ఏతావతా శాస్త్రోక్త పదార్థపరిజ్ఞానమున్నూ, తద్గత స్వానుభవ విజ్ఞానమున్నూ,—ఈ రెండూ మానవుని కర్తవ్యము లని తేలుతూంది. వీటిని సిద్ధాంతము లేక శాస్త్రభాగమనీ, ఆచరణము లేక ప్రయోగాత్మక మనీ కూడ ఆధునిక పరిభాషలో చెప్పవచ్చును. తన్ను తాను తెలిసి, యితరము నెరుగుటవల్ల లోకయాత్ర సుష్ఠుగా సాగుటేగాక ఆత్యంతికమైన సుఖా నందములున్నూ కలుగుతవి.

ప్రాచ్యభూములలో అందులోనూ మన హిందూదేశంలో బహుప్రాచీనకాలాన్నుంచిన్నీ ఆయామార్గాలలో మనీషులనేక వారు ముందుదారి చూపుతూ వచ్చారు. అందుకనుగా [illegible] పరిస్థితులిచ్చట సమకూడినట్లితర దేశాల్లో లేవు. అందుచేత యితర దేశాల్లో జీవితపోరాటంలో అత్యధికభాగం శరీర యాత్రామాత్రమునకే పరిమితమైపోతూ వచ్చింది. అట్లు గాక అత్యల్పకాలమునూ, శక్తినీమాత్రమే జీవయాత్రావసరాల సేకరణకు వెచ్చించి, మిగిలిన యావత్ శక్తినీ, కాలాన్నీ జ్ఞానసేకరణలో ఉపయోగించిన మహాజనులు మనదేశంలో ఎందరో ఉన్నారు. వారు చూపిన వెలుగు యీ గ్రంథంలో రేఖామాత్రంగా ఫుట్‌నోట్స్‌లో చూపగలము.

పాఠక మహాశయు లీ గ్రంథాన్ని చదివి ఉపయోగాన్ని పొందినచో మా శ్రమ సార్థకమని తలంతుము. సెలవు.

రాజమండ్రి
31–3–1957

మహీధర జగన్మోహనరావు
సంపాదకుడు.

# విషయసూచిక

# జ్ఞానం : విజ్ఞానం

## ప్రథమ మండలం

## మానవ యాత్రారంభం

శా. ఆరంభించరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై,
ఆరంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థములుజ్జగింపరుసుమా ప్రజ్ఞానిధుల్ గావునన్.

భర్తృహరి సుభాషితము.

### బంధనాలు త్రెంచుకొని మానవుడు వెలికివస్తాడు.

ప్రాచీనకాలంలో, వేల సంవత్సరాల క్రిందట ఆఫ్రికా ఖండంలోని ఈజిప్టు దేశంలోని మానవులు తమ పరిసర ప్రకృతిని చూచి యేమనుకొన్నారు? దాట నశక్యములైన యిసుక యెడారులు యెర్రగా కాలుతూ చుట్టూ వ్యాపించివున్నాయి. ముందు ఉత్తరదిశలో భయంకరమైన సముద్రజలములు అగాధంగా, నల్లగా విజృంభిస్తున్నాయి. వెనుకవైపున పాతాళలోకపు కళపెళలుగా, సుడులుగా, నదులుగా! దక్షిణదిశలో నున్న ఆ పాతాళంలోనుంచే నైలునదీ జలాలు ఉరవడిగా వెలువడి వచ్చినాయి, భూమిమీదికి! తమ నివాసభూమిని రెండుగా చీల్చి, యేటేటా పొంగి పొరలి పొలాలన్నిటినీ

ముంచివేస్తూ, వరదబాధలను మచ్చుచూపేది నైలు నది!
పైన అనంతాకాశం నీలిరంగు చాందినీలాగ సుట్టూరా సుదూ
రంలో వున్న పర్వతాల మీద ఆనుకున్నట్టు ప్రాకించేది.

ప్రపంచమంటే తాము చూస్తూన్న ఆ ప్రదేశమే అను
కునేవారు ఐగుప్తీయులు!

'నైలు' అనే పేరు విన్నారుగదా? ఐగుప్తు దేశంలోని
నదిపేరు నైలు. కాని, దీనికా పేరు యెట్లావచ్చింది? ఐగుప్తీ
యుల భాషలో ప్రాచీనకాలంలో 'నైలు' అను మాటకు 'నది'
అని అర్థం. తామెరిగియున్న ఆ ప్రవాహాన్ని వారు 'నైలు'
అనగా 'నది' యని పిలిచేవారు. తమను 'ప్రజలు' అని పిలుచు
కునే వాళ్ళు. ఈ భూమండలంమీద మరొక నది వున్నదనీగాని,
యింకా ప్రజలున్నారనిగాని వారికి తెలియదు!

రంగులలో నలుపు మంచి రంగు అనీ, ఎరుపు చెడు అనీ
వారి భావన. ఎందువల్లనో తెలుసా? నల్లటి పండు నేల
భూమి నల్లగను, చుట్టూరా దూరంలో వున్న యెడారి భూమి
యెఱ్ఱగనూ వుంది గనుక! ఎఱ్ఱనిభూమి ఆట్టే దూరంలో
లేకున్నా అక్కడికి వెళ్ళేందుకే సాహసించేవాళ్ళు గారు!
ఉత్తరదిశలో సముద్రం నీలిగా, మెరిచిన కిటికీలా ఉండేది.
కాని, అదీ వాళ్ళకి దుస్తరం, దుర్భేద్యంగానే కానవచ్చేది.
సముద్రదేవుని నోటవచ్చిన నురుగే సముద్రపు ఫేనరాశి యనీ,
లవణం విషతుల్యమనీకూడ వారు భావించేవారు!

ఈ విధమైన భావాలతో ఐగుప్తీయులు వేల యేండ్లు తమ యిసుక కొండలలో గహనమైన సంసారయాత్ర సాగిస్తూ క్రిక్కి-రిసి వుండిపోయేరేగాని వెలుపలకు రా సాహసించలేదు.

కాలప్రవాహం గడచిపోతూంది. నైలు మాత వారి కధి-కాధిక ధాన్యసమృద్ధి నొసగుతూండేది. పంట పండించడానికి జనులు శ్రమచేస్తూండేవాళ్లు. కాని, శ్రమచేస్తేనేమి? నైలు మాత ప్రసాదం గాక పంటలు వేరేమిటి? ఈ కృషిలో ప్రజలు తమ కాలుచేతుల నుపయోగిస్తూనే వున్నారు. ఒక్కొక్క శతాబ్దం గడుస్తూన్న కొద్దీ హస్తం అధికతరంగా నేర్పు గలదీ, నిపుణమైనదీ అవుతూవచ్చింది. అంతవరదాకా శత్రువులు దొరికినప్పుడు చంపివేయడమో, చేతులు ఖండించడమో, లేదా విమోచన ద్రవ్యం గైకొని నాయకునికి పంపివేయడమో గావించేవారు. బ్రతికివుంటే అతని పోషణకు కావలసినంత పదార్థోత్పత్తికూడ మానవుడు చేయజాలనిచో శత్రు మానవులను అట్టే వుంచడంలో అర్థం కనబడలేదు వాళ్ళకి! అటువంటిది యిప్పుడు యుద్ధంలో దొరికిన వాళ్ళను ఖైదీలుగా వుంచి, వాళ్ళచేత పనిచేయించుకోడం అధిక లాభకర మని ఆ జనులు తెలుసుకున్నారు. గుహాకుడ్యాల మీది చెక్కడములలో సైన్యములు, వెనుక యుద్ధఖైదీలు చేతులు విరిచి కట్టబడినవారూ నడుస్తూండడం చూస్తాము. ఐగుప్తీయులు యుద్ధఖైదీలను కర్రలతో గుదికట్టి నడిపించేవాళ్లు. శత్రువులందరినీ మ్లేచ్ఛులనీ, హైనదూరులనీ, పరప్రజలనీ పిలిచేవాళ్ళు!

అప్పటికింకా ఐగుప్తీయుల భాషలో 'బానిస' పదం లేదు. పాత మాటలలోనే కొత్తవస్తు విషయాదులను వ్యక్తీకరించ డానికి ప్రయత్నించేవాళ్ళు. అప్లో యుద్ధబంధీతులు 'జీవచ్ఛ వాలు' అనబడేవారు! ఈ పదసమ్మేళనము మన చెవులకు కటువుగా, వింతగా తోచవచ్చు. కాని, యీ పదాన్నే ఐగుప్తు దేశంలో కుడ్యశాసనాలలోనూ, సమాధుల మీదనూ మనం చూస్తాము. ఈ 'జీవచ్ఛవాలు' పొలాల్లో పనిచేసే వాళ్ళు, ఆనకట్టలు కట్టేవాళ్లు, కాలువలు త్రవ్వేవాళ్లు.

క్రమంగా ఐగుప్తులో ప్రజల జీవితవిధానమే మారిపోతూ వచ్చింది. ఆదిమ కమ్యూనిస్టు సమాజ విధానం శిథిలమై పోయింది. బానిస విధానం అమలులోకి వస్తున్నది. అంతవరకూ తెగలలోని, గణాలలోని వ్యక్తులంతా సమిష్టిగానే ఆ స్తిపాస్తులన్నిటినీ హక్కుగలిగి అనుభవించేవాళ్ళు. పొలాలు, యిండ్లు, మందులు, పరికరాలు, వగైరా అన్నింటినీ కూడా అంతా కలిసే వాడుకునేవాళ్లు. అట్లాంటి సాంప్రదాయం క్రమంగా శిథిలమైపోనారంభించింది, బానిసవిధానం రావడంతో.

అంతదనుక పని, శ్రమ, ఆత్మరక్షణ మొదలైనవన్నీ గణం లో ఉన్నవాళ్ళంతా చేస్తూండేవారు. అట్లాంటిది యిప్పుడు క్రమంగా బరువైన పనులన్నీ బానిసలమీదనే పడుతున్నాయి. పనుల విభజన జరుగ నారంభించింది. ఐగుప్తులోని పిరమిడ్లు నిజానికి రాజుల సమాధులే. వాటిలోపలి అసంఖ్యాకమైన గదులో గోడలమీద యెన్నెన్నో చిత్రాలు ఉంటాయి.

ప్రాచీన కాలంలోని జనులు గావించే వృత్తిపనులన్నీ ఆ కుడ్య చిత్రాల్లో మనం యీనాటికీ చూడగలము. సారెను త్రిప్పుతూన్న కుంభకారుడు, అంపంతో దూలాన్ని కోస్తూన్న వడ్రంగి, పొట్టి బల్లముందు కూర్చుని పాదరక్షలు కుడుతూన్న చర్మకారుడు, తోలుతిత్తులతో కొలిమి ఊదుతూన్న లోహకారుడు, నాగేటికి పూన్చిన ఎడ్లను అదలించు హాలికుడు,— యిటువంటివన్నీ ఆ సమాధుల్లోని కుడ్యచిత్రాల్లో చూస్తాం.

వృత్తివిభజన, కర్మవిభాగం జరిగినచోట తప్పనిసరిగా వస్తు వినిమయం ఉండేతీరుతుంది. విభిన్నకర్మ జన్యములైన భిన్నభిన్న వస్తువులను ఆయా కర్మకారులు పరస్పరం మార్చుకుంటారు. కుమ్మరి తాను చేసేకుండల్ని అన్నిటినీ తానే ఉపయోగించడు. అల్లాగే చమారీ కుట్టిన పాదరక్షలనూ. ప్రాచీన సమాధుల, దేవాలయాల కుడ్యచిత్రాల్లో యీ వస్తువినిమయం చిత్రించ బడివుంది. జాలరి తన బుట్టలోని చేపలనిచ్చి, కమ్మరినుంచి గాలములను తీసికొన్నట్లు; హాలికుడు తాను పండించిన ధాన్యాన్నిచ్చి, చమారినుంచి పాదరక్షలను కొంటున్నట్లు; పట్టుకొన్న పిట్టల నిచ్చి పూసలను కొను వ్యాధుడు;— యిల్లాంటివెన్నో ఆనాటి బొమ్మల్లో మనం చూస్తాము.

పురాతన గణముల కాలంలో పల్లెజను లంతా అడవి, పొలాలు, పశువులమీద హక్కుగలిగి వుండేటప్పుడు, అంతా కలిసి సమిష్టిగానే పొలాల్లో పనులుచేయువారు. ఆ పరిస్థితి మారిపోయింది. ఇప్పుడు కొందరు పెద్ద భూఖండాలు గలిగి

వుంటే మరికొందరు అతిస్వల్పమైన భూవసతి మాత్రమే కలిగి వుంటున్నారు. కులీనులు సంపన్నులు తమ పొలాల్ని బానిసల చేత దున్నిస్తారు. వ్యవసాయపు పనుల రోజుల్లో దాస్యానికీ, కూలి లకీ, సాగుపులకూ చిన్న రైతులుకూడ భూస్వాముల పనుల్లోకి వెళ్ళేవారు. భూస్వామి పొలాన్ని కొందరికి మక్తాలకు యిచ్చే వాడు. ప్రభువు, భూస్వామీ, యోధుడూ సాధారణంగా ఒకడే. అతడు చనిపోయాంకకూడ సమాధికడకు జనులు కానుకలు తీసుకు పోయి సమర్పించేవాళ్ళు. ఐగుప్తు, బాబిలన్ దేవాలయాల కుడ్యచిత్రాల్లో జనులు తమ తలలపై పండ్లతట్టలు, మద్యభాం డాలు మోసుకుంటూ, మేకపిల్లలను బలికై గొంపోతూ ప్రభువు మృతకర్మ దగ్గరకు పోతూండడం చూడగలము.

వస్తూత్పత్తి విధానం మారుతూన్నకొద్దీ జనుల అభిప్రా యాలుకూడా మారుతూ వచ్చాయి.

విదేశీయులుకూడా 'జనులే' అని ఐగుప్తీయులు క్రమంగా అంగీకరించుతూవచ్చారు. కాని ఆ విదేశీయులు తమవంటి జనులే యని వాళ్లు అంగీకరించడానికి యింకా యెన్నో శతా బ్దాలు గడవాల్సివుంది.

వాళ్ళ అభిప్రాయంప్రకారం విదేశీయులు అసలు 'జనులు' కారు; ఒక వేళజనులైనప్పటికీ నిర్భాగ్యులూ, ఘృణ్యజీవులూ, దైవదూరులూ అనీ! దేవుడైన 'రా' వాళ్ళందరినీ అసహ్యించు కుంటాడు. సూర్యుడు వాళ్ళందరికోసం ప్రకాశించడు. అతడు

ఐగుప్తీయులకోసమే వెలుగుతూన్నాడు. బానిసను, విదేశీయుని చంపుట దోషంకాదు.

ఐగుప్తీయులు నివసించేది యింకా బహు సంకుచితమైన లోకనే. శతాబ్దులు గడచిపోతూన్నాయి. యుద్ధదేవతా ప్రేరితులై వారంతకంతకు తరచుగా తమ దేశాన్ని వీడి పరాయి భూములమీదికి నడుతూన్నారు. మార్గదర్శియైన 'నెప్పుఅత్' దేవుడే వారికి నాయకుడు. తమకు బానిసలు కావాలి. దానికి ఒకటే మార్గం. యుద్ధంలో బానిసల్ని పట్టి తెచ్చుకోవాల్సిందే. తమకు కావాల్సినవీ, తమ దేశంలో లేనివీ యింకాయెన్నో వస్తువులున్నాయని తెలుసుకున్నారు. భవన నిర్మాణానికి దేవదారు పలకలు కావాలి; పరశువులకు తామ్రం; దేవాలయాలకూ, రాజప్రాసాదాలకూ దంతం, స్వర్ణం కావాలి. బలప్రయోగంచే పొందజాలని వాటిని వినిమయంచేత సంపాదించేవాళ్లు. ధాన్యాదులు, ఆభరణములు, ఆయుధాలు మొదలైనవి యిచ్చి, తమకు కావలసిన వస్తుతతిని సమకూర్చుకునేవారు.

ఐగుప్తుకి దక్షిణంలో 'దంతద్వీపం' ఉండేది. అక్కడిజనులు కాలవస్థులు. వాళ్లు యేనుగులను వేటాడ్డంలో ఘనులు. ఆ జనులే నూబియనులు. సముద్రతీరాన యిసుకమీద ఐగుప్తీయులు తమ సరకులను పరచేవాళ్లు. రాగి చావులు, కంఠాభరణాలు, పూసలు యిత్యాదులు. నూబియనులు ఏనుగదంతాల్ని, బంగరుటిసుకను తెచ్చేవాళ్లు.

వస్తువుల ధరలనుగూర్చి వాళ్లు సంభాషించుకొనేవాళ్లు. ఈ యిచ్చిపుచ్చుకోడాలు జరిగే చిన్న పల్లెను 'కెపినీ' అని పిలిచేరు. వారి భాషలో 'కెపినీ' అనగా 'ధర' అని అర్థం.

ఉత్తరదిశలోనున్న పొరుగు జనులు ఫొనీషియనులు సాగర తీరస్థులు. వారు ఓడల్లో వచ్చేవారు. తెరచాప ఓడలను తీరమున కీడ్చి, పగ్గములతో తీరమందలి పెనుబండలకు బంధించి, దేవదారువులను, రాగి చిట్టెములను దించేవారు.

ఈ రీతిగా యిరుగు పొరుగు జనులమధ్య రాకపోకలు, సరకుల మారకము వృద్ధిపొందుతూంది. తమ దేశమేగాక యితర దేశాలు యెన్నో ఉన్నవని జనులు తెలుసుకుంటున్నారు. భూగోళ విజ్ఞానం అభివృద్ధిగాంచ నారంభించింది. ద్వీపాలు, దేశాలు, పర్వతాలు, నదులు మొదలగువాటిని పేర్లుపెట్టి పిలువ నారంభించేరు. ఆ యా ప్రాంతాల పేర్లు వింటేనే అక్కడ దొరికే వస్తువులు తెలుస్తాయి. 'దేవదారులోయ'లో దేవదారువులుంటాయి. సైప్రస్ దీవిలో కూప్రమ్ అనగా తామ్రం లభిస్తుంది. తారస్ పర్వతాలంటే వెండికొండలని అర్థం. అక్కడనుంచి వెండి వస్తుంది. అంబరు దీవులనుంచి అంబరు లభిస్తుంది. ఇల్లాగే. *

---

* సింధువంటే నదియని సామాన్యార్థం. సింధు తీరవాసులైన వారు సింధు జనాలు; వారి దేశం సింధుదేశం. 'స' పలుకలేక 'హ' అంటారు పరిష్యన్లు. సింధుదేశం హిందూదేశం అయింది. మన పూర్వులు కూడ అనేక దేశాలనూ, ప్రాంతాలనూ పేర్కొనుటలో యీ విధానమే కాన

ఇసుక రేణువుకంటె చిన్నదీ, పర్వతముకంటె పెద్దదీ యింకొకటి లేదని జనులు ఒకానొకప్పుడు భావించేవారు. అందుచేతనే మనం యిప్పటికీ 'ఇసుక రేణువంత చిన్నదీ' 'పర్వతమంత పెద్దదీ' అని వాడుతాం. 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అను వాక్యం అనునిత్యమూ మనం వింటూనేవుంటాం.

కాని, మానవులు అంతకంతకు సూక్ష్మతరమైన ప్రపంచం లోనికి చొచ్చుకొని పోతూనేవున్నారు. ఆ సూక్ష్మకణము లను మనం కంటితో చూడలేము. పూర్వులు యీ సూక్ష్మ కణ ప్రపంచంలో తమ దారిని తడుముకుంటూ పురోగమిం చేరు. లోహాలను చేజిక్కించుకోవడమే వారికి ప్రధానంగా ఉండేది. లోహాలను మట్టినుంచి విడదీయాలంటే ఎల్లాగ? అగ్ని దేవుడు మనుష్యులకు యీ పనిలో తోడ్పడ్డాడు. అగ్ని సాయంతో లోహపుచిట్టెములను బట్టీలలో కాల్చగా, రాగి కరిగి నీరై, ఉదితసూర్యప్రభలతో కళ్లు మిరుమిట్లుగొల్పుతూ, గలగల ప్రవహిస్తూ క్రింది తొట్టెలలోకి వచ్చిపడేది.

అప్పటికి మనుష్యునికి తెలిసిన లోహాలు కొద్దివే. ఎక్క డేనా లోహపు చిట్టెములు లభిస్తే, వానినొక పెన్నిధివలె భావించేవారు. సూక్ష్మవస్తు ప్రపంచంలో ఎక్కడైనా, ఏదైనా కీలకం లభిస్తుందా? అని బుద్ధిమంతులు అన్వేషించేవాళ్లు.

---

వస్తుంది; సువర్ణద్వీపం, జంబూద్వీపం, భర్మదేశం, కామరూపం, పంచనదం, త్రిగర్తం, దండకాటవి, తామ్రపర్ణి. నాగరకత పెంపొందుతూన్నకొద్దీ ఆదర్శప్రాయులైన మహాత్ముల పేర్లనుబట్టి దేశాలు, నదులు మొదలైనవి పేర్కొనబడుతూ వచ్చాయి. — అనువాదకుడు.

దేశాలమధ్య రాక పోకలు, వస్తువుల ఉత్పత్తి, వాణిజ్యం పెరుగుతూన్నాయి. సముద్రాల మీద ప్రయాణం చేయడానికి పెద్ద పడవలు నిర్మిస్తూన్నాడు, మానవుడు. ఒక చోటినుంచి మరొక చోటికి పోవడానికి దుస్తరమైన యీ 'మున్నీరు' పెద్ద ఆటంకంగా ఉండేది. దానిని కొయ్యతో కట్టిన పడవలతో సుకరంగా దాటడం నేర్చేడు, మానవుడు. పర్వత సానువుల మీది మహావృక్షాలు, శతాబ్దుల నాటి దేవదారు, ఓక్, టేకు మొదలైనవి పడగొట్టబడుతూన్నాయి. సాగరతీర దేశమైన ఫొనీషియాలో తామ్రపరశువులతో పురాతన మహావృక్షాలను పడగొట్టే పనిలో వేలాది జనులు నిమగ్నులై ఉండేవాళ్లు. గొడ్డలి వ్రేటులకి పర్వతములన్నీ ప్రతిధ్వనించేవి. బ్రహ్మాండమైన తరుమూలములనుంచి పడవలను చెక్కి, మలచేవాళ్ళు. చీమలు ప్రాకిన శిల లరుగును. సాధనము లంతగా లేకున్నా మనుష్యులు నిరంతరకృషి గావిస్తూ, అసాధ్యము లనుకున్న వాటిని సాధ్యముగావిస్తూన్నారు. మొదట వారొక దూలమును చెక్కేవాళ్ళు. దాని కిటునటు ప్రక్క ఎముకల వలె కమ్ములను బిగించి, కంకాళం తయారు చేసేవారు. తోలు ప్రాటితో కొలిచి, ప్రక్క కమ్ములను సమంగా చేసేవాళ్ళు. ప్రక్క కమ్ములను కలుపుతూ పై భాగాన పొడుగు పలకలను వేసి, వాటిపైన 'తట్టు' నిర్మించేవారు. చుక్కానిని చేపతోక ఆకారంలోనూ, క్రింది వెన్నుభాగాన్ని చేప కడుపు మాదిరిగనూ, పడవ ముఖభాగాన్ని పక్షి తల రూపంలోనూ నిర్మించేవారు.

పక్షి గాలిలోవలె నావ కెరటాలమీద తేలియాడుతూ, నీటిలో చేపవలె సులభంగా పోగలుగుతుందనే మనుష్యులు యీ రూపకల్పన గావించేరు. చుట్టూవున్న నిర్జీవ, సజీవ వస్తువులను చూచే, మానవుడు నూతన కల్పనలలు గావిస్తూ వచ్చేడని చెప్పాలి.

ఇట్లు రూపొందిన దదే బహువిచిత్రమైనది, పడవ. దుస్తరమైన మున్నీటిని తరించగలది గాన 'తరణి' యైనది! * వీటి నధిరోహించి జనులు అజ్ఞాతద్వీపాలకు బోగలిగేవాళ్లు.

కాని, నౌకాముఖంమీద మనుష్యుని బోలిన ఆ విచిత్ర రూప మెవ్వరిది చెప్మా! అది ఎందులకక్కడ అంత భద్రంగా స్థాపించిరో? ఆహాఁ! తెలిసింది. వామనరూపుడైన సమ్మోట దేవుడు 'పు ఆమ్' విగ్రహ మది. నావికులు ఆ దేవుని సాన్నిధ్యమును సర్వదా కోరుతూండేవాళ్లు. చిమ్మచీకటిగా ఉండే గనుల్లోంచి తీసిన చిట్టెములను పిండిగొట్టి, లోహాన్ని వేరుపరచుటకు తోడ్పడిన వా డాతడేగద! కమ్మరి దాగలిమీద పరశువులను రూపొందించినదికూడ ఆయనయే! అంతేనా? నౌకలను కట్టుటలో వడ్రంగులకు తోడ్పడినదీ యీ దేవుడే! సూక్ష్మప్రపంచాన్నుంచి వెలువడిన యీ దేవుడు, మానవ

* భారతదేశం సముద్ర పరివృతమైనది. ఇక్కడ బహుప్రాచీనకాలంలో కూడ నౌకలున్నట్లు ఆధారాలున్నాయి. ఋగ్వేదంలో నౌకల ప్రస్తావన ఉంది. ఆదిమకావ్యమైన రామాయణంలో ఆటవిక రాజైన గుహుడు గంగాతరణమునకై 500 పడవలను భరతునికి ఆయత్తపరచినట్లు చెప్పబడింది. — అనువాదకుడు.

హస్త నిర్మితుడైన యీ వామనరూపుడు, ఓడపై నిలచి, దానిని పర్యవేక్షిస్తూ, రక్షకుడై, సువిశాల జలరాశిపై, హద్దులు లేని వరుణలోకంలో మార్గదర్శిగా ఉండనియ్యి! ఆ దేవుని సాయంలేనిచో యీ చిన్న పడవ యెట్లు తాళ్ళప్రమాణమ్ములైన అలలతో కల్లోలంగా ఉండే సాగరంలో సురక్షితంగా ఉండగలదు ?

శతాబ్దాలు గడచిపోతున్నాయి. క్రీస్తుపూర్వం 5000 యేండ్లు గాక యిప్పుడు 4000 యేండ్లే.

ఫొనీషియనుల గాలీలు (దోనెలు) యిప్పుడు మధ్యధరా సముద్రానంతనీ దున్ని వచ్చినాయి. అంతకంతకు దూరదూరంగా బోతూన్నాయి; ద్వీపాలమీంద, ద్వీప కల్పాల మీందా వలసలు స్థాపిస్తూన్నారు; వసతులు సమకూర్చుకుంటున్నారు. వర్తక స్థావరాలనూ, స్థిరనివాసాలనూ కూండా ఆయా ప్రదేశాల్లో నిలుపుతూన్నారు, ఫొనీషియనులు.

క్రమంగా ఫొనీషియను నౌకలు 'మెల్కార్టు స్థంభాల' దగ్గరకు వచ్చాయి. అవి దాటితే యిక మహాసముద్రమే. అబ్బో! దానికి పారమే లేదు. ఫొనీషియనుల రేవుపట్టణం 'టైరు'కు ప్రాకారములు నిర్మించిన దీ 'మెల్కార్టు' దేవుడే. మధ్యధరాసముద్రపు కడపటి మజిలీగా యీ స్థంభాల నాతడే నాటేడు. 'ఈ చోటుదాటి ఎవరూ ముందుకు బోవద్దు!' అని హెచ్చరించడానికే ఆయన యీ స్థంభాలను నిలిపేడు. 'ఆగండి! ఇంకొక్క అడుగు ముందుకు బోవద్దు. మీా

మాతృనగర కుడ్యములనుంచి చాల దూరం వచ్చారు సుమా. ప్రపంచానికి హద్దు యిదే! ముందున కడుగు వేయవద్దు!' అని యెవరో అంటూన్నట్లే నావికులకు వినిపించేది!

ఆయన ఆజ్ఞను జవదాటుటకు చాలకాలం వరకూ నావికు లెవరూ సాహసించలేదు. ఈ ముఖద్వారం తరువాత నున్న విశాలసాగరం దుస్తరమైనది. అది ఎంత వారికీ గుండెలవియ చేస్తుంది.

కాని, అందరూ చేయ సాహసించని పనిని సాధించేవాడు ఉండనే ఉంటాడు! అజ్ఞాతవిషయాలు కొందరిని ఆకర్షిస్తానే ఉంటాయి. కొందరు సాహసులు యీ ద్వారం దాటి ముం దుకు పోయేరు. నావికులు, వర్తకులు, ఒక్కొక్కరే భయం తీరి, మహాసముద్రంలోనికి పోనారంభించేరు. తెడ్లు వేస్తూంటే లయబద్ధంగా నౌకలు నాట్యమాడుతూండేవి. దూరంగా తీరం గానవచ్చేది. అల్లదిగో! అదే స్పానియాతీరం; ఆ పైన గానవచ్చేది ఫ్రాన్సుతీరం. అచ్చట బర్బరులు, ఆటవికులూ ఐన మానవులే నివసిస్తూన్నారు. క్రమంగా ఫొనీషియను నౌకలు తగరపు దీవియైన బ్రిటను, అంబరు భూములైన బాల్టిక్ తీరాలనూ చేరినాయి.

ఆ! ఇప్పుడు జనులు యీ భూగోళముమీద మరికొంత భాగం కూడా తమ కర్మరంగం గావించుకున్నారు. బాగుంది. ఇంతకాలంగానూ భూగోళం సక్రమంగానే సూర్యదేవుని చుట్టూ ప్రదక్షిణాలు గావిస్తూనేవుంది.

శతాబ్దులు గడుస్తున్నాయి. ఇక యిప్పుడు క్రీస్తుపూర్వం 4000 యేళ్లు గాదు. క్రీస్తు పూర్వం 2800 సంవత్సరాలు వచ్చాయి.

ఫొనీషియనుల రాజు హీరమ్. యూదుల రాజు సోలమన్. సోలమన్ చాల తెలివైనవాడు, పండితుడు. ఆయనకాలం యూదు జనులకు స్వర్ణయుగం. సోలమన్ రాజు తన యిరుగు పొరుగు రాజులతో స్నేహంగా ఉంటూ, వ్యాపార సంబంధాలు పెంపొందింపజేసేడు. ఫొనీషియనులు నౌకలను నిర్మించి నడపడంలో అద్వితీయులు. అందుచేత వారిసాయం తీసికొని తమ నౌకావ్యాపారాన్ని వృద్ధిచేయ సంకల్పించేడు, యూదు రాజు సోలమన్. హీరమ్ రాజు నేర్పరులైన నావికులను సోలమన్ రాజునకు యిచ్చాడు. సోలమన్ రాజు ఓడల నాయత్త పరచి, యూదులను, ఫొనీషియనులను జతపరచి, ఎర్రసముద్రం గుండా పంపించేడు. వారు ఎర్రసముద్రంలోంచి అరేబియా సముద్రంలోనికి బోయి, అరేబియా, పరిష్యా, సింధు, మలయాళ దేశాలను చూచేరు. సోలమన్ రాజు చిరకాలవాంఛ నెరవేరింది. జెరూసలేమ్‌లోని దేవాలయాలకు, రాజభవనాలకు అవసరమైన టేకు, దంతము, వెండి బంగారాలు, మంచి గంధపు క్రమాకులు, వెలలేని రాళ్లు, పట్టుబట్టలు తెచ్చేరు. దేవాలయ ఉద్యానములకై నెమళ్లు, కోతులు కూడ భారత దేశంలోనే లభించేవి. వాటిని తేవడానికి అంత దూరం నౌకల మీద ఎన్నో కష్టములకోర్చి ప్రయాణం చేసేవాళ్లు.

జనులకు తెలిసిన ప్రపంచపు సరిహద్దులు అంతకంతకు విస్తృతం అవుతున్నాయి.

కాని, మహా సముద్రాలమీదకు బరితెగించి పోవడానికి నావికులింకా సాహసించడంలేదు. తిరిగి వెనుకకు రాజాలమని వాళ్ల భయం. భూమిమీద యెటుపోయినా యేదో ఒక ఆనవాలు పెట్టుకోవచ్చు, తిరిగిరావచ్చు. కాని, నీటిమీద యేముంటుంది? కాలిజాడలా? ఏ చెట్టో, మొక్కో, రాయో ఆనవాలుగా పెట్టుకోగలమా? అబ్బే! ఏమీ ఉండదు. అంతా అయోమయం! వచ్చినదారీ, పోయినదారీ తెలుసుకోలేము. నేలమీదైతే ప్రాచీనమైన బిడారుల మార్గాలు, పొడుగునా పగిలిన కుండపెంకులూ, పొయ్యిరాళ్లూ, నెగళ్ల ఆనవాళ్లూ, యెముకముక్కలూ చెదురుచెదురుగా కనబడుతూనే ఉంటాయి. రాజమార్గా లున్నచోట్ల మైలురాళ్లుకూడ ఒక్కొక్కచోట కనబడవచ్చు. నల్లని మైలురాళ్లనే జనులు కొన్ని దేశాల్లో దేవుళ్లుగా పూజించేవాళ్లుకూడాను!

రేఖలవల్లనూ, మట్టిరంగువల్లనూ కూడ భూమిమీద మార్గం తెలుస్తుంది. పోయేదారిలో రాయీ రప్పా, చెట్టూ చేమా జాగ్రత్తగా గుర్తుపెట్టుకుంటూ వెడితే యాత్రికులు భూమిమీద దారి తప్పిపోవడం ఉండదు.

కాని, నీటిమీద? అందులోనూ సముద్రంమీద? ... తాడిచెట్టు ప్రమాణాన బ్రహ్మాండమైన కెరటాలు నిరంతరం లేస్తూ పడుతూ ఉంటాయి. ఒక కెరటానికీ మరో కెరటానికీ

భేదం నువ్వు కనిపెట్టనే లేవు! ఓ చెట్టో, పర్వతమో, పల్లె టూరో;- ఏమీ కనుచూపు మేర కనబడదు. ఆనవాలే దొరకదు! మునిగిపోయిన మానవుల కళేబరాలూ, ఓడల శిథిలాలూ కూడ యెటో కొట్టుకొని పోతాయే గాని పడిన చోట ఉండవుగదా. పైన అసీమమైన వినీలాకాశం, క్రిందచుట్టూ హద్దులు లేని వినీలజలాలు;- అల్లాంటిచోట దారి తప్పకుండా ఎట్లుండగలవు?

మానవుడు ముఖమెత్తి ఆకాశంలోకి చూపులు బరపేడు. అనంత తారకా సముదయం కనబడింది. వాటిలో ఏవైనా మైలురాళ్లుగా గుర్తుంచుకోడానికి పనికివస్తాయా? అని అన్వేషించ నారంభించేడు. ఆc? దినంలో సగభాగం, అంటే పగలంతా సూర్యుడు తూర్పు పడమరలు, దక్షిణోత్తరాలు తెలుపుతూనే ఉంటాడు. రాత్రిపూట ఉత్తరదిశను (లఘు ఋక్షం) లిటిల్ డిప్పర్ సూచిస్తూనేఉంటుంది. అందుచేతనే ఆ నక్షత్రసముదాయాన్ని 'రథం' (wagon) అంటారు. ప్రయాణీకులకు యిది తరణోపాయమని అర్థం.

ఈ రీతిగా మానవుడు క్రమంగా తన ఉనికిపట్టయిన యీ భూగోళాన్ని, ఖగోళ సహాయంతో పఠిస్తూ వచ్చేడు. విశాల విశ్వానికి కీలకం యెక్కడుంది? అని నక్షత్రలోకాలన్నీ అన్వేషించేడు. ఈ కీలకమును మానవుడు సూక్ష్మ వస్తు ప్రపంచంలోనూ కనుక్కొన్నాడు! విశాలతర తారకాలోకంలోనూ కనుక్కోగలిగాడు!

అంతవరకూ వివిధజనులమధ్య అవరోధంగానున్న సముద్రాలు యిప్పుడు రాకపోకలకు అవకాశం కల్పిస్తాన్నాయి. ఎరుక లేనపుడు ఆటంకంగా నున్నదే ఎరుక కలిగేక సాధనంగా వుంటుంది! ఇది విచిత్రంగదూ?

జనులు తమతో ధనధాన్యాలను, ఘటపటాదులను, బానిసలను మాత్రమేగాక ఆచార విచారాలను, కళలను, వృత్తులను, విశ్వాసాలనుగూడ పరదేశాలకు గొంపోయేవాళ్లు. క్రీటు ద్వీపాన్నుంచి లేఖనము ఫొనీషియాకు, అక్కడనుంచి గ్రీసుకు గొంపోబడింది. ఈ ప్రయాణంలో అది బొమ్మలునుంచి గుర్తులుగా మార్పుచెందింది. ఆగుర్తులే అక్షరములు. *

సముద్రంమీద బైలుదేరే ప్రతి నౌకలోనూ చదువనూ, వ్రాయనూ తెలిసినవాడొకడైననూ ఉండువాడు. అతడు లెక్కలు, పద్దులు వ్రాస్తూ, వివిధవృత్తాంతాలు లిఖిస్తూ ఉండేవాడు. ఇంటికి తిరిగి వచ్చాక నౌక యజమానికి సరియైన సమాచారం చెప్పాలిగదా. ఫొనీషియను వర్తకులు యీ రీతిగా తమ ఓడలలో ఘనమైన ద్రాక్షాది మధువులనూ, మిలమిలలాడే అరుణాంశుకములనూ, చిత్రవర్ణ కుంభములనూ

---

* ఐగుప్తదేశంలో బొమ్మల లిపి ఉండేది. అస్సీరియా, బాబిలను దేశాలలో కోణాకార (క్యూనీఫారం) లిపి ఉండేది. సుమేరియనులకు బహు ప్రాచీన కాలంలోనే లిపి ఉండేది. భారతదేశంలోకూడ పూర్వకాలంలోనే లిపి ఉండేదని శాస్త్రజ్ఞులు ఋజువు చేసేరు. గణితం, లేఖనం, కవిత్వం మొదలైనవి ప్రప్రథమంలోనుంచీ మనదేశంలో అభ్యసించబడుతూన్నట్లు యెన్నో నిదర్శనాలున్నాయి. — అనువాదకుడు.

మాత్రమేగాక అక్షరములనుకూడ గొంపోతూ ఉండేవాళ్ళు. ప్రపంచంలో ప్రప్రథమంగా అక్షరమాలిక నుపయోగించిన వారిలో ఫొనీషియను లొకరు. ఐరోపా భాషల్లో యెన్నో ప్రాచీన ఫొనీషియను శబ్దాలు నిలిచిపోయినాయి. ఇంగ్లీషులో నేటికీఉన్న గాలీ (పడవ), వైన్ (ఆసవం), ఆల్ఫబెట్ (అక్షర మాల) మొదలైనవి ఫొనీషియను శబ్దాలే.

ఎన్నో మానవజాతులు, తెగలు నశించినాయి. ఎన్నో రాజ్యాలు కాలగర్భంలో కలిసిపోయినాయి. ఎన్నో శిలా శిల్పాలు రూపుమాసిపోయినాయి. పాపిరస్ చుట్టలు, తాటాకు పుస్తకాలు మసియై ధూళిగా దిశల కెగిరిపోయినవి. కాని... భావములు? అవి పరంపరగా నిలిచిఉన్నాయి. మరి అక్షర ములూ, శబ్దములూనో? అవి అక్షరములే * యైనాయి. వాటిని నాశంచేయు శక్తి కాల్నానికే లేకపోయింది! శబ్దశక్తి, భావశక్తి అసాధారణమైనదని బుజువైంది!

*అక్షరము లనగా నాశంలేనివని అర్థం. వర్ణమాలిక కిన్ని మరే భాషలోనూ యింత శక్తివంతమైన మాటలేదు! ఆల్ఫా, బీటా అనే ప్రథమాక్షరాలను బట్టి 'ఆల్ఫబెట్' అయింది. మనం 'అఆలు' అన్నట్లు. సంస్కృతంలో ప్రతిమాటా అర్థవంతమై ఉంటుంది. లేఖనాసౌకర్యాలు తక్కువ గా ఉండీ, లిఖితగ్రంథాలుకూడా శీఘ్రంగా నశించిపోతూండడం గమనించీ, మన ప్రాచీనులు లేఖనముకంటె ధారణమునకే ప్రయత్నిస్తూ వచ్చారు. భారతీయ ప్రాచీన గ్రంథాలూ, శాస్త్రాలూకూడ ధారణములోనే నిలిచి వుండగలిగి నాయి. మరే ప్రాచీన జాతికీకూడ హైందవులకున్నన్ని శాస్త్రగ్రంథాలు, అంత ప్రాచీనమైనవి, కేవలం పరంపరగా ధారణవల్లనే నిలిచివున్నవి లేనే లేవని చరిత్రకారులంతా అంగీకరించిన విషయమే. — అనువాదకుడు.

నీ పూర్వులనుంచి నీకు సంక్రమించిన వెన్నో ఉండవచ్చు. బంగారు, రత్నాలు, శిల్పాలు, అనేక కృషులు,–కాని అవన్నీ ఒక యెత్తు, గ్రంథజాలం ఒక యెత్తు! గ్రంథాలు మాటల తోను, మాటలు అక్షరాలతోను నిర్మిస్తాంగదూ? పాఠిక ముప్పై గురుతుల్నే 'అక్షరాలు' అని పిలుస్తాము. ఈ అక్ష రాలకంటె అమూల్యనిక్షేపం, సంపద, మానవజాతికి మరొ కటి లేనేలేదు. కాలప్రవాహానికి సేతువు నిర్మించిన దీ అక్షర మాలికే! యుగమునుంచి యుగానికీ, జాతినుంచి జాతికీ యీ అక్షరాలే బహు సున్నితమైననూ అత్యంతబలాఢ్యమైన సేతు వును నిర్మించినాయి. ఈ అక్షరములూ, శబ్దాలే లేకపోతే అనంతమైన భూతకాలంలో మానవమేధస్సు దేనిని సృజిస్తూ వచ్చిందో మన మెట్లు చెప్పగలిగేవాళ్ళం? విజ్ఞానాన్ని సంపాదించి యిముడ్చుకోగలశక్తి మానవమేధస్సుకు లేదు. అక్షరములూ, శబ్దముల సాహాయ్యాన్ని గైకొంటేనే మానవమేధస్సున కనంత విజ్ఞానమును నిలిపియుంచుకోగలశక్తి కలుగుతుంది. పురాతన విస్మృత ప్రపంచాన్ని తిరిగి నవోన్మిషితం చేయగలట్టి శక్తి, పురాతన అధునాతనకాలాలకు సేతునిర్మాణం చేయగల శక్తి, వివిధకాలాల్లోని మానవజాతుల నొక జీవప్రసంతిగా, యెన్నడు తెగని పరంపరాగతక్రమంగా సృష్టించే శక్తి అక్షరాలకేవుంది. అస్తిత్వంలోనుంచి చిరకాలంక్రిందటే విలుప్తమైపోయిన విష యాదులను చూస్తాం, ఎన్నడో మూగవోయిన గొంతులను వింటాం, అక్షరసహాయంతో, శబ్దప్రపంచంలో! *

---

* భారతీయ వేదశాస్త్ర పురాణేతిహాసాలు వింటూంటే వేలాది సం వత్సరాల క్రిందట ఆర్యావర్తప్రజల జీవన చరిత్రములు, ఆచారవిచారములే

కానిండు, మనం తిరిగి ఫొనీషియను నావికులను చూడ పోవుదము, రండు.

ఫొనీషియనులు నావలలో యేదో ఒక అజ్ఞాత తీరానికి చేరినపుడు తమ భావాలను దుబాషులద్వారానో, బభాషుల ద్వారానో అచ్చటి జనులకు తెలిపేవారు. దుబాషులంటే రెండు భాషలు వచ్చినవాళ్లు; బభాషులంటే బహుభాషులు, అనేక భాషలు వచ్చినవాళ్లు అనుకుందాం, మీకు అభ్యంతరం లేకపోతే! ఆ కొత్తదేశంలో యెల్లాంటి జనులు నివసిస్తూన్నారు? వారు ఆటవికులా? అనాగరకులా? దైవారాధకులా? నాస్తికులా? వారికున్న సంపద లేమి? ఇల్లాంటి భోగట్టా నంతనీ వారు తెలుసుకోవాలి. ఒక్కొక్కసారి ఆ నూతనులు వీరికి బల్లెములతోనూ, బాణాలతోనూ స్వాగతం యిచ్చేవాళ్లు. అతిథుల కిదొక గుణపాఠంగా ఉండేది. పిమ్మట వారు మరింత జాగరూకులుగా ఉండేవాళ్లు. మరుచటి తూరి వారు తమ సరకులను సముద్రతీరాన పరచి, నెగడి ప్రజ్వలింపజేసేవాళ్ళు. తాము వచ్చినట్లు అదే గుర్తు. అప్పుడు వారు పడవలెక్కి నీళ్ళలోకి దూరంగా వెళ్ళి, ఏమి జరుగుతుందో గమనిస్తూండేవాళ్ళు.

---

గాక ఖగోళాది శాస్త్ర విజ్ఞానం, తాత్త్వికభావనలు మొదలైనవి కళ్ళకికట్టినట్లుంటాయిగదా. అక్షరరూపంలో సంచితమైవున్న అత్యంత ప్రాచీన మానవ విజ్ఞాన మియ్యది. — అనువాదకుడు.

సరే. నెగడి ప్రజ్వలించేది. మంటల్ని చూసి, ద్వీపవాసులు జాగ్రతగా సమీపించి, తీరము మీద నుంచబడిన బహుమతు లను తీసికొని, వాటికి మారుగా తాము న్న అక్కడ కొన్ని బహుమతి వస్తువుల నుంచి పోయేవారు. ఈ విధంగా ఒకరి నొకరు కలుసుకోకుండానే, చూచుకోకుండానే కొంతకాలం పాటు వస్తువినిమయాదులు సాగిపోతూండేవి.

కాని, తమకావరకే సుపరిచితమైయున్న స్థలానికి బోయి నపుడుమాత్రం వారికింతకష్టం ఉండేదికాదు. వారు తమ పడవలను దరికిలాగి, తీరమందలి వృక్షాలకో, బండరాళ్ళకో పగ్గాలతో కట్టేసేవాళ్లు. పడవల పడిచెక్కలమీద తమ సర కుల్ని పరచేవారు. అంగడివాడు అరుగుమీద పరచినట్లే. స్త్రీలుకూడా వచ్చి చుట్టూ మూగి, బేరాలు సాగించేవారు. అంతా సందడిగా, కోలాహలంగా ఉండేది. ఈ విలాయితీ వస్తువుల్ని చూడ్డానికీ, కొనడానికీ అక్కడి రాజుగారి కుమార్తె కూడా చెలికత్తెలతో వచ్చేది. ఆ కాలంలో రాజులు, వాళ్ళ కుటుంబీకులూ ప్రజలకు దూరంగా ఉండేవాళ్లుకాదులెండి.

వర్తకం ప్రశాంతంగా సాగిపోయీది. కాని, ఒక్కొక్కప్పుడు ఆఖరిక్షణంలో అంతా తారుమారయేది. తెచ్చిన సరుకంతా అమ్మేసి, కొనవలసినవి కొని, బైలుదేరబోయే సమయంలో యీ వర్తకులే తెరవాటుగాండ్లవలె ప్రవర్తించేవారు. బలా త్కారంగా కొందరుస్త్రీలను పట్టుకుని పడవలమీదికి లాగు కొనిపోవడంతో ఆర్తనాదాలు మిన్నుముట్టేవి. కాని అప్పటికే

సమయము మించిపోయింది. తెల్లని తెరచాపలు గాలి పోసుకునేవి. అనుకూల పవనానికి నావలు డేగల్లా పసిగట్టి పోయావి. నావికులు తెడ్లమీద వంగి సిద్ధంగా ఉండేవాళ్ళు. నావలు బైలుదేరి పోతూంటే అంతకంతకు చిన్నవై క్రమంగా కనుమరుగై పోయావి.

తీరమున తల్లులు రొమ్ములు బాదుకుని, జుట్టు పీక్కుని, బట్టలు చించుకుని యేడుస్తూన్నారు. జీవితంలో కష్టసుఖాలు నింపుకున్న వృద్ధులు వాళ్ళ నూరడించేవాళ్లు. "ఏమో! దేవతలకు దయ తప్పిందిలావుంది, మనమీద. రాజకుమార్తె కూడ బానిసత్వవిషఫలాలను రుచిచూడవలసివుందేమో! విధి రాత నెవరు తప్పించగలరు?"

## అర్ధంకాని కొత్తలోకంలో ఉన్నట్టు మానవుడు తెలిసికొంటాడు.

మరో శతాబ్దం గడిచింది. మహాసముద్రాలమీద నౌకలంతకంతకు ముందుకు బోతూన్నాయి. ప్రపంచమంతకంతకు విశాలతరం అవుతూంది. గద్ద ఆకాశంపైకి లేస్తూన్నకొద్దీ, అది కొట్టే గిరికీలు, చెక్కర్లు అంతకంతకు విశాలమవుతూండవూ! అల్లాగే.

చరిత్రరంగంమీదికి మరోజాతి అవతరించింది. గ్రీకులు వచ్చి ఫొనీషియనులతో పోటీచేయ నారంభించేరు. వారు పడ

మట ఇటలీవరకూ, ఉత్తరాన సిథియను మైదానాలవరకూ, పురోగమించేరు. ఆసియామైనరులోని మిలిథస్ నగరంలో స్థిరపడిన గ్రీకు కర్షకులు నల్లసముద్రతీరంలో తోడేళ్ళను వేటాడుతూండేవాళ్లు. మిలిథస్ వర్తకులు నగిషీపని చేసిన కలశకుంభాదులనూ, బుటేదారీ పనిచేసిన ఉన్ని దుప్పటులనూ విక్రయించుతూండేవాళ్ళు.

నూతనమైన మరో ప్రపంచంలోనికి ద్వారాలు తెరువబడి నట్లయింది. ఆ ప్రపంచమంతా విచిత్రాలతోను, అద్భుతాల తోనూ నిండివుంది. చేయాల్సిందల్లా మన నౌకను యే విదేశ తీరాన్నో విడియించి, లంగరు దించడమే. ఆ దేశాన్ని యిది వరకు నీవు చూసిఉండవు. ఇదొక దివ్యభూమి అనుకుంటావు, నీవు! ఈ నూతన ప్రపంచంలో నీవు కళ్ళతో చూసినదీ, చెవులతో విన్నదీ కూడ గ్రహించనేలేవు!

ఇక్కడి భాష అశ్రుతపూర్వమూ, అగ్రాహ్యమూను. ప్రావృట్కాలంలోని కప్పల బెకబెకలూ, గ్రీష్మంలో మర్రి చెట్లమీది ఋషిపక్షుల రొదలూ, మైదానాల్లో చీరండల గీసుగాదులూ, చింతచెట్లమీది గూడకొంగల హోరూ జ్ఞాపకం వస్తూంటుంది, ఆయా భాషలు వింటూంటే. పాతాళలోకంలా ఉన్న లోతైన లోయలూ, ఆకాశాన్ని మోసే స్థంభాల్లా కన పడే ఎత్తైన పర్వతాలూ కండ్లబడేవి.

మొట్టమొదట కోతుల్ని చూచినప్పుడు విదేశీయులు పరమా శ్చర్యములో మునిగేరు. రోమశులైన ఒకజాతిజను లని వారు

భావించేరు. దగ్గరికి వెడితే వాళ్ళు పీకుతారు, కరుస్తారు, గీసు తారు! సముద్రతీరాన నెగడి వేస్తే, నౌకలోంచి చూసేవాళ్ళకు అగ్నిప్రవాహం నీళ్ళలోకి ప్రవేశిస్తూన్నట్లు తోపించేది!

కొత్తప్రపంచంలోనికి చొచ్చుకొనిపోవాలంటే మానవుడు తానూ కొత్తవాడు కావాలి. తా సంతవరకూ ఉన్నట్లుగాక భిన్నుడుగా ఉండాలి. అంతవరకూ నదీతీరమైదానాల్లో, అరణ్యాల్లో నివసించే మానవుడు తనకాళ్ళనే ఉపయోగించేడు. ఆ తరువాత తన కాళ్ళకు మారుగా గుర్రాల నాలుగు కాళ్ళనూ ఉపయోగించి, త్వరగా పోవడం నేర్చుకున్నాడు. ఎడారుల్లో ప్రవేశించేటందుకు ఓరిమిగలిగి, కష్టసహిష్ణుతగల, యిసుకలోకూడ పోగల ఒంటెల నుపయోగించుట నేర్చుకున్నాడు. నీళ్ళమీద పోవాలంటే తెప్పలను నిర్మించి తెడ్లను చుక్కానిని ఉపయోగించడం నేర్చుకున్నాడు. ఇంకా అనేక పనులను ప్రకృతినుంచీ, పశుపక్షి పిపీలికాదులనుంచీ నేర్చుకున్నాడు. అంతవరకు కనివినియుండని దేశాల్లోకి పోవడం, విపరీతవాతావరణాల్లో నివసించడం నేర్చుకున్నారు, జనులు. కొత్తవస్తువిషయాలను కేవలం చూడడమే గాక గుర్తించడం, అర్థంచేసుకోడం ముఖ్యం. ఇది అన్నిటికంటెనూ కష్టమైన విషయం.

మానవుడింకా తన తండ్రితాతల నాటి పాత కొలమానాలతోనే అన్నింటినీ కొలుస్తూన్నాడు. అలవాటును తప్పించుకోవడం ఎంత కష్టమో! ఏదైనా కొత్త వస్తువును చూచినా,

దానిలో మానవునికి చిరపరిచితమైన పాతవిషయాలే గోచరించేవి. ఏ కొత్త దానిలోనైనా పాతదీ, పరిచితమైనదీ కనబడకపోతే మానవుడు కింకర్తవ్యతామూఢుడై, తన కండ్లతో చూచినదే గ్రహించలేకపోయేవాడు.

ఉదాహరణకు ఒక సంగతి: మనం యిప్పుడొకసారి ఐగుప్తు దేశానికి పోదాం. క్రీ. పూ. మూడువేల ఏండ్ల క్రిందటి మాట. అప్పుడా దేశాన్ని ఫారోలు పరిపాలిస్తూండేవాళ్ళు.

ఆ నాటి ఐగుప్తీయులు తమదేశంలో ప్రవహించే నది ఒక్కటే యీ భూలోకంలో ఉన్నదనుకునేవారు. అందుచేతనే దానివి 'నైలు' అంటే 'నది' అని పిలిచేవాళ్ళు. అది దక్షిణాన్నుంచి ఉత్తరానికి ప్రవహిస్తూంది. అందుచేత నదులు ప్రవహించేదిశ ఒక్కటేననీ, అది ఉత్తరం మాత్రమేననీ ఐగుప్తీయులు భావించేవాళ్లు. 'ఉత్తరంగా' అని వారు వ్రాయాలంటే, ప్రవాహపు వాలునకు బోయే, తెరచాపలేని పడవ బొమ్మను వ్రాసేవాళ్లు! 'దక్షిణంగా' అనడానికి ఐగుప్త భాషలో ప్రవాహానికి ఎదురుగా, తెరచాపమీద వెళ్ళే పడవ బొమ్మను వ్రాసేవారు!

కాని, తమ జన్మభూమియొక్క అల్పపరిధులను దాటి విశాల ప్రపంచంలోనికి అడుగిడుతూన్న కొద్దీ వారు యితర నదులను కూడ చూస్తూవచ్చేరు. బాబిలను దేశంలో ప్రవహించే యూఫ్రటిస్ నదీ ప్రాంతభూమిని చేరేరు, ఐగుప్తీయులు. అక్కడవారు మహాద్భుతమైన విషయాన్ని చూచి విభ్రాం

తులైపోయారు. అదేమిటో తెలుసా ? యూఫ్రటీస్ నదివే ! అది ఉత్తరాన్నుంచి దక్షిణానికి ప్రవహించి పరిష్యాను అఖాతంలో పడుతుంది. తమ నది ప్రవహించేదిశకు సరిగా వ్యతిరేకమైనది, యీ నదీప్రవాహదిశ ! ఇల్లాంటి వింతను, అలౌకిక విషయాన్ని తమ జనులకు తెలిపితీరాల్సిందే. వారిని ప్రబోధించకుంటే తప్పుగాదూ ? అందుచేత వారీ విషయాన్ని లిఖించిఉంచేరు. ఐగుప్తీయుల ఫారో, మొదటి తూత్ రాజు శిలాస్థంభాన్ని నాటించి, దానిపై వ్రాయించేడు; "బాబిలను భూమిలోని యూఫ్రటిస్ నదిలోని జలాలు యెదురు తిరిగి, పైకి ప్రవహిస్తాయి !"

ఐగుప్తీయులు తమ దేశం దాటి బైటికి అడుగుబెట్టేక, విశాల ప్రపంచంలోని విషయాలెన్నో వారికి ఆశ్చర్యాద్భుతాల్ని కలిగించాయి. ఉదాహరణలు కొల్లలు. ఐగుప్తదేశంలో పంటలు ఎల్లాపండుతాయి ? నైలునదికి వరదలువచ్చి, పొంగి పొర్లి, చుట్టూవున్న పొలాలన్నిటినీ ముంచుతాయి. ఒండ్రు పొలాల్లో దిగబడుతుంది. వరదనీరు తీసిపోయినా, ఆ తేమకే పంటలు పండుతాయి. వర్షములు వారు ఎరుగరు ! 'వర్షాలవల్ల పంటలు' అసలే ఎరుగరు ! ఇల్లాంటి జనులు మరో దేశానికి బోయినపుడు వర్షం కురియడంచూసి, విభ్రాంతులైపోయారు. "అదుగో ! అదే ! దివ్యాపగ ! నాకధునీ శీకరము లయ్యావియే కాబోలు ! ఓహోహో ! ఎంత సేద దీర్చునవిగా ఉన్నాయి ! దేవతలకు అనుగ్రహం వస్తేనే తమ దివ్యనదీ జలాల్ని పంపుతారు !" అని భావించేరంటే ఆశ్చర్యమా ?

కాలం గడిచిపోతూంది. ఐగుప్తచక్రవర్తులు అంతకంతకి యెడారిలోకి చొచ్చుకుపోతూన్నారు. వెళ్ళినచోట తమ శిలాస్థంభాల్ని నాటుతూ, శాసనాలు వ్రాయిస్తూన్నారు. ఈ శాసనాల్లో ఫారో చక్రవర్తులు తమ అద్భుతకార్యాల నుల్లేఖిస్తూ వచ్చేరు. 'తూర్పు పడమరలుగా, ఉత్తర దక్షిణాలుగా ఉన్న భూమినంతనీ, చతుస్సముద్రముద్రితమైన ధరావలయాన్నంతనూ నిజభుజబలముచే రక్షించిన...ఫారో' అని వ్రాసుకుంటూండేవారు, ఆ శాసనాల్లో.

ఐగుప్తీయులు తమ దేశ సరిహద్దులను ముందుసకు గొంపోతూన్నకొద్దీ వారికి యీ భూమిమీద యితరేతర జనులున్నారనే విషయం విస్పష్టమవుతూవచ్చింది. అంతేగాదు. లోకంలోని ఉత్తమోత్తమ జనులు తామే గాదనికూడ తెలిసిరాసాగింది. వారి రాయబారులు బాబిలన్ నగర ప్రాకారాల కథలను చెప్పసాగేరు. బాబిలన్ ప్రాకారాలు చంద్రలోకాని కంటా వ్యాపించియున్నాయని విన్న ఐగుప్తీయులు విభ్రాంతులై పోయీవాళ్ళు. ప్రాకారాలమీద నాలుగు గుర్రాలను స్వారీ చేయించవచ్చునట! ఆకాశోద్యానవనాలు బాబిలను నగరాని కెంతో శోభను కూరుస్తాయట! ఆ ఉద్యానాల్లో ఆకాశానికంటే చెట్లు ఉన్నవట! అచ్చటి సరోవరాల్లో తెలిరాయంచలు క్రీడిస్తూంటవి! బాబిలను దేవాలయాలు అంబరచుంబులై, నగర సౌధముల ఉపరిభాగంమీద కానబడుతూంటే చూచిన ఐగుప్తరాయబారులు విస్మయంతో నోట

మాటరాకుండా ఉండిపోయీవారట! అంతవరకూ తామే మహాపండితులమని విశ్వసిస్తూండిన ఐగుప్తీయుల పురోహితులు బాబిలను పురోహితులనుంచి నేర్చుకోవలసిన దెంతో ఉందని తెలుసుకోవాల్సి వచ్చింది.

తమదే యీ లోకమని భావిస్తూండిన ఐగుప్తీయులు కాల క్రమాన యితర జనుల ఆచారవిచారాలను, మత విశ్వాసా లను గౌరవించడంనేర్చుకుంటున్నారు. అంతవరదాకా ఫారోలు తమకుటుంబంలో పుట్టిన చెల్లెండ్రనే వివాహమాడేవారు. తమం తటి కులీనులు, ఆభిజాత్యంగలవారు యీ లోకంలో మరె వరూ లేరనే విశ్వాసమే యీ ఆచారానికి మూలం! అటు వంటిది యిప్పుడు ఫారోలు విదేశీయ రాజకుమార్తెలనుంచి తమ భార్యల నెంచుకొన నారంభించేరు. ఒక శిలాశాసనంలో వర్ణించబడిన కథను చూస్తే, ఉత్తర భూముల్లో తుపానులూ, కుంభవృష్టులూ అల్లకల్లోలంగాఉన్న సమయంలోనే, ఆ దేశా న్నుంచి ఒక రాకుమార్తె ఫారోను వివాహమాడుటకై ఐగుప్తుకు పయనంచేసి వచ్చిందని తెలుస్తుంది.

ఎంత మార్పు!

ఇదివరలో ఐగుప్తీయులకు వర్షం చూస్తేనే ఆశ్చర్యం కలి గింది. కాని యిప్పుడు ఆకాశాన్నుంచి వర్షమేగాక మంచు కూడా కురుస్తుందని వారు తెలిసికొన్నారు!

ఈ రీతిగా జనులు నూతన విషయాలు చూసేరు, నూతన ఆచారవిచారాలు నేర్చుకుంటున్నారు.

ఆ కాలంలో ఆలోచించడమంటే నమ్మడమే. ప్రతీనగరానికీ దాని దేవత ఉండే దినాలని. నదీ దేవతలు, అరణ్య దేవతలు, వర్ష దేవతలు, పర్వత దేవతలు, యిల్లాగ ప్రతిదానికీ దాని దేవత ఉంటుంది. నగర దేవతయే దానిని రక్షిస్తూంటుంది. ఆ దేవత తన నగరజనులను ప్రేమిస్తూ, వారికి తోడ్పడుతూ, వారి శత్రువులమీద విజయపరంపరలను సాధించి పెడుతూ ఉంటుంది. కాని, యిప్పుడు పాతగోడలు శిథిలమై పోనారంభించాయి. నగరాల్నీ, జనుల్నీ, జాతుల్నీ వేరుజేసి ఉంచుతూవచ్చిన పురాతనపు దట్టుగోడలు ఒక్కొక్కటే కూలి పోతూన్నాయి. మొట్టమొదట ప్రతిజాతి జనులూ యితర జనులందరనూ శత్రువులుగానే చూస్తూ, వాళ్లు హీనులనీ, రాక్షసులనీ, దైవదూతలనీ అనుకునేవాళ్లు. కాని, యిప్పుడు వివిధజాతులు ప్రశాంతంగా ఒకరినొకరు కలుసుకుంటూ, చల్లగా వ్యవహారాలు చక్కబెట్టుకుంటున్నారు. వివిధజనులిప్పుడు కేవలం పొలికలనులో మాత్రమేగాక సంతల్లోనూ, రేవుల్లోనూ, దేవళోత్సవాదుల్లోనూ, దేవాలయాల్లోనూ కూడ కలుసుకుంటున్నారు. వాళ్లు పలుభాషలు మాట్లాడుతూ కలసిమెలసివుంటూనే, పలు దేవతలను నమ్ముతూండేవాళ్లు. కొత్తదేవతల పేర్లు విని, వాళ్ళ కథలను తెలుసుకొన్నప్పుడు వాళ్ళని సంతోషాశ్చర్యాలు ముప్పిరిగొనేవి. క్రమంగా బుద్ధిమంతులైనవాళ్లు, పేర్లు వేరైనా యీ దేవతలంతా ఒకటే ననీ, వేరు నామములతో పూజింపబడేది ఒక్కదేవుడే ననీ,

రూపభేదంకూడ అంతగా పట్టించుకోనక్కరలేదనీ గ్రహించ నారంభించేరు. * ఫోనీషియనులు తమ ఆదోనిస్ దేవతయే ఐగుప్తీయుల ఓసిరిస్ దేవతయని గుర్తించేరు. ఇదే ప్రకృతి! ఈమె యేటా చనిపోయి, తిరిగ బ్రతికివస్తూంటుంది! చెట్లు చిగిర్చి, పుష్పించి, ఫలించే వసంతమే యీ దేవత పునరుజ్జీవన సమయము. అప్పుడు వారు గొప్పపండుగ చేసుకునేవాళ్లు.

ప్రతి వసంతములోనూ ఐగుప్తీయులు పాపిరసుతో నొక గోళాన్ని చేసేవారు. క్రూరదేవుడైన సెత్ చే హత్యగావించ బడిన ఓసిరస్ దేవత శిరస్సే యీ పాపిరస్ గోళం. వారీ శిర స్సును సముద్రంమీదుగా ఫోనీషియనులకు పంపేవాళ్ళు. ఫోనీషియను స్త్రీలు విలాపాలతో దానికి ఎదురోక్కలు యిచ్చే వారు. అదే ఆదోనిస్—ఓసిరిస్ దేవత. తరువాత ఆ దేవత తిరిగి బ్రతకడంతో వసంతోత్సవం ఆరంభమయేది. ఇదే పున రుజ్జీవనోత్సవం; ఇది అన్నిజాతుల జనులూ యేదో రూపంలో చేస్తూన్నదే!

---

* భారతీయుల ప్రాచీనభావములను చూడుడు :

*ఏకం సద్విప్రా బహుధా వదన్తి / ఋగ్వేదం.* **10-164-46.**
*ఏకం సన్తం బహుధా కల్పయన్తి / ఋగ్వేదం.* **10-114-5.**

ఎన్ని నామరూపభేదాలతో చెప్తునా్నా దేవుడొక్కడే యని దీని అర్థము.

*ఇంద్రం మిత్రం వరుణం అగ్నిమాహుః / అథోదివ్యస్సుపర్ణో*
*గరుత్మాన్ / అగ్నిం యమం మాతరిశ్వానమాహుః//*
*ఆకాశాత్పతితం తోయం యథాగచ్ఛతి సాగరం/*
*సర్వదేవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి//*

ఏదేవునికి నమస్కరించినా కేశవునికే ముడుతుందని దీని అర్థము. బహు దేవతోపాసనలో ఏకేశ్వరోపాసననుగుర్తించిన మేధావులు ఆర్యఋషులు.—

— అనువాదకుడు.

జనులు తమ దేవుళ్ళనేగాక యితరుల దేవుళ్ళను గూడ విశ్వసించి కొలిచేవారు. బాబిలనురాజు తమ దేవుడైన ఇష్టర్ విగ్రహమును ఫారోకు పంపుతూ జాబు వ్రాసేడు: "సర్వలోక పాలకుడైన ఇష్టర్ దేవుడు, నినేవా నగరనివాసి, యిల్లా అంటున్నాడు. 'నేను ప్రేమించు ఐగుప్తు దేశానికి వస్తున్నాను.'

త్వరలోనే జనులు సర్వవ్యాపియగు దేవు నొకనినే గొలువ నారంభించేరు. * ఆతడు సర్వజనులకు రక్షకుడు, సర్వ లోకాధిపతి. ఐగుప్తీయు ఫారో అఖనాతన్ యీ సర్వేశ్వరున కొక ఆలయాన్ని నిర్మించేడు. అఖనాతన్ భక్తిపూర్వకంగా ఆ దేవుని గీతాలతో యిల్లా కీర్తించేడు:

"త్రికాలాధిపా! దేవా! నీ రాక మనోహరంగా ఉంది. నీ కిరణములు మానవజాతి కంతకూ వెలుగును గొనివస్తాయి. నీ కిరణజాలమును యెక్కడ బరపుదువో అక్కడ లోకములు వెలుగొందుతాయి."

అంతఃపూర్వం సూర్యుడు తమ కొక్కరికే వెలుగు నిస్తాన్నాడని ఐగుప్తీయులు నమ్మిన రోజులుండేవి. కాని, యితర భూములుకూడ తమకు పరిచయ మవుతూన్న కొలదీ, సూర్యుడు బహు దూరస్థ దేశాలకుకూడ ఉష్ణకాంతులను ప్రసాదిస్తూనే ఉన్నాడని తెలుసుకున్నారు. "సుదూర దేశాలకుకూడ నీవు

---

* *ఖూతస్య జాతః పతిరేక ఆసీత్ / ఋగ్వేదం.* **10-121-1**
*యే యథామాం ప్రపద్యంతే తాన్ తథైవ భజామ్యహం / గీతా /*
ఏ పేరుతో రూపంతో కొలిచినా దేవుడొక్కడే యనే భావం మన గ్రంథాల్లో సర్వత్రా కానవస్తుంది. - అనువాదకుడు.

జీవన ప్రదాతవు, దేవా! పరమ కారుణికుడవై ఆ జనులకు దివినుండి నైలు (నది)ల నొసంగుచున్నావు గదా !"

ఒకప్పుడు తా మొక్కరమే జనులమని, నిజమైన జనుల మని ఐగుప్తీయు లనుకుంటూండేవారు. దివినున్న దేవుళ్లు తమరి నే ఆశీర్వదించి, యితర జనుల నందర్నీ అసహ్యించుకుంటున్నా రని వాళ్లు నమ్మేవాళ్లు. కాని, క్రమంగా యీ పరజనులనుగూర్చి అధికాధిక పరిచయం కలుగుతూ రావడంతో ఆ భావం మారింది. పిమ్మట ఐగుప్తులో విదేశీయులే అధికసంఖ్యాకులుగా ఉండేకాలంకూడ త్వరలోనే వచ్చింది! విదేశీయులైన యోధులు అంగరక్షకులుగా ఫారోరథాన్ని అనుగమించేవారు. విదేశీయ వర్తకులు సుదూర భూములనుండి విలాయితీ సరకు లను గొని తెచ్చి యిచ్చేవారు.

"జనుల భాషలు వివిధములు. వారి చర్మ వర్ణములున్నూ వైవిధ్యం గలవియే ... కాని, దేవా! నీవు ప్రతి ఒక్కరికీ వాని వాని అర్హస్థానా న్నిచ్చి, వారి వాంఛితముల నీడేర్చు దువు !"

"ఏ భాషమాట్లాడువారుగానీ, జనులందరకూ యీపృథ్విపై చోటున్నది. . ."

ఈ భావాలు ఆధునికు లెవ్వరినైనా అనుకుంటున్నారా? అబ్బే! కాదు! 3000 యేండ్లక్రిందట ఫారో అఖనాతన్ యీ భావాలను వెలిబుచ్చేడు! కాని, యీనాటికీ యీ విష

యాన్ని అర్థం చేసుకోనివారూ, అర్థం చేసుకో నిరాకరించే వారూ ఉన్నారు! *

అతి ప్రాచీన కాలాన్నుంచీ తమ్ము మూసివుంచుతూన్న గోడలను వెనుకకు జరపాలని యత్నించేవాళ్లుంటూనే వున్నారని తెలుస్తుంది. అఖినాతన్ ఫారో కాలంలో ఐగుప్తీయుల చుట్టూవున్న గోడలు పడద్రోయబడినట్లు స్పష్టం. నైలునదీ తీరాన్నుంచి చూస్తే, యీ లోకంలో అనేక యితర నదులు, సముద్రాలు, జనులు కనబడ నారంభించేరు. 'మానవజాతి' యను మాట మొదటిపర్యాయం ఐగుప్తీయ దేవాలయాల మీద యీ దశలోనే కనబడింది. §

---

* వేదకాలంలోనుంచీ అనేక భారతీయ ఋషులు విశ్వజనీనమైన భావాలను ప్రబోధిస్తూ వచ్చేరు. వారి కారుణ్యభావం అఖిల మానవ లోకానికే గాక సమస్త ప్రాణిలోకానికే పర్యాప్తమైనది. 'శంనో ద్విపదే శం చతుష్పదే' అను వేదవాక్కులో మానవులకేగాక జంతుజాలానికిన్నీ శుభమును కోరుట చూడగలము. — అనువాదకుడు.

§ ప్రాచీన నాగరకజాతుల భావపరిణామంలోని యీ ఘట్టం మన వైదిక వాఙ్మయంలో స్పష్టంగా చూడవచ్చును. ఉపనిషత్ కాలానికే మానవులంతా ఏకశబ్దవాచ్యులుగా అంగీకరించబడింది, అందరిచేతా. అది పండితులకేగాక మనదేశంలో సామాన్యులకుకూడా పరిపాటియైనట్లు యెన్నో తార్కాణాలు చూడగలము.

సర్వేజనాః సుఖినో భవంతు,,
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు,,

యిత్యాది వాక్యాలే మనకు నిదర్శనం. —అనువాదకుడు.

కాని, జనులందరూ అఖినాతనుని యెంతదూరం చూడగల వారు గారుగదా. చాలమంది చూడజాలకపోవడంగాని, చూడ నిచ్ఛలేనివారుగా వుండడం గాని తటస్థించింది. శక్తివంతుడైన అఖినాతనుడు విదేశీయులతో సఖ్యంగా ఉంటూవచ్చేడు; దూరతఃపరివర్జనీయులుగా భావించబడుతూ వచ్చిన సామాన్య ప్రజలతో కూడ స్నేహభావం పెంపొందించుకున్నాడు. ఈ రాజుకు శత్రువులు చాలమంది ఉండేవాళ్ళు. వాళ్లాతనిని క్రూరంగా బాధించ నారంభించేరు. అఖినాతన్ మరణానంతరం అధికారమంతా తిరిగి పురోహితవర్గం, ప్రభువర్గం అధీనంలోనికి పోయింది. దేవాలయాల్లో సనాతన దేవతల పూజలు తిరిగి ఉద్ధరింపబడినాయి. అఖినాతనుడు మహాపాపియనిన్నీ, స్వమత శత్రువనిన్నీ తిరస్కృతుడైనాడు. అతని పేరును దేవాలయ కుడ్యములమీదనుంచీ, శాసనాలమీదనుంచీ చెక్కివేశారు కూడాను. ♦

చుట్టూ నూతన విశాలప్రపంచ మొకటి వ్యాపిస్తూంటే మరొకప్రక్క సనాతనుల మనుకొనువారు పాతనమ్మకాలూ, సంకుచితభావాలూ వదలకండా అంటిపెట్టుకుని పెనుగులాడు తూండేవాళ్ళు. ఆచారం, సాంప్రదాయం అనే పేరులతో

---

♦ భారతీయేతిహాసములలో వేనమహారాజు చరిత్ర యిట్టి దొకటి గాన వస్తూంది. సాంప్రదాయ ధర్మముల నుల్లంఘించి, అత్యాచారపరులైన అధి కారవర్గముల నెదిర్చి, ప్రజాసామాన్యమున కుపకృతిచేయ సమకట్టిన వేనుని రాజ్యాధికారభ్రష్టుని గావించి, పురోహితప్రభుబృందములు సాంప్రదాయ మును పునఃప్రతిష్ఠించినట్లు గానవస్తూంది. — అనువాదకుడు.

అలవాటులను అంటిపెట్టుకొనే ప్రవృత్తి మానవునిలో సహజంగా ఉంది. అందుకనే వాటికి చాల బలం ఉంటుంది. ఐగుప్తీయులు తాము ఒక్కళ్ళమే మనుష్యుల మనుకొనే కాలంనాటి సంకుచిత విశ్వాసాలను అంత సులభంగా విడిచిపెట్ట లేదు.

మానవుని బుద్ధి వికాసాన్నీ, స్వేచ్ఛనూ పొందడానికి యెడ తెగని సుదీర్ఘకృషి, కఠిననియమశిక్షణలు అవసరం.

మరైతే యీ కృషి ఏదో ఒక్క దేశంలోమాత్రమే జరిగిందనుకుంటున్నారా? అబ్బే! లేదు. ఇల్లాగే యితర దేశాల్లోనూ జరిగింది. *

గ్రీసు దేశంలో కూడ అటు తరువాత యిల్లే జరిగింది. గ్రీకులు సముద్రాంతరయానం గావించేరు; కొత్త దేశాలు చూచేరు, పర్వతాలు అధిరోహించేరు, గుహల్లో అన్వేషించేరు. పూర్వపరిచిత ప్రపంచమును వారు నిరంతరం విస్తృతపరచేవారు. పురాణ ప్రసిద్ధుడైన ఏకాక్షి రాక్షసుడు పోలిఫమస్‌నూ, త్రిశిరోశునకాన్నీ కన్న దేశాలకి బోయి వచ్చేరు, వాళ్లు! కాని, యింకా గ్రీకు రాజయోధుల విందులలో

---

* ఈ కృషిలో భారతప్రజలు బహు ప్రాచీనకాలాన్నుంచీ పాల్గొంటూనే ఉన్నారు. సంకుచిత భావాలను నిరాకరిస్తూ, విశాల దృక్పథాన్ని శాస్త్రీయంగా నిర్వచిస్తూ పురాతన తత్త్వవేత్తలు ఎన్నో గ్రంథాలు రచించేరు. భారతీయసంస్కృతి అనేది 'మానవ కృషి' అనే చెట్టున కాచిన అమృతఫలమని చెప్పాలి. మానవధర్మ నిర్వచనంలో భారతీయ మనీషులు అద్వితీయకృషి సల్పిరి. అదీ ఎడతెగని చరిత్రగలదికూడను.—అనువాదకుడు.

చారణులు ప్రాచీనగీతాలు పాడుతూనే ఉన్నారు. పూర్వం దేవతలు రాక్షసులతో యెల్లా యుద్ధాలు చేసిరో, భీమబలుడైన హెర్క్యులస్ పాతాళలోకానికి బోయి త్రిశిరో శునకాన్ని తీసికొని తిరిగి యెల్లా వచ్చేడో మొదలైన పురాణవిషయాలనుగూర్చి వాళ్లు పాడుతూంటే వేలాదిజనం పరవశులై వింటూండేవాళ్ళు. సాహసులు పర్వతశిఖరారోహణ గావిస్తూ అక్కడి విశేషాలను వెల్లడి చేస్తూన్నారు. కాని, ఒలింపస్ శిఖరంమీది దేవాయతనమునుగూర్చి చారణులు గానం చేస్తూనే ఉండేవాళ్లు!

ఇటలీ—సిసిలీల మధ్యనున్న మెస్సీనాజలసంధి కిరుప్రక్కలా గ్రీకు పట్టణాలు వెలిసినాయి. కాని, యిక్కడ నౌకలను దిగ మింగేవని ప్రాచీనగాథలు వర్ణించే సిల్లా, చార్బిడీస్‌లను జలరక్కసులను గూర్చిన కథలను మాత్రం గ్రీకుజనులు విశ్వసిస్తూనే ఉండేవాళ్లు!

ప్రపంచం విస్తృతమవుతూనే వుంది. తగరపు దీవియైన బ్రిటను వెల్లడియైనది. సిథియనులవైన అంబరుతీరాలూ; రత్నగర్భా, జ్ఞానఖనీ యైన హిందూదేశమూ కూడ నౌకాయాన పరిధిలోకి వచ్చేసాయి. కాని, యింకనూ గ్రీసులో అసంఖ్యాక జనులు ఒడెస్స్యూస్ వీరుని కాలంనాటి సంకుచిత ప్రపంచం మాత్రమే యదార్థమని నమ్ముతూన్నారు.

ఈ భూమి చదునుగా వృత్తాకారంలో వుందనీ, దానిమీద ఆకాశమనే పెద్దగిన్నె బోర్లించివుందనీ, ఈ గిన్నెకు తూర్పు

పడమరలలో రెండే ద్వారాలున్నవనీ జనులు భావించేవారు !
ఐగుప్తీయుల యీ భావాలనే గ్రీకులు మొదలైనవాళ్లు కూడా
విశ్వసించేవాళ్లు. ప్రతి దినం ఉషఃకాలంలో ఉషో దేవత
తూర్పు ద్వారాన్ని తెరచి సూర్యరథాన్ని వదలేది. సూర్య
రథం దేదీప్యమానంగా ఉండి, నాలుగు జవనాశ్వములు పూన్చి
ఉంటుంది. భూమిచుట్టూవున్న నదినే సముద్రం అని పిలవాలి.
ఆ నది యీవల పశ్చిమంగా యెక్కడో సంధ్యాదేవత పశ్చిమ
ద్వారాన్ని తెరచేది. సూర్యరథం పశ్చిమాకాశమనే వాలు
మీంచి దిగి, పడమటిద్వారంగుండా నిశారాజ్యంలోకి వెళ్ళి
పోతుంది. ఇదీ ఆ నాటి జనుల అభిప్రాయం.

అతిసుందరమైన ఇథాకా దీవిపై ఒడెస్యూస్ రాజు నివ
సించేవాడు. అచ్చటి కనతిదూరంలోనే ల్యూకాడియా పర్వత
ముల ధవళశిఖరములున్నాయి. వాటి వెనుకనే పాతాళలోకా
నికి ద్వారాలున్నవనీ, అచ్చటి మైదానాల్లో ఆస్ఫోడెల్
పుష్పాలు వెలవెలబోతూ వికసిస్తాయనీ, మృతుల ఛాయా
రూపాలు అచ్చోట గుంపులుగా పరిభ్రమిస్తూంటాయనీ అను
కొనేవాళ్లు, అందరూకూడా !

అమాయికములూ, సుందరములూనైన యీ దివ్యగాథ
లను వింటూ, జనులు తమ కండ్లతో చూసిన యథార్థ
ప్రపంచాన్నే మరిచిపోయేవాళ్ళు.

సాహసిక జనులు సాగరయాత్రలు గావిస్తూ, ప్రపంచ
మంతా పరిభ్రమిస్తూ, లోకపుగోడల నంతకంతకు వెనుకకు

నెట్టుతూవచ్చేరు. కాని, యిక్కడికి వచ్చేసరికి వారు మరో కొత్త ఆటంకాన్ని యెదుర్కోవాల్సివచ్చింది. అది కండ్లకు కానరానిదైననూ బలవత్తరమైనట్టిది. తమలోనే గూడు కట్టుకునివున్న పాతభావాలు, విశ్వాసాలు అనేదే యీ గోడ, ఆటంకం.

ఈ గోడను దృఢంగా నిలిపి కాపాడుతూండేవాళ్లు, సనాతన దేవతలు !

ఈ ఆటంకము నధిగమించగలది, ఈ గోడను భగ్నంచేయ గలది ఒక్కటే ఉంది. అదే శాస్త్రీయజ్ఞానం !

## శాస్త్రజ్ఞానానికి పుట్టినిల్లు ఏది ?

మనం తరచుగా విజ్ఞాన శాస్త్రంలో 'కడపటి సిద్ధాంతం' అనడం వింటూవుంటాము. కాని, విజ్ఞాన శాస్త్రంలో 'మొదటి మాట' యెప్పుడు చెప్పబడింది ? విజ్ఞాన శాస్త్రానికి పుట్టినిల్లు ఏది ? అనేది యెవరూ చెప్పరు.

మీకు ఆశ్చర్యం కలుగవచ్చునేమో గాని ఈ ప్రశ్నలకు జవాబు మనం చెప్పగలము.

విజ్ఞాన శాస్త్రంలో మొదటిమాట అంటే మొదటి శాస్త్రీయగ్రంథం అనే అర్థం. ఆసియా మైనరులో మిలిథుస్ అనే రేవుపట్టణం ఉంది. అది గ్రీకులు స్థాపించినది. క్రీస్తు పూర్వం 547 వ సంవత్సరంలో యీ పట్టణంలో ఉండిన అనక్షి

మందిర్ ( Anaximander) అనే గ్రీకు పండితుడు 'ప్రకృతిని గురించి' అను గ్రంథాన్ని రచించేరు. అదే ప్రథమ విజ్ఞాన శాస్త్ర గ్రంథమని చెప్పవచ్చును.

1953 వ సంవత్సరంలో విజ్ఞానశాస్త్రానికి 25 వ శతవార్షికోత్సవాన్ని చెయ్యవచ్చు నన్నమాట! కాని, యింకా ఖచ్చితంగా చెప్పాలంటే యీ తేదీనింకా వెనక్కి గెంటవలసి వుంది. ఎందుచేతనంటే క్రీ. పూ. 585 వ యేట మే 28 వ తేదీని మిలిథుస్ పట్టణంలో కనిపించే సూర్యగ్రహణంపట్టింది. అంతకుముందూ సూర్యగ్రహణము లెన్నో పట్టినాయనుకోండి. వాటిని చూసి జనులు భయభక్తులతో వినమ్రులయేవాళ్ళు. అంతే. కాని, యీ సారి సూర్యగ్రహణాన్ని చూసిమాత్రమే గాదు జనులు ఆశ్చర్యపడినది! ఆ సమయానికి సూర్యగ్రహణం పడుతుందని మున్ముందుగానే చెప్పబడిన జ్యోతిషం పట్ల వారు మరింత ఆశ్చర్యపడ్డారు! మిలిథుస్‌లోని థేల్స్ పండితుడు యీ జ్యోశ్యాన్ని చెప్పేరు!

ఐతే, విజ్ఞానశాస్త్రం మరోచోటగాక మిలిథుస్‌లోనే ఎందుకు జన్మించింది? ఈ రేవుపట్టణాన్నుంచి స్థల జల మార్గాలు ప్రపంచం నాలుగు చెరగులకీ వ్యాపించినాయి. ఇక్కడ అనేక దేశాలనుంచి వచ్చిన వర్తక బృందాలతో మహా సందడిగా, హడావుడిగా ఉంటుంది. 'విజ్ఞాన శాస్త్రం' తన శైశవ క్రీడాస్థలంగా యిల్లాంటి తావును యెందుకు ఎన్నుకుంది? మిలిథుస్‌లో తయారయే ఉన్నిగుడ్డల తానులు, చిత్ర

వర్ణ రంజిత కలశకుంభములు నింపిన నౌకలు ప్రతిదినం ఆ రేవు నుంచి బైలుదేరి, చాప లెత్తుకుని సుదూరదేశా లెన్నిటికో పోయీవి. దూరస్థమైన సిథియనుల భూమికీ, దక్షిణాన ఐగుప్తదేశానికీ, పశ్చిమాన యిటలీలోని సైబారిస్‌కూ యీ నౌకలు వెళ్ళేవి. హిందూదేశం, పెర్షియా, బాబిలను మొదలైన ప్రాన్దేశాలకు పోయే బిడారులకు కేంద్రం మిలిథుస్ పట్టణమే. ద్రాక్షతోటలు, ఆలివ్‌తోపులు, పచ్చికబీళ్ళు దాటి యీ బిడారులు సాగిపోయీవి. సన్నని కాళ్ళుగల అంగోరా గొఱ్ఱెలు పచ్చికను పెదవులతో కొరికి తింటూ, బిడారులు సమీపించగానే బెదరి చెదరి పారి, బిత్తరిచూపులు చూస్తూండేవి. మిలిథుస్ రేవు రేయింబగళ్ళు సందడిగా, గందరగోళంగా ఉంటూండేది. ఓడలు వస్తూపోతూండేవి. ఓడలుకట్టే తక్షులు నిరంతరాయంగా కొట్టే సుత్తిదెబ్బలకు పట్టణం మారుమ్రోగుతూండేది. సరంగులు, కళాసీలు, రేవుకూలీలు రేవుల్లో గుంపులుగూడి కోలాహలంగా ఉండేవాళ్ళు.

అంగడిప్రాంతం కొనేవాళ్ళతోనూ, అమ్మేవాళ్ళతోనూ నిండి ఉండేది. బరువులతో పిటపిటలాడే గార్దభములు మనుష్యుల్ని తోసుకుంటూ తిరిగేవి, ఆ బజారుల్లో.

చతుష్పథంలో సభలు జరిగే రోజున ఏం గందరగోళమని చెప్పమన్నారు! రెండు పక్షాలు పరస్పరం పోటీపడేవి. వర్తకులు, వడ్డీవ్యాపారులు, యజమానులు ఒక పక్షం; కూలీలు, నావికులు, వృత్తిపనులవాళ్లు, బానిసలు మొదలైనవాళ్ళంతా

రెండో పక్షం. మొదటిపక్షంలోని సుగంధ వాసనావాసి తులూ, సుందర కేశపాశులూనైన లక్ష్మీపుత్రులకు రెండో పక్షంలోని మోటు మానిసులతోడి పోరాటాల్లో సాధారణంగా అధికశ్రమ కలిగేది. యజమానుల నున్నని గిరజాలు రేగిపోయేవి, వాళ్ళ ఉదారంగు అంగీలు చెదిరి నలిగి పాడై పోయేవి.

ఈ గోలా, గందరగోళం, హడావుడీ, అట్టహాసం, కేకలూ అన్నీ కలిసిపోయి, విలక్షణమైన మంగళోత్సవనాదమై, శాస్త్ర శిశూదయ శుభసమయాన్ని ప్రకటిస్తూన్నట్లున్నాయి. నిభృతమై నిశ్శబ్దమై ఉండే ఏ ఐగుప్తీయ దేవాలయమో, బాబిలోనియను మఠమో మన శాస్త్ర శిశువుకు ఊయెల తొట్టిగా ఉంటేనే దాని అభివృద్ధికి మంచి అవకాశం ఉండేదేమో? విషయ పరిశీలనకూ, మననమునకూ దేవాలయములకంటె మంచిచోట్లు ఎక్కడవుంటాయి? * అసలు వాటిని చూస్తేనే గ్రహములూ, నక్షత్రములూ, విశ్వరూపం స్ఫురిస్తాయి. ఒకదానిపై నొకటిగా నిర్మించిన ఏడుగోపురాలూ మనల నాకాశానికి గొంపోయే బృహత్సోపానపంక్తిలా ఉంటుంది. సప్త

* ప్రాచీన భారతదేశంలో ప్రశాంతములైన వనప్రదేశములే ఆత్మజ్ఞానాభివృద్ధికై వినియుక్తములైనవి. ఐతే కర్మకౌశలమును సాధించుటలో కూడ ప్రాథమిక దశలో అరణ్యాశ్రమములలోనే కృషి జరిగినట్లు కనబడుతుంది. అగ్నికర్మ, ధనుర్వేదం, ఆయుర్వేదం, వాస్తుశిల్పాదులకు కూడ వేద వేదాంత కావ్యాదులకు వలెనే ఋష్యాశ్రమాలే జన్మస్థానములు.

— అనువాదకుడు.

గ్రహములకూ ప్రతిగా సప్త గోపురములు! దేవాలయ ద్వారంలో చలువరాతి జలకుండిక ఉంటుంది. ఈ భూమి ప్రాకృతజలాలనుంచి ఉద్భవించిం దనే బాబిలోనియను మత విశ్వాసాన్నిబట్టే యిక్కడీ జలకుండిక ఉంచబడింది! ఎత్తైన గోడలు, స్థంభాల వరసలు వెనుక పరిశోధనాగారాలు, పాఠశాలలు, గ్రంథాలయాలు, లేఖనాపరికరాలుంచే గదులూ మొదలైనవి ఉండేవి.

తెలివిగల వ్రాయసగాండ్రు ఉదయాస్తమయ పర్యంతం మట్టి బిళ్ళలమీద వ్రాస్తూనే ఉండేవాళ్ళు. ఆ లిపి కోణాకృతి గల గుర్తులతో కూడినది. దినదినం, వారంవారం, మాసం మాసం, యేటేటా యీ మట్టిబిళ్ళలు గుట్టగుట్టలుగా గ్రంథాలయాల్లోనూ, గదుల్లోనూ ప్రోగుపడేవి. వేల సంవత్సరాల్లో వాళ్ళు సంపాదించిన విజ్ఞానాన్నంతనీ యీ యిటుకలమీద వ్రాసి ఉంచారన్నమాట! ఒక బిళ్ళ యిల్లా ప్రారంభమైంది. 'ఎనూమా ఎలిష్' అంటే 'ఎప్పుడు పైన' అని ప్రారంభించి, 'స్వర్గం' క్రిందభూమికూడ నామరూపరహితమై ఉండేదో' అని సాగిపోతూ, యీ ప్రపంచం పుట్టుకను గూర్చి చెపుతుంది. *

---

* దేవానాం పూర్వ్యేయుగే ఽ సతస్సదజాయత / ఋగ్వేదం.
**10_114-5.**

ఆపోవా ఇదమగ్రే సలిల మాసీత్ / తై. బ్రా. **1–1–3–5.**

సదేవసౌమ్యేద మగ్ర ఆసీత్ / ఛాం. **6–2.**

నైవేహకించనాగ్ర ఆసీన్మృత్యు నైవేద మావృత మాసీత్ /
బృహదారణ్యకం. **1–2–1**

మరో మట్టిబిళ్ళ చూదాం. దీనిమీద రాశిచక్రం ఉంది. నక్షత్రరాసులు, వాటిగుండా సూర్యుడు ప్రయాణం చేయడం, దినమాసవత్సరాదులను లెక్కించుట, గ్రహముల భోగట్టా, గ్రహణములను తెలిసికొనే విధానం, చంద్రునినుంచి యితర గ్రహ నక్షత్రాదులకుగల దూర గణనం మొదలైన విషయాలను తెలుపుతూంది, యీ బిళ్ళ. గణితశాస్త్రాన్ని గూర్చిన బిళ్ళలు కొన్ని వున్నాయి. గుణకార భాగహారములను గూర్చి, భిన్నములగురించీ, సంఖ్యల వర్గమూలములను సాధించుటను గూర్చి తెలుపు బిళ్ళలు అవి.

దేశములు, నదులు, పర్వతములు మొదలైనవాని జాబితాలూ, భోగట్టా కొన్ని బిళ్ళలమీదఉంది. నిఘంటువులు, పద్యమంజరులు, వ్యాకరణములు కూడ వున్నాయి, వాటిలో. వైద్యశాస్త్రములు, దేశపటములు కూడ ఆ బిళ్ళలమీద వ్రాసేరు. ఆ దేశపటాల్లో భూమి వృత్తాకారంగా వ్రాయబడి ఉండేది. నదులు, సముద్రములు భూమిని నాలుగు విభాగాలుగా చేసి ఉంటాయి. భూమిచుట్టూకూడా సముద్రం చుట్టుముట్టి ఉంటుంది.

సరే, ఐతే యిదంతా శాస్త్రం, జ్ఞానం కాదా ?

---

తమోవా ఇదమగ్ర ఆసీదేకమ్ / మైత్ర్యుపనిషత్. 5–2.
ఆసీదిదం తమోభూత మప్రజ్ఞాత మలక్షణం /
అప్రతర్క్య మవిజ్ఞేయం ప్రసుప్త మివసర్వతః// మనుస్మృతి. 1-5-8.

సృష్టికి పూర్వం ఏమున్నదనే విషయాన్ని గూర్చిన వివిధ చిత్రణలియ్యవి. — అనువాదకుడు.

చూద్దాం. రాశిచక్రంలో పన్నెండు రాశులకు అనుగుణ్యంగా సంవత్సరాన్ని పన్నెండు నెలలుగానే మనం యీనాటికీ విభజిస్తూన్నాము. వారానికి యిప్పుడూ ఏడు రోజులే. బాబిలోనియను లెరిగియున్న యేడు ఖగోళాల్ని బట్టి వారంలోని యేడు రోజులకీ నామకరణం చేసేరు. ఈ ఖగోళాల్ని 'గ్రహములు' అనగా 'సంచారముచేయునవి' అని పిలిచేవాళ్లు. సోముని (Moon) బట్టి సోమవారం, అంగారకుని (Mars) బట్టి అంగారక లేక మంగళవారం, బుధుని (Mercury) బట్టి బుధవారం, బృహస్పతి (Jupiter) కి బృహస్పతి లేక లక్ష్మీ గురు వారం, శుక్రు (Venus) నికి శుక్రవారం, శని (Saturn) ని బట్టి శనివారం, సూర్యుని (Sun) బట్టి ఆదిత్యవారం అని పేర్లు ఏర్పడినాయి. ఇంగ్లీషులో సాటరన్ దినం సాటర్ డే; జర్మనీలో సన్ దినమే సన్ డే, యిప్పటికీ! బాబిలోనియనులనుంచి సెమైట్లు అనగా యూదులున్నూ, వారినుంచి పాశ్చాత్య ప్రపంచమంతయున్నూ యీ పద్ధతినే అనుసరించేరు.

మన మొక గడియారాన్నే చూదాం. దాని ముఖఫలకం మీద 12 గంటలు గుర్తించివుంటాయి. గంటను 60 నిముషములుగను, నిముషమును 60 సెకనులుగాను విభజించడంకూడ చూడగలముగదా. ఇదంతా వేలయేండ్ల క్రిందట బాబిలోనియనులు గావించినదే! వృత్తమును 360 అంశములు లేక డిగ్రీలుగా విభజించడంకూడ బాబిలోనియనులనుంచే మనము నేర్చినది!

ఐతే బాబిలనులోనే శాస్త్రవిజ్ఞానం ప్రారంభించిందని ఎందుకు చెప్పకూడదు? 'ప్రపంచ ముఖద్వారము' అని బాబిలనును ప్రాచీనులు వ్యవహరించే వాళ్ళంటే, ఊరకనే గాదని తెలుసుకోవాలి!

ఇప్పుడు చెప్పండి? శాస్త్రవిజ్ఞానం ఉదయించినది బాబిలనులోనా? మిలిథుస్‌లోనా?

చెప్పలేరా? సరే! ఐతే దీనికి ప్రత్యుత్తర మిమ్మని బాబిలోనియనులనే అడుగుదాము.

వాళ్ళు దీనికేమని జవాబు యిస్తున్నారు?

బాబిలోనియనుల మట్టిబిళ్ళలనే విచారించి తెలుసుకుందాం, దీనికి జవాబేమని.

కోణాకృతిగల యీ గుర్తులు నేటి అక్షరాలవంటివిగావు. ఆ మాటకువస్తే నేటి వివిధభాషల్లోని అక్షరాల్లోనూకూడ ఎంతెంతో తేడాలున్నాయి. బాబిలోనియనుల మట్టిబిళ్ళలూ నేటి గ్రంథాలవంటివిగావు. ఆ బిళ్ళలను చదువగలిగినా వాటిఅర్థం మనం గ్రహించలేము. ఎందుచేతనంటే, వేలాదియేండ్లక్రిందట నివసించిన జనులు మనమీనాడు ఆలోచించినట్లు ఆలోచించేవారుగారు. మనమీనాడు భావిస్తూన్నట్లు భావించేవారుగారు. అందుచేత వారి భాషలోనుంచి మన భాషలోకి అనువదిస్తేనే సరిపోదు. వారి ఆలోచనాసరళిని మన ఆలోచనా సరళిలోనికి మార్చుకోవాలి కూడాను!

"ఎనూమా ఎలిష్......"

"ఎప్పుడు పైన స్వర్గమును ఒకనూ నామరూపములు లేనిదై ఉందో, అప్లే క్రిందిభూమికూడా నామరూపములను పొంది యుండలేదో, అప్పుడు అన్నిటికీ 'అప్సు' ప్రథమోత్పాదకమై యుండెను. అంతేగాక సర్వమునూ వహించునట్టిదైన 'తియామత్' అనునదికూడ ఉండెను. ఈ 'అప్సు' 'తియామత్' లు రెండూ తమ జలములను కలుపుకొన్నవి......అప్పుడు దేవాలయాలు అసలు నిర్మించబడనేలేదు; చిత్తడినేలలున్నూ లేవు; దేవతలున్నూ యింకా దృశ్యులు గాలేదు. అసలు అప్పటికింకా నామమనేదే లేదు, నిర్దిష్టమైన అదృష్టం (fate) * అనేదే లేదు. దేవతలు ఆ తరువాతనే సృజించబడిరి..."

---

* మన పరిభాషలో 'కర్మ' యని దీనిని అనువదించాలి

*దేవానాం పూర్వ్యేయుగే౽ సతస్సదజాయత / ఋగ్వేదం.*

**10-72-7.**

*అపోవా ఇదమగ్రే సలిల మాసీత్ / తై. బ్రా.* 1-1-3-5.

*తమోవా ఇదమగ్ర ఆసీదేకమ్ / మైత్ర్యుపనిషత్.* 5-2.

ప్రాచీనవాఙ్మయాన్నుంచి యిల్లాంటివెన్నో వాక్యాల నుదహరించవచ్చును. సృష్టిక్రమాన్నిగూర్చిన వెన్నో మనోహర భావచిత్రాలు ఋషులు నిర్మించి యున్నారు. మరేప్రాచీనజాతికీ యిల్లాంటి విస్తృతమైన, వైవిధ్యంగల ఆలోచనాసరళి లేదనే చెప్పాలి. గాక పారశీక, సుమేరు, బాబిలను, అస్సిరియను, యూద, గ్రీకు జనులకు మనదేశంనుంచే పారంపర్యంగా యీ భావాలు వ్యాపించాయనుట కెన్నో తార్కాణాలు, వేలయేండ్ల వినాశానికి తట్టుకొని నిలువగలిగినవి చూచినా మనదేశంలో యింకా సాగరోపమంగా ఉంది, ప్రాచీన విజ్ఞాన భావసందోహం. ఈ విస్తృతియే ఋజువు, ఇక్కడే దీని పుట్టుక అనడానికి. — అనువాదకుడు.

ఒక్కొక్క మట్టిబిళ్ళనే చదువుతూ పోతే కథంతా తెలుస్తుంది. అప్సుదేవుడు, ఆయన భార్య తియామత్ యున్ను తమకు జన్మించిన బిడ్డలతోనే పోరాడనారంభించేరు. అప్సు తియామత్‌ల సంతానమే దేవతలున్నూ. వారి సంతానంలోని ఇయా (Ea) అనే దేవత అప్సును సంహారించేసేడు. మరొకడైన మర్దుక్ వచ్చి తియామత్‌ను రెండుగా చీల్చేశాడు. ఆలిచిప్పల జంటవలె తియామత్‌లో సగభాగం ఆకాశంగానూ, మిగతా సగం భూమిగానూ అయిపోయినాయి.

ఇదంతా శాస్త్రీయ విజ్ఞానమా, మరి?

అబ్బే! కాదు. ఇదంతా వ్రాసినవారు శాస్త్రీయంగా ఆలోచించ నభ్యసించినవారు కారు. మహోంతమైన గొప్ప గందరగోళం (Choas) లేక నకుతః (Nowhere) అనే భావం వారి బుద్ధికి అందనేలేదు. * ఆ గందరగోళం లేక ప్రళయంలోంచే మిగిలినవన్నీ సృష్టమైనవని వారు ఊహించరు. దానిని బాబిలోనియనులు పితయైన అప్సుదేవునిగా భావించేరు. సువ్యాప్తమైన జలార్ణవంలోనుంచి యీ లోకమంతా సృజించబడినదని వారు భావించక, తియామత్ దేవత రెండుగా చీల్చ

---

* అది వివాదాంశం. సృష్టినిగూర్చిన భావములు శాస్త్రీయంగా ఒక ప్రక్క పండితులైనవారు ప్రవచిస్తూనేవుండగా రెండోప్రక్క జనులంతా యిట్టి పుక్కిటిపురాణాలను, అభూత కల్పనలను నమ్ముతూండడం సర్వత్రా ఉన్నదే. సృష్టి ఎల్లాఆరంభమైంది? లేక ఇది ఎప్పుడూ యిల్లాగే ఉందా? అనే ప్రధానప్రశ్నకు వైదికఋషులు చక్కని సమాధానమిచ్చి యున్నారు. (నాసదీయ సూక్తములు). — అనువాదకుడు.

బడినదని భావిస్తారు. 'ఈ దృశ్యప్రపంచమంతా యెట్లా, దేని నుంచి ఉద్భవించింది?' అనే ప్రశ్నను వారు వేయలేదు. 'ఎవరినుంచి యీ చరాచరవస్తుప్రపంచ మంతా పుట్టినది? ఏ తలిదండ్రుల సంతానమిదంతా?' అనే ప్రశ్ననే వారు వేసుకుంటూ వచ్చేరు. ఈ సృష్టిలో ప్రతీదీ తలితండ్రులనుంచి సరాసరిగా బిడ్డలుగాజనించడంచూస్తూన్నారు, వేలయేండ్లుగా. అల్లాగే యీ లోకమంతా ఒకప్పుడు యెవరో దంపతులుగా జనించినదేననీ వారు విశ్వసిస్తూవచ్చేరు.

ఈనాటికీ మనంకూడ కొంతలో కొంతైనా ఆ భావాలనే కలిగివుంటూన్నాము. 'మాతృభూమి' 'తల్లిదేశం' అని తరచు మనం అనడానికి మూలం అప్పటిదే!

గ్రహణము లెప్పుడు వస్తాయో బాబిలోనియనులు కూడా సరిగా చెప్పగలుగుతూండేవాళ్లు. కాని, వారు యీ గ్రహణములు దేవతలు పంపిన గురుతులనిన్నీ, రాబోవు సంక్షోభాలను గురించి చేయబడు హెచ్చరికల వంటివనిన్నీ నమ్ముతూండేవాళ్లు.అంతేకాని గ్రహణాలు ప్రకృతిసహజమైన దృశ్యలక్షణములని వారు భావించలేదు.

వారు చాలకాలంవరకు యిల్లాంటి భావాలనే కలిగిఉంటూ వచ్చేరు. వాళ్ళ గ్రంథాలయాలు బోలెడంత భోగట్టాను ప్రోగులుపెడుతూన్నాయి. బీరువాలు, గదులు, భవనాలు నిండిపోతున్నాయి, యీ గ్రంథాలతో. కాని కార్యకారణ సంబంధమైన 'శాస్త్ర' మనేది అక్కడ యింకా జన్మించలేదనే

చెప్పాలి. బాబిలోనియనుల ప్రాచీన గ్రంథాలన్నీ అసంఖ్యాక మైన మంత్రాలు, తంత్రాలు, ప్రయోగవిధులతో నిండి వుండేవి. పంటికి పుప్పి బైలుదేరిందనుకోండి. దానికి మంత్రాలు, మందులు, తంత్రాలు బోలెడున్నాయి. గుగ్గిలం, సున్నం కలిపి పంటిలో పెట్టడం అనేది తంత్రం అనుకోండి. ఆ పని చేస్తూ, కొన్ని మంత్రాలుకూడా వల్లించాలనేది విధి. ఆ మంత్రాల్లో ఏముండేదో చూదాం. దేవుడు ఆకాశాన్నెల్లా సృష్టించేశో, ఆకాశాన్నుంచి భూమి, భూమినుంచి నదులూ, నదులనుంచి కాలువలూ యెల్లా బైలుదేరాయో, కాలువల్లో క్రిములు పుట్టి, అవి పంటిలో దూరడం మొదలైన విషయాలు సుదీర్ఘమైన దండకంలా వుంటుంది. ఆఖరున క్రిమిని సంబోధిస్తూ "దేవుడు మహాశక్తిగల తన హస్తాలతో నిన్ను నాశం చేయుగాక!" అని శపిస్తారు! *

శాస్త్రాన్ని సృష్టించేందుకు పూర్వం జనులొక నూతన పంథాలో ఆలోచించడం నేర్చుకొని వుండాలి. కాని కొత్త పంథా, కొత్త ఆలోచనలు సుఖసుఖాల వస్తాయా? వేల సంవత్సరాలనాటి పురాతన దేవాలయాల్లో నూతన భావాలు కలగడం అసంభవమే.

---

* మంత్రాలు యిప్పటికీ అమెరికావంటి ఆధునిక దేశంలో కూడా ఉంటూనే ఉన్నాయి. అంతమాత్రాన శాస్త్రీయదృష్టి అక్కడ అభివృద్ధి కాలేదనడం సరిగాదు. అల్లాగే మూఢ నమ్మకాలూ, శాస్త్ర విజ్ఞానమూ ప్రక్క ప్రక్కనే వర్ధిల్లుటకు అవకాశంవుంది. — అనువాదకుడు.

శాస్త్రముల పుట్టినింటిని అన్వేషించడానికి మనం మరో దిశగా పోవాలి. తూర్పున బాబిలను, దక్షిణాన ఐగుప్తు గాక పశ్చిమాన గ్రీసుకు పోవాలి. అటునుంచే వచ్చారు, మిలిథుస్ జనులు.

తమ జన్మభూమినుంచి, పూర్వపు కాణాచినుంచి వీరేమి తెచ్చేరు? గ్రీసుదేశాన్నుంచి భాష, విశ్వాసాలు, ఆచారాలు వగైరాలు తెచ్చుకున్నారు, వాళ్ళు.

మిలిథుస్‌లోనూ, గ్రీసులోనూ కూడ జనులు కొలిచే దేవుళ్లు ఒకళ్ళే. వాళ్ళ పురాణములు, కావ్యములు ఒకటే. సాంప్రదాయిక గాథలనుబట్టి ప్రాచీన మహాకవి హోమర్ రచించిన పాటలు, యివి. హోమరు పాటల్లో మతం, శాస్త్రం, కవిత్వం, అన్నీ కలగాపులగంగా ఉంటాయి. మానవుల ఆలోచనాక్రమంలోని మూడు విభిన్న శాఖలుగా యివి కాలేదు, అప్పటికి.

హోమరు మహాకవి ఇలియడ్, ఒడెస్సే అను రెండు కావ్యాలు రచించేరు. ఆయన వాటిలో కర్మను మతంతో ముడిబెట్టేడు. ఉదాహరణకు ఆయన ఒకచోట ఆయుధనిర్మాత కార్ఖానాను గురించి గానం చేస్తూ, మహావీరుడగు అఖిలీస్‌కి డాలును తయారుచేసి యిచ్చిన కమ్మరి మానవమాత్రుడు గాడనీ, అతడు హెఫాస్టస్ అను దేవశిల్పి యనీ వర్ణిస్తాడు. ఆ నాటి నౌకాయాన సంబంధమైన శాస్త్రమంతా ఒడెస్సే కావ్యంలో కానవస్తుంది. సముద్రంమీది తుపానులను

హోమర్ కవి యెంతో నిర్దిష్టంగా వర్ణించేడు. ఒదిస్స్యూస్ ఓడలను తిప్పలుబెట్టిన తుపానులు, గాలులుగూర్చిన ఆయన వర్ణనలు గైకొని మనం యీనాడుకూడా సిసలైన వాతావరణ పటాన్ని, ఛార్టును తయారుచేయవచ్చు! కాని, ఆ గాలులను దేవతలుగా వర్ణిస్తాడు, ఆ మహాకవి!

హీసియడ్ కూడ గ్రీకు కవియే. ఆతడూ దేవతలనుగూర్చి కవిత లల్లేడు. కాని, ఆయన తరహా వేరు. హీసియడ్ కవి గ్రీసులోని బొయోషియో పర్వతములలో ఆస్క్రా యనే కుగ్రామంలో నివసించేవాడు. ఆయన తన కావ్యాల్ని ప్రభువుల విందుల్లోనూ, రాజుల సభల్లోనూ గాక గ్రామ జనుల సమావేశాల్లో గానంచేయువాడు. గాథలను బట్టి చూస్తే హీసియడ్ పుట్టిన దేశం 'మ్యూజెస్' అనే దేవతాస్త్రీల జన్మభూమియే. హెలికాన్, పర్వతసానువులపై నా దివ్యసోదరీమణులు తొమ్మండుగురూ హీసియడ్ పల్లెకుపైన నివసించేవారట! ఈ ఏడుగురు సోదరీమణులూ పురాణకావ్యము, చరిత్ర, శృంగార ప్రబంధము, గేయము, విషాదాంతనాటిక, వక్తృత్వము, నాట్యము, సుఖాంతకావ్యము, జ్యోతిషము అను తొమ్మిది కళలకు అధిష్ఠానదేవతలని గ్రీకుల సాంప్రదాయము. నిజమే! హీసియడ్ పుట్టినిల్లు దివ్యకళలకు జన్మస్థానమే!

హేమంత ఋతువులో పగలుకూడ చలిగానే ఉంటుంది. చేయుటకు పనులూ ఉండవు. అటువంటప్పుడు ఆస్క్రా గ్రామీణులు పర్వతసానువులమీద ఎండపొడవున్న ఒక చో

కుండేవాళ్లు. అక్కడే హిసియడ్ ఉండేవాడు. అతడికి లైర్‌గాని మరే తంత్రీవాద్యంగాని చేతగాదు. అందుచే నాలెడు చేతనొక గుణుపుల కర్రగాని, దానితో లయ వేస్తూ, ఎన్నెన్నో సంగతులను గురించిన పాటలు పాడుతూండేవాడు. దిజ్మండలం మీద కృత్తికానక్షత్రం * కనబడినప్పుడు కోతలు, నూర్పుడుల తరుణం వచ్చిందని రైతులకు చెప్పేవాడు. అట్లే కృత్తికా నక్షత్రం అదృశ్యమైనప్పుడు దుక్కికి పదును అని చెప్పేవాడు. ఓడల్లో సరకులు నింపి, యెప్పుడు సముద్రాంతరాలకు పైలు దేరాలో కూడ ఆతడు గ్రామీణులను హెచ్చరించువాడు. ద్వీపాంతరాలనుంచి తిరిగివచ్చిన పడవలను ఒడ్డు పట్టించి, పడి చెక్కలమీద బరువైన పాషాణములను యెక్కించి ఉంచుమనీ, లేనిచో కెరటాలు వాటిని కొట్టేస్తాయనీ ఆతడు సలహాలనిచ్చువాడు. చుక్కానికాచే తెడ్డుకర్రను వంటపొయ్యిపైన వ్రేలాడదీసి ఉంచితే బాగా ఆరుదలగాడుంటుందనేదీ ఆయనే చెప్పాలి.

---

* దీనినే గ్రీకులు Pleiades అని వ్యవహరిస్తారు. సప్తకన్యలని దీని కర్థము. మన ప్రాచీనులు మంగలికత్తి ఆకారంలో ఉండే ఆరుచుక్కలనిరి. 'క్షురా షట్' అనియు, 'అగ్నిశిఖాకృతి షట్ తారకామయమ్' అని కాళిదాసున్ను దీనిని వర్ణించిరి 'కత్తెర చుక్క' లంటే యివే. మామూలుగా ఆరు చుక్కలున్నా బాగాపరిశీలించి చూస్తే ఏడుచుక్కలున్నా యిందులో కనిపిస్తాయి. కాని యిది 2700 చుక్కల గుంపు. జట్టుగా పోవు నీ చుక్కల గుంపు 'కొరవిపూ బొదరింటి చందాన' ఉండునని శ్రీనాధుడు కాశీఖండములో వర్ణించేడు. సూర్యుడు ఈ కృత్తికానక్షత్రముతో గూడియుండు మే 4–14 తేదీల మధ్యకాలమునే మనం 'కత్తెరకార్తె' అంటాం. ఎండలు బహుతీక్షణంగా ఉండు దినాలవి. — అనువాదకుడు.

పైనందిన కృత్యాలను గూర్చిన ప్రసంగం కాగానే దేవతా గాథలను అందుకొనేవా డాయన. ప్రళయం (Chaos) లో నుంచి అంధకారం—తేజస్సు, భూమి-ఆకాశం, ఇవన్నీ యెల్లా ఉద్భవించేయో, భూమ్యాకాశాల వివాహఫలితంగా దేవతలు, రాక్షసులు (టైటాన్‌లు, సైక్లోప్‌లు) జన్మించడం మొదలైన పురాణగాథలు పాడేవాడు. ఆ వెంటనే ప్రకృతిశక్తిని గురించీ, భూతాలన్నీ దేవతలుగా గావించిన పనులనూ వర్ణిస్తూనూ పాడి వినిపించేవాడు.

హీసియడ్ కవి యొక్క టైటాన్‌లు, సైక్లోప్‌లు కూడ హోమర్ మహాకవియొక్క పాత్రలవలె మానవతగలవాళ్లుగా ఉండరు. వాళ్ళకి నామధేయాలున్నాయి. భూమి, తేజస్సు, దినం, ఉత్తరపవనం, వృద్ధాప్యం, భద్రత, మోసం, - యివన్నీ కూడా దేవతలే, పాత్రధారులే. కాని, అవన్నీ నిజంగా రక్త మాంసాలుగల ప్రాణులుగావు. వాటిని కొన్ని నిర్దిష్ట భావాలని గాని, ప్రకృతిశక్తులని గాని చెప్పవచ్చును. హీసియడ్ గీతాల్లోని దేవతలందరూ ఒకేమాదిరిగా ఉండేవారు. 'మనోహర పాదములుగల దేవత' యనే ప్రతి దేవతనూ వర్ణించేవా డాతడు. వారిని వేరువేరుగా రూపరచి చెప్పలే దాతడు. వాళ్ళంతా కలిసిపోయినట్లు అస్పష్టంగా మబ్బుల్లా ఉండేవాళ్లు! హోమరు మహాకవి వర్ణనలలో విడివిడిగా వ్యక్తిజీవితాల్ని పూర్ణంగా గడపిన యీ దేవతలంతా హీసియడ్ వర్ణనలలో యేకరూపుగా కలిసిపోయివుండేవాళ్లు. క్రమక్రమంగా దేవతల

రూపాలు అస్పష్టమగుచు, పొగమంచువలె విపోతూంటే అంత కంతకు జనులు విస్పష్టంగా ప్రకృతిని చూడగలుగుతూండిరి !

జనులు నూతన భావాలను ఆకళింపు చేసుకుంటున్నారు. సుదూరస్థమైన యే బొయోషియను పర్వత గ్రామములోనో రైతుజనులింకా హీసియడ్ గీతాలను పాడుతున్నా సందడిగా నున్న నౌకాపట్టణాల్లో కొత్తతరహా భావాలను వ్యక్తీకరించే పాటలు వినబడుతూన్నాయి.

## విజ్ఞానశాస్త్రపు మొదటిమాటలు

సందడిగా ఉండే రేవుపట్టణమైన మిలిథుస్‌కు నడదాం, మరొకసారి.

అక్కడి జన సమూహాల్లో మనంకూడ చేరి తిరుగుదాం, నడవండి. మొదట్లో మనకు తెలిసేది ఏమంటే వారందరూ ఒకేభాష మాట్లాడడం లేదని. ఎన్నెన్నో భాషలు వినబడ తాయి, వేరువేరు ఆచార వ్యవహారాలు, భిన్నభిన్న మతాలు అక్కడవున్నట్లు స్పష్టమవుతుంది. అక్కడి సందడీ, గందర గోళంలోనుంచి మురళీనిస్వనములు శ్రావ్యంగా వినిపిస్తూన్నా యేమిటిచెప్మా! ఓహో! తెలిసింది. ఫొనీషియా నావికులు వాళ్ల దేవుడైన మెల్‌కార్ట్ నారాధిస్తూన్నా రన్నమాట. మురళీస్వనానుసారంగా వాళ్ళు నాట్యం చేస్తూ, సాష్టాంగనమ స్కారాలు గావిస్తూ, తమభక్తిని ప్రదర్శిస్తూన్నారు. వాళ్ల సరసనే వున్నారు, ఏజియను సముద్ర ద్వీపాలనుంచి వచ్చిన గ్రీకులున్ను. గ్రీకులు తమనౌకలను తీరానికిలాగి, భద్రపరచి,

సముద్రదేవతయైన పోసీదన్‌కు బలులు వేళ్ళేటందుకు అగ్నిని ప్రజ్వలింప జేసేవాళ్ళు.

పూర్వకాలంలో మానవులు తమ తాతముత్తాతలు నివసించిన చోటనే తామూ నివసిస్తూ, తమ పూర్వుల ఆచార విచారాలను, విశ్వాసాలను తుచ తప్పకుండా నిష్ఠతో అనుసరించుతూండేవారు. అటువంటిది యిప్పుడు జనులు నౌకలలో సముద్రాంతర భూములకు బోతూ, భూగోళమంతటా పరిభ్రమిస్తూన్నారు. వారు యెన్నెన్నో అభూతపూర్వవిషయాలను చూస్తూన్నారు, వింటూన్నారు. ప్రతిదేశంలోనూ దేవుళ్ళ కథలు వింటున్నారు. ఇథియోపియా దేశంలో దేవుళ్ళకు గండు తుమ్మెదల కాంతిని ధిక్కరించే నల్లనిచర్మం ఉంటుంది. కానీ, థ్రేస్‌లో దేవుళ్ళకు ఎర్రనిజుట్టు, నీలికండ్లూ ఉంటాయి. దేవుని వర్ణనావిషయంలో గ్రీకులు మరొకలా చెపుతారు. ఇథియోపియనులదీ, థ్రేషియనులదీ తప్పనీ, గ్రీకులవర్ణనే సరియైనదనీ యెల్లా చెప్పగలం?

మిలిథుస్ వాసులంతా చేతిపనులవాళ్ళూ, నావికులూ, వర్తకులూను. సంప్రదాయక దేవతలయొక్క, పురాణవీరుల యొక్క గాథలను వీరు చాలకాలంగా సంశయంతో చూస్తూన్నారు. పురాణచారణుల, కవుల గీతాలలోని విషయాలన్నిటినీ విశ్వసించేటట్లయితే నేటిప్రభువర్గాల వారంతా సాక్షాత్తూ దేవతల సంతతివారని మనం అంగీకరించాల్సి వస్తుంది. ఐతే

తమవంశీకులైన యీ ప్రభువర్గాలవాళ్లతో మిలిథుస్‌లోని వర్త కులు, నావికులు, చేతిపనులవాళ్లు, కూలీలు వగైరా సామాన్యజనం పోట్లాడుతూ, చికాకు పరుస్తూన్నపుడేనా ఆ దేవతలు వాళ్లకి సహాయం రావడంలేదేమి? *

మిలిథుస్ నివాసి హెకాతొయ్యాస్ అనునాత డొక విమర్శాశీలు డుండేవాడు. అతడా ప్రాంతమంతటా పర్యటించి, పర్వతశిఖరాలన్నీ అధిరోహించి, గుహ లన్నిటా దూరి చూచినవాడు. పాతాళలోకానికి రెండుదారులున్నవనీ, ఒకటి ల్యూకాడియా కొండల్లో ఉత్తరమునా, మరొకటి దక్షిణాన త్యేనారమ్ అగ్రంమీదనూ ఉన్నవని హెకాతొయ్యాస్ చిన్నతనంలో విన్నాడు. అందుచే నాతడు త్యేనారమ్ అగ్రంమీది కొండ గుహను కరదీపికామాత్రసహాయుడై ప్రవేశించి,అన్వేషణనారంభించేడు. పాతాళలోక ద్వారాలకు కాపలాగా పామువంటి తోక గల మూడుతలల శునకం ఉటుందనికూడ అంతా విశ్వసించేవాళ్లు. ఈ కట్టుకథనూ హెకాతొయ్యాస్ నమ్మలేదు. ఆ గుహలోని మూలలన్నింటినీ కరదీపికా సాహాయ్యంతో పరిశోధించగా, అదంతా వట్టిదని తేలింది! అతనిచేతనున్న దీపపు వెలుగే చిరకాలాగతమైన విశ్వాసాంధకారాన్ని పటాపంచలు గావించింది.

---

* భారతీయ సంప్రదాయంలో కూడ పాలకులు విష్ణుఅంశవల్ల జన్మిస్తారని ఉంది 'నావిష్ణుః పృథివీపతిః' అని ఆర్యోక్తి. లోకస్థితికి, సువ్యవస్థకు కారకమైనశక్తిని విష్ణుఅంశమని, ఆ అంశఉన్న వ్యక్తియే రాజ్యపాలకుడు కాగలడనీ దీనిభావం. ఎవడు పాలకుడైతే వానికే యీ అంశ ఉన్నదని దీనిని నమ్మేవారు సంతృప్తిపడుతూంటారు. —అనువాదకుడు.

హెకాత్యూస్ వెనుతిరిగి వచ్చేక స్నేహితులతో తాను గుహాలో చూచిన పాములను, గబ్బిలాలనూగురించి చెప్పేడు. బహుశా, జనులీ పాముల భయంవల్లనే అక్కడకు వెళ్ళేవాళ్లు గారనీ, క్రమంగా పాముతోక వున్న భయంకర జంతువు అక్కడ కాపలావుందనే ప్రవాదం పుట్టిఉంటుందనీ అతడు అన్నాడు.

చిరకాలంనాటి విశ్వాసం శిథిలమై పోయింది...

ఈ రీతిగనే అవిశ్వాసంచేత, బుద్ధిబలంవల్ల యిట్లే అనేక ప్రాచీనవిశ్వాసాలూ, దివ్యగాథలూ నిరాధారములై నశించి పోతూవచ్చినాయి. దుష్కరమైన యీ కార్యం కత్తిచేతగాక హేతువాదంచేతనే, బుద్ధివల్లనే సాధించబడింది. "హెల్లీసియు లనేక విశ్వాసాలు గలవారైనను అవన్నీ నాకు అసంగతంగానే కనబడుతూన్నాయి." అను సాహసవాక్యంతో హెకాత్యూస్ తన గ్రంథాన్ని ఆరంభించేడు. అతడిప్పుడే కాకి గాడు. ఆతనికి మున్నే మిలీథుస్ పట్టణంలో నూతనపంథాలో ఆలోచించేవారూ, దర్శించగలవారూ కొందరుండేవాళ్ళు.

వీరే మొదటి శాస్త్రజ్ఞులు, విద్వాంసులు—థేల్స్, అనక్సిమందిర్ లు.

వారి బోధనలేమిటి? ... ఈ ప్రశ్నకు జవాబు యివ్వడం అంత సులభంకాదు. వాళ్ళ పుస్తకాలను అటునిటు తిరగేస్తే తెలియదా? అంటారా?...కాని, వచ్చిన చిక్కేమిటంటే వారి గ్రంథాలు మనకు దొరకవు! వారు చెప్పినవన్న కొన్ని వాక్యాలూ, బోధనలూ అక్కడక్కడమాత్రం లభిస్తాయి.

ప్రాచీన శాస్త్రగ్రంథములకు పట్టిన దుర్గతి యిదే, మరి. అట్టి పురాతనగ్రంథాల అవశేషాలు మాత్రమే అక్కడక్కడ ఒకటీ అరా వాక్యాలు దొరుకుతాయి. పోనీ దొరకిన యీ వాక్యాలైనా మంచిపరిస్థితుల్లో ఉండవు. ఎవరో వీటిని ఖండించేటందుకే ఆ వాక్యాల్ని ఉల్లేఖిస్తారు. అందుచేత అవి నిలబడివుండడానికే బహు మూల్యమును చెల్లించుకోవలసి వచ్చిందన్నమాట !...ఈ విధంగా ఒక మహాపండితుడు జీవితమంతా గావించిన అమూల్యకృషియొక్క అవశేషాలుగా కొద్ది వాక్యాలుమాత్రమే మిగిలియున్నా యన్నమాట ! ఒక మహాసౌధ శిథిలావశేషాల్లాగ వున్నవని చెప్పవచ్చు, ఆ పురాతన గ్రంథావశేషాలు. వాటినన్నిటినీ ప్రోగుజేసి, సమకూర్చి, తిరిగి యథాప్రకారంగా ఆ గ్రంథాన్ని చేయుట అసాధ్యమైన పని. ఆ వాక్యాలలోనుంచి పూర్తి అర్థాన్ని లాగడమున్నా అంతకంటె కష్టమైన పని. ఎందుకంటే ఆ గ్రంథాల్లో అత్యధికభాగం మాయమయేపోయింది ! వాటి ఊహాచిత్రాన్ని నిర్మించుకోవలసిందేకాని మనకింకో మార్గమే లేదు.

పూర్వం గ్రంథాలను పాపిరస్ చుట్టలమీద వ్రాసేవాళ్ళు. పాపిరస్ అంటే రెల్లుకాగితం అన్నమాట. ఆ పాపిరస్ చాల కాలం నిలువ ఉండునదికాదు, మరి. ఐనా ప్రయత్నిస్తే ఆ పుస్తకాల్ని భద్రంగాఉంచుట సాధ్యమయేదేననుకోండి. కాని, పాతిక శతాబ్దాలంటే మాటలా యేమన్నా నా ? ఇంతకంటె ప్రాచీనమైన ఐగుప్తీయ పాపిరస్ గ్రంథాలు మనకు లభ్యమైనా యంటే వీటినిమాత్రం కాపాడలేకపోయేవాళ్ళమా ?

ఐతే, కాలదేవతకు యీ ప్రాచీనగ్రంథ వినాశనంలో తోడ్ప డినవారు యింకెవరేనా ఉన్నారేమిటి? ఆఁ! బాగా ఊహించేరు, మీరు. అల్లాటి నాశనకారులు కొల్లలుగా వున్నారు. మానవులే ఆ గ్రంథాల్ని వీలుచిక్కినప్పుడల్లా నాశంగావిస్తూ వచ్చేరు. ఎందుకంటారా? పాత విశ్వాసాలు, పురాతన మతాలు తమ ఉనికికై నూతన భావాలతో తీవ్రపోరాటం గావించితే గాని లొంగవని చరిత్ర ఘోషించుతూనే ఉంది. తమకు వ్యతిరేకమైన కొత్తభావాలకు పాతవి ఓ పట్టాన లొంగి పోలేదు, యెప్పుడూ. ఆ పాత మతాలూ, విశ్వాసాలూ నమ్మినవాళ్ళంతా యీ నూతన గ్రంథాల్ని వీలుదొరికినప్పు డల్లా నాశనంచేయడానికీ, పరశురామప్రీతిగావించడానికీ ప్రయ త్నిస్తూనే ఉండేవాళ్ళు.

థేల్సు పండితునిగూర్చి మనకు తెలిసిందేమైనా ఉందంటే అది ఏ పుస్తకాల్లోనో, కొద్ది పుటల్లోని నాలుగైదు ఖండన వాక్యాల్లో చూచినదిమాత్రమే. అతనినామధేయం థేల్స్ అని చదువుతాము. ఆయన జన్మతః ఫొనీషియను అనీ, ప్రాచీనుల చేత అప్పటి యేడుగురు మహాపండితుల్లోనూ ఒకడుగా పరిగ ణించబడేవాడననీ గ్రహిస్తాము.

థేల్స్‌వాణి మనకు వినబడదు. కాని, ఆయనను ఖండించే వాళ్ళ మాటలుమాత్రం మనకు విస్పష్టంగా, స్ఫుటంగా విన బడతాయి. ఆకాశంలోని నక్షత్రలోకాల్ని చూస్తూ, తన ముందే వున్న గోతిలో కూలేడని యీాయననుగూర్చి ప్రత్యే

ర్థలు వ్రాసేరు. ఆయన్నుగురించి యిల్లాంటి కథలు చాలానే ఉన్నాయి. ఇటువంటి పరధ్యానపు పండితుల్నిగూర్చిన యీ మాదిరి కథలు జనులు అప్పుడూ యిప్పుడూ కూడా చెప్పు కుంటూనే ఉన్నారు. శాస్త్రీయసిద్ధాంతనిర్వచనకై యత్నించే ప్రారంభదినాలనుంచీ యిల్లా అనుకోడం పరిపాటైనదిలెండి!

పురాతనయుగాల్లో పనులన్నీ బానిసలు, రైతులు, చేతి పనులవాళ్ళూ చేస్తూండేవాళ్ళు. వర్తకవ్యాపారాదులు చేయ డానికి ఒక ప్రత్యేకవర్గం ఉండేది. ఇక శాస్త్రజ్ఞులూ, తత్త్వ వేత్తలూ మొదలైనవాళ్ళు యీ సంసారతాపత్రయాలలో పడిపోకండా, వాటికి అతీతులుగా ఉంటారని అంతా అను కొనేవాళ్లు. అందుచేతనే థేల్స్, డెమోక్రిటస్, ఆర్కిమెడీస్ మొదలైన శాస్త్రజ్ఞులందరూ పరధ్యానంగా ఉండేవాళ్లుగనూ, యేదో ఆలోచనలో, తపస్సులో నిమగ్నులై ఉండేవాళ్ళు గనూ చిత్రించబడుతూండేవాళ్లు.

కాని, ఎవరైనా శాస్త్రజ్ఞుడెట్లుకాగలడు? తనచుట్టూవున్న ప్రతివిషయాన్నీ, సంఘటననీ నిశితంగా, పరిశీలనాబుద్ధితో పరి కించుతూ, వాటినిగూర్చిన తత్త్వమును రూపొందించాలని యత్నించడంవల్లనే గదా? థేల్స్ కూడ నిజాని కట్టివాడే. నక్షత్రలోకాల్లో యేమి ఉందో అనేగాక యీ భూమిమీది ప్రతీవిషయాన్నీ కూడా ఆయన తెలుసుకుంటూండేవాడు. ఆయన భూమార్గానా, సముద్రమార్గానా కూడ సుదీర్ఘ యాత్రలు గావించేడు. థేల్స్ పండితుడు, యంత్రనిర్మాత

మాత్రమే గాక వర్తకుడూ, నావికుడూ, పనివాడూ కూడాను. ఉప్పు తీసుకురావడానికై ఆయన ఐగుప్తుకు పడవలమీాద సము ద్రయానం చేసివచ్చేడు. ఆతడు కాలువలు త్రవ్వించేడు; వంతె నలు కట్టించేడు. వ్యాపారంలో ఆయన తెలివిని గురించిన కథ ఒకటిఉంది. ఒక సంవత్సరం ఆలివ్ పంటకు గిరాకీ ఉంటుం దని కాలమానపరిస్థితుల్ని బట్టి అంచనా వేసి, థేల్స్ ఆయేటి పంటనంతనూ ముందుగనే కొనేశాడు. అల్లా యిప్పుడూ కొందరు చేస్తూంటారు. ఏదోఒక దినుసును బజారులోనిదంతా కొనేసి, నిలవఉంచి, హెచ్చుధరకు అమ్ముతారు. ఇదే గుత్త వ్యాపారం అంటారు. ఆతడు పసిపట్టింది నిజమే ఐంది. ఆ యేడు ఆయన మంచిలాభాలు ఆర్జించేడు! తలచుకున్నట్లై తే తత్త్వవేత్త, పండితుడు కూడా ధనార్జన చేయగలడని యీా విధంగా ఆయన ఋజువు చేశారు. కాని, విజ్ఞానులందరి వలెనే థేల్స్ పండితుడు కూడా ధనసంపాదనాదృష్టి అంతగా యోగ్యమైనదీ, ఘనమైనదీ గాదని భావించేవాడు.

సరే. ఇది యిట్లుంచి, ఆయన యేకొత్తవిషయాన్నైనా కనుగొన్నారా? అనేది చూద్దాము. ఆయనే ప్రథమ విజ్ఞాని యని యెందుకంటున్నాము?

థేల్స్‌నుగురించిన భోగట్టానంతనూ ప్రోగుజేసి ఒకచోట నుంచుదాము. సంవత్సరానికి 365 దినములని ఆయన చెప్పే డంటారు. ఐతే అప్పటికే ఐగుప్తీలకీ విషయం తెలుసుననీ, థేల్స్ ఉప్పుకోసం ఐగుప్తదేశానికి వెళ్ళి వచ్చాడనీ, వాళ్ళ

నుంచే ఆయన ఈ సంగతి నేర్చుకునిఉంటాడనీ చెప్పాలి, మరి. రథము లేక లిటిల్ డిప్పర్ * అని పిలువబడే నక్షత్రరాశిని ఆయన సూచించేరు గాని ఫొనీషియనులు దీని నదివరకే గుర్తించేరు. దానినిబట్టే తమ నౌకల్ని సముద్రంలో నడిపేవారు, ఫొనీషియనులు. పోనీ, మరొకటి. సూర్యమండలవ్యాసం, ఆకాశవృత్తవ్యాసంలో 1/720 అని థేల్స్ విజ్ఞాని చెప్పేడు. కాని, బాబిలోనియన్ పురోహితులు దీని నదివరకే చెప్పియున్నారు! అచ్చటినుంచి మిలిథుస్‌కు యీ విషయం అంది వుండడంలో ఆశ్చర్యమేమిన్నీ లేదు. స్థలజలమార్గాల కూడలైన మిలిథుస్‌కు యెక్కడెక్కడి భోగట్టా, విశేషాలూ అతి సులభంగా, విధిగా వచ్చి చేరుతూండేవి.

క్షేత్రమితి లేక జామిట్రీ అనబడే గణితశాస్త్రవిభాగాన్ని పఠించిన మొదటి గ్రీకుకూడ థేల్స్. పిరమిడ్ల యెత్తును వాటి నీడల పొడవునుబట్టి లెక్కగట్టడం ఆయనే కనుగొన్నాడు. ఐగుప్తీయులు ఆవరకే క్షేత్రమితిని పఠించేవాళ్ళుగదా? వాళ్ళ నుంచే థేల్స్ యీశాస్త్రజ్ఞానాన్ని సంపాదించియున్నాడేమో!

మున్నీటిమీద గుండ్రని చదునైన తెప్పవలెనే మన భూమి కూడా తేలుతూందని ఆయన ఊహ చేసేడు. అది అటునిటు జరిగినపుడు భూకంపాలేర్పడుతున్నాయని తేల్చేడు. కాని, బాబిలోనియను లీ విషయాన్ని అదివరకే చెప్పేశారు!

---

* భారతీయులు దీనినే లఘుబుత్తము లేక శింశుమారము అని పిలుస్తారు. ధ్రువనక్షత్రం యీ లఘుబుక్షము తోకచివరనుండి, ఆ గుంపులోకల్లా కాంతివంతమై వుంటుంది. — అనువాదకుడు.

సమస్తమూకూడా జలంనుంచే ఉద్భూతములైనవని థేల్స్ చెప్పేడు. కాని అంతకిముందే బాబిలోనియను పురోహితులు కూడా యీ లోకము తియామత్ మాత రెండుగా చీలిన దానినుంచే అంటే జలమయమైన అఖాతాన్నుంచే వచ్చిందని చెప్పేరు. వీళ్ళేగాదు, ఐగుప్తీయులుకూడ ప్రాచీనమైన నూన్ అనగా జలంనుంచే యీ లోకమంతా ఉద్భవించిందన్నారు ! *

ఐతే యింతకీ థేల్స్ చెప్పిన కొత్తవిషయం ఏదేనాఉందా ?

అనేక శతాబ్దాలుగా ఐగుప్త, బాబిలను, ఫొనీషియా దేశాల్లో సంచితమగుతూవచ్చిన విజ్ఞానాన్ని, శాస్త్ర సిద్ధాంత భాండారాన్ని థేల్స్ ప్రోగుజేసి తన దేశానికి గొనివచ్చేడు. అసలు అదే ఒక ఘనకార్యం అనుకోండి ! కాని అతడు అంతే చేసివుంటే ఆయన్ని ప్రథమ శాస్త్రవేత్త యని మనం చెప్పడం సరికాదుగదా ? ఆయన వెనుకటి విజ్ఞానాన్ని ప్రోగు జేసి తేవడమేగాక యెన్నో నూతన విషయాలనూ కను గొన్నాడు. ప్రతివిషయాన్నీ ఆయన నూతన కోణాన్నుంచి చూసేవాడు. అదొకటి థేల్స్ పండితుని విశిష్టత. బాబిలోని యన్ పురోహితులు విశాలమైన జలార్ణవమనే దేవతను చూచేరంటే థేల్స్ జలమనే ఒక మూలభూతాన్ని, పదా

---

* అప ఏవ ससర్జాదౌ తాసు బీజ మవాసృజత్ /
తదణ్డ మభవత్ హైమం సహస్రాంశుసమప్రభమ్ // మనువు.
యద మోఘ మపామన్త రుప్తం బీజ మజ త్వయా /
అతశ్చరాచరం విశ్వం ప్రభవ స్తస్య గీయసే // కాళిదాసు.
ఇట్టిదే భారతీయుల పురాతనవిశ్వాసమున్ను. — అనువాదకుడు.

ర్థాన్ని చూచేడు. అఖ్యాతమైన గోత్రిని, అప్పు దేవసేను వాసు చూసిన-చోట, ఆయన ప్రదేశం అనేదాన్ని చూచేడు.

ఐగుప్తీయులు భూమ్యాకాశముల పటమును గీసినప్పుడు వారు వాటిని దేవతలుగా చిత్రించేరు. క్రింద భూమి, దాని మీద వాయుదేవుడు రెండు చేతులతోనూ తన తలమీద మోస్తూన్న స్వర్గదేవుని చిత్రించేవారు. వాయుదేవుని శరీరం పొడుగునా నక్షత్రాలు మెరుస్తూంటాయి, సూర్య చంద్రులు ప్రయాణం చేస్తుంటారు. ఐగుప్తీయ పురోహితుల శిష్యుడే థేల్స్ కూడా. కాని, ఈయన వాటన్నిటినీ కొత్త పంథాలో చిత్రించేడు. ఆయన సూర్యుని దేవుడుగా భావించనే లేదు. భూమిలో ఏయే మూలపదార్థాలున్నవో అవే సూర్యుని లోనూ ఉన్నాయన్నాడు, థేల్స్. అల్లే చంద్రునిలోనున్నూ. భూమికీ సూర్యునికీ మధ్య సరళ రేఖలో చంద్రుడు అడ్డురావడం వల్లనే సూర్యగ్రహణం వస్తూందన్నాడు. * మొదటి చూపుల కిదొక గొప్ప విషయంగా, నూతనంగా కనబడకపోవచ్చును. ఎవరు? అని అడగడానికి మారుగా, ఏమిటి? అను పదాన్ని వాడడం మహా తెలివి గాదని మీరనుకుంటారు. ఈ ప్రపంచం ఎవరినుంచి జన్మించింది? అని ప్రశ్నించేందుకు మారుగా,

* ప్రాచీన భారతీయ జ్యోతిశ్శాస్త్రగ్రంథాలలో చంద్రుడు దర్పణవత్ సూర్యకాంతిని పరావర్తం చేస్తున్నాడనీ, భూఛ్ఛాయయే చంద్రగ్రహణ కారణమనీ విస్పష్టంగా సిద్ధాంతీకరించియున్నారు కాని, జనసామాన్యంలో అతఃపూర్వపు కథలున్నూ, కల్పనలున్నూ చెలామణీ అవుతూనే వచ్చినాయి. ఇది సర్వత్రా వున్న వైరుధ్యమే, — అనువాదకుడు.

ఈ ప్రపంచం దేనినుంచి జనించింది? అని అడగడంలో పెద్ద తేడా ఏమున్నదనుకుంటున్నారు, కదూ ?

కాని, యీ చిన్న మార్పు, మెలికతోనే శాస్త్రం, విజ్ఞానం ఉదయించింది!

జలములే అన్నిటికీ మూలమని థేల్స్ చెప్పేడు. భూమి మున్నీటిలోనుంచే వచ్చిందనిన్నీ, అది జలాలమీద తేలుతూం దనిన్నీ ఆయన అన్నాడు.

ఇది మనకు విచిత్రంగా కనబడవచ్చు. కాని, అంతకు ముందుగానే యితరదేశీయులు చెప్పినదానితో థేల్సు చెప్పింది పోల్చిచూస్తే, పెద్దభేదం కనబడదు.

జలములే అన్నిటికీ ఉత్పాదకములనిన్నీ, మూలమనిన్నీ, తిరిగి అన్నీ నీళ్లలోనే మునిగి లీనమైపోతాయనిన్నీ థేల్సు ప్రతిపాదించారు. శూన్యంలోనుంచి పదార్థం ఉద్భవించ దనిన్నీ, పదార్థం అవినాశ్యమనిన్నీ, కూడ ఆయన సిద్ధాంతీక రించేరు.

ఈనాడుకూడ శాస్త్రవేత్తలు శూన్యంలోనుంచి పదార్థం ఉద్భవించదనీ, పదార్థం అవినాశ్యమనీ అంటున్నారు. ఇది ఆశ్చర్యకరంగా లేదూ? వేలాది యేండ్లక్రిందట థేల్స్ విజ్ఞాని ప్రతిపాదించిన మొదటి శాస్త్ర సిద్ధాంతమే ఈనాడు కడపటి వాక్యం గావడం విచిత్రమే, మరి!

ఐగుప్తు, బాబిలోనియా మొదలైన దేశాల్లోని దేవా లయాల్లో వేంచేసియున్న దేవుళ్లందరూ కూడా కాలూచేయీ

కదపని సోమరులూ, భోగులూను. కాని, మిలీథుస్ నిరంతర పరిశ్రమ గావించే మానవులకు కాణాచి. నేల నాలుగు చెరగులనుంచీ వచ్చే బిడారుల కిది కూడలి ప్రదేశం. వివిధజనుల విశ్వాసాలు, ఆచారాలు, విచారధారలు కలుసుకొనే చోటు, యిది. ఇటువంటిచోట శాస్త్రవిజ్ఞానం జనించటం మనం చూస్తాం!

అనాదిగా కులీనప్రభువుల ఆధిపత్యాన్ని నిలుపుటలో సాయపడుతూ వచ్చిన పురాతనవిశ్వాసాలన్నిటిమీదా థేల్స్ బోధనలు పెద్ద దెబ్బతీసినాయి. కులీన ప్రభువర్గాలన్నీ దేవతాంశవల్ల జన్మించినవాళ్లే. సామాన్యజనులు అనగా వర్తకులు, సముద్రాంతర వ్యాపారులు, దేవతాంశ లేనివాళ్లు. థేల్స్ సామాన్యజనుడే. దేవతాంశ లేని వీళ్ళు కూడా బానిసలనూ, సంపదలనూ సంపాదించుకున్నారు. వ్యాపారమే వీరికి సమస్త సంపదలనూ యిస్తూంది. మామూలు జనుల సంతానం కంటె కులీన ప్రభువుల సంతానం అధికులు గారనీ వాళ్లలో దివ్యత్వం యేమీ గానరాదనీ యీ నూతనవర్గాలు వాదించనారంభించేరు. ఈ ప్రపంచం దేవుడు సృష్టించిందిగాదనీ. ఇదంతా పదార్థపు రూపభేదమేననీ వీరు వాదించ నారంభించేరు. సముద్రంలోని నీటి బిందువులవలె రాజ్యంలోని జనులందరూ సమానులే నన్నారు, వారు.

## విజ్ఞానశాస్త్రం ప్రపంచపు హద్దుల్ని విశాలంచేస్తుంది

విజ్ఞానం బహుత్వరగా యెదిగింది. పాతప్రపంచంలో దానికి బహుయిరుకుగా ఉండేది. ఆ సంకుచిత ప్రపంచం దానిని ఉక్కిరిబిక్కిరిచేసేస్తూండేది. చుట్టూ యిరుకుగోడల్లో బంధించి, దానికి ఊపిరి ఆడకుండా చేసేస్తూన్నట్లుంది. ఆ పాత నిర్బంధాల్ని ఛేదించుకుని బైటికి వచ్చేందుకు అది యత్నించింది.

ఇదివరలోనే చెప్పినట్లు ఆ కాలంలో జనులనమ్మకం యేమిటంటే భూమిమీద ఆకాశం మూకుడులా బోర్లించిపెట్టిఉందని. కాని, క్రమంగా ఆ నమ్మకం సడలిపోతూంది. స్వర్గం వచ్చి ఒలింపస్ శిఖరంమీద ఆనుకుని లేదనీ, మన కాళ్లక్రింద పాతాళ రాజ్యమైన హేడిస్ కు తావులేదనీ, సుదూరాన దిఙ్మండలం దగ్గర భూమ్యాకాశాలు కలుసుకుంటున్నాయనీ జనులు గమనించ నారంభించేరు.

ఆకాశపు గోడలు కూడ అంతకంతకు దూరదూరంగా త్రోసివేయబడుతూ వచ్చాయి. ఆఖరికి ఆకాశానికి గోడలే లేవన్నారు. ఆకాశం అనంతం! ఈ అనంతప్రదేశంలో, అనంతమైన అవకాశంలో భూమి మొదలైన ప్రపంచములు మహావేగంతో యెగిరిపోతూన్నాయి! ప్రధమ శాస్త్రీయ గ్రంధంలో వర్ణితమైన విశ్వరూపం యిది. థేల్స్ శిష్యుడైన అనక్షిమందిర్ 2500 ఏండ్లక్రిందట వ్రాసినగ్రంధంలో 'ప్రకృతినిగురించి' అను దానిలో యిదంతా వ్రాసేడు.

గురువునుమించిన శిష్యుడు. శిష్యుడే నాలుగాకులు యెక్కువ చదివేడు. ఈ భూమి గుండ్రని తెప్ప మాదిరిగా జలార్ణవం

మీాద తేలుతూందని థేల్స్ పండితు డన్నాడు. అనక్షిమందిర్ మరో అడుగు ముందుకు వేశాడు. ఈ భూమి అనంతాకాశంలో వ్రేలాడుతూందన్నాడు. అప్పటికి ఆయనకు యిదిగోళాకారంగా ఉన్నదన్న తెలియదు. దీనికి యేదో ఒకరూపం ఉండాలిగదా ? అనక్షిమందిరు ఓక కల్పనము గావించేడు. మన భూమి ఒక స్థూపభాగంగా ఉందన్నారాయన. కాని, యీా స్థూపభాగం దేనిమీాదా ఆనుకునీ ఉండదు; దీనిమీాదనూ స్వర్గాదులేవీ ఆధారపడీ ఉండవు !

అనంతం ! అసీమం !!

అనంతావకాశం ఊహించుకోడం మనకికూడా, యిప్పుడూ కష్టమే. ఇంకా మనం ఆకాశం మన తలలపైన కప్పులా వుందనే అభిప్రాయంతో 'ఆకాశకలశం' అంటూంటాము. 'ఆకాశవీధి' అని అన్నప్పుడుకూడ దానికేవో హద్దులున్నట్లే భావిస్తాము.

కాని, 2500 యేండ్లక్రిందట జనులు ఆకాశం కలశంవంటి దనే నిజంగా భావిస్తూండేవాళ్లు. అంతా తమ కళ్ళతో చూస్తూన్న దానిని కాదనడానికి, అందరి విశ్వాసానికీ భిన్నంగా ఆకాశం అనంతమైన దనడానికి ఎంతధైర్యం కావాలి ? ఈ విశ్వముకు ఆది అంతములు లేవనీ, ఎల్లలు లేవనీ అనడానికి యెల్లాంటి భావనాబలం ఉండాలి ?* మన కాలంలోనే యింకా

---

* దిక్కాలములు అనవచ్ఛిన్నములని భారతీయదార్శనికులన్నారు. వారే యీా భావమునకు ప్రథమ ప్రతిపాదకులు. ఇంత సూక్ష్మంగా, స్పష్టంగా యీా భావాన్ని చెప్పడానికి మరే భాషలోనూ పదాలు లేకపోవడమే దాన్ని ఋజువుచేస్తుంది. — అనువాదకుడు.

చాలమందికి యీ విషయాలు తెలియవు. అటువంటప్పుడు అనక్షిమందిర్ కాలంలో వేరేచెప్పాలా ? దేవతలు యీ ప్రపంచాన్ని సృష్టిచేసి యింకా యెంతో కాలం కానేలేదని ఆ రోజుల్లో జను లనుకుంటూండేవాళ్లు.

హెకాతేయ్యస్ ఏవిషయాన్నైనా పరీక్షిస్తేగాని నమ్మేవాడు గాడు. అతడుకూడ ప్రాచీనులైన దివ్యపితరులు అప్పటికి కేవలం 15 తరాల క్రిందటనే ఉండేవారని భావించేడు. 15 తరాలంటే 15×40=600 యేండ్లుమాత్రమే. అప్పటి కారు శతాబ్దాల క్రిందటనే అమరులైన దేవతలనుంచి మర్త్యులైన జనులు జన్మించేరట ! *

అనక్షిమందిర్ కూడ గతంలోనికి దృష్టి సారించేడు. ఈ సందర్భంలో కూడ ఆయన యితరులకంటె యెంతో దూరానికి చూడగలిగేడు. అమరులైన దేవతల నుంచిగాక యితర ప్రాణికోటి నుంచి బైలుదేరిన కాలంలోనికి ఆయన చూచేడు! మొట్టమొదట మానవుడు మత్స్యాకారుడై వుండి, సముద్రగర్భాన్నుంచి, పంకంలోనుంచి వెలికి వచ్చాడు. అతడి శరీరం చేపశరీరం వలెనే పొలుసులతో కప్పబడి ఉంటూండేది. పొడి నేలమీాది కాతడు వచ్చాక ఆ పొలుసులు రాలిపోయినాయి.

---

* ప్రాచీన భారత దేశంలో జనులం యీ సృష్టి, దానిలోని మానవులూ లక్షలూ, కోట్లూ సంవత్సరాల క్రిందటే ఉన్నారని చెప్పేవారు. మనవాళ్ళకి ఊహాదారిద్ర్యం గాని, సంఖ్యాలోభం గాని ఎన్నడూ లేదు!
— అనువాదకుడు.

మానవుని రూపమూ మార్పు చెందింది, జీవిత విధానమూ మార్పు చెందింది.

ఐతే, బురద నేల, పొడినేల ఎక్కడి నుంచి వచ్చినాయి? అసలు భూమి అనేది అస్తిత్వంలోని కెట్లువచ్చింది? అనక్షిమందిర్ తీవ్రంగా ఆలోచన గావించేడు, కాలగర్భంలోనికి వీక్షించేడు. క్రమంగా ఆయన తీక్ష్ణదృష్టి ముందు కాలసాగరపు టావరణలు నిలువజాలక కూలి పోయేయి. భూమిమీద మానవులు లేని కాలమేగాక అసలు భూమే లేనికాలంకూడా ఒకటి ఉండేదన్నాడు, ఆయన.

సరే! ఐతే అప్పుడు ఏమున్నది?

ఆఁ! అప్పుడు, సర్వమునకూ మూలమైన 'అనంతం' ఉంది. అనంతావకాశమం దంతటా అనంత పదార్థం నిండి ఉండేది! ఈ రోజున తాత్త్వికులు, విజ్ఞానులు చాలమంది యిల్లాగే భావిస్తూన్నారు గదా! అంతేగాక, అనంతావకాశమంతటా నిండియున్న యీ అనంతపదార్థంయొక్క స్వభావం ఏమిటి? అనికూడా అనక్షిమందిర్ ప్రశ్న వేసుకున్నాడు. జవాబుకోసం ఆలోచించేడు, తపించేడాయన. ఆఁ! అదీ! ఈ అనంత పదార్థం నిరంతర చలనశీలమై వున్నదిగా ఆయన దర్శించేడు. దానిలో విశ్వం దృశ్యమానమైంది. ఈ పదార్థం రెండు గుణాలు గలది. శీతం, ఉష్ణం; తడీ, పొడీ,– యిట్లే ద్వంద్వ గుణాత్మకమైన దీ అనంతపదార్థం. భూమిని చుట్టు ముట్టి అగ్నిగోళాలున్నాయి. అవన్నీ వేర్వేరు పరిధులు గలవి.

ఆగ్నేయమైన మబ్బులే యీ ఖగోళాలకు మూలమని ఆయన భావించేడు. అనక్షిమందిరుని విశ్వభావన యిట్టిది! ఈ విశాల విశ్వంలోని లోకాలు నిరంతరం ఉత్పన్నమవుతూ, నాశన మవుతూన్నాయని కూడ ఆయన అన్నారు.

ప్రకృతిలోని నూతనోత్పాదకశక్తి నిరంతరాయమైనది. ఒక్క రెప్పపాటు కాలంకూడా దానికి విరామం లేదు. ఏ పదార్థం నుంచి యిదంతా ఉత్పన్నమవుతూందో అది ఎన్నడూ తరుగదు, నిశ్శేషమైపోదు, క్షయంకాదు, వ్యయమైపోదు. అనక్షిమంది రుని గురుడైన థేల్స్ పండితుడు 'సృష్టికంతకూ జలములే ఉత్పాదకములు' అన్నారు. కాని శిష్యుడు దీని నంగీకరించ లేదు. "జలము లెట్లు అనాది కాగలవు? సర్వోత్పాదకము లవి యెల్లాగ అవగలవు? మహా సముద్రాలకూ తీరము లున్నాయే! కాని, జలములే పదార్థాన్నుంచి జనించినవో దానిని అనాది యని చెప్పవచ్చును." అన్నాడు, అనక్షి మందిరుడు.

ఆయన తిరిగి యింకో ప్రశ్న వేసేడు: "ఏది నిత్యము? ఏది శాశ్వతము?" ప్రాణులు పుట్టి గిట్టుతూన్నాయి, రాజ్యాలు లేస్తూ పడుతూన్నాయి, లోకాలు ఉద్భవిస్తూ నశిస్తూన్నాయి. కాని, ఒక్కటిమాత్రమే శాశ్వతంగా కనిపిస్తూంది. అదే 'గమనం'. ఈ గమనానికి ఆద్యంతాలు లేవు. ఈ రీతిగా శాస్త్ర విజ్ఞానం ఆదిలోనే దిక్కాలములకు హద్దులు తొలగించేసింది. కాని, తొలుతటి యీ ఉజ్జాయింపు ఊహాకల్పనలనుంచి తరు

వాటిమైన నిశ్చయాత్మక సిద్ధాంతాలకు యింకా యెంతో దూరం ఉంది.

మానవునికి శాస్త్రజ్ఞానం మూడో కన్నులాంటిదని విజ్ఞులన్నారు. అది నిజమే. కండ్లతో కనలేని వెన్నెన్నో శాస్త్ర సహాయంతో చూడగలంగదా! మానవదృష్టిలోని నైశిత్యం యెడతెగకుండ ఉండలేదు. ఒక్కొక్క మహామేధావీ, పండితుడూ ఐన మహాజనుడు బైలుదేరి ఎంతోదూరంచూసేవాడు. కాని, ఆతడు ప్రసాదించిన యీ నిశితదృష్టి యెంతోకాలం నిలువబడేదికాదు. తిరిగి మసకలు గ్రమ్మేవి. అనక్షిమందిరుని ప్రథమశిష్యులే కంగారుపడనారంభించేరు. ఎంతో ప్రయాసతో పడగొట్టబడిన అడ్డుగోడలను, హద్దులను కొన్నింటిని వాళ్లు మళ్ళా లేవదీయనారంభించేరు. పెంకును పగులగొట్టి బలికి వచ్చిన పిల్ల మళ్లా గ్రుడ్డులోనికి పో నారంభించింది!

మళ్లా త్వరలోనే యీ భూమిచుట్టూ దివ్యమైన ఆవరణ, చాందినీ, బ్రహ్మాండమైన స్ఫటికసంకాశకలశం యేర్పడింది. నక్షత్రాలు దానిమీది బంగారు మేకుల్లా మెరుస్తూన్నాయి. మనిషితలమీద టోపీ అమిరినట్లు భూగోళంమీద ఆకాశం అమిరివుంటుందన్నారు. సూర్యచంద్ర గ్రహతారకాదు లన్నీ దానిమీదనుంచి పండుటాకులవలె యెగిరిపోతున్నాయి.

అనక్షిమందిరుని శిష్యుడైన అనక్షిమినిస్ (Anaximenes) మన కొసంగిన విశ్వరూప మిట్టిది.

నిజంగా యిది వెనుకడుగే. కాని పూర్తితిరోగమనం కాదు. భూమిపై కప్పుగా ఒకచిప్ప ఉంచబడింది. ఐతే అది భూమి అంచులమీద ఆనుకొనిగాక దానినుంచి దూరంలో ఉంది.

అనక్షిమినిస్ ఒక విషయంలోమాత్రం గురువుగారికంటె ముందుకు చూడగలిగేడు. గ్రహములకూ నక్షత్రములకూ గల భేదమును గురువుగారు గుర్తించలేకపోయేరు. శిష్యుడు యీ రెండింటికీ భేదం ఉందని గుర్తించేడు. గ్రహాలు భూమికి సమీపంలోనే ఉండి, పరిభ్రమిస్తూంటాయి. నక్షత్రాలు మన కతిదూరంలో ఉండి, నిశ్చలములై, ఆకాశంలో మేకులు దిగ గొట్టినట్లుంటాయి. అవి అటునిటు తిరుగవు. అనక్షిమినిస్ ఆకాశంవైపు దృష్టి సారించేడు. మేఘాలు యేర్పడుతున్న విధానాన్ని గమనించేడు. ఆకాశంలో ఇంద్రధనస్సు యెట్లు ప్రకాశిస్తూందో, సూర్యకిరణాలను నల్లటిమేఘాలు యెట్లు అరి కడుతూంటాయో కూడ చూసేడు. పక్షికంటె హెచ్చు వేగంతో వీచు గాలిధ్వని నాతడు విన్నాడు. సృష్టికి ఆరంభం జలములు కాజాలవని ఆయన నిశ్చయించేడు. దేనినుంచి మిగి లిన వన్నీ జనించేయో అది యావత్ప్రదేశమునూ నింపిఉండాలి. కాని, నీటికి తీరాలున్నాయి, అవధులున్నాయి. అదేగాక నీరు నిప్పును ఆర్పేస్తుంది కూడాను.

ఐతే అన్ని పదార్థాలకూ జన్మనిచ్చిన దేమిటి?

అనంతం, అనాది యైనదేదో ఒకటి! దానినే అనంతం అందాం. అనంతం అంటే ఏమిటి? దాని గుణములేవి? అనక్షిమందిర్ కూడా దాన్ని నిర్వచించలేకపోయాడు.

శిష్యుడు గురువు నతిక్రమించ దలచుకున్నాడు. ఈ ప్రకృతిలోని సమస్తానికీ ఆరంభక మేది? ఏది సర్వ ప్రదేశాన్నీ నింపి, సర్వవ్యాపియై ఉన్నది? అనక్షిమినిస్ యీ మూలవస్తువును రూపించుకోడానికి ఆలోచిస్తూనేవున్నాడు.

సర్వారంభకమైనది వాయువైయుండునా?

వాయువు చిక్కనైనపుడు మేఘం అవుతుంది. అది యింకనూ చిక్కనైనచో వర్షంగా పడుతుంది. వర్షపు చినుకులు ఘనీభవించి వడగండ్లుగా పడుతవి. మేఘమే ఘనీభవించినపుడు మంచుకురుస్తుంది. అదియింకనూ చిక్కనై, సాంద్రతరమైనచో పృథ్వీపదార్థం, శిలాపదార్థం కాగలదని అనక్షిమినిస్ ఆలోచించేడు. ఒకసారి భూమి యేర్పడ్డాక దానిమీద చెట్లు పెరుగుతాయి, ప్రాణికోట్లు ప్రత్యక్షమవుతాయి. *

ఏతావతా వాయువే ప్రాథమిక పదార్థమని ఆయన నిర్ణయించేడు. దీనిలోనుంచి పుట్టినవన్నీ తిరిగ దీనిలోనే లీనమైపోతూన్నాయి. నీరు పొగమంచుగా, ఆవిరిగా మారిపోతూంది. కర్రలు మొదలైనవి కాలి, పొగగా యెగసిపోతున్నాయి.

---

* ఉపనిషత్తులలో సృష్ట్యారంభమును గూర్చిన యోచనలున్నాయి. బహు ప్రాచీనమైన ఋగ్వేదంలోని విచారధారలను కొన్నిటిని మనం చూచియున్నాము. వేదములలోని ఒక్కొక్క భావమునే తరువాతి ఋషులు విపులీకరిస్తూవచ్చేరు. ఆత్మన ఆకాశ స్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోన్నం, అన్నాత్పురుషః॥ తైత్తిరీయం 2-1.

అదృశ్యమైన వాయు అణువులు ఒకప్పుడు విరళంగా యెగురుతాయి, మరొకప్పుడు దగ్గరకు చేరుతవి. అణువుల యీ కదలికల ఫలితమే నక్షత్రాలు, సూర్యుడు, భూమి మొదలైనవన్నీ.

ఒకప్పుడు జనులు యిసుక రేణువులే బహు సూక్ష్మపదార్థాలని, భావించేరు. వాటికంటెనూ బహుచిన్నవీ, కంటికగుపడనవీ యైన సూక్ష్మతమఅణువు లున్నాయని యిప్పుడు వారు గుర్తించేరు.

ప్రకృతిలోని స్థూలవస్తువుల కన్నిటికీ జన్మనిచ్చిన మూలతత్త్వమునకై సూక్ష్మకణ ప్రపంచంలో అన్వేషించ నారంభించేడు, మానవుడు. ప్రపంచమంతా, విశాల విశ్వమంతా అతి సూక్ష్మములూ, - అదృశ్యములూయైన అణు సందోహముల యొక్క కదలికలవల్లనే యేర్పడినదని నిర్ధారణ గావించేందుకు ప్రయత్నం జరిగింది. ఈ వివరణమైతే సరియైనదికాదు. కాని, సరియైనదిశలో పురోగమించడమనే చెప్పాలి.

ఈ విషయమే యిక్కడ ప్రధానమైనది. *

---

* భారతీయ దర్శనములలో వైశేషిక దర్శనమును కణాదుడను మహర్షి నిర్వచించెను. అణువుల సంయోగంవల్లనే పదార్థ నిర్మాణం జరిగిందనిన్నీ పదార్థం అవినాశ్యమనిన్నీ యీయన సిద్ధాంతము. ఇది శాస్త్రీయ వైజ్ఞానిక లోకం సర్వత్రా అంగీకరించినదే.

పరమాణు లక్షణా నిత్యా<br>కార్య లక్షణా త్వనిత్యా ।। } వైశేషికదర్శనం — అ 4, ఆ 1, సూ 1, 2

# ద్వితీయ మండలం

## రంగస్థలి విశాలపరచే కృషి

### నవ్యగీతాల నాలపించిన వృద్ధచారణుడు

తన కనులముందు విశాలంగా వ్యాపృతమైయున్న ప్రపంచాన్ని మహాజనుడు ఆశ్చర్యంతో చూసేడు. అంతా కొత్తగా కనిపించింది. సూర్యుడు యిప్పుడూ ప్రాతఃకాలాననే ఉదయిస్తున్నాడు. స్వర్గపథాన దివ్యరథంమీద ఆరూఢుడై పోవు దేదీప్యమానుడగు దేవుడుగాక ఆతడిప్పుడు జాజ్వల్యమానమైన ఆకాశగోళంగా ఉన్నాడు. ఇంద్రధనుస్సులు యిప్పుడూ ఆకాశాన్ని అలంకరిస్తూనేవున్నాయి. కాని, అది యిప్పుడు సప్తవర్ణాంబరధారియైన దేవతామూర్తి గాకుండా సూర్యకిరణముల వక్రీకరణంచేత రంగులు వెదజల్లే మేఘశకలముగా గుర్తించేరు.

ఎన్నో సహస్రాబ్దాలుగా దేవుళ్ళు నివసిస్తూన్న దివ్యాయతనములన్నీ కలలలోవలె కరిగి అదృశ్యమైపోయేయి. దేవుళ్లు

---

కారణాభావాత్ కార్యాభావః । నతు కార్యాభావాత్ కారణాభావః ।

వై. ద. అ 1. ఆ 2. సూ 1, 2.

పదార్థములకు, శక్తికీ వస్తుతః భేదములేదు. అవస్థా భేదమాత్రమే కారణము. దిక్కాలములు ప్రత్యేకపదార్థములు గావు. అవి అవకాశమునందు వ్యాప్తమైయున్న పదార్థజాతమే. దిక్కాలావకాశములు సాపేక్షము అని భావము. ఇది వైజ్ఞానికదృష్టియే. —అనువాదకుడు.

విందులు చేసుకొనే స్థలాలు, హెబీ దేవుడు బంగారు పాత్ర లలో సురభిళమైన దివ్యామృతమును పంచియిచ్చిన స్థలము, అల్లాంటి దివ్యుల క్రీడారంగాలన్నీ అదృశ్యమైపోయి, కేవలం ఒలింపస్ పర్వతశిఖరపు భౌతిక రేఖలు మాత్రమే నిరంతర హిమాచ్ఛాదితములై అస్పష్టంగా కానవస్తున్నాయి.

దివ్యగాథలూ, వాటిలోని దివ్యయోధులూ క్రమంగా జాన పద గాథల్లోకీ, గీతాల్లోకీ జారిపోయేరు. కాని, యింకనూ చారణులు మాత్రం ఆ యోధుల వీరగాథలను గానంచేస్తూనే వున్నారు. ప్రాచీనకవి హెసియడ్ రచించిన 'దివ్యవంశావళి' (థియోజనీ) ని యువకజనులు యెగతాళి చేస్తూన్నారు. ఏ ఏ దేవత ఎవరెవరికి జన్మించేడో, ఎవరిని పెండ్లియాడి, ఎవరిని కనెనో వగైరా దివ్యవంశ కథన మంతా దానిలో వుండేది! అదియేగాదు. ఆదికవి హోమర్ కూడ పూర్వంవలె యిప్పుడు గౌరవించబడుట లేదు!

హెసియడ్ కవికాలం గడచి అప్పుడే నూరేళ్ళు దాటింది. హోమర్ మహాకవి కావ్యరచన జరిగి యింకా చాలకాలమే దాటింది. ఈ కాలంలో లోకంలోని వస్తువులు యథాప్రకా రంగా ఉండిపోలేదు. సమస్తమూ కూడ పెద్ద మార్పులకు లొంగిపోయినాయి.

హోమర్ మహాకవి రాజవంశీకులైన వీరుల కీర్తిని గానం చేసేడు. వారు దివ్యులైన జ్యూస్ మొదలైన దేవతల వంశీ కులు. హోమర్ తన కావ్యాల్లో సామాన్యప్రజలను నిరసనా

పూర్వకంగానే వాకొంటూవచ్చేడు. కాని, జరిగిం దేమిటి ? దివ్యులైన రాజవంశీకుల నందరనూ, సామాన్యులైన ప్రజలూ, ధనిక వర్తకవర్గాలూ కలిసి ఓడించేశారు !

కాలం మారిపోయింది. కాలోహి దురతిక్రమః గదా! కొత్తకాలం వచ్చింది. కొత్తపాటలు కావలసివచ్చాయి....

చారణుడైన క్షణోఫణిస్ (Xenophanes) గ్రీసుదేశము నంతనూ యెన్నోసార్లు చుట్టివచ్చినవాడు. రాజ పథములన్నీ అతడు మెట్టినవే. ఈతడు పేదవాడు. ఈ లోకంలో తనదని చెప్పుకోతగిన ఆస్తి క్షణోఫణిస్‌కు ఒక చితారు (Zither)న్ను, ఒక బానిసయున్ను మాత్రమే. యజమానుని పడకను వీపున మోసుకుని ఆ బానిసవాడు అతని వెనుకనే నడుస్తూండేవాడు. ఈతనిని బానిసీడనుటకంటె విశ్వాసపాత్రుడైన సహచరుడు, మిత్రుడు అనుటయే సమంజసంగా ఉంటుంది. వారిద్దరూ సహ యాత్రీకులై గ్రీసుదేశపు రాజమార్గాలన్నిటినీ అధిగమించేరు. శీతకాలంలో మంచుకు, చలికి కొరడుపారుతూ, వేసవిలో గ్రీష్మాతపశాఘలను సహిస్తూ, వారిద్దరూ కలిసే ఉండేవాళ్లు. ఆ సమయంలో వీరిని చూచినవాళ్లు ఎవరు యజమాని ? ఎవరు బానిస ? అనేది తెలుసుకోలేకపోయేవాళ్లు ! వారి సాహచర్యం అంత గాఢమైనది.

ఏదేనొక చిన్నపట్టణానికి చేరినపుడు జనులు వారిచుట్టూ చేరేవాళ్ళు. కాస్త అన్నోదకాలున్న వాడెవడో గృహస్తుడా చారణునీ, అతని బానిసనూ తన యింటికి అతిథులుగా

ఆహ్వానించేవాడు. ఈ చారణుని గీతాలు వినాలని ప్రతీవాళ్లూ ఉవ్విళ్ళూరేవాళ్లు.

ఆతడెవరి గృహానికైనా అతిథిగా వెళ్ళినప్పుడచట యేమి జరిగేదో మనం ఊహాగానం చేయనవసరం లేదు. క్షణోఫణిస్ యిదంతా తానే వ్రాసుకున్నాడు. ఆతని గీతాలు కొన్ని యీనాడు మనకు మిగిలియున్నాయి. వాటినే మనం చూడ వచ్చును.

శీతకాలం. నెగడి జాజ్వల్యమానంగా మండుతూంది. నెగడి ముందున్న మంచాలమీద మెత్తలపై అంతా సుఖాసీనులై యున్నారు. భోజనాలు ఐనాయి. ఏవో గింజలు ఒలుచుకు నములుతూ, మధుపానం గావిస్తూన్నారు. ఆ సుఖసమయంలో గేస్తు అడిగేవాడు: "మహాత్మా! నీ వెవ్వరవు? నీ నివాసంబున పవిత్రంబైన ఊరెయ్యది? మీ రెంతకాలంబుగా నీ భూమండలంబున పర్యటించుచుంటిరి? మీ రెన్ని వసంతములు జూచితిరి? మీ చరితము విన కుతూహాలం బయ్యెడిని, చెప్పంగదవే!"

చారణు డిట్లు ప్రత్యుత్తరమిచ్చెడివాడు: "అయ్యలారా! ఈ గ్రీసు భూమియందంతటనూ నా అభిప్రాయములను వినిపించుచు అరువదేండ్లకు పైబడి పర్యటించుచున్నాను. నే నిందు పొరబడ లేదనియే భావింతును. ఇంటినుండి బైలుదేరునప్పటికి నా కిరువదియైదు వయసుండును. నేను ఎనుబదియైదు వసంతములను జూచితిని."

గేస్తు ప్రత్యుత్థానం చేయగా నా చారణుడు చితారును గోడనున్న చిలుక కొయ్యకు తగిలించి, బల్లదగ్గరకు బోవు వాడు. బానిస పడుచులు నీటిని, తుండ్లను తెచ్చి యీయగా నాతడు హస్తప్రక్షాళనాదులు నిర్వర్తించి, రొట్టెను వడ్డన గావించుకుని, మధువుతో తన పాత్రనింపుకున్నాడు. తనివితీర తిని, కడుపార గ్రోలడం కాగానే తన చితారును చేతగొని, గొంతెత్తువాడు. ఇదిగో! చారణుని గేయార్థమునే చెపుతా, వినండి.

"నట్టిల్లు పరిశుభ్రంగా ఉంది. అతిథిహస్తములూ, మధు పాత్రములూ కూడ శుభ్రంగా వున్నాయి. కొందరు అతిథులు పూలమాలలను ధరించుతూంటే, మరికొందరు సుగంధతైల మును పూసికొంటున్నారు. విందు కంతకూ శోభస్కరముగా నొకపెద్ద కలశమును మధువుతో నింపి యుంచేరు. పుష్పరాశి వలె గుబాళించే మధువులతో నిండిన మృణ్మయ కలశములు యెడనెడ ఉంచబడినాయి. అగరుధూపములు, దివ్యసుగంధ ములు నాసికాపర్వ మొనర్చుతూన్నాయి. అతిథుల ముందరి బల్లలపై అంబరుగొట్టి ఉంచబడింది. తేనెలు, జున్నుతో బల్లలు క్రుంగుతున్నాయి. నట్టింటిమధ్య పుష్పమయమైన వేదికఉంది. ఇల్లంతా పాటలతోను, నాట్యంతోను, ఉత్సాహ ధ్వనులతోనూ కోలహాలంగా ఉంది. అతిథులందరూ మొదట నీ విందుభోజనంలో 'అమృతాస్తరణ మగుగాక!' యని దేవ తల కారాధనగా నైవేద్యమును బెట్టిరి. అతివృద్ధులు గాని

వారు తెగ త్రాగుట దోషంగాదు, గర్హితమూ కాదు. మదిరా పానం గావిస్తూ, ఉత్సాహ జనకమైన కథలు, కబుర్లూ చెప్పే అతిథి నందరూ గౌరవించేవారు. విందైనతర్వాత మద్యపాన ముచే ఒడలు తెలియనివారిని బానిసలు వారి వారి యిండ్లకు మోసికొనిపోయి జేర్చువారు..."

"మేము పాడుతూన్నది దేవరాక్షసయుద్ధాల్ని గూర్చి కాదు. మహాకాయులు, రాక్షసులు, దేవతలు, నరవృషభములు మొదలైనవాటితో పోరాటాలనూ, ప్రాచీనుల పురాణ కథ లనూ కాదు, మేము గానంచేసేది..."

ఐతే, మధుపానానంతరం క్షణోఫణిస్ చారణుడు పాడిన కథ లెట్టివి ?

హోమర్, హెసియడ్ల గాథావళినే తిరిగి తిరిగి పాడే అందరు చారణుల వంటివాడుగాడు, క్షణోఫణిస్. ఇతను వారిద్దరినీ నిరాకరించేడు. ఏయే పాపకృత్యములు గావిస్తే మను ష్యులే శిక్షార్హులగుదురో ఆ యా అకార్యములన్నిటినీ యీ ఆదికవి మహాశయులు దేవతలకే ఆపాదించేరు గదా ! దేవతల విశృంఖల ప్రవర్తనను, వారొకరినొకరు గావించు మోసాలనూ గూర్చే తమ కావ్యాలనిండ యీ పురాణకవులు వ్రాసేరు.

ఈ మాటల నతిథులు విస్మయపరీత మనస్కులై వింటూ న్నారు. దేవతలంటే యీ వృద్ధచారణునికి భయభక్తులు లేవా?

నాస్తికుడను తాను గానని చారణుడు ముందే సభికులకు విస్రంభపాత్రంగా వెల్లడించేడు. దేవతలున్నారనే ఆతడూ విశ్వ

సిస్తూన్నాడు. కాని, దేవతలంటే అతని భావాలు యితరజనుల విశ్వాసాలకు భిన్నమైనవి. క్షణోఫణిస్ అనేవాడు: "దేవతల నెవరైనా గౌరవించవలసిందే. ఔను! కాని, దేవతలంటే యెవరు? మనం దేవతలను మనకువలెనే, మర్త్యులకువలెనే చిత్రిస్తున్నాము. మన శరీరాలవంటివే వారివీ ననీ, దేవతలు కూడా మనలాగే అలంకరించుకుంటారనీ, మాట్లాడతారనీ అనుకుంటాను. కాని, మన మిట్టి భావాలను కలిగియుండ రాదు. దేవతలపట్ల మనుష్యుల యీ భావాలు సరికాదు. ఇదే నిజమైతే దేవత లమరు లెట్లగుదురు? దేవతలు పుట్టి యుండని కాలమొకటి యున్నట్లేకద? దేవతలు మనుష్యుల పోలికగా వుంటారని జనులు భావిస్తూన్నారు కదా? అట్లైన-చో అశ్వములు, యితర పశువులు కరములు గలిగి, దేవతల రూపాలను వ్రాయగలిగితే అశ్వముల దేవతలు అశ్వరూపమునూ, పశువుల దేవతలు పశువుల రూపమునూ కలిగిఉండేవే కదా!"

ఈ ధోరణిలో మాట్లాడితే అతఃపూర్వపు రోజుల్లో నైతే శ్రోతలు భయభీతులైపోయేవాళ్ళే! కాని రోజులు మారి నాయి. పూర్వపు ఛాందసవిశ్వాసాలు బీటలువారి క్రమంగా తొలగిపోతూన్నాయి. జనులు క్షణోఫణిస్ గీతాల్ని శ్రద్ధా ధానులై వింటూన్నారు. 'ఐతే మరి, దేవుడు యెల్లా ఉంటాడు?' అని చారణుని ప్రశ్నించేవాడు.

"దేవుళ్ళు యెల్లా ఉంటారో అనేది తెలిసినవారు గతంలో యెవరూ లేరు. ఇకముందూ ఉండరు!" అనేవాడతడు.

తెలిసింది గదూ? మానవుడు సత్యమే మాట్లాడినను, అతడే దానిని నిశ్చయంగా చెప్పలేడు. అతడు తన అభిప్రాయమును మాత్రమే చెప్పగలడు. దేవతలు యెన్నడూ మర్త్యులకు తమ నిజరూపాన్ని తెలియనీయరు. మర్త్యులు సత్యమును మెల్లగా, క్రమంగా మాత్రమే సమీపించగలరు.

చితారును చేతగొని మీటుతూ క్షెనోఫనీస్ యిల్లా పాడేవాడు :

"దేవుడొక్కడే! ఆయన మానవులకూ, దేవతలకూ, అందరకూ పైవాడు. ఆయన రూపంలోగాని, భావాల్లోగాని మానవులను బోలినవాడు గాడు. ఆయన సమస్తమునూ చూస్తాడు, సమస్తమునూ వింటాడు, సమస్తమునూ ఆలోచిస్తాడు. ప్రపంచంలోని సర్వమునూ ఆయన నియమనంగావించి నడుపుతాడు. దేవు డెప్పుడూ ఒక్కచోటనే అచలుడై ఉంటాడు. కదలుట ఆయన కవసరం లేదు గాననే ఆయన నిశ్చలుడై వుంటాడు."*

క్షెనోఫనీస్ కీర్తిస్తూన్న దేవుడు నూతనుడు. ఈతడు శాశ్వతుడు, అనంతావకాశమునకువలెనే నిశ్చలుడు. ఆయన ఏకమేవాద్వితీయుడు. ఏలనన యీ ప్రకృతి యంతయు నొక్కటిగనే వుందిగదా. ఆ దేవుడే యీసర్వమును. ఆద్యంత

---

* ఇదే అర్థమును యింకా చక్కగా చెప్పిన శ్రుతివాక్యాలు మనకున్నవి. *ఏకం మనసోజవీయో నైతద్దేవా అప్నువన్ / సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ! సర్వం ఖల్విదం బ్రహ్మ! తత్ సృష్ట్వాతదేవాను ప్రవిశత్ /* మొదలైన శ్రుతివాక్యములే దీనికి తార్కాణం. ఋగ్వేదమందలి నాస దీయసూక్తమునుకూడ యీ సందర్భమున గమనించాలి. — అనువాదకుడు.

రహితుడు, కాలాతీతుడు, శాశ్వతుడునున్నూ, నిరాకార స్వరూపుడున్నూ.

"సర్వవస్తువుల రూపాలు మారుతాయి. మేఘము లన్నీ తప్తములై మండిపోతాయి. జనులు వీటినే జ్యోతిస్సు లంటారు. ఈ పృథ్విమీద ప్రాణు లుద్భూతములై, భాసించి, తిరిగి మట్టిలోనే కలిసిపోతూంటాయి. మహాసముద్రాలనుంచి పొగమంచు, ఝంఝామారుతములు బైలుదేరుతాయి. మేఘ ములు వర్షరూపంలో భూమికి దిగుతాయి. వర్షోదకములు నదీప్రవాహరూపంలో భూమిమీంచి క్షారలవణాదులను తీసు కొనిపోయి సముద్రంలో కలుస్తాయి. అందువల్లనే సము ద్రోదకం ఉప్పగా ఉంటూంది. మెల్లమెల్లగా, నీవు గమనించ జాలనంత మెల్లగా సముద్రజలాలనుంచి పొడినేల బైటపడు తూంటుంది. పర్వతాగ్రములపైన కూడ మనం నత్తగుల్లలను చూస్తూంటాము. గనులలోనూ చేపల శిలాజములు, ఆన వాళ్ళు అగుపడతాయి. అది యిందుకు ప్రత్యక్షసాక్ష్యం. తిరిగి యీ పొడినేలలు జలాలచేత ఆక్రమించబడతాయి. జన సంఘాలను సముద్రోదకం ముంచేస్తూంది. ప్రతీదీ మారు తూంది. కాని, యీ విశ్వం మాత్రం యిల్లాగే నడుస్తూంది! ఈ ప్రకృతి ఒక్కటే ఆది అంతములు లేనట్టిది......"

ఈ రీతిగా బహు వర్ణ నామ రూపాత్మకమైన* యీ ప్రపం చం క్రింద, నిరంతరం మారుతూండే యీ బాహ్య వస్తుజాలం

* స ప్రాణమసృజత్ ప్రాణాత్ శ్రద్ధాం ఖం వాయుః జ్యోతి రాపః పృథివీన్ద్రియం మనో అన్నం అన్నాద్వీర్యః తపోమన్త్రాః కర్మలోకాః లోకేషుచ నామచ / ప్రశ్నోపనిషత్ అ 6. మం 4. — అనువాదకుడు.

క్రింద, దీనికి మూలమైన నిశ్చలవస్తువుకోసం, శాశ్వత తత్త్వం కోసం థ్సిోఫణిస్ అన్వేషించేరు.

ఆ మరునాడు థ్సిోఫణిస్, అతని బానిస తమ కాతిథ్య మొసంగిన ఆ గేస్తు యింటినుంచి బైలుదేరుతారు. వృద్ధబానిస యిప్పు డెంతో ఆనందోత్సాహాలతో ఉన్నాడు. నిన్నటి రోజున లభించిన అమూల్య బహుమతులతో అతని వీపుమీది వలాసం నిండివుంది. థ్సిోఫణిస్ కూడ సంతృప్తుడై నాడు. ఎందుకంటే జనులందరూ తన గీతాలను బహుశ్రద్ధగా, సగౌర వంగా ఆలకించలేదూ, మరి? శిష్యుల శ్రద్ధకంటె గురువును సంతుష్టిపరచగల దేమున్నది?

ఐతే, వెళ్ళిన ప్రతి-చోటనూ యిల్లా జరుగలేదు. పురాణ కవులైన హోమర్, హీసియడ్‌లనూ, దేవతలనూ పరిహసించి, తృణీకరించు నీ చారణుడు జ్ఞానవయోవృద్ధుడైనా అందరూ సహించేవారుగారు. ఇతని కాతిథ్యమిచ్చే ఆ గృహస్థే యే దేవతాంశవల్లనో, యే శూరుల అంశవల్లనో జన్మించినవా డనుకోండి. అల్లాంటపుడు వారి పూర్వీకులూ పూజ్యులూ నైన సురులనూ, శూరులనూ పరిహసించి, వారు దివ్యులు కారని నచో నీ దేశద్రిమ్మరియైన వృద్ధచారణుని గతి యేమికావాలి?

తమ సిరి సంపదలనూ, కీర్తి ప్రతిష్ఠలనూ, బలగమునూ చూసుకొని, మహాగర్వంతో మిన్నుమన్నెరుగని యీ సంపన్న ప్రభువులను చూస్తేనే థ్సిోఫణిస్‌కు అరికాలి మంట నెత్తి కెక్కేది.

మధుపాత్రల జేతబట్టి యెడనెడ గ్రోలుతూ ఆ సంపన్న ప్రభువులు తలదాచుకొన నెలవులేని యీ వృద్ధచారణుని బహు నిరసనగా పరిహసించువారు : "హోమర్ యేనాడో కీర్తిశేషుడైనా యీ నాటికీ వేలకొలదిమంది పాటకులకు ఉపాధి కల్పిస్తూన్నాడు. ఇతగాడు తనకూ, బానిసకూ సరిపడ సంపాదించుకోడానికే నానాపాట్లూ పడుతూన్నాడు !"

కాని, క్షణోఫణిస్ వంటి వాళ్ళ దారిద్ర్యానికి బాధ్యత యెవరిది ? కుస్తీలు పోట్లాడేవాళ్ళకి తగలెయ్యడానికీ, పందెములు ఒడ్డడానికీ యెప్పుడూ వీళ్ళదే ముందడుగు. అల్లాంటి యీ సంపన్నులకు బుద్ధి శక్తియొక్క విశిష్టత యేమెరుక ? పంది పన్నీరు మెచ్చునా ?

క్షణోఫణిస్ పర్వతమార్గాల వెంబడే నడుస్తూన్నాడు. తాను పర్యటించే ఉన్నతప్రదేశాలనుంచి చూస్తూంటే జనుల యిండ్లు ఎంత చిన్నవిగానూ, అల్పములుగానూ కనబడుతున్నాయి ! వారి వ్యాపృత్తు లెంత అప్రాముఖ్యములుగాను, క్షుద్రములుగానూ ఉన్నాయి ! వారి ప్రపంచ మెంత సంకుచితముగా నున్నది !

ఒకప్పుడేమోగాని యిక యిప్పుడు ఆ ప్రపంచం తనది గాదు. క్షణోఫణిస్ యిప్పుడీ కొండలమీాదనే లోకానికి దూరంగా ఉంటున్నాడు. తనకింక స్వదేశమనేదేదీ లేదు ! ఈ విశాలప్రపంచమే తనది. ప్రకృతిమాత ఒడిలోనే నివసించడం ఆతని కెంతో యిష్టం. ప్రకృతి నిత్యనూతనమైనది. దానికి

జీర్ణత్వం, వృద్ధాప్యం, మరణం అనేవి లేవు. పరిశ్రాంతుడైన యీ వృద్ధ చారణునికి ప్రశాంత ప్రాకృతిక వాతావరణంలోనే విశ్రాంతి లభిస్తుంది. మహాసముద్రంలో నీటి బొట్టువలె తాను యీ మహావిశ్వంలో నొక అల్పభాగం! వివిక్త ప్రకృతి పరిసరాల్లో యీ భావనే ఆ వృద్ధ పండితునికి మనశ్శాంతి నొసగేది.

## సాంప్రదాయికులు విజ్ఞానమును తమపక్షానికి త్రిప్ప జూస్తారు.

అంధవిశ్వాసాల చీకట్లు నూతనభావాల మెరుపులకు పటాపంచలై పోతున్నాయి. శాస్త్రజ్ఞానపు సమ్మెట దెబ్బలకు పాత చెరసాల గోడలు బీటలువారి, శిథిలములై కూలిపో నారంభించేయి. ఆ శిథిలాలనుంచే నూతనమైన మరో ప్రపంచం ఉద్గమించింది. ఈ క్రొత్త ప్రపంచం పూర్వపుదానికంటె విభిన్నమైనది.

పాత ప్రపంచాన్నీ, విధానాల్నీ సమర్థించేవారు యీ నూతన భావాల పురోగమనం ముందర నిలువబడలేకపోతూన్నారు. విజ్ఞానశాస్త్ర పురోగతి యెవ్వరికీ దుర్నిరోధమైనదే గదా! అందుచేత వారు యీ శాస్త్రవిజ్ఞానమునే తమ పక్షానికి అనుకూలంగా చేసుకోడానికి ప్రయత్నించేరు......

మిలిథుస్‌నగరాని కనతిదూరంలోని సామోస్‌దీవినుంచివారీ ప్రయత్నాలను ప్రప్రథమంలో సాగించేరు. ఇక్కడ పాతదేవ

తలు క్రొత్తదేవతలముందర నిలువబడలేక ఓటమినంగీకరించాల్సి వచ్చింది. ఎవరా క్రొత్తదేవతలు ? రజితమూ, స్వర్ణమూ నే ఆ క్రొత్తదేవుళ్ళు ! వెనుకటిరోజుల్లో వెండి బంగారు నాణెము లనే జనులెరుగరు. ఆ కాలంలో బాబిలోనియనుల టాలెంట్ లే యేకైక నాణెములు. ఆ నాణెము ఒక్కొక్కటి డెబ్బదిరెండు పౌనుల బరువైనది ! ఏ సంపన్న ప్రభువుల ధనాగారాల్లోనో యీ బృహత్ నాణెములు తరముల నుంచి యెండకన్నెరుగక పడివుంటూండేవి. వస్తువులను కొనడంలో జనులచేతుల్లో తిరిగే నాణెములు ఆ కాలంలో లేనే లేవు. వర్తకవ్యాపారాలు క్రమంగా అధికమవుతూన్నకొద్దీ వెండి బంగారముల ఉప యోగం తప్పనిసరియైనది. నిర్దిష్టపరిమాణంగల వెండి బంగారు తునకలు నాణెములుగా మారకసాధనాలై నిరంతరం చేతులు మారుతూ ఉండడం అధికమైంది. ఎవరిదగ్గర వెండి బంగారు నాణెము లధికంగా వున్నాయో వారికి దేవతల అవసరమే లేకుండెను ! ప్రార్థనాదికములచే పరితృప్తులైన దేవతలు వేటిని యిస్తారో అవన్నీ ఆ నాణెములే సమకూరుస్తూన్నాయి, వాళ్ళకి ! అల్లాంటపుడు అనిశ్చయమైన దేవతానుగ్రహం సం పాదించడంకంటె నిశ్చయ ఫలదాయకములైన యీ నాణెము లను సంపాదించడమే వాంఛనీయమని జనులు భావించడంలో ఆశ్చర్యమేముంది ?

ఉదాహరణకు ఈవ్యక్తిని చూడండి. ఇతడిపేరు పోలిక్రేట్స్. అతగాడి గోత్రమేదో, జాతియేదో యెవరికీ తెలియదు.

అతనికి బంధువులూ, కుటుంబమూ లేరు. అతడొక కార్ఖానాను తెరిచేడు. అక్కడ రాత్రింబగళ్లు పాతికమంది బానిసలచేత నిర్విరామంగా పనిచేయించుకునే వాడాతడు. ధనికులకోసం అందమైన కొయ్యసామగ్రి చేయించడమే పోలిక్రేట్స్ వ్యాపారం. పెద్దపెద్ద పందిరి పట్టెమంచాలమీద పరుపులు, దిండ్లు వేసి, విలాసంగా వాటిపై నొరిగి, మద్యపానాదుల్లో, విందులు వినోదాల్లో మునిగి తేలుతూండడమే సంపన్న ప్రభు కుటుంబీకుల పని. వాళ్ళకి కావాల్సిన మంచాలు, బల్లలు, సోఫాలు, ఆసనాలు తయారుచేయడమే యీతని వృత్తి. వ్యాపారం మాంఛి చురుగ్గా సాగుతూంది. భోగపరాయ ణులూ సోమరులూ నైన కులీనప్రభువుల సుకుమార హస్తాల నుంచి వెండిబంగారాలు కొల్లలుగా యీ వడ్రంగి మోటు చేతుల్లోకి ప్రవహిస్తూంది. కఠినపనిచే కాయలుకాచిన పోలి క్రేట్స్ మోటుచేతులు ధనం యింకా యింకా ప్రోగుచేస్తూనే వున్నాయి. అతడిప్పుడు పడవలు, ఓడలు నిర్మించ నారంభిం చేడు. అంతతో ఆగలేదు. ధైర్యశాలురు, అనుభవజ్ఞులు ఐన నావికులను, మాలిములను, సరంగులను కూలికి తెచ్చి పెట్టు కొని, యీ పడవల్ని సముద్రాంతరాలకి పంపేవాడు. ఒక ద్వీపంనుంచి మరో ద్వీపానికి, ఒక తీరంనుంచి మరో తీరానికి వీరు ప్రయాణాలుచేస్తూ, మనుజుల్ని హత్యలుగావిస్తూ, స్త్రీ శిశువులను బానిసలుగా చేస్తూ, తమ నల్లనిఓడల్ని వెండి బంగా రాలతోనూ, పట్టుపుట్టములతోనూ, సుగంధ ద్రవ్యాలతోనూ

నింపుకొని వచ్చేవారు. అన్ని దిక్కులనుంచీ సంపదలు ఒకే ప్రవాహంగా పోలిక్రేట్స్‌కు వచ్చిపడినాయి. తనకు కావలసిన వన్నీ ధనంమూలంగా సాధ్యమవుతున్నాయి. అన్నిటికంటెనూ పరమ వాంఛితమైన రాజకీయాధికారం కూడా చివరకి పోలిక్రేట్స్ చేతుల్లో పడిపోయింది !

నావికులు, పనివాళ్లు, బానిసలే గాకుండా వర్తకులు, వృత్తినిపుణులు, బానిస యజమానులు కూడా పోలిక్రేట్స్ యొక్క నూతన ప్రభుత్వంతో సంతృప్తులై యున్నారు. వాళ్లందరూ యీతని ప్రభుత్వంక్రింద లాభాన్నే పొందుతూన్నారు. ఈ కొత్తతరం బైలుదేరి ఆరు పువ్వులూ మూడు కాయలుగాగా మేడలూ మిద్దెలూ కట్టుకుని, ఝామ్మని ఉండడం చూస్తూంటే సంపన్నులైన కులీన వంశీకులకు కన్నెఱ్రగా ఉండేది. దేవతల అనుగ్రహం యీ నూతనవర్గం వాళ్లమీద ఉందనడం నిజం కాదు. ఈ పరిస్థితుల నెంతోకాలం కొనసాగనీయరాదు !

అసూయాపరులైన అదృష్టదేవతకు అర్పణగా తన అమూల్యాంగుళీయకాన్ని పోలిక్రేట్స్ సముద్రంలోకి విడిచేడనే వార్త అంతటా వ్యాపించింది. కాని, పోలిక్రేట్స్ కమిత సంపదల నొనగూర్చిన సముద్రదేవుడు అతనినుంచి ప్రతిఫలరూపమైన యీ కానుక నంగీకరించలేదు. ఉంగరం తిరిగివచ్చేసింది. ఒక బెస్తవాడు పట్టితెచ్చిన పెద్ద చేపకడుపులో యీఉంగరంఉంది!

ఔనుమరి ! దేవుళ్లులేరూ ? ఒలింపస్ పర్వత శిఖరాన్నుంచి దేవుళ్ళు ప్రతివిషయాన్నీ గమనిస్తూనే వున్నారు ! తమ వంశీకు

లైన కులీనప్రభు కుటుంబాలవాళ్లు అందరిచేతా నిరసనగా చూడబడుతూండడం, దైన్యం అనుభవిస్తూండడం; అలగా జనం సంపదలన్నీ సుఖంగా అనుభవిస్తూండడం చూస్తూ దేవుళ్ళు యెంతకాలం ఊరుకుంటారు ?...

చాలమంది యీ రకమైన భావాలతోనే ఉండేవారు. ఈ మాటలు విన్నప్పుడు మరికొందరు విషాదంతో కటువైన చిరునవ్వు నవ్వేవాళ్ళు. ఒలింపియన్ పర్వతశిఖరాగ్రవాసులైన దేవుళ్ళు యెక్కడున్నారు ? పురాతన విశ్వాసాల్లో జనులకు గల నమ్మకం సడలిపోయింది. పశుప్రాయులైన జనసామాన్యాన్ని అధ్వాస్థానంలో పెట్టిఉంచగల శక్తి యేది ? అది యెక్కడ ఉంది ? నడమంత్రపు సిరిసంపదలు అబ్బిన యీ అలగామూకను గుర్రం దింపి, తిరిగి వాళ్లని బండచాకిరీలోకి, బానిసత్వంలోకి పంపగల శక్తి యేదీ లేదా ?

ప్రాచీనశూరుల, రాజుల వంశీకులు తమ వెనుకటి ధైర్య సాహసాలను గోల్పోయి, నిరంకుశుడైన పోలిక్రేట్ పేరు చెపితేనే వణుకుతున్నారు. కొత్తభావాలు వీళ్లనికూడా లోబరచుకొంటున్నాయి. ఏది న్యాయం ! ఏది అన్యాయం ? ఏది సంగతం ? ఏది అసంగతం ? ఈ విషయంలో కులీనప్రభు కుటుంబీకులకే యిప్పుడు సంశయాలు కలుగ నారంభించేయి.

తమకు సాయం యెక్కడినుంచి వస్తుంది ? ఎవరు చేయగలరు ? తమకు దారి చూపుమనీ, నడుపుమనీ తా మెవరిని ప్రార్థించాలి ?

తమకు సాయంచేయగలవాడు, పండితుడు, పవిత్రుడు, ఋషి ఒకడున్నాడని పలుచోట్ల గుసగుసలు వినవస్తున్నాయి. తమ పాపాలనుంచి విముక్తులుగావడానికి చాలకాలం కష్టాల ననుభవించుతారనీ, తరువాత పవిత్రులగుదురనీ చెప్పబడింది. శుష్క తర్క-వాదనలకు దిగకుండా చెప్పినమాటలను వినయంతో ఆలకించి, కిమ్మనకండా ఆచరించాలని విన్నారు. మానవులకు తమకేది మంచియో తెలియనే తెలియదనీ, కేవలం దివ్యులూ, దివ్యాంశ సంభూతులూ, ఋషులూ మాత్రమే మానవుల కేది శ్రేయస్సో తెలుసుకోగలరు!

తమలోనుండి మార్గదర్శిత్వం వహించడానికి దేవతాంశతో నొక పురుషు డవతరించేడనీ, అతనిపేరు పైథాగొరస్ అనీ జను లనుకొనజొచ్చేరు. కొందరు మాత్రం పైథాగొరస్, రాళ్ళు కొట్టే మ్నిసార్కస్ కొడుకన్నారు. అంతేగాక అతని జననాన్ని గూర్చి యేమేమో ప్రవాదలుకూడా వున్నాయి. దేవదూత యైన హెర్మిస్ కుమారుడని కొందరంటే, సూర్యదేవుడు అపోలో కుమారుడేనన్నారు మరికొందరు. ఒకసారి అతని ఉత్తరీయాన్ని వాయువెగురకొట్టగా, ప్రక్కలు బంగారు కాంతితో మిలమిల మెరయుట గాంచిన ప్రజానీకం పరమా శ్చర్య నిమగ్నులైపోయారు! పైథాగొరస్ అద్భుతా లెన్నో గావించేవాడు. దేవతలతో మాట్లాడేవాడు. ఒకసారి హేడిస్ (నరకం)కు వెళ్లి, ప్రాచీన దివ్యగాయకుడు ఆర్ఫియుస్‌వలె కొంతకాలం వుండి తిరిగివచ్చేడు!

ప్రభుకుటుంబీకులు చాలమంది పైథాగొరస్ దగ్గరకు చేర నారంభించేరు. అతడేమి బోధించేవాడో అంతా రహస్యంగా ఉంచబడీది. కాని, యీ బోధనలను గూర్చి పోలిక్రేట్స్ తెలుసుకుని, పైథాగొరస్‌ను పట్టుకోమ్మని అనుచరుల కొందర్ని పంపేడు. ఈ రహస్యబోధనలూ, సంఘాలు తన్ను పడగొట్టడానికేదో కుట్రగావిస్తూన్నాయనే అతని అనుమానం నిజమే కావచ్చు. ఇది తెలిసి పైథాగొరస్ సామోస్‌ను వదలి పలాయనం గావించేడు. "ఈ నిరంకుశుడు చాల బలవత్తరుడవుతున్నాడు. ఇతని పాలనలో యెవరూ స్వేచ్ఛగా మనజాలరు." అని తన శిష్యులను హెచ్చరించే వెళ్లేడాతడు.

కొంతకాలంవరకు కాతడెవరికీ కనబడలేదు. ఐగుప్తులోనూ, బాబిలనులోనూ బర్బరజనులమధ్యవుంటూ, వాళ్ళ పురోహితుల దగ్గర గుప్తశాబరవిద్యల్లో ఉపదేశం పొందుతూన్నాడని అంతా అనుకున్నారు. చివరకు పైథాగొరస్ సుదూరంలోని ఇటలీ రేవుపట్టణం క్రోటోనాలో ప్రత్యక్షమయేడు.

ఆ రోజుల్లో ఇటలీలో కూడా రాజవంశీకులకూ ప్రజాసామాన్యానికీ మధ్య యుద్ధాలు జరుగుతూన్నాయి. ఒకప్పుడు వీరు నెగ్గితే, మరొకప్పుడు వారు నెగ్గుతూన్నారు. ప్రభువర్గాలతరఫున ఒక వస్తాదు పోరాడుతున్నాడు. భీమబలుడైన హెర్క్యులస్ వలె ఈతడు సింహచర్మం ధరించి, గదను పట్టుకుని ఉండేవాడు. అతడు యుద్ధరంగంలో కనబడ్డాడంటే ప్రతిపక్షంవారు భీతితో వికావికలై పారిపోయేవాళ్లు. ఆ వీరుని

పేరు మిలోన్. అతడు తెలివైనవాడూ కాడు, చదువుకున్న వాడూ కాడు. తత్త్వశాస్త్రం అంటే తలనొప్పి అతగాడికి. కాని, కుస్తీలంటేమాత్రం కులాసాయే!

ఏ పక్షంలోనైనా అంతా అన్నచారవగలవాళ్ళే చేరితే లాభంలేదు. కొందరైనా అక్షరచారవగలవాళ్ళుకూడా ఉండాలి గదా. క్రోటోనా ప్రభువర్గాలకి వీరుడొకడున్నాడేగాని బోధకుడు లేడు.

అల్లాంటి సమయంలోనే పైథాగొరస్ వచ్చి చేరేడు. ప్రభు కుటుంబాల యువకులతో అతడు చాలరోజులు దీర్ఘ సంభాషణలు, బోధనలు గావించేడు.

"యువకులారా! నేను చెప్పబోవుదానిని వినయంగా, శ్రద్ధతో, మౌనంగా ఆలకించండి. లోకాన్ని పరిశీలిస్తే మీకు ప్రతిచోటా నిర్దుష్టమైన నియమపాలనే కనబడుతుంది. సృష్టి అంతా క్రమబద్ధమై, గణితశాస్త్రానికి లోబడి నడుస్తూంటుంది. అంతెందుకు? ధ్వనులు, శబ్దాలూ కూడ నియమబద్ధమై ఉంటున్నాయి."

పైథాగొరస్ ఒక చెక్కమీద కొన్ని తీగెలను అమర్చి, బిగించి, ప్రయోగించేడు. తీగె పొడవునుబట్టి దాని ధ్వని భేదిస్తూంది. తీగె పొట్టిచేసినకొద్దీ ధ్వని తారస్థాయిలోకి పోతూంది. సోపానక్రమంగా తీగె పొట్టి పొడుగులనుబట్టి దాని ధ్వని మంద్రమధ్యమతారస్థాయిలుగా ఒక నిర్దిష్ట పరిమాణంలో ఉంటూంది.

శ్రుతులలోని వ్యత్యాసాల్ని బహు సూక్ష్మ పరిశీలనాశక్తి గలవారే గ్రహించగలరని ప్రజలనుకుంటూండేవాళ్లు. తీగె పొడవే ధ్వనిస్థాయిని నిర్ణయిస్తూంది గనుక ఎవరైనా సరే సంగీత సాధనాలకు శ్రుతి పెట్టగలరని పైథాగొరస్ చేసి చూపించేడు !

పిమ్మట పైథాగొరస్ యిసుకలో సమకోణ త్రిభుజాన్ని వ్రాసేడు.

ఆ త్రిభుజం యొక్క రెండు భుజములను కొలిచి చూసి, మూడో భుజం పొడవు తెలుసుకోవచ్చునని ఋజువుచేసేడు, పైథాగొరస్. సమకోణమున కెదురుగానున్న కర్ణము పొడవును మిగిలిన రెండుభుజాల పొడవునుబట్టి చెప్పగలము. *

సంఖ్యలు, గీతలు, కొలతలు మొదలైనవే యీ ప్రపంచాన్ని ఓ పెద్ద గందరగోళంగా కాకుండా నిర్దిష్టరూపు రేఖలు గలదాన్నిగా మనకు వ్యక్తీకరిస్తూన్నాయి. విరూపమైనదానికి రూపకల్పన గావించేయి. హద్దులులేనిదానికి హద్దుల నేర్పాటు చేసినాయి !

---

* బహుప్రాచీనకాలంలోనే భారతదేశంలో బీజగణిత క్షేత్రగణితము లభ్యస్తములు. శుల్వసూత్రములను గ్రంధములో క్షేత్రగణితవిషయము లంటంకించబడినాయి. హోమకుండముల పైశాల్యములను నిర్ణయించుటకై క్షేత్రగణిత మభ్యస్తమని తెలుస్తూంది. సమకోణత్రిభుజమందలి కర్ణము మిగిలిన రెండు భుజములపొడవుతో సమమని పై శుల్వసూత్రములలోనే చెప్పబడియున్నది.

— అనువాదకుడు.

పైథాగొరస్ తన శిష్యబృందాన్ని రాత్రులు మైదానాల మీదికి గొంపోయి, నక్షత్రాలు చూపేవాడు. నక్షత్ర లోకంలోకూడా సంఖ్య, కొలతలు, గమనం మొదలైన గణిత శాస్త్ర సూత్రాలే ప్రభుతవహించియున్నాయనేవాడు, ఆయన. నక్షత్రాలు నియమితకాలాల్లో ఉదయించి, అస్తమిస్తాయి; తమ గమనాల్ని నిర్దిష్టమార్గాల్లో సాగిస్తాయి. విశ్వకేంద్రంలో నొక పెద్ద అగ్నిగోళం, బలివేదికపై అగ్నిహోత్రంవలె ఉంది. అదే చుట్టూ వేడి వెలుతురుల నిస్తూంది. దానిచుట్టూ పది స్ఫటికగోళాలు, సూర్య చంద్ర గ్రహతారకాదులున్నాయి. భూమికూడ అవే సూత్రాలకు, నియమాలకు బద్ధమై సంచ స్తూంది. భూమి అచలంగాదు. మిగిలినగోళాలతో పాటు క్రమ పద్ధతిలో భూమికూడ లయబద్ధంగా ఆ కేంద్ర అగ్నిగోళం చుట్టూ పరిభ్రమిస్తూంది. ఈ గోళాలు మెల్లగా తిరుగుతూ, తమతమ ప్రత్యేకనాదాల్ని ఆలాపిస్తూంటాయి. ఈ విశ్వమే ఒక వీణె. ఈ విశ్వవీణ దశతంత్రీయుతమైనది. ఈ తంత్రు లలో దేనినాదం దానికి ప్రత్యేకమే.

ప్రతీదీ ఒక నిర్దిష్టక్రమంలో నడుస్తూంది. ప్రతీదీ సంఖ్య లచే నియమితమై వుంది.

సంఖ్యలలో కొన్ని పవిత్రమైనవి కూడాను. 1, 3, 4, 10. మొదటి నాలుగు అంకెల్ని చూడండి : 1, 2, 3, 4. వీటి నన్ని టినీ కూడితే 10 వస్తుంది. అందుచేతనే 10 అనేది నిర్దుష్టసంఖ్య.

ఈ మహాద్విషయం కనిపెట్టినందుకు పైథాగొరస్ తానే పరమాశ్చరపడిపోయేడు. ఏదో ఒక విషయాన్ని గమనించి,

యూనత్ సత్యాన్ని కనిపెట్టానని మురిసిపోయా డీయన ! ప్రతి దాన్నీ కొలవగలం, లెక్కించగలం. గనుక ప్రతీదానికీ అంక ములే బోధకము లనుకున్నాడు, పైథాగొరస్. ధ్వనులు, రూపాలు, ఖగోళములు మొదలైన సమస్తానికీ కీలకాన్ని కను గొన్నా ననుకొన్నా రాయన. లోకంలోని మిగతా రహస్యా లన్నింటినీ యిది తనకు కరతలామలకం చేసిపెట్టదా !

'ఆఁ ! తప్పకచేస్తుంది !' అనుకున్నాడు, పైథాగొరస్. సుఖదుఃఖాలకు కూడ సంఖ్యలే కీలకాలు. జయాపజయాలకు కూడాను. ఈ సంఖ్యల్లో మంచివీ, చెడ్డవీ వున్నాయి. కొన్ని సంఖ్యలు అదృష్టకరములు, మరికొన్ని దురదృష్టకరములు. సంఖ్య, కొలత, పొందిక,—యివే విశ్వమంతనీ శాసిస్తూ న్నాయి. లోకంలో నిర్దుష్టమైన క్రమబద్ధతనే ఈశ్వరుడేర్పరచి యున్నాడు. గ్రహ నక్షత్రాదులే యీ నియమాల్ని అతిక్ర మించలేవు. అట్టియెడ మానవుడు అతిక్రమించి చరించ గలడా ?... నియమోల్లంఘనం జరిగి, అరాజకం ప్రబలిన దేశంలో దుఃఖం గాక మరేమిఉంటుంది ? దేవతలు యేర్పాటు చేసిన శాశ్వత నియమాలను గౌరవించని అత్యాచారుల దేశంలో దురదృష్టదేవత తాండవించక ఏమి జరుగుతుంది ? ప్రతీది గుంపులే నిర్ణయించాల్సినచో అధోగతి తప్పదు !

ఈ విధంగా పైథాగొరస్ తన శిష్యులకు బోధించేవాడు. వారిని తన గుప్తవిద్యలు స్వీకరించేందు కాయత్తపరచేవాడు. ఇవన్నీ పాతకాలపు కాకమ్మ కథలుగావు. వాటినిప్పు డెవ్వరూ

విశ్వసించరు! పాత దేవుళ్ళను బలపరచే కొత్త విజ్ఞానం, యిది!

పైథాగొరస్‌కు శిష్యు లంతకంత కధికమైరి. వారందరూ చేరి ఒక సోదరబృందంగా, పైథాగోరియను సంఘంగా యేర్పడ్డారు. వాళ్ళు తమ యావత్కాలమునూ గణితం, సంగీతం, వ్యాయామం మొదలైనవి అభ్యసించడంలోనే గడుపుతూండే వారు. శరీరంయొక్క లయబద్ధతే వ్యాయామశాస్త్రం. శరీరం నియమ బద్ధంగా లేకపోతే బుద్ధికూడా సక్రమంగా ఉండదు. సంగీతం సర్వమునూ క్రమనిర్మాణంలోనికి తెస్తుంది. శుద్ధశాస్త్రమైన గణితమే ఆత్మ పారిశుద్ధ్యానికి తోడ్పడుతుంది.

పైథాగొరియన్ బోధనలు సగం మతమే. వారి కెన్నో నియమాలున్నాయి. వారి మతంలో చేరనివాళ్ళకి పైథాగోరియనుల విధినిషేధాలు అర్థమయేవిగావు. ఉదాహరణకు, వారు గొఱ్ఱెమాంసాన్ని తప్ప మరే యితరజంతు మాంసాన్నీ తినరాదు. బఠాణీలు వారికి నిషిద్ధ పదార్థం! కుడి పాదరక్షలోనే వారు ముందు కాలుంచాలి! కాని, వామహస్తాన్నే మున్ముందుగా ప్రక్షాళనం గావించుకోవాలి. రాజమార్గంలోనే నడవాలి.

ఇల్లాగే యెందుకు నడచుకోవాలో యీ వ్రతావలంబులకే తెలియదు! ఎందుకు? అనే ప్రశ్న వారి బుర్రలోకి రానే కూడదు. "గురువులు స్వయంగానే యిల్లా చేయాలని సెలవిచ్చారు!" అనే దొక్కటే సమాధానం. శిష్యులు చేయాల్సిందల్లా నియమపాలనమే, చెప్పినదల్లా శిరసావహించడమే!

మీరు నాటకం చూడబోయూరనుకోండి. వేయిమంది ప్రేక్షకుల్లోకూడ పైథాగొరియన్‌ను పోల్చుకోగలరు! బజారులో గాని, చౌకులోగాని యెంతమందిలోనైన వాళ్ళని యిట్టే కని పెట్ట గలరు! సామాన్యజనులనుంచి కొంచెం యెడంగా వుంటూంటారు, వాళ్ళు. తాము ఉపదేశం పొందినవారమనీ, వ్రతావలంబులమనీ, తమ మాటలు శిరసావహించడమేసాధారణుల కర్తవ్యమనీ, వారి అభిప్రాయం. అంతేగాదు. తమ వ్రతావలంబులు గానివారిని కొంచెం న్యూనతగా చూసేవాళ్లు కూడాను!

భీమబలుడైన మిలోన్ బుద్ధిలో అల్పుడేగాని అతడుకూడ పైథాగొరియన్ శిష్యవర్గంలోనివాడే.

శిక్షణ, క్రమబద్ధత, విధేయత మొదలైనవి తమ పనినేమో చేసినాయి. గందరగోళాన్ని, అరాజకాన్ని ఆఖరుచేసినాయి. పైథాగొరియన్ సంఘం కేవలం విజ్ఞాన శాస్త్రీయ విషయాలతో ఆగిపోలేదు. వారిచేతుల్లో క్రోటోనా రాజ్యాధికారం కూడా ఉంది. ప్రతీదీ నియమబద్ధమై, సమన్వయస్థితిలో ఉండాలని పైథాగొరియనుల వాంఛ. కాని, 'నియమము' 'సమన్వయము' అంటే వారి అభిప్రాయము, జన బాహుళ్యమును పైనున్న కొద్దిమంది పాలించాలని మాత్రమే. సమన్వయ విధానం, శాంతి మొదలగు వాటిని గూర్చి వాళ్లు బోలెడంత మాట్లాడేవారు. కాని అప్పటికే వారు, తాముచెప్పే 'శాంతిని' ఖడ్గంతోనైనాసరే స్థాపించడానికి కృతనిశ్చయులై యుం

డిరి. బలప్రయోగంతోనూ, హింసతోనూ శాంతిని స్థాపించ డానికి పైథాగోరియన్‌లు తయారైరి! శాస్త్రజ్ఞానాన్ని ఆచర ణలో పెట్టదలచినది, వారా విధంగానే.

ఇట్లు చేసేందుకు వారికి త్వరలోనే ఒక అవకాశం దొరి కింది. సమీపమందలి పట్టణారాజ్యమైన సైబారిస్ నుంచి శర ణార్థులు కొందరు క్రోటోనాకు పారివచ్చి, దేవాలయములలో తలదాచుకొనగోరేరు. ఈ శరణార్థులు సంపన్నప్రభు వంశీకులు. సైబారిస్‌నగర ప్రభుత్వం జనసామాన్యం చేతుల్లోకి పోయి సందున వారు పారిపోయి రావలసివచ్చింది. వీరిని తిరిగి తమకు వప్పజెప్పవలసిందని సైబారిస్ ప్రభుత్వం కోరగా, క్రోటోని యన్ ప్రభుత్వం నిరాకరించింది. దీనికి పర్యవసానం యుద్ధమే నని అందరికీ తెలుసు. కాని, క్రోటోనియనులు యుద్ధసంసిద్ధు లయే యీ పని చేసేరు. సైబారిస్‌నగర సంపదలమీద వీరి దృష్టి యిదివరకే పడింది. మిలిథుస్‌నుంచి వచ్చిన ఉన్నిగుడ్డల తానులు మేట్లుపడి వుంటాయి, సైబారిస్‌లో! అక్కడ ద్రాక్షమధువు నొకచోటినుంచి మరోచోటికి గొంపోయేటం దుకు భూమిలోపలనే సొరంగా లుండేవి!

సైబారిస్ జనులు చాల తెలివైన వ్యాపారులు; జవుళి దినుసులు, మద్యములు, యితర భోగవస్తువుల వ్యాపారంలో ఉన్నవాళ్లు. క్రోటోనా జనులు కర్షకులు, బెస్తలు మాత్రమే.

క్రోటోనీయ రైతులు, బెస్తలు దండయాత్రకు వెడలిరి. భీమబలుడు మీలోన్ సింహచర్మధారియై, ఒలింపిక్ పూల

మాలను శిరమున ధరించి, వారికి నాయకుడై ముందు నడుస్తూన్నాడు. మిలోన్ ననుసరించే రాజకుటుంబీకులూ, జీతగాండ్లైన శిక్షితసైనికుల దండులూ, వారి వెనుక నియమబద్ధులైన పైథాగోరియన్‌ల దళాలూ నడిచినాయి. వీరి ధాటికి సైబారేయులు నిలువజాలకపోయేరు.

యుద్ధం శీఘ్రంలోనే ముగిసింది. పైథాగోరియనులు విజయలక్ష్మిని చేబట్టేరు. వెను వెంటనే సైబారిస్‌లో శాంతినీ, క్రమమునూ స్థాపించుటకు వారు ప్రారంభించేరు. మగవాళ్ళంతా చంపబడ్డారు; స్త్రీలూ, పిల్లలూ బానిసలుగా చెఱగొనిపోబడ్డారు. నగరమంతా పరశురామప్రీతి గావించబడి, దున్నబడింది. క్రోటోనియనులలో శ్రేష్ఠులైనవారు దోచిన సంపద నంతనూ వాటాలు వేసి పంచుకొన్నారు. రైతులు తమ క్షుద్రకుటీరములకూ, బెస్తలు తమ చీకు పడవలకూ తిరిగి చేరుకున్నారు.

సైబారిస్‌లో 'శాంతి' స్థాపించబడింది. గాని, క్రోటోనాలోనే ఆ శాంతి కరవైంది! అక్కడి పరిస్థితులు గందరగోళంగా వున్నాయి. రైతులు, బెస్తలు గొడవలు చేయనారంభించేరు. దోపిడీ సంపదల్లో తమకు వాటా పంచలేదేమని వాళ్ళిప్పుడు గట్టిగా అడుగుతూన్నారు.

అసంతృప్తులైన వాళ్ళలో కొందరు ధనికులూ వున్నారు. వీరు నిన్న మొన్నటి వరకూ కుమ్మరిపనీ, కమ్మరిపనీ చేసి, పొట్ట పోసుకుంటూండినవాళ్ళే. ఎల్లాగో నాలుగుడబ్బులు కూడబెట్టి ధనికులైన వీళ్లూ తమకు వాటా పెట్టాలని ఆందోళన

నారంభించేరు. అభిప్రాయ భేదాలవల్ల పైథాగోరియన్ సమితిలో నుంచి వెళ్లగొట్టబడినవారు కొందరుకూడ యీ అసంతృప్తుల పక్షాన చేరేరు. పైథాగోరస్ శిష్యుల్లో శ్రేష్ఠుడైన హిప్పస్ సమితిని వదలి ప్రజాపక్షమును చేరేడు. సమితి నిర్మాణ రహస్యాలను కొన్నింటిని వెల్లడించినందుకే యితన్ని సమితినుండి బహిష్కరించేరు. పైథాగోరస్ పండితుని గణిత శాస్త్ర సూత్రాలు సర్వత్రా ఉపయోగకారులు గావని హిప్పస్ తన గ్రంథంలో వ్రాసేడు. సంఖ్యలలో నియమ బద్ధములుగాని (యిర్రేషనల్) వీ వున్నాయనీ, సంఖ్యలకు 'ఒకటి' ప్రారంభం గానక్కరలేదనీ ఆతడు ఋజువు చేసి చూపించేడు !

అంచేత పైథాగోరస్ శిష్యుని బహిష్కరించేడు. హిప్పస్ మృతుడైనట్లుగా అతనికొక సమాధిని, స్మారక చిహ్నంగా నిర్మించేరు. సమాధిఐతే లేచిందేగాని హిప్పస్ బ్రతికే ఉన్నాడు. అతడు బహిరంగ సభలకు వెడుతూ, పైథాగోరియన్ లను దేశాన్నుంచి తరిమివేయాలని హెచ్చరించుతూండేవాడు ! పైథాగోరస్ పవిత్ర వాక్యాలనే ఉటంకిస్తూ, వాటితోనే ఆయన బోధనలను ఖండించేవాడు.

పైథాగోరస్ క్రొటోనా నుంచి పలాయనం గావించేడు. ఆయన శిష్యులు దేవతలు పంపిన శకునాలు, అద్భుత సంఘటనలూ గూర్చి ప్రచారం చేయ నారంభించేరు. పైథాగోరస్ ఒకనదిని దాటుతూంటే హఠాత్తుగా 'పైథాగరస్ ! స్వాగతం!' అని ఆకాశవాణి పలికిందట ! అప్పటికే పైథాగోరస్ సుదూ

రస్థమైన ప్రొపోంటస్‌లో ఉన్నాడు. కాని, ఉన్నట్లుండి ఆయన తిరిగి క్రోటోనాలో ప్రత్యక్షమయేడు.

ఔను ! తనకృషి అంతా వినష్టమై బోవ వీలులేదు!"‘శ్రేష్ఠ జనులపై’ ‘మడ్డి మూకలు’ జయం పొందడాన్ని దేవతలు సహించరు. పైథాగొరస్ తన శిష్యులనే ‘శ్రేష్ఠ జనులు’ అనేవాడు. ఔత్తరాహుడైన (హైపర్ బొరియన్) అపోలో దేవుని మీదనా అలగా జనం జయించేది ?

తమ సేనానియైన మిలోన్ యింటిలో ఒకరాత్రి సమయాన పైథాగొరియనులు సమావేశ మగుచుండిరి. వారి శత్రువు లీ విషయాన్ని ముందే పసికట్టి, అన్నివైపులనుంచీ హఠాత్తుగా వారిని ముట్టడించేరు. వెలుతూన్న కాగడాలను చేతుల్లో పట్టుకుని వచ్చి, సమావేశ గృహాన్ని చుట్టుముట్టి, దానికి నిప్పు ముట్టించేరు, వాళ్ళు. పైథాగొరియన్‌లు విభ్రాంతులై పోయారు. అంతా ఒక్కుమ్మడిగా పారిపోవ బ్రయత్నించడంతో గందరగోళం మరింతగా పెరిగింది. చివరకు ఆ గలాటాలో అక్కడ చేరినవారందరూ మరణించేరు. బాగా జంఘాలురైన యిద్దరుమాత్రం ప్రాణాలతో బైటికి పారిపోగలిగేరు. పైథాగొరస్ వాగ్దానం గావించిన నియమబద్ధమూ, సమన్వాయయుతమూ నైన ప్రపంచ విధాన మెక్కడ ? వారికి పట్టిన యీ దుర్గతి యెక్కడ ? మిన్నుకూ మన్నుకూ యెంత అంతరం ఉంది !

క్రొటోనా నగరపు శిలాప్రాకారాలు పడగొట్ట బడినాయి. పాతసమ్మకాలూ, మూఢవిశ్వాసాలూ అనే అస్థగోడలు కోట గోడలతో పాటు కూలద్రోయ బడినాయి. కులీన ప్రభు వర్గాల పురాతన తెగల పద్ధతికీ కొత్తగా బైలుదేరుతూన్న బానిస సమాజానికీ మధ్య జరిగిన సర్వనాశనకర యుద్ధాల్లో పాతదంతో నాశనమైపోయింది.

స్వరశాస్త్రము, నియమబద్ధ సంఖ్యలు మొదలైన వాటిని గూర్చి పైథాగొరస్ బోధనలను మనం ఈనాడు పరన గావి స్తూంటే, యిల్లాంటి పరమ సత్యములైన సిద్ధాంతాల మీద ప్రజ్వరిల్లిన భయంకర పోరాటాలను గూర్చిన స్పృహ మనసు కలుగనే కలుగదు! గణిత శాస్త్రంలోని సమకోణ త్రిభుజం యొక్క కర్ణమును గూర్చిన సిద్ధాంతమును పైథాగొరస్ వ్రాసేడా? అని పండితులు యిప్పుడు సందేహిస్తూన్నారు. * ప్రపంచం గోళాకారంగా ఉందనీ, విశ్వకేంద్రం భూమికాదనీ చెప్పేడని యీాయనకాపాదిస్తూన్న సిద్ధాంతాలూ యీాయ నవి కావని పండితులు విశ్వసిస్తూన్నారు. ఈ గొప్ప పరిశోధ నలు పైథాగొరస్ పండితునివి గాకపోవచ్చు. బహుశః యివి ఆయన శిష్యులైన పైథాగొరియనులవే కావచ్చు. ఏదేమైనా మానవ విజ్ఞాన చరిత్రలో వారు గావించిన ఘనమైనకృషీ, పరిశోధనలూ మరువరానివే!

---

* శుల్వ సూత్రములలోని యీా సిద్ధాంతము పడమటి దిశగా ప్రయాణం చేసిందని చారిత్రకులు చెప్పుతూన్నారు. — అనువాదకుడు.

ఒక్కొక్క వసంతమే గడుస్తూన్నకొద్దీ విజ్ఞానం మరింత శక్తివంతంగా పెరుగుతూ వచ్చింది. ప్రభువులూ, ప్రజలూ కూడ యీ విజ్ఞానాన్ని, శాస్త్రశక్తిని తమ పక్షానికి త్రిప్పు కుని, పోరాటసాధనంగా ఉపయోగించుకోవా లనుకొనేవారు. శాస్త్రాన్ని తమకు మిత్రుడుగా చేసుకోవాలనీ, మిత్రప్రయోజ నాన్ని స్వీకరించాలనీ ప్రతీవారూ తాపత్రయ పడేవాళ్లు! సనాతన విశ్వాసాల్నీ, పద్ధతుల్నీ రక్షించి, ఉద్ధరిస్తుందనే ఆశతో కొందరు శాస్త్రశిశువును పెంచి పోషించేవారు. క్రమంగా అది గండాలను గడిచి, చుట్టు గోడలను మించి అధిగ మించి, శక్తివంతంగా వృద్ధిబొందింది. పైథాగొరియనులు తమ పరిశోధనాంశాలను గుప్తంగా ఉంచ యత్నించేరు. అల్లాగే మరెందరో! కాని, యెంత బలిష్ఠమైన శిలా కుడ్యములూ కూడ విజ్ఞాన ప్రభలను కుంచించి, మూసిపెట్టజాలవని మరల మరల ఋజువవుతూ వచ్చింది!

పైథాగొరియనులు శాస్త్ర విజ్ఞానాన్ని తమ చెప్పుచేతల్లో ఉండే బానిసగా చేసుకో దలచిరి. కాని, శాస్త్రమే వారిని నెట్టివేసుకుని విక్రమించింది!

## మానవుల కాలోచించ నేర్పిన వృద్ధ తపస్వి

మానవసమాజ మతి విచిత్రమైనది.

ఒకప్పుడు జీవితస్రవంతి బహు మెల్లగా ప్రవహిస్తూంటుంది. అది యెటుప్రవహిస్తుందో కూడ చెప్పజాలనంత మందగతిలో

సాగుతూంటుం దన్నమాట! అప్పుడు ఒక రోజుకూ మరో రోజుకూ భేదమే కనబడదు. వారాలు, నెలలు గడుస్తూంటాయి. చెట్ల ఆకులు రాలుతూంటాయి. పంచాంగాల్లోంచి పుటలు జీర్ణమైపోతూంటాయి. ప్రతి నూతన హేమంతమూ గత హేమంతంవలెనే కానవస్తూంటుంది. ప్రతి నూతన వసంతంలోనూ గత వసంతపు దివ్యశోభలనే పులకిత తను మనములతో తిలకిస్తూంటాము. ఒక తరం వయసుతీరి, కాలగర్భంలో కలుస్తూంటే దానిస్థానాన్ని మరుచటితరం ఆక్రమిస్తూంటుంది. తాతలు, మనుమలను చూచి, తమ శైశవాన్ని గుర్తుకు దెచ్చుకుని ఆనందిస్తూంటారు. గృహాలు క్రమంగా పాతబడి శిథిలము లవుతూంటే మరల అట్లాంటివే కొత్తయిళ్ళు నిర్మించబడుతూంటాయి. ఈ నూతన గృహములలోని కొత్త తరం మానవుల జీవితాలు కూడా పాతయిండ్లలోని వెనుకటి జీవితాల్లాగే సాగిపోతూంటుంది. ప్రశాంతంగా సంవత్సరం తరువాత సంవత్సరం సాగిపోతూంటుంది.

తరువాత వున్నట్లుండి యెక్కడినుంచో ఒక పెనుతుపాను విరుచుకుపడి, దేశాలన్నింటినీ అల్లకల్లోలంచేస్తూ సాగుతుంది. తుపాను తగ్గేక తీరా తేరిపారజూస్తే, పాతజీవితపు ఆనవాలైనా కానరాకుండా మాయమైపోతుంది. అక్కడనుంచీ జీవిత స్రవంతి మెల్లగా చల్లగా ప్రవహించదు. ఉరవడితో సాగుతూ, దారిలో ప్రతీదాన్నీ తిరగద్రోస్తూ, సుడులు తిరుగుతూ వడి వడిగా విరుచుకుపడుతూ సాగుతుంది. ప్రతీదీ రోజురోజూ

మాత్రమేగాక గంటగంటకూ మారిపోతూంటాయి. ప్రవాహ
మార్గంలో తిరుగదీయబడని రాయి ఒక్కటీ మిగులదు. అం
తకు ముందు వేయేండ్లలోనూ కలిగిన మార్పుకంటె యిప్పుడు
నూరేండ్లలో అత్యధికమైన మార్పు కలుగుతుంది.

ఇరవైనాల్గువందలేండ్ల క్రితం సరిగ్గా యిల్లాంటి ఘట్టమే
మానవచరిత్రలో ఆవృత్తమైంది. పాతగోడలు, శతాబ్దాల
పాటు నిలచియున్న రాతిగోడలు కూలి పడిపో నారంభించేయి.
పాత ఆచార విచారాలు, పాత విశ్వాసాలు, పాత నియమ
నిబంధనలు నేలమట్టానికి కుప్పకూలిపో నారంభించేయి. ఇవన్నీ
దేవతలచేతనూ, మహర్షులచేతనూ యెల్లకాలాలకూ సరిపడు
నట్లు శాశ్వతంగా నిర్మించబడినాయని చెప్పుతూవచ్చినవే!
నిన్నటివరకూ నియమబద్ధమైనది నేడు నియమ విరుద్ధమై
పోతూంది. నిన్నటిమర్యాద నేడు అవమరియాదమై పోతూంది.
చెడ్డవి మంచివిగానూ, మంచివి చెడుగానూ మారిపోతూ
న్నాయి. నిన్నటివరకూ ఊరూపేరూ లేనివాళ్ళు నేడు హఠా
త్తుగా సంపన్నులు, అధికారధూర్వహులూ ఐపోతూన్నారు.
నిన్నటివరకు కొలువబడిన రాజవంశీకులు నేడు పరమ దరి
ద్రులూ, నిర్భాగ్యులూ ఐపోయేరు. నిన్నటి అనామకులు
నేడు గౌరవనీయులూ, నిన్నటి కీర్తివంతులు నేడు బికారులూ
కావడానికి కారణమేమిటి?

ఏమిజరిగింది? ఈ వైపరీత్యమేమిటి? ఈ చెడుకాలం
యిట్లే ఉంటుందా? లేక పూర్వులు గాంచిన మంచి
రోజులు మరల యెన్నటికైన యేతెంచునా?

జనులు అబోధోపహతులై వుండేవాళ్ళు. దీర్ఘదర్శులైన మహాత్ములూ, పండితులూ ఆ కాలంలో కూడ అక్కడక్కడ ఉండేవాళ్ళు. జను లీ పండితులను సందర్శించి, యిల్లాంటి ప్రశ్నలనే అడిగేవాళ్ళు. బోద్ధలైన ఆ మహాత్ములు, ఋషులు కూడ పలువిధాలుగా చెబుతూండేవాళ్ళు.

భావభేదం పండితులలో గాక పామరులలో ఉంటుందా? మతభేదం ఋషులలోగాక కులాసాపురుషుల్లో ఉంటుందా?

పైథాగొరస్ యీ జగత్తునందలి క్రమబద్ధతను గూర్చి, శతాబ్దాలుగా స్థాపితమైయున్న సువ్యవస్థను గూర్చి బోధించేడు. సనాతన వ్యవస్థనే పునఃస్థాపించాలన్నా డాయన.

సరే, మరొక పండితుని కూడ ప్రశ్నించుదాం. రండు, అడుగో! హెరాక్లితస్ పండితుడు. ఆయన మతమేమో తెలుసుకుందాం.

హెరాక్లితస్‌ను చూడాలంటే మనం కాకులుదూరని కీకారణ్యానికి బోవాలి. ప్రజలకు దూరంగా ఉండేటందుకై ఆయన అరణ్యంలో ఉండేవాడు. తనుపుట్టిన పట్టణం ఇఫిసస్‌ను వదలి, సుదూరంలోని పర్వతాలమీదికి వెళ్ళిపోయాడాతడు. ఆయన రాజకుటుంబానికి చెందినవాడు. మహాపండితుడు. మృగయాధిదేవతయైన ఆర్తెమిస్ ఆలయప్రాంతంలోనికి, సాగరతీరమందలి పర్వతశృంగములమీదికి వెళ్ళిపోయాడు, హెరాక్లితస్. రూక్షస్వరూపుడు, వృద్ధుడు నైన యీ మహర్షిని గూర్చి, ఆయనకు జనులంటే గల అసహ్యత, నిరసనను గూర్చి, ఎవరో పర

దేశాలూ, యాత్రీకులూ అప్పుడప్పుడు వచ్చి చెప్పిపోతూండే వాళ్ళు. అక్కడికి వెడితే అతడు తమ్ముకూడ చీవాట్లు పెడ తాడనీ, శపిస్తాడనీ అంతా భయపడేవాళ్లు. ఈ వికార స్వరూపుని నుంచి తామొక్క మంచిమాటనైన వినలేమని అనుకునే వారు. అందుచేత జనులాతనిని 'శోక హెరాక్లితస్' అని పిలిచేవాళ్లు. ఆయన చెప్పునది గ్రహించడంకూడ చాల కష్ట తరంగానే ఉండేది. డెల్ఫిలోని దివ్యవాణి చెప్పినట్లాయన గూఢఫణితిలో, వ్యంగ్యార్థవాక్యములనే పలికేవాడు! అందు వల్ల ఆయనకు 'నిగూఢ హెరాక్లితస్' అను మరొక పేరు కూడా వుండేది.

హెరాక్లితస్ కటురూక్ష స్వభావమునుగూర్చిన కథలకంటె ఆయన కీర్తిచంద్రికలే సర్వత్రా వ్యాపించినాయి. భయభక్తుల తోనే గానిండు, జనులాయనను చూడబోవువారు. భయకంపితులై వణకుతూ సమీపించినవాళ్ళతో ఆయన అనేవాడు:

"లోనికి రా! ఇక్కడా వున్నారులే, దేవతలు!"

జనులు ఆయనను సమీపించేవాళ్లు. సంభాషణ ఆరంభ మయ్యేది. ఇఫిసస్ పట్టణ వృత్తాంతాలు అడిగేవాడు, ఆ వృద్ధ తపస్వి. పట్టణ పౌరులమీద ఆయన కెంతమాత్రమూ సాను భూతి లేదు. వాళ్లు స్థాపించిన 'నూతన రాజ్యాంగపద్ధతి' ని ఆయన తూర్పారబట్టేవాడు. జనులందరూ సగర్వంగా చెప్పు కునే ఆ 'సమానత్వం' హెరాక్లితస్ తీవ్ర పరిహాసానికి పాత్ర మయ్యేది!

"జనులకి కొంచెమైనా బుద్ధిలేదే! అజ్ఞానులైన అలగా మూకచేత వాళ్లు పరిపాలించబడుతూన్నారు. లోకంలో అత్యధిక సంఖ్యాకులు చెడ్డవాళ్లుగానూ, మంచివాళ్లు అల్పసంఖ్యాకులుగానూ ఉంటారని వాళ్లు ఎరగరూ? నన్నుగనక అడిగితే సామాన్యజనం పదివేల మంది కంటె అధిక గుణాఢ్యు డొక్కడే మేలు. ఈ మూక తమలోని ఉత్తమపౌరులను తరిమేస్తున్నారు. 'మంచివాళ్ళను మాలో ఉండనీయము. అల్లాంటివాళ్లుంటే వెళ్ళిపోయి యెక్కడో అక్కడ బ్రతకమనండి. వాళ్ళు మాకు అక్కరలేదు!' అంటారు. పెద్దవాళ్ళందర్నీ చంపి పారేసి, చిన్న పిల్లలకి పట్టణాన్ని వదలిపెట్టం డంటాను. పిల్లలకే కాస్తంతైనా బుద్ధి వుంటుంది."

ఇల్లాంటి మాటలు విని దర్శనాగతులు భయభ్రాంతులై పోయేవాళ్ళు. తొందరగా యీ ప్రసంగాన్ని మార్చేసి, పూర్వకాలపు జనులు, వాళ్ళ పద్ధతులు గురించిన ప్రశంసను తెచ్చేవాళ్ళు. కాని, హెరాక్లితస్ సమకాలినులనే గాకుండా ప్రాచీనులనుకూడ అదేవిధంగా తిరస్కారం చేసేవాడు. ఆయన హోమర్ మహాకవినీ, హిసియద్‌నూ కూడ ఖండించేవాడు! 'హిసియద్ తానితరుల కంటె జ్ఞాని ననుకొనేవాడు. కాని. దినమూ రాత్రీ కూడా ఒకటే నని ఆతనికి తెలియదు!' అనేవాడు, హెరాక్లితస్.

హెరాక్లితస్ దేవుళ్ళనుకూడ తిరస్కరించేవాడు. పురోహితుల, రాజుల వంశీకుడైన యీతడు, ఆర్తెమిస్ దేవ్యా

లయప్రాంత నివాసియైన యీతడు, పురాతన దేవతలనే విశ్వ
సించకుండుటా? 'జనులు విగ్రహాలకు మొక్కుతారు. రాతి
గోడలతో మాట్లాడితే యింతకంటె మంచిది!' అనేవా
డాయన. తత్త్వవేత్తలనూ, పండితులనూ కూడ సామాన్య
జనులను ఖండించినట్లే యీయన ఖండించేవాడు. ఇతడు ఏమే
కొంచెమైనా సుముఖంగా మాట్లాడేది ఒక్క థేల్స్ పండితుణ్ణి
గూర్చే. పైథాగొరస్ నీయన మరింతగా ఖండించువాడు. "తన
కేదో కొన్ని శాస్త్రవిషయాలు తెలుసునని యితడు మహా తెలి
వైనవాణ్ణను కుంటూన్నాడు. ఆ రకమైన జ్ఞానంవల్ల ప్రయో
జనం శూన్యమే. లేకపోతే హిసియడ్, పైథాగొరస్, హికా
త్యూస్, క్షణోఫణిస్‌లు కొంచెమైన యుక్తాయుక్తవివేక
శూన్యు లెందుకయేరంటా?"

"ఐతే మేము యింకెవరివల్ల తెలుసుకోగలము?" అని
పృచ్ఛించేవాళ్ళు, దర్శనాగత జనులు.

"నా గురువులు కళ్లూ, చెవులూనే. మీ రేమైనా నేర్చుకో
దలచుకుంటే చుట్టూ ప్రతీదీ పరిశీలనగా చూస్తూ, వింటూ
వుండండి. ఏదైనా ధూమంగా మారిపోయినా మనం ముక్కుతో
దానిని పసిపట్టగలము. ప్రకృతి చెప్పేది వినడమేగాక బుద్ధితో
గ్రహిస్తూనూ ఉండాలి. అర్థంచేసుకోగల మెదడు గనక లేక
పోతే కళ్ళూ చెవులూ అంతగా ప్రయోజనకారులు గావు.
చెవులకంటె కండ్లు అధిక ప్రమాణశీలములైననూ మనం కేవ
లం వాటినే నమ్మడానికి వీలులేదు. ప్రకృతి ప్రతి విషయాన్నీ

నిగూఢంగా ఉంచాలనుకుంటుంది. దాని అంతరాంతరాల్లో మనం చొచ్చుకుపోయి, భేదించగలిగి వుండాలి. ప్రకృతి యొక్క శబ్దాలు వినండి, దృశ్యాలు కనండి. ఈ విశ్వము వలెనే ప్రకృతి కూడ అనంతమైనదని గుర్తుంచుకోండి. ఆత్మకుకూడా అవధులు లేవు. ఏ దిశకుచూచినా, ఎంతదూరంగాంచినా ఆత్మ కూడ అనంతమైన దే." ఈ రీతిగా ఆయన ధోరణి సాగి పోయేది.

దర్శనాగతులు బహుశ్రద్ధగా వినేవారు, ఆ తత్త్వవేత్త ప్రతి మాటనూ.

"మీ చుట్టూ పరికించిచూడండి. ప్రతీదీ కదలుతూనే ఉంటుంది, ప్రవహించుతూనే ఉంటుంది. నీవు ఒకేనదిలో రెండు సార్లు మునగ లేవు. ఒకసారి మునిగి లేచేసరికే అప్పుడే పాత నీరు పోయి, కొత్తనీరు ప్రవహిస్తూ వుంటుంది, నీ చుట్టూ. చివరకు సూర్యుడుకూడ యే రోజుకారోజు నూతనుడే. ఈ విసృష్టిలో శాంతి, విరామం అనేవి అసలు లేనే లేవు. ప్రతి చోటా పోరాటాలూ, యుద్ధాలూనే ఉన్నాయి. వీని వల్ల కొందరు స్వతంత్రులూ, మరికొందరు బానిసలుగా అవుతూ న్నారు. మహాకవి హోమర్ 'దేవతలూ, మర్త్యులూ తమ నిరంతర పోరాటాల్నే గనక మానుకుంటేనా!' అన్నాడు. కాని, యిదెంత అసంగతమైనది! ఆయన అన్నట్లే జరిగితే అంతా అదృశ్యమైపోతుంది. ఎందుచేత ? ఈ నిరంతర సంఘర్షణా పోరాటాలవల్లనే యీ ప్రపంచంలో ప్రతీదీ కనిపించడం మాయమవడం జరుగుతూంది. ఈవిసృష్టికి సంఘర్షణే కారణం.

ఒకదానికి మరణం మరోదానికి జీవం అవుతూంది. కట్టెలు కాలుతూంటే వాటికి వినాశనమున్నూ, అగ్నికి జీవమున్నూ అవుతూంది* అంతే."

నెగడిలో అగ్ని జాజ్వల్యమానంగా వెలుగుతూంది. ఆ వృద్ధ తత్త్వవేత్త ముఖం ఆ కాంతిలో ప్రకాశమానంగావుంది. ఆయన ఫాలభాగం మీది గాఢమైన ముడుదలనీ, నిష్ఠురంగా బిగించివున్న సన్నని పెదవుల్నీ, తెల్లనై ఉంగరాలు తిరిగివున్న గడ్డాన్నీ చూసి యెవరైనా భక్తిగౌరవాలు చూపాల్సిందే!

ద్రష్ట, తత్త్వజ్ఞుడు ఐన ఆ వృద్ధుడు ప్రసంగాన్ని కొనసాగించేవాడు :

"ఈ ప్రపంచం దేవునిచేతా సృజించబడలేదు, మానవునిచే అంతకంటెనూ సృష్టించబడలేదు. ఇది అనాదిగనే వుంటి, వుంటుంది. ఒక నిర్ణీతక్రమాన్ననుసరించి ప్రజ్వరిల్లుతూ, ఉపశమిస్తూ, తిరిగి ప్రజ్వరిల్లుతూండే ఒక మహాజ్యోతి వలెనే యీ ప్రకృతికూడా వుంటూంది. అగ్ని ప్రథమంలో సముద్రంగా మారింది. తరువాత వాయువుగానూ, ఆ పిమ్మట భూమిగానూ మారింది. ఆ తరువాత అంతా తిరిగి అగ్నిగా మారిపోయింది. ఇదే జనన మరణ క్రమం. ఈ విధంగా నిరంతరం సంఘర్షించే

* భారతీయ దర్శనములలోని సాంఖ్యములో యీ మాదిరి విచారధార, యిదే ఉదాహరణలతో సాగింది. న్యాయ వైశేషిక సాంఖ్య దర్శనముల లోని భావములే గ్రీకుతత్త్వవేత్తల దర్శనములలోనూ గానవస్తూంటుంది.

— అనువాదకుడు

భూతములు సృష్టిలో నియతి నేర్పరుస్తూన్నాయి. వీణె మాదిరిగా ఉందీ ప్రపంచం. వాయించే టప్పుడు మనం వీణె తంత్రులను బిగించడం, వదులుచేయడం జరుగుతూంటుంది. ఆ పట్టు బిగువుల్లోంచే శ్రుతి, స్థాయి యేర్పడుతూంది. మనకు గందరగోళంగా కనిపించేదానిలోనే నిజంగా క్రమబద్ధత ఉంది. ప్రకృతి నిజానికి అస్తవ్యస్తమైనదిగాక క్రమతగలదిగానేవుంది. ఈ సృష్టిలో ప్రతీదీ తప్పనిసరిగా, అవసర-చోదితమై, నియమబద్ధమై నడుస్తూంది.* వాటి అవసరమే ప్రాణుల్ని ఆహార సంపాదనకు పురిగొల్పి పంపుతూంది. సూర్యుడుకూడా తన నియమితగతిక్రమము నొక్క అడుగుతప్పి వెలుపలకు రాజాలడు........"

ఈసంభాషణ సాగుతూండగనే సూర్యుడు పశ్చిమాంభోధిని గ్రుంకులిడ బోతూన్నాడు. శ్రోతలంతా ఆ వృద్ధ ఋషిదగ్గర సెలవు తీసికొంటూరు. వచ్చిన ప్రతివాడూ తనతో కూడ ఒక అమూల్య బహుమానాన్ని గొనిపోతున్నారు. అది బంగారు కంటె మరి దేనికంటెనూ విలువైనది. క్రొత్తభావాలు, నూతన దృక్పథం అనేదే వారు గొంపోయే బహూకృతి. వారు అడిగీ అడుగకనే తమ ప్రశ్నలకు జవాబులు వచ్చేశాయి. వారి

---

* కర్మసూత్రబద్ధమై యావత్ప్రపంచమూ నడుస్తూందనే సిద్ధాంతమునే యీవివరణ ప్రతిపాదిస్తూంది. సృష్టిస్థితి లయముల కధిష్ఠానదేవతలైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులుకూడా కర్మబద్ధులేయనే భారతీయవేదాంత ప్రతిపాదిత సూత్రిమువంటిదిది. — అనువాదకుడు.

సంశయగ్రంథి ఛిన్నమైపోయింది. తమ పాత జీవితవిధానాన్ని, పాత ఆలోచనలను యింకను అంటిపెట్టుకుని ఉండడం వారికింక అసాధ్యం. వీరు సెలవుతీసికుని వెడుతూంటే మరికొందరు ఆయనకోసం వచ్చి చేరుతూన్నారు. వీరందరూ చిన్నపిల్లలు. వాళ్ళు కులాసాగా, యెంతో సందడిగా వున్నారు. రోజూ వా రాయనతో ఆడుకుంటూ పాడుకుంటూ కాలక్షేపంచేయ డానికి వస్తూంటారు. హెరాక్లితస్‌కు చిన్నపిల్లలంటే యెంతో ప్రేమ. పిల్లలే యీ ప్రపంచానికి ఆశాజ్యోతులనీ, అనం తత్వం వాళ్ళరూపంలో ప్రత్యక్షమవుతూందనీ, రేపటి పాల కులు బిడ్డలేయనీ ఆయన అంటూండేవాడు.

ఈ విధంగా ఆ అరణ్యాలలో, మానవ నివాసాలకు దూరంలో నూతన సిద్ధాంతమొకటి బోధించ బడుతూంది! ఇది పాత భావాల బూజును తొలగించాల్సివుంది. నిష్ఠరమై, వజ్రసన్నిభమైన 'అవసరము' (కర్మ) చేతనే ప్రపంచం పాలించ బడుతూంది. ప్రకృతి కంతకు శాసకుడైన యీ నూతన పాల కునికి యేమిపేరు పెట్టాలి? జ్యూస్ దేవేంద్రుడనే పిలుస్తే? అబ్బే! వద్దు! ఆ పాతపేర్లతో పిలుస్తే మళ్లా వెనకటి ఊహా పద్ధతే వస్తుంది, పాత దేవతలంతా మళ్ళా తయారవుతారు.

ఈ కొత్తశాసకుని పేరుకోసం హెరాక్లితస్ బుర్ర కాస్త బ్రా లాగ ఆలోచించేడు. తపస్సే చేశాడనుకోండి. ఎట్టకేలకు ఆయనకు రెండుపేర్లు తోచాయి. కాస్మోస్ అంటే విశ్వక్రమం అనేదొకటి, లోగోస్ అనగా శాసనం లేక శబ్దం అనేది రెండోది.

ఐతే యీ రెండుమాటలూ పాతవే. పాత శబ్దాలతో కొత్త భావాలను స్పష్టీకరించడం కష్టంగానేవుంది. కాని, తప్పదు, మరి. చివరకు లోగోస్ అనేదే తగిన మాట యని హెరాక్లితస్ నిశ్చయించేడు. ఎందుచేత? మానవుని తార్కిక జ్ఞానం యిప్పుడొక నిర్దిష్టదశకు చేరుకున్నది గనుకనూ, దానికి మానవుని తార్కికజ్ఞానమూ, ప్రకృతీ కూడ లోబడివున్నవి గనుకనూ. కార్యకారణసంబంధం లేనిదే యీ సృష్టిలో యేదీ లేదనీ, శబ్దాది జ్ఞానంతోనే దీని వివేచన సాధ్యమవుతూంది గనుకనూ. గ్రీకుల పురాణగాథ ఒకటివుంది. ప్రమిత్యూస్ స్వర్గాన్నుంచి అగ్నిని దొంగిలించి, దానిని కట్టెలో పెట్టి భూమిమీదికి రహస్యంగా గొనివచ్చి మానవుల కిచ్చేడని అది చెపుతూంది. అగ్నినిపొందిన మానవులు సంపద్వంతులై సుఖులై తన్ను ధిక్కరిస్తారనే జ్యూస్ భయం నిజమే ఐంది. మానవులు కొందరు ద్రోహులై దేవతలకు ప్రమిత్యూస్ సంగతి చెప్పేశారు. దేవేంద్రుడు జ్యూస్ ప్రమిత్యూస్‌ను కాకసస పర్వతముల్లో నొక శిఖరానికి బంధించి, రాబందులు పీక్కుతినేటట్లు శిక్షవిధించేడు. కాని ప్రమిత్యూస్ నిస్పృహా చెందలేదు, పశ్చాత్తాప పడలేదు. తాను గావించినది సరైనదే ననీ, జ్యూస్‌కు తగిన ప్రతీకారం జరిగి తీరుతుందనీ, యీ లోకంలో శాశ్వతమైనదేదీ లేదనీ, చివరకి దేవతలు కూడా శాశ్వతంగా ఉండలేరనీ అతనికి తెలుసును. జ్యూస్ దేవుడు సాగరదేవతను వివాహ మాడతాడనీ, వారికి పుట్టబోవు కుమారుడే తన

తండ్రిని దేవేంద్ర పదవీ భ్రష్టుణ్ణి చేస్తాడనీ ప్రమిత్యూస్‌కు తెలుసు! ఇదీ ప్రాచీన సాంప్రదాయిక గాథ.

ఇది పురాణగాథయే కాని దీనిలో సూచించబడిన భవిష్యత్ నిజమయేరోజు నిజంగానేవచ్చింది! సాగరతీరానవున్న మిలిథుస్, ఇఫిసస్ రేవుపట్టణాల సమీపంలోనే దేవేంద్రుని కూలద్రోసే శక్తి బైలుదేరి, దినదినాభివృద్ధి జెందుతూంది. ఆ శక్తియే 'లోగోస్' ఆ శక్తిని ఉపాసించువారే, పూజించువారే 'ఫిలాసఫర్స్.' ఈ మాటకు అర్థం 'విజ్ఞానోపాసకులు' అని. సృష్టిలోని కార్యకారణాన్వేషణగావించే తార్కికులే, శాబ్దికులే, శాసనకర్తలే వీరు. ప్రాచీన విశ్వాసాలను వీరు త్రోసిరాజనేకాలం వచ్చేసింది.

హెరాక్లితస్ తన భావములను లిఖిస్తూనే వున్నాడు, చర్మపట్టములమీద. వాటిని భద్రంగా ఆర్టెమిస్ దేవ్యాలయంలో ఉంచుతూన్నాడాయన. "దేవీ ఆలయంలోనే వీటిని ఉండనీ. అక్కడవుంటే పూజారుల్లో పండితులుమాత్రమే వాటిని చూడగలరు. సామాన్యజనులు వీటినిచూడకపోవడమేమంచిది. వాళ్ళు యివేనో పైశాచిక బోధన లనుకుంటారు! ఇవి ఎంత ప్రకాశవంతంగా ఉన్నా, అంధ తమస్సులోనికి ప్రోద్రోయునవే అనుకుంటారు, వాళ్లు. విజ్ఞాన నిలయములైన యివి సామాన్యజనులకు, అజ్ఞానులకు పనికిరావు. అసలు వాళ్ళు జ్ఞానంకోసం ప్రయత్నమే చేయరు! 'ఈ రాతకోతలు మనకెందుకురా? కూటికా గుడ్డకా!' అంటారు వాళ్ళు.

గాడిదలకువలెనే వాళ్లు కూడా బంగారంకంటే పచ్చిగడ్డంటేనే పడిచస్తారు."

హెరాక్లితస్ అనుకున్న ధోరణి, యిది!

"వాళ్ళు ప్రతీదాన్నీ మంచీ – చెడూ, వెలుగూ – చీకటీ, అంటూ రెండుగా విభజించి, వేరువేరుగా పెట్టెల్లో పెడతారు. అరలలో మూసిపెట్టి, విడిగా నిక్షేపాల్లా ఉంచుతారు. కాని, ఆ పద్ధతి సరైనదికాదు. సముద్రోదకం చేపలకు మంచిదే కాని మానవులకు సరిపడదని తెలుసునుగదా. బహు సుందరమైన కోతి కూడ మనిషితో పోలిస్తే అసహ్యంగానే ఉంటుంది. స్వతంత్రుని కేది స్వర్గమో, బానిసకదే నరకంగా ఉంటుంది. జను లీ విషయాలనింకా గ్రహించలేదు. వెలుతురనేదే గనుక లేనిచో చీకటి అనేది మనకు తెలియదని వాళ్ళు గ్రహించనే లేదు. అసత్యమే లేనియెడల సత్యమూ ఉండదు. రోగమే లేకపోతే ఆరోగ్యమంటే యేమిటో మనకు తెలియకనేపోవును. వృత్తపరిధిలో మొదలేమిటి? చివర యేమిటి? ఒకటి నశిస్తేనే మరొకటి జనిస్తుంది. అగ్ని ప్రశమనమే నీటికి జన్మనిస్తుంది. జలం నాశనమై ఆవిరి పుడుతూంది. మనం అస్తిత్వంలో ఉన్నాము – లేము! మనం అనుక్షణం మనంగాక మరొకరం అవుతూన్నాము!"

ఈ పంథాలో వితర్కించేడు. ఆ వృద్ధ వేదాంతి, హెరాక్లితస్. జన సామాన్యం తన భావ ధోరణి నర్థంచేసుకో లేరనీ ఆయన యెరుగును. సంకుచితమైన చిన్న యిరుకు ప్రపంచంలో

వాళ్లు పెరిగేసు, నివసిస్తూన్నారు. ప్రపంచం క్రమంగా విస్తృత మవుతూన్నా, చాలమంది బుద్ధులు మాత్రం యిదివరకటికి వలెనే చాల సంకుచితంగానే ఉండి పోయినాయి. తమ బుద్ధులకు పదును పెట్టుకోలేరు వాళ్లు. దేన్నైనా తమవైపునుంచే చూస్తారు గాని, మరొకవైపునుంచి చూస్తే యింకొకలా కనబడు తుందనీ, అల్లాగ చూడవచ్చుననీ వాళ్లు అనుకోరు. నీవు చెప్పేనదేదో తెలుసుకోజాలనివాళ్లముందర నువ్వు మాట్లాడి ప్రయోజన మేమి? అంతేగాదు, చాలమంది జనులకు పొట్టనింపు కొనుటెట్లా? అనేదే కాని మరియితరవిషయాలేవీ పట్టవు. మరి దేనియందూ వాళ్లకు శ్రద్ధలేనేలేదు. తమకు యిసుమంతా ప్రయోజనంలేని విషయాన్ని గురించి ఆలోచించి, బుర్ర పాడుచేసుకునేటందుకు వాళ్లకేం పట్టింది!

అందువల్ల యీ వృద్ధఋషి జనులమీద చిర్రు బుర్రుమంటూ విరుచుకుపడుతూండేవాడు. పైకి ఆయన మానవ ద్వేషిలా కనిపిస్తూన్నా, నిజానికి ఆ ఋషి మానవజాతి నమితంగా ప్రేమించేవాడే. ఎందుచేతనంటే, హెరాక్లితస్ తత్త్వాన్వేషణా, సత్యాన్వేషణా చేస్తూన్నాడంటే మానవాళికి గాక మరెవరికొరకు? ఈ భావం గ్రహించేందుకే జనానికి కొన్ని శతాబ్దాలు పడుతుంది. ఆతడు ఒక్కొక్క సమయంలో అనవసరంగానే పెట్టే చీవాట్లను సరకుజేయకండా, ఆయన సత్యాషిని మెచ్చి, బోధనలను గ్రహించి, శుభమును పొందేటందుకు యెన్నో శతాబ్దాలు పట్టవచ్చును.

## జయం లభించకముందే విజయోత్సవం !

శతాంధులు గోతకూలడం తప్పదు. దారిచూపుట కొక్క-
డైన దృష్టిగలవాడుండాలి. గ్రుడ్డివాళ్ళతోనే నిండివున్న యీ
లోకంలో కొంచెమైనా దృష్టిగలవాడు హెరాక్లితస్ విజ్ఞాని
ఉండేవాడు.

ఏ కొంచెమో దృష్టిగలవాళ్లు మరికొందరు కూడా ఉండే
వాళ్లు, ఆ కాలంలో గ్రీసులో. వాళ్ళు తత్త్వవేత్తలు, పండి
తులు. తమకాలంలో ఉండిన విజ్ఞానాన్నంతనీ తెలిసికొని
ఉండడమేగాక పీరు ప్రజానీకానికి జ్ఞానోద్బోధనలు గావిస్తూండే
వాళ్లు. ఆ మహాత్ములు తమ జీవితాలను జ్ఞాన ఆర్జనకూ,
బోధనకూ పూర్తిగా వినియోగం చేసేవాళ్ళు.

అట్టి లోకోత్తములైన తత్త్వదర్శులలో మరియొకడు ఎంపి
డోక్లిస్.

హెరాక్లితస్ వలెనే ఎంపిడోక్లిస్ కూడ రాజులైన పురో
హిత కుటుంబానికి చెందినవాడు. ఆయన తాతలు సిసిలీ
ద్వీపంలోని అగ్రిజెంటమ్ నగరాన్ని పాలించేవారు. అక్కడ
సాగరోపరిభాగాన, మహోన్నత పర్వతదుర్గ ప్రాసాదంలో
వారు కొలువుతీర్చియుంటూ, తమ శాసనముల నమలుపరు
స్తూండేవాళ్ళు. వారే రక్తారుణ వస్త్రధారులై రాజదండ
మును చేతబట్టుకొని, దేవతలకు పూజాదికములనూ నెరవేరు
స్తూండేవాళ్లు.

ఎంపిడోక్లీస్ యీదుర్గకుడ్యముల లోపలనే, రాజభోగముల మధ్యనే పుట్టి పెరిగేడు. కాని, అతడు పెద్దవాడైన తర్వాత రాజదండమును ధరించ నిరాకరించేడు. జనసామాన్యం వివిధ వృత్తులు చేసుకుంటూ, సందడిగా, దుర్గానికి వెలుపల దూరంగా నివసిస్తూండేవాళ్లు. కమ్మరి, కంచరి, వడ్రంగి, శిలాశిల్పి మొదలైన వృత్తిపనివాళ్ళ కర్మాగారాలు నిరంతరం ధ్వనులతో గడబిడగానే వుండేవి. రేవుల్లో పడవకూలీల గడబిడలు, బజారులో గుంపులుగూడిన జనుల గందరగోళం,—యివేవీ చేరని యెత్తైన రాతిగోడలు రాజప్రాసాదంచుట్టూ వుంటాయి. ఈ వివిక్త ప్రశాంతవాతావరణం ఎంపిడోక్లీస్‌కు యిష్టంగాఉండేది కాదు. రాజభవనంలో పరిపాలకులుకూడా కష్టజీవులుగానే, సాధారణంగానే ఉండాలని ఆయన అభిప్రాయం. నిజానికి రాజులకు ఉందనుకునే అధికారంకూడా ఆ నాటికి నామమాత్రమే. నిజమైన అధికారమంతా అప్పటికే కొద్దిమంది ధనికులైన వ్యాపారస్థుల కుటుంబాలచేతుల్లో పడిపోయింది.

పరమదాంభికులైన యీ వేషధారి రాజులంటే ఎంపిడోక్లీస్‌కి యిష్టం ఉండేదికాదు. పౌరులందరూ స్వేచ్ఛగా, సమానులై యుండాలని ఆయన వాదిస్తూండేవాడు. ఆయన ఊహలు నిజంగావడాన్ని ఎంపిడోక్లీస్ చూడనేనూలేడు. సుదీర్ఘ పోరాటాలు గావించి, ప్రజలు ప్రభువర్గాలమీద విజయంసాధించేరు. సాధించిన యీ విజయం ప్రజలు మళ్ళా పోగొట్టుకోకండా ఎంపిడోక్లీస్ జాగరూకతతో కనిపెట్టి సలహా

లిస్తూండేవాడు. ఎన్నుకోబడి అధికారంలోకివచ్చిన పెద్దలలో ఎవడో ఒకడు అధికారాన్నంతనూ చేజిక్కించుకుని, దుశ్శాసనుడు గాదలచినపుడు ఎంపిడోక్లిస్ అతడిని తీవ్రంగా విమర్శించేవాడు. అట్టి నిరంకుశుణ్ణీ, వాని సహకారుల్నీ కఠినంగా శిక్షించాలని ధాటీగా అడిగేవాడు.' ఇతరులకంటె గొప్పవాణ్ణనుకొనే వాళ్ళని ఎంపిడోక్లిస్ బహిరంగసభల్లోనే తూర్పారబట్టేవాడు.

ఆయన తన శక్తియుక్తు లన్నింటినీ ప్రజలకోసమే, వాళ్ళ పక్షాన్నే వినియోగించేవాడు.

ఆయననుగూర్చి చెప్పుకునే కథలెన్నో ఉన్నాయి. వాటిలో ఒకటి వినండి. ఒకప్పు డొక భయంకరవ్యాధి 'సెలినుంతా' నగరంలో వ్యాపించింది. దానికి కారణం నదిలోని నీరు అపరిశుద్ధంగా ఉండడమే. నదీజలాలను పరిశుద్ధమొనర్చడం ఎల్లాగ? ఎంపిడోక్లిస్ అందుకు పూని, సమీపంలోని మరో రెండు నదుల జలాలను యీ నదిలోకి మళ్ళించడానికి కృషిచేసేడు. ఆ ప్రవాహాలు కలియడంతో నీరు పరిశుద్ధమైంది. రోగం మాయమైపోయింది. సెలినుంతా నగరవాసులు వ్యాధి నిర్మూలమైనందుకు అపరిమితానందభరితులైరి. ఒకరోజున వారు నదీతీరాన చేరి, విందుగావించుకుంటూ, మహోత్సవానందంలో మునిగివున్నారు. ఆ సమయాన ఎంపిడోక్లిస్ మార్గవశాత్తూ అటు బోతూ, కంటబడగానే జనులాయన పాదాలపైబడి, దేవతను వలె పూజించేరట !

మరొక కథ వినండి, చెపుతా. ఒకసారి సముద్రంమీంది నుంచి యేదో పాడుగాలి వీచి, జనోపద్రవకరంగాఉంది. అది తోటలను నాశనం చేయడమేగాక తగిలినచోట్ల ప్రాణి జీవితాన్నే దుర్భరంగావిస్తూవచ్చింది. ఈ విషవాయువు నడ్డుకోడానికి ఎంపిడోక్లిస్ ఉపాయము లాలోచించేడు. గాడిద చర్మాలతో పెద్దపెద్ద తెరలు తయారుచేయించి, కొండమీందా గుట్టలమీందా వీటితో అడ్డుదడులు కట్టించేడు. వీటివల్ల తోటలు రక్షించబడినాయట! ఈ కథనే మరొకరీతిగానూ చెపుతారు. దక్షిణపుగాలివీచు లోయకు అడ్డుగా ఎంపిడోక్లిస్ పెద్దగోడ కట్టించేడనీ, ఆ రీతిగా నాశనకరమైన దక్షిణపుగాలిని అడ్డుకోగలిగేడనీ చెపుతారు. ఏదోఒకటి గావచ్చు. ఆతడు తోటల్ని రక్షించేటందుకై విషపుగాలిని అడ్డుకొట్టేడు. అప్పటి నుంచీ యీాయనను 'వాయువిజేత' అని పిలుస్తూవచ్చేరు.

ఎంపిడోక్లిస్ మృత్యువుతోనే పోరాడేడని కూడా చెపుతారు. ఆతడు పాతాళంలోని హేడ్స్ (నరకం) కు వెళ్ళి, అచ్చటి మృత్యుఛాయలను జయించి వచ్చేడట! బహుశః అది యిట్లు జరిగివుండవచ్చు: ఒక తీవ్రవ్యాధికి మృత్యులక్షణాలున్నాయి. రోగి మూర్ఛాగ్రస్తుడై చాలదినాలుండిపోతాడు. ఊపిరిపీల్చడం ఉండదు; గుండెకూడా నిలిచిపోతుంది. అగ్రిజెంటం నగరంలో ఒకస్త్రీకి యీవ్యాధి సోకింది. ఊపిరికూడ పీల్చకండా ఆమె ముప్పది దినాలు పడివుంది. ఎంపిడోక్లిస్ ఆమెను బ్రతికించేడు.

ఆతడొక పట్టణాన్నుంచి మరొక పట్టణానికి ప్రయాణాలు చేస్తూంటే ప్రజలు తండోపతండాలుగా ఆయనను చూడవచ్చే వాళ్ళు. రోగాలకు నివారణోపాయాలు చెప్పమనీ, సత్యపథాన్ని బోధించమనీ, యింకేదో చెప్పమనీ రకరకాలుగా ఆయనను ప్రార్థిస్తూండేవాళ్ళు, ప్రజలు.

ఎంపిడోక్లిస్ రాజోచితమైన దుస్తులు ధరించేవాడు. రక్తారుణమైన అంగీ తొడిగి, బంగారు మొలదట్టీ పెట్టుకునేవాడు. తామ్రమ పాదరక్షలు ధరించి, పుష్పదామమును తలపై అలంకరించుకునేవాడు!

ఆయన తన కాలంలో ఒక మహానాయకుడు. శూరులు, సాహసులే గాక తాడిత పీడిత జనులెందరో రకరకాలవాళ్ళు ఆయనచుట్టూ చేరేవాళ్లు. బాధితులకు సాయంచెయ్యడానికి ఆయన సర్వదా సంసిద్ధుడే. అగ్రిజెంటం నగరంలో రాజభవనం అక్రోపోలిస్ అని పిలువబడుతుంది. అందులో రాజసభా భవనం, అనేక సౌధాలూ వున్నాయి. స్వర్ణమందిరం అనబడే దానిలోనే రాజకుటుంబీకులు నివసిస్తూండేవాళ్లు. కాని ఎంపిడోక్లిస్ మాత్రం ఎప్పుడూ అందులో ఉండేవాడుగాదు. పేదసాదల కుటీరప్రాంగణంలోనూ, పట్టణంచివరి మురికిపేటల్లోనూ, బురదవీధుల్లోనూ ఆయన కనిపిస్తాడు.

పూర్వులవలెనే ఆతడుకూడ విజయలక్ష్మీ విభాసితుడే. కాని పూర్వులు ఖేలనారంగంలోనూ, క్రీడాపరీక్షల్లోనూ, హిపోడ్రోమ్‌లోని గుర్రపు పందెములలోనూ, రథచోదనం

లోనూ విజయలక్ష్మిని చేపట్టేవారు. లేదా శత్రు రక్తక్షాళిత యుద్ధభూమిపైన విజయులుగా నిలబడేవాళ్ళు. ఎంపిడోక్లిస్ కేవలమూ క్షాత్ర క్రీడలలోగాక మానవాతీతంగా కనబడే మేధో విజ్ఞానసంపదచే ప్రకృతిశక్తులమీదనే విజయాన్ని సాధించేడు! తుపానులు, సుడిగాడ్పులు, నదీప్రవాహాలు, అదృశ్య రోగక్రిములు, అజ్ఞాత మృత్యుశక్తి,—వీటిపైన ఎంపిడోక్లిస్ పోరాటంసాగించి, విజయలక్ష్మిని చేపట్టినది! జనులకాయన మానవమాత్రుడుగా గాక దైవసమానుడుగానే కాన్పించేవాడు. లోకంలోని సమస్త శక్తులకంటెనూ జ్ఞానశక్తి, కార్యకారణ వివేచననిచ్చు తార్కికశక్తియే అత్యధిక శక్తివంతమైనదని ఆయన ఎరుగును. ఐతే, తన జ్ఞానాధిక్యతను, పాండితీగరిమను చూచుకొని ఆయన గర్వమును చెందలేదు. "అడుగడుగునకూ దుఃఖ దారిద్ర్య వినాశములతో సతమతమైపోతూన్న యీ దురదృష్టవంతులైన మానవులకంటె అధికుడనై యున్నందుకు నేను ఆనందించజాలను. నా ఆధిక్యత అందులో లేదని నా విశ్వాసము." అనేవాడు ఆయన.

ఆతడు ఋషితుల్యుడు, పండితుడు, కవి, ద్రష్ట. అతడెన్నో కావ్యాలను, గ్రంథాలను రచించేడు.

ఆయన తన తెలివిని దాచుకోలేదు. తనకైయే దానినుపయోగించుకోనూలేదు. సమస్త జనులకొరకూ తన విజ్ఞానాన్నుపయోగిస్తూ, అందరి కష్టసుఖాల్లోనూ తోడునీడగా నిలుచునేవాడు.

ఆతడు పడుచుదనంలో పైథాగొరియను సమితిలోంచి వెళ్ళ గొట్టబడ్డాడనుకునేవారు. వారి రహస్యాలను కొన్నింటిని వెల్ల డించేడనే ఆయనను వాళ్ళు బహిష్కరించేరనుకుంటారు.

ఆయన అనేవాడు: "జనుల బుర్రల్లోకి కొత్తభావాల్ని యెక్కించడం బహు కష్టమైనది."

కాని, ఆ ప్రయత్నంమాత్రం ఆయన విరమించలేదు. జన సామాన్యంలో వుంటూ, వాళ్ళకి బోధగావించడానికే నిరంతరం కృషిచేస్తూ, శాస్త్రవిజ్ఞానవ్యాప్తికి పాటుపడుతూండేవాడు.

ఆతడు బోధించేది యేమిటి?

జ్ఞానులైన థేల్స్, అనక్షిమందిర్, అనక్షిమినిస్, హెరా క్లితస్ మొదలైనవారి బోధనలనే ఎంపిడోక్లిస్ కొనసాగించే వాడు.

"సృష్టికంతకీ మూలమైన పదార్థాలు నాలుగు. ఆ నాలుగు మూలభూతములనుంచే మిగిలిన సర్వమున్నూ జనించినాయి. నిప్పు, నీరు, నేల, గాలి,—యివే ఆ నాలుగూ. వీటి కలయిక, విడిపోడంవల్లనే అన్ని వస్తువులూ పుట్టడం, గిట్టడం జరుగు తూంది. సంయోగం ఉత్పత్తికీ, వియోగం నాశనానికీ కారణ మవుతూన్నాయి.* భూత వర్తమాన భవిష్యద్వస్తు విషయాదు

* వైశేషికదర్శనంలో కణాదమహర్షి చెప్పిన సిద్ధాంతాలను బోలినవివి.
పరమాణులక్షణానిత్యా / కార్యలక్షణాత్వనిత్యా /
ద్రవ్య గుణ కర్మ ధర్మ విశేష సమవాయము లనే ఆరు పదార్థములను చెప్పుటచే వీరిని షట్పదార్థవాదు లనెదరు. గ్రీకు తత్త్వవేత్తల బోధనల కును, భారతీయ దర్శనాలకును యెంతో సామ్యం కనపడుతుంది. —అను

లన్నీ యీ విధంగా జన్మించినవే. లోకంలో నశించున దేదీ లేదు. ఏదీ నాశంజెందదు, యేదీ కొత్తగా సృష్టించనూ బడదు. జనులు జనన మరణా లనేవి సంయోగ వియోగాలు గాక మరేవీగావు."

"సృష్టి యెప్పుడూ యిల్లాగే వుంటూంది. అనేకత్వంలో నుంచి యేకత్వమున్నూ, మళ్ళా యీ యేకత్వం విచ్ఛిత్తి నొంది అనేకత్వంక్రింద చెదరిపోవడమున్నూ జరుగుతూంది. దేదీప్యమానమైన వెలుగు సూర్యబింబంలేని కాల మొకటి ఉంటూండేది. తరులతా గుల్మాదులతో గూడిన యీ పృథ్వీ గాని, తరంగాఘాత సంకులమైన విశాలసాగరం గాని అస్తిత్వంలోకి రానికాలం ఒకటి ఉండేది. ద్వేషం లేక వైముఖ్యం వల్లనే ప్రతీదీ ఒకదాని కొకటి దూరదూరంగా పోతూన్నాయి. వస్తు విషయాదులను కలిపివుంచేశక్తి, సంయోగశక్తి,— దీనినే రాగము లేక బంధమూ అంటారు,—అప్పుడసు లేనేలేదు."

"రాగం నిరంతరమూ ద్వేషంతో పోరాడుతూనేవుంటుంది. విడివిడిగావున్న భూతాలను యీ రాగమే కలిపి, పదార్థసృష్టి గావిస్తూంది. చిత్రకారుడు తన రంగులతో యావత్ప్రపంచాన్నీ, చెట్లు చేపలు పిట్టలు జంతువులు మనుష్యులతో సహా యీ ప్రకృతినంతనీ సృష్టించినట్లే యీ రాగంకూడా సృష్టిస్తూందన్నమాట. ప్రజ్వలించే సూర్యగోళమున్నూ, సూర్యకిరణాలను ప్రతిబింబించే చల్లని, తెల్లని చంద్రగోళమున్నూ అస్తిత్వంలోనికి వచ్చిన విధానమున్నూ యిట్టిదే. మహాదా

కాశమూ, భూమిపై వ్యాపించియున్న మహాసముద్రాలున్నూ యిట్టి జననప్రకారంగలవే. నాలుగుభూతాల కలయికవల్లనే సమస్త జీవకోటులున్నూ పుట్టినాయి. ప్రప్రథమంలో శరీరాలు లేని శిరస్సులు కోటానుకోట్లుగా ఉండేవి. అట్లే కాళ్ళూ, చేతులూ మొదలైన అంగాలుకూడా విడివిడిగా చెల్లాచెదురుగా పడి వుంటూండేవి. తరువాత యీ వివిధావయవాల విచిత్ర సంయోగరూపాలు, విస్తారపు ప్రాణులు బైలుదేరినాయి. మానవ శరీరాలమీద వృషభ శిరస్సులు, మేష శరీరాలపై నరశిరస్సులు,—యిదేరకంగా కలుసుకుంటూ వచ్చినాయి. కాని, అటువంటిభయంకర ప్రాణులన్నీ నశిస్తూవచ్చేయి. జీవనయోగ్యమైన ప్రాణులుమాత్రమే మిగిలినాయి".

"ఇటుకలు మొదలగువాటితో యింటిని కట్టినట్లే వివిధ భూతాలతో యీ ప్రపంచం నిర్మించబడింది. రాగమే యీ భూతాలను దగ్గరకు తెచ్చింది. మళ్ళా ద్వేషం విజృంభించి, ప్రేమను జయించేకాలం వస్తుంది. అప్పుడు భూతాలన్నీ విడిపోతాయి. జగన్నిర్మాణమంతా చెదాయదలై చెదరిపోతుంది దప్పుడు. మరలఅంతా మొదటినుంచీ ప్రారంభించాల్సివస్తుంది. ఈ విధంగా సృష్టి లయములతో గూడిన యీ కార్యం అనంతంగా సాగిపోతూంటుంది. ఒకప్పుడు రాగం లేక ఆకర్షణ భూతాల్ని కలుపుతూంటుంది; మరొకప్పుడు ద్వేషం వాటిని నలుముఖాలకూ చెదరగొట్టేస్తుంది."

జనులు ఎంపిడోక్లిస్ బోధనలు వింటూండేవాళ్లు. కాని, వాళ్ళకి ఆయన భావాలు పూర్తిగా గ్రహించేశక్తి లేదు. భావాలు శరపరంపరగా బాణాల్లా యెగిరిపోతూంటే వాటిని అందుకోనగలవారెవ్వరు? ప్రజలు చాలకాలాన్నుంచీ దేవతలే యీ భూమినీ, స్వర్గాన్నీ, యిందులో వున్న సమస్తమునూ, సర్వ ప్రాణికోటినీ సృష్టించేరని భావిస్తూ వచ్చేరు. కాని దేవతల యిచ్ఛామాత్రంచేతనే సృష్టి జనించలేదనీ, నాలుగు భూతాల కలయికవల్లనే యిదంతా యేర్పడిందనీ ఎంపిడోక్లిస్ చెప్పేడు. సృష్టి సర్వమూ కూడా ఒక అనుల్లంఘనీయ అవసరం * వల్లనే జరుగుతూందని ఆయన వాదన.

ఎంపిడోక్లిస్ చనిపోయాకకూడ ఆయన చనిపోయినాడని జనులు విశ్వసించేవాళ్లుగారు! అగ్రిజెంటంలో ఆయన అవసాన దశనుగూర్చి జనులు యిల్లా అనుకునేవారు: ఒకనాటి సాయంకాలం ఎంపిడోక్లిస్ మిత్రులతో కలిసి బల్లదగ్గరకూర్చుని వున్నారు. హఠాత్తుగా ఆకాశపథాన మిరుమిట్లుగొల్పే వెలుతురూ, కాగడాల వెలుగులూ కానవచ్చేయి. ఏదో గంభీర మేఘనిర్ఘోషం యెలుగెత్తి ఎంపిడోక్లిస్‌ను పిలిచినట్లయింది. తర్వాత మళ్ళా అంతా అంధకారమైపోయింది, నిశ్శబ్దం ఆవరించింది. చూస్తే ఎంపిడోక్లిస్ జాడేలేదు! అందువల్ల ఆయన

---

* పాశ్చాత్యులు necessity అనగా అవసరం అని చెప్పేది మన తత్త్వశాస్త్రాల్లో, మన పరిభాషలో 'కర్మ' అని తాత్పర్యార్థం. తప్పిపోరానిది, విధి అని దీని అర్థం. — అనువాదకుడు.

దివ్యుడని అంతా అనుమానించేరు. ఆయనకు నైవేద్యాదు లొసగి, ప్రార్థనలు చేయాలనీ, దేవతల నారాధించిన ట్లారా ధించాలనీ అందరూ భావిస్తూ వచ్చారు.

మరోకథ కూడా చెపుతారు. తన కనసానసమయమాసన్న మైనదని తెలిసికొని, ఆయన ఎట్నా అగ్నిపర్వత బిలంలో దూకి భస్మీభూతుడైనాడని ఆ కథ. ఆ అగ్నిపర్వతం ఎంపి డోక్లిస్ తామ్రపాదుకల్లో నొకదాన్ని బైటికి విసిరివేయడం వల్ల యీ ప్రవాదం బైలుదేరింది.

కాని, నిజంగా జరిగిందేమిటి ? ఎంపిడోక్లిస్‌ను దేశభ్రష్టుణ్ణి గావించేరు. ఆయన పరదేశాల్లో మరణించేరు. కులీన ప్రభు వర్గాలవాళ్ళు దేశంలో అధికారాన్ని తిరిగి చేజిక్కించుకొని, జనుల భుజాలమీద మళ్ళా భారాన్ని మోపేరు. ఎంపిడోక్లిస్‌ను నగరాన్నుంచి బహిష్కరించేరు. చెట్టుచేమలు లేని పిలోపాన్ని సస్ పర్వతాల్లో, బర్బర జనులమధ్య ఆయన తన జీవితశేషం గడిపాడు.

అవసానదశలో ఎంపిడోక్లిస్ కొన్ని విషాద గీతములు నాల పించినట్లు తెలుస్తూంది. "అంతటి గౌరవభాజనుడనై, మహా భోగముల ననుభవించిన నేను యీనాడు యీ మరు భూముల్లో, పాడునక్షత్ర ప్రభావంక్రింద మృత్యుఛాయల్లో పరి భ్రమిస్తూన్నాను. దురదృష్టవంతమైన యీ భూమియందలి దారుణహత్యలు, భయంకర వ్యాధులు, దురంత దుఃఖాలు చూస్తూకూడా నిస్సహాయుడనై విలపించవలసివచ్చిందిగదా !"

మానవులను పీడించే దుఃఖాలూ, పీడలూ, రోగాలూ శాశ్వతంగా పారద్రోలగల ననుకొన్న దినాల్లో యీ వాయు విజేత, నదీశాసకుడు, మృత్యుంజయుడు యెంత ఉత్సాహిమై, సుఖియై ఉండేవాడు! జనుల కెన్నెన్ని సుఖమయకల్పనలను, వాగ్దానాలను గావించేడు! ఎంపిడోక్లిస్ అనేవాడు: "ఈ లోకంలోని అన్ని రోగాలకూ, వార్ధక్యానికీ కూడా మందులు ఉన్నాయి. మీరే వాటినన్నింటినీ తెలుసుకుంటారు. వాటిని గురించి నేనే మీకు చెప్తాను. వాతావరణమును మీ అవసరాలకు సరిపడేటట్లు మార్చుకునే విధానాల్ని గూర్చి కూడా మీకు నే చెప్తాను. అనావృష్టి భయనివారణకూ, నీటి వనరు లేర్పాటుచేయడానికీ హేడ్స్ (పాతాళం) నుంచి మృతులను పునరుజ్జీవింపచేయడానికీ కూడా కావలసిన విజ్ఞానాన్ని మీకు నేను అందిస్తాను." ఒక మహాకవి, ద్రష్ట, జ్ఞాన దృష్టితో ప్రకృతిపై మానవుడు సాధించబోవు విజయాన్ని ముందుగనే చూచి, ప్రజలకు బోధించేడు. ఆ రోజు అతి సమీపంలోనే వుందనికూడా ఆయన అన్నారు.

ఒలింపియా క్రీడలలో విజయులైనవారు శిరస్సులపై పొన్న పూదండలను ధరించే ఆచారం ఉంది. ఎంపిడోక్లిస్ శిరస్సుపై ధరించిన పూలదండ దేన్ని సూచిస్తుంది? ప్రజలాతనికి సాగిల బడి మ్రొక్కేవాళ్ళు, దేవతలకివలెనే, ఆయన విజయోత్సవం గావించుకోనేటందుకు సమయ మాసన్నం కాలేదు. కాని, తలమీద పూలమాల ధరించే తిరిగేవా డాయన! విజ్ఞాన విజ

యం అంత దగ్గర్లో ఉందనుకోడంలో తాను పొరబడ్డానని ఆ మహాత్ముడు కడపటిదినాల్లో, దుఃఖమయకాలంలో మాత్రమే తెలుసుకున్నాడు.

ఆయన మరణసమయంలో నిష్ఠురవచనములు పలికేరు : "ఓ మర్త్యులారా ! అసుఖులారా ! మీకు దుఃఖమే గతి ! దుర్భరప్రసవవేదనలలో నుంచి, మూలుగులలోనుంచి కాదా మీరు జన్మించినది ?"

పాతకొత్తల సంఘర్షణలో, పోరాటంలోనే ఎంపిడోక్లిస్ బోధనలు జనించినాయి. ఈ సంఘర్షణ ఆయన మనస్సులోనూ, ఆయన జన్మించిన అగ్రిజెంటంలోనూ మాత్రమే గాదు. గ్రీసు దేశమంతటనూ కూడ యీ సంఘర్షణ ప్రసర్తిల్లింది. నూతనమైన తార్కిక విజ్ఞానం, పాతదైన పాషండభావాలు, చీకటివిద్యలు కలిసేవుండాయి, ఆయన గ్రంథాల్లో. 'ప్రకృతినిగూర్చి' అనే ఒక కావ్యాన్ని ఆతడు విజ్ఞానదేవతకు అంకితమిచ్చేడు. 'పరిశుద్ధీకరణ' అనే గ్రంథాన్ని 'మంత్రతంత్ర విద్య'కు అంకితంగావించేడు. ఆయన దేవతలను నిరాకరించేడు. కాని, ఆయన గీతాల్లో జ్యూస్, హీరా మొదలైన దేవతా నామధేయాలు వస్తూనేవుంటాయి ! నాలుగు మూలభూతములకున్నూ ఆయన దేవతల పేర్లను ఉంచేడు !

పంచ జ్ఞానేంద్రియాలు, వాటి సహకారియైన మనస్సూ చేత గ్రహించదగిన యీ ప్రపంచం యదార్థమైనదిగానే విజ్ఞానియైన ఎంపిడోక్లిస్ విశ్వసించేవాడు. కాని, ఆత్మకు

స్థానం మరొక ఉత్తమలోకంలో ఉందని నిర్వచించినపుడు యీతడుకూడా పైథాగొరస్ పండితునివలెనే శాస్త్ర నియమాలను, కార్యకారణవివేచననూ ఉల్లంఘించేడు. ఈ లోకం దుఃఖకరమైన పరాయి దేశమనిన్నీ, ఆత్మలు ( జీవులు ? ) గత జన్మలో గావించిన పాపములకు ఫలము ననుభవించి, ప్రాయశ్చిత్తము గావించుకోడానికే యిందులోనికి వచ్చి జన్మముల నొందుతూన్నాయని యీాయనకూడ అన్నారు. ఇది విజ్ఞాన దృష్టికి అనుగుణ్యమైనదిగాదు గదా.

ఏవంవిధ గుణగణ చరిత్రుడు, బోధకుడూ ఎంపిడోక్లిస్! పాతకొత్తల సంఘర్షణ యీాయనలో స్పష్టంగా కనిపిస్తుంది. పురోహిత ప్రభుకుటుంబీకుడై వుండిన్నీ తన వర్గానికి అమిత్రుడై సంచరించేడు. మంత్రవాదియై యుండిన్నీ విజ్ఞానియైనాడు. పైథాగొరస్ శిష్యుడై యుండిన్ని థాలిస్, హెరాక్లితస్ లకు అనుయాయియై యున్నాడు.

దేవతలు మానవులకంటె సర్వవిధాలా అధికులైనట్లే * ఎంపిడోక్లిస్ తోటి జనులందరికంటె మిన్నయైనవాడని ఆయన సమకాలీనులే అనుకుంటూండేవాళ్ళు. కాని, ఆతడు కూడ మానవమాత్రుడే. విశ్వాసములకూ విజ్ఞానమునకూ సంఘర్షణ

---

* *దేవర్షీణాం శరీరం ధర్మవిశేష సహితేభ్యో అణుభ్యోజాయతే.*

*వైశేషికదర్శనం ప్రశస్తపాదభాష్యం. అ 4 ఆ 2-7-10 సూత్రం.*

భారతీయులలో ప్రథమవిజ్ఞానియని పేర్వడసిన కణాదమహర్షి అనేక శాస్త్రీయ భావములనూ, ఊహలనూకూడ తన దర్శనములో చేర్చియున్నారు.

— అనువాదకుడు.

పెచ్చుపెరిగిపోయిన దశలో, ఆ నాటి పరిస్థితుల ఫలరూపమే ఎంపిడోక్లీస్. విజ్ఞానశాస్త్రమా? మంత్ర విద్యయా? ఏది కావాలి? ఈ ప్రశ్నకాతను నిర్దిష్టంగా జవాబు చెప్పనే లేదు; తను నిశ్చయం గావించుకోనూ లేదు. కాని, మన మాయనను విజ్ఞానిగనే జ్ఞాపకం ఉంచుకుంటాము. ఎందుచేత? సుదూరస్థమైవున్న సత్యమువైపున కొక్క తప్పటడుగైనా వేయగలిగేడు గనుక. లోకంలో సమస్తమూ నాలుగు భూతాలనుంచే జనించిందనిన్నీ, మళ్లీ అంతా ఆ నాలుగుగానే విభజింపబడుననిన్నీ చెప్పి, ఆతడు విజ్ఞానసౌధపు పునాదులలో మూలశిలను స్థాపించేడు గనుక!

# తృతీయ మండలం

## జయాపజయములు

### యాత్రికుడు హెరొడోటస్‌తో పోయి నావికుల కథలను పాఠకుడు వింటాడు.

క్రీస్తు పూర్వపు దేశపటములు గనుక చూస్తే, ఆ నాటి గ్రీకు తత్త్వవేత్తలు, విజ్ఞానవేత్తలు జన్మించిన పట్టణాలు యెంతంత దగ్గరలో వున్నాయో తెలుస్తుంది.

మిలిథుస్ రేవుకు దగ్గరలోనే హాలికార్నసుస్ వుంది. ఇక్కడనే చరిత్రకారుడు, పండితుడు నైన హెరొడోటస్ జన్మించేడు. దాని వెంబడినే వుంది, సామోస్ ద్వీపం. అక్కడే పైథాగొరస్ జన్మించేరు. సామోస్‌కు సమీపంలోనే, అఖాతమున కావలిప్రక్క ఇఫిసూస్ ఉంది. అక్కడే, ఆర్తెమిస్ దేవతాలయారామంలోనే హెరాక్లితస్ నివసించేవాడు. ఇఫిసూస్ నుంచి మూడుగంటల ప్రయాణంలోనే కొలోఫోన్ ఉంది. పరభూములన్నీ పరిభ్రమించే చారణుడు, కవి క్షణోఫణిస్ జన్మస్థానమియ్యదే. కొలోఫోన్‌కు సమీపంలోనే క్లజోమిని నగరం ఉంది. తత్త్వవేత్త, మహాత్ముడు నగు అనక్షగోరస్ ఉనికిచే పవిత్రమైన నగరమిది.

ఈ మహాజనులంతా కూడ సమకాలీనులే. థాలిస్, అనక్షిమందిర్‌ల యౌవనకాలమంతా గ్రీస్తు పూర్వం 6 వ శతాబ్దం

ప్రారంభంలోనే. అనక్షిమందిర్ శిష్యుడు అనక్షిమినిస్. అనక్షిమినిస్, పైథాగొరస్ లిరువురూ థాలిస్‌కు మనుమలు గాదగుదురు. వీరందరూ క్రీస్తుపూర్వం ఆరవ శతాబ్దిలోనివారే. మనం చూచిన వృద్ధమహర్షి హెరాక్లితస్ పసితనంలోనే పైథాగొరస్ ముసలిపండు. అప్పట్లో అనక్షగోరస్, హెరొడోటస్ లింకనూ చిఱుతవారు. వీరు క్రీస్తుపూర్వం 5 వ శతాబ్ది లోని వారు.

ఈ మహాపురుషులందరూ నీ పృథుగోళంమీద నొక చిన్న దేశంలో, కొద్ది కాలవ్యవధిలో జీవించిఉండిరి. కాని, ఆ చిన్న దేశానికీ, ఆ అల్పకాలానికీ వీరు మహత్తరమైన కీర్తిని తెచ్చేరు.

ఇక్కడనే విజ్ఞానశాస్త్రం బైలుదేరింది. రెండు శతాబ్దాల సంధికాలంలో, బహుదేశాల కూడలి ప్రదేశంలో, వేర్వేరు ఆచారాలూ, విశ్వాసాలూ ఒకదానినొకటి ఒరసికొన్నాయి, సంఘర్షించినాయి. ఆ నాడు ఆ ప్రదేశంలో సరకులేగాక భావాలుకూడా మారకం చేసుకున్నారు, ప్రజలు. కానైతే, అది యెంతో కష్టకాలం! మానవునికి పరీక్షాకాలం!

తూర్పునుంచి జనులు గుంపులుగా వచ్చి దేశంతర్వాత దేశాన్ని ఆక్రమిస్తూన్న కాలం అది. 5—6 శతాబ్దాల కూడలి కాలంలోనే 'రాజరాజు' పర్షియన్ చక్రవర్తి దండెత్తి వచ్చి, ఆసియా మైనరునంతనూ యుద్ధజ్వాలల్లో ముంచెత్తేడు. ఆక్ర మణ సైన్యాలకు ఒక్కొక్కనగరమే వశమైపోతూంది. అయో

నియను నగరాలనూ, వాటి వలస ప్రాంతాలనూ కలిపే సాగర మార్గాలు శత్రువుల వశమైపోయినాయి. పర్షియనుల మిత్రులైన ఫొనీషియనులు గ్రీకుల నగరాలను ఆక్రమించి పాలించ దొడగిరి. మర్త్యులలో అతి అదృష్టవంతుడని భావించబడిన పోలిక్రేట్స్ పర్షియనుల చేతులలోపడి దుర్మరణమునొందెను. బానిసనువలె వారాతనిని శిలువపై కొట్టి చంపేసేరు. పర్షియను దండయాత్రలను నిలువరించాలని మిలిథుస్ కొంత ప్రయత్నించింది. కాని, ఆ ప్రయత్నాలను మొదట్లోనే పసికట్టి, అందులోని వాళ్ళందరినీ పర్షియనులు దారుణశిక్షలకు గురిచేశారు. తిరుగుబాటు అణిచివేయబడింది. మిలిథుస్ నేలమట్టం గావించబడింది.

ఆక్రమిత ప్రాంతాలనుంచి కాందిశీకులు తండోపతండాలుగా పశ్చిమాభిముఖులై తరలిపోతూన్నారు. ఏథెన్సుకు కొందరు, సిసిలీద్వీపానికి కొందరూ, యింకా యితర దేశాలకు కొందరూ పారిపోతూన్నారు. ఆ కాందిశీకులలో పండితులూ, శాస్త్రవేత్తలూ కూడా ఉన్నారు. వీరు తమతోకూడ వ్రాత ప్రతులనూ, పటాలనూ, ప్లానులనూ కూడ తీసికొనిపోతూన్నారు. అన్నిటికంటె ముఖ్యం అమూల్యమైన విజ్ఞానమునే వీరు తాము పోయిన చోట్లకల్లా మోసికొనిపోయేరు.

దాడిమూకలు ఆసియా మైనరునుంచి యూరోపుపైకి సాగి, దారిలో అడ్డునచ్చినవాళ్ళ నందర్నీ తుడిచిపెట్టేస్తూన్నాయి. ఇంకొంచెం ఐతే నాగరక ప్రపంచం యావత్తూ కొన్ని శతా

గ్రామాలపాటు వెనుకకు నెట్టివేయబడివుండేదే. కాని, ఏథెన్సు నగరం దారిలో కొండలా నిలబడింది! పర్షియను నౌకా బలాన్ని నాశనంచేయడంలో ఏథెన్సు నౌకాబలం నాయకత్వం వహించింది. భూతలయుద్ధంలోకూడ ఏథెన్సు వీరులే నాయకులుగా నిలబడి పోరాడేరు. గ్రీసుదేశ స్వాతంత్ర్యం నాగరికతలను రక్షించేందుకు ఏథెన్సు దృఢంగా నిలబడింది.

విజయలక్ష్మినిపొందిన ఏథెన్సును ధనలక్ష్మికూడ వరించింది. విదేశీ సరకులతో నిండిన నౌకలు ఏథెన్సు రేవుకు ముసురుతూన్నాయి. మిలిథుస్ నాశనమైపోయింది. స్మృతిపథాన బడిపోతూంది. ఇప్పుడు ఏథెన్సులోని కర్మాగారాల్లో, రేవుల్లో, నౌకానిర్మాణ స్థలాల్లో పనులు అవిరామంగా జరుగుతూన్నాయి. అతి కుశలురైన వృత్తినిపుణులు, కుంభకారులు, తంతువాయులు, ఆయుధ నిర్మాణదక్షులు యిచ్చటకే చేరారు. అయోనియను నగరాల నుంచి పారివచ్చిన విజ్ఞానాదిశాస్త్రాలన్నీ కూడా ఏథెన్సులో నూతన నివాసాన్ని యేర్పాటు చేసుకున్నాయి. హెరొడోటస్‌ను యిప్పుడు యిక్కడనే చూస్తాము. విశేషంగా దేశ విదేశ యాత్రలు గావించే డీయన. ఫొనీషియను రేవులనుంచి ఐగుప్తియను పిరమిడ్ల వరకూ, రాజాధిరాజైన పర్షియా చక్రవర్తి రాజధాని వరకూ యాత్రార్థియై తిరిగి చూచి వచ్చినవా డీతడు. నైలు నదిమీద యెగువకు ప్రయాణం గావించేడు. నల్లసముద్ర తీరాలమీద గ్రీకు దేవాలయములు, సిథియను తబర్న కిల్ల

స్వర్ణకలశములు శోభాయమాన మొనర్చే నగరాలలో నివ
సించి వచ్చినవాడు, హెరొడొటస్. ఆయన వెళ్ళినచోట
నల్లా దేవాలయాల్లోని పండిత పూజారులతో విద్యాప్రసం
గాలు గావిస్తూండేవాడు, యీాయన. నౌకాశ్రయాల్లోకి వెళ్ళి
నౌకాధిపతులనూ, సరంగులనూ కలుసుకొని, యెన్నో ప్రశ్నలు
వేసి, జవాబులు రాబట్టేవాడు. ఈతడు ఏథెన్సులోని తన
యింటిలో నివసించేటప్పుడు కూడ కాలాన్నంతనూ పిరయేస్
రేవులోనే గడపేవాడు. అక్కడే అన్ని దేశాలనుంచీ వచ్చిన
నౌకలన్నీ లంగరువేసుకొని వుండేవి. ఆ నౌకాశ్రయం ఎంత
సందడిగా ఉండేదని! సిథియను దేశంనుంచి ధాన్యాదులతో
నిండిన పడవలు యిక్కడికే వస్తూండేవి. మిలిథుస్ ఉన్ని
వస్త్రాలతానులతో చెక్కపూసైన ఓడలు యిక్కడినుంచే
బైలుదేరి అన్ని దేశాలకూ వెళ్ళేవి. ఇచ్చట అడుగడుగుకీ
విదేశీయు లెదురవుతూంటారు. నానా దేశీయులనూ కలిపేది
సముద్రమేగదా. ఒకానొక కాలంలో జనులు తాము పుట్టిన
చోటనుంచి కదలకండా, తమ రక్తసంబంధీకులతోనే యావ
జ్జీవితమూ గడిపేవాళ్ళు. ఇప్పుడా కాలం వెళ్ళిపోయింది. ఆ
రోజుల్లోఐతే కనబడే ప్రతీవాడూ మనకు సంపూర్ణంగా తెలి
సినవాడే ఐవుండేవాడు. పరదేశస్థు డెవ్వడైన యే గ్రామానికో
వెడితే, అక్కడ తనకు ఆశ్రయమిచ్చి, తన రక్షణక్రింద ఉంచు
కోడానికి అంగీకరించే స్థానికుడుంటేతప్ప నిలబడడమే అసాధ్య
మైన కాలమది! తాను సురక్షితంగా, క్షేమంగా ఉండ

దలిస్తే, స్థానికుల యిండ్లలో యేదో ఒక దానిలో ఆశ్రయం చూచుకోవలసిన రోజులవి !

ఒకప్పుడు పట్టణాలకీ పల్లెలకీ భేదమేమీ ఉండేదేగాదు. ఇప్పుడు పల్లెలకూ నగరాలకూ హస్తిమశకాంతరం వుంది. మధ్యలో రాజుగారి కోటా, చుట్టూ తీర్చిదిద్దినట్లున్న వీధులూ, సౌధపంక్తులూ, పెద్ద బజారూతో ఉండే నగరాలు కేవలం కొద్దిపాటి కుటీరాలు మాత్రమే ఉండే పల్లెలకంటె విభిన్నమైనవి గాదా ?

సముద్రం జనులనూ, సరకులనూ కూడా కలగాపులగం చేసివేస్తుంది. వెనకటిరోజుల్లో యే గ్రామంలోనైనా కుమ్మరి కుండలు చేసేడంటే ఆ గ్రామంలోని యిళ్ళవాళ్ళ కోసమైయే. బానిసలు బట్టలు నేసేవారంటే తమ యజమానులకోసం మాత్రమే. కమ్మరులు తమ తెగ యోధులకే, తమ గణంలోని వీరులకోసమే కత్తులు, బల్లెములు, శిరస్త్రాణాదులూ తయారు చేసేవారు.

అటువంటిది యిప్పుడో, మరి ? కుండలు, బట్టలు, కత్తులు కళార్లూ ఒక ఊరివాళ్ళు తయారుచేస్తే, దూరంలోని యేదో పట్టణంవాళ్లు కొనుక్కుని వాడుతూన్నారు. ఏథెన్సులో నేసిన వస్త్రాలు దూరపు దీవియైన సిసిలీలోని జనులు ధరిస్తూన్నారు. ఏథెన్సు కమ్మరులుచేసిన ఖడ్గాలు యెక్కడో సిరియా, పర్షియాలలో యోధుల చేతుల్లో మెరుస్తూన్నాయి. ఒకానొకప్పుడు వర్తకుణ్ణి ప్రభుకుటుంబీకు డెవడైనా పొగరుబోతు తనంతో అవ

మానించగలిగేవాడు. అల్లాంటివాళ్ళ నిప్పుడు చట్టం శిక్షి స్తూంది. అదివరలో విదేశీయు డెంతవాడైననూ పట్టణంలో అనామకుడే. ఇప్పుడు విదేశీయుడైనాసరే, యెవనికి బాని సలు, ఓడలు, బంగారం ఉన్నవో వాడే పూజనీయుడు గాని స్వదేశీయుడైనా బీదవాడు గాదు! వెనకటికాలంలో ప్రతీ వాళ్ళూ వర్తకులను చిన్నచూపు చూసేవాళ్ళు. వర్తకమున కంతగా గణ్యాత ఉండేదికాదు. అల్లాంటిది యిప్పుడు రాజ కుటుంబాలవాళ్ళున్నూ యిప్పుడు తామై ఓడలు సంసిద్ధ మొనర్చుకుని, సరకులెక్కించి, ద్వీపాంతరాలలో వర్తకవ్యాపా రములు గావించేందుకు సిగ్గుపడడంలేదు. ఏథెన్సునగరంలో రాజకుటుంబీకుల అధికారాన్ని కూలద్రోసి అప్పుడే చాలకాల మైంది. ప్రభువుల దుర్గాలుండే కొండవాలుల్లో యిప్పుడు కేవలం దేవాలయాలు మాత్రమే ఉన్నాయి.

ఇప్పుడు ప్రజాసమితియే ప్రతి విషయాన్నీ నిర్ణయిస్తూంది. దానిలో వర్తకులు, సాలీలు, కుమ్మరులు, కమ్మరులు, చర్మ కారులు మొదలగువాళ్ళంతా ఉంటారు.

ప్రాతఃకాలాల్లో చతుష్పథంలోకి జనులందరూ గుమిగూడే వాళ్ళు. స్థానికవార్తలు, ద్వీపాంతరవార్తలు, వింతలు విశే షాలు వినడానికి అందరికీ కుతూహలమేగదా! మంగలి షాపుల్లో గూడిన జనులు క్షురకుడు కత్తి నూరుతూంటే రాజ కీయాలు చర్చిస్తూండేవాళ్ళు. గతరాత్రి ప్రజాసభలో నొక ప్రతినిధి గావించిన ఉపన్యాసం వాళ్ళకి చర్చనీయాంశం.

ఇల్లాటి వాగ్వాదాలు మధ్యాహ్నం వరకూ సాగుతూనే ఉండేవి. మధ్యాహ్నం అయేసరికి యెండ దుర్భరంగా ఉండేది. సౌధప్రాంగణాల్లోని ముఖమండపాల క్రిందకీ, చెట్ల నీడల్లోకీ జనులు చేరేవారు. ఈ గుంపుల్లోనే ఉంటూండేవాడు, హెరొడోటస్. వృక్షఛాయలో నొక కవాచీబల్లమీద కూర్చుని, యెవరో నౌకాధిపతితో ఆయన మాట్లాడుతూంటాడు. ద్వీపాంతరాన్నుంచి యీ నౌకాధిపతి ఆరోజునేతిరిగివచ్చాడు. ఆతడు చెప్పే వివిధదేశ విశేషాలను వింటూ, ప్రశ్నిస్తూ, సందేహాలకు సమాధానాలు రాబడుతూ, హెరొడోటస్ సమస్తమునూ గ్రంథస్థం గావించుతూండేవాడు. అప్పుడప్పు డాయన వ్రాస్తూవచ్చిన యీ విశేషాలన్నీ చేరి ఒక మహాగ్రంథం ఐంది. ద్వీపాంతరాలనుంచి వచ్చిన నావికులు చెప్పిన విశేషాలు, కథలు, యితర భోగట్టా యావత్తూ ఈ గ్రంథంలో వుంటుంది. ఆ గ్రంథం చదువుతూంటే ఒక్కొక్క దేశంమీదినుంచీ యవనిక తొలగించి, ప్రత్యక్షంగా నీ కళ్ళముందు ఆ దేశాన్ని ఉంచుతూన్నట్లుండేది. ఎన్నో విదేశాల దృశ్యాలను మనో నేత్రంతో చూచేందుకు జనుల కవకాశం లభించేది. కానైతే ఆ దృశ్యం యింకా మసకగానే ఉండేదనుకోండి. అదీగాక ఆ నావికులు చాలమంది తాము చూచినవేగాక విననవీ, విననివీ కూడ అభూతకల్పనగావించి చెపుతూండేవాళ్లు. అవన్నీ కూడ హెరొడోటస్ గ్రంథంలోకి యెక్కినాయి.

వాళ్ళేంచెపుతారో, విందాం, రాండి. సుదూరదేశమైన లిబియాలో కొందరు మనుష్యులు నివసిస్తారనీ, వాళ్ళ చర్మం

కారుచీకట్లవలె నల్లగా ఉంటుందనీ, అక్కడ పెద్దపెద్ద యేను గులూ, బ్రహ్మాండమైన కొండచిలువలూ వున్నాయనీ; గాడిద లకు కొమ్ములున్నాయనీ; మెలికలుతిరిగి ముందుకు పొడుచు కొచ్చి నేలనుదున్నే కొమ్ములుగల ఆబోతు లున్నాయనీ చెప్పే వాళ్ళు. ఈ ఆబోతులు మేతమేసేటప్పుడు వెనక్కి నడుస్తవట! ముందుకి నడుస్తే వాటికొమ్ములు భూమిలో గుచ్చుకునిపోతా యనిట! అట్లాస్ పర్వతిరాజును గురించిన కథలుకూడా వాళ్లు చెప్పేవారు. ఆయన శిఖరాగ్రాలు యెంతో ఉన్నతంగా ఉండ టం వల్ల మనకి కనబడవు. ఆ శిఖరాలమీదనే ఆకాశం ఆను కొని వుంది! అట్లాసుశిఖరాల బోటుగనుక లేకపోతే ఆకాశం యేనాడో క్రిందికిపడిపోయి, మనల నందరినీ అణచివైచి యుండేది!

ఇంకా ఆవలగా, ఒక దేశంలో, మనుష్యులకి కుక్కతల లుంటాయి! మరో దేశంలో మనుష్యులకి అసలు తలకాయ లే ఉండవు! తలలు లేనివాళ్ళు గ్రుడ్డివాళ్ళు కారు సుమండీ. వాళ్ళకి కళ్లు గుండెలమీాద వుంటాయి! తూర్పుదేశాల్లో పెద్ద పెద్ద జలపక్షులు, జలజంతువులు ఉన్నాయి. అక్కడ యెడా రిలో కుక్కలంతేసి పరిమాణంగల బంగారు చీమలున్నవట! సూర్యోదయానంతరం యెండవేడిమిని భరించలేక యీ చీమలు భూమిలోదాగి, నిద్రిస్తాయి. అందుచేత ఆ సమయంలోనే జనులు పైకివచ్చి, తమ పనులు చూచుకోవాలి. వాళ్లు గబ గబ తమ ఒంటెలమీాది కురికి, ఎడారియంతటా పరుగులు

తీస్తారు. దొరికిన బంగారుపొడి నంతనీ వేసుకొని, ఒంటెలపై ఎక్కించుకుని తొందరగా వెళ్ళిపోతారు. ఒక్కక్షణమైనా తారటలాడేందుకు వాళ్లు యిచ్ఛగించరు. ఏమాత్రం ఆగినా, మరుగునవున్న చీమలు బైటికివచ్చి వాళ్ళ నెదిరిస్తాయి.

ఇంకా ఉత్తరాన మరో ఆశ్చర్యకరమైన దేశం ఉంది. అక్కడ తెల్లని పెద్దపిట్టలు పిండులుగట్టి యెగురుతూంటే, వాటి యీకలు రాలిపడి, బాటలన్నింటినీ కప్పివేస్తాయి! ఏడాది కారు మాసాలు నిద్రించే మనుష్యులూ, యేడాదికి మూడుసార్లు తోడేళ్లుగామారే మనుష్యులూకూడ ఉన్నారట!

ఐతే, శాస్త్రజ్ఞుడైనట్టి హెరొడోటస్ ఈ కథలను నిజంగా నమ్మేవాడా?

అబ్బే! లేదు! తను విన్నవాట్ల నన్నిటినీ వ్రాసుకునే వాడేగాని అవన్నీ నమ్మేవాడుగాడు.

ఆయన కెన్నెన్నో ఘట్టి సందేహాలుండేవి. ఉదాహరణకి, ఒంటికంటి మనుష్యులున్నారని ఆయన నమ్మేవాడు గాడు. తోడేళ్ళుగా మారే మనుష్యులున్నారని అంతకంటెనూ విశ్వసించేవాడుగాడు.

"ఈ నావికులు మహాగొప్ప కల్పనాపరులు! అబద్ధాల పుట్టలు! అనేక చిలువలు పలువలుగా కథలల్లి చెపుతారు, వాళ్లు. విదేశాలన్నిటిలోనూ మనం మార్గదర్శులమీాద ఆధారపడవలసినదే. పోనీయంటే వాళ్ళ మాటలనూ పూర్తిగా నమ్మేటందుకు లేదు. ఈ భూమియొక్క కొనలందున్న దేశాలు,

అక్కడవుండే జనులు గురించిన విశేషాలు విన్నా నిజానిజాల నెట్లు కనుగొనగలం ? భారతదేశం వెళ్ళివచ్చినవాళ్ళు గాని, లిబియాకు పోయివచ్చినవాళ్లు గాని అరుదు. అటువంటపుడు ఓ ఫొనీషియను నావికుడో, యాత్రీకుడో ఐతే యిల్లాంటి అభూతకల్పనలు చెపుతూ, అందరూ నమ్ముతారనే అనుకుంటాడు."

కాని, హెరొడోటస్ అల్లాంటి పిచ్చిపుల్లాయి కాడు. ప్రతి దానికీ ఆరాలుతీసి, విషమప్రశ్నలు వేసి, నిజాన్ని పైకి లాగగల దిట్ట, ఆయన. సాధ్యమైనంతవరకూ నిజమైన భోగట్టానే పైకి లాగేవాడు, ఆతడు. అరేబియాలో రెక్కలపాములున్నాయంటే, చూసి తెలుసుకోడాని కాయన అరేబియాదేశానికి వెళ్ళి వచ్చేడు ! కథలేగాని అక్కడ ఒక్క రెక్కలపామూ కనబడలేదు. ఈ విధంగా విమర్శాశక్తి ముందు మరో అభూయిత్యపు కల్పిత మృగం కూలిపోయింది ! తాను వ్రాసివుంచిన పెద్ద సంపుటాలు, పాపిరస్ చుట్టలూ పరిశీలిస్తూంటే ఆయన కనేక సందేహాలూ, ప్రశ్నలూ తలయెత్తేవి. వీటిని గ్రంథాల్లో వ్రాయనా ? మాననా ? అని హెరొడోటస్ ఆలోచించేవాడు. తన పేరుమీాద యీ అబద్ధాల పుట్టలను వ్రాయడమా ? పోనీ, దేనిని వదలిపెడదామన్నా, అది నిజమేమో ? అదే నిజమై, దాన్ని తాను వదలిపెడితే, లజ్జించవలసిందే, మరి. అంచేత సూదిగా చెక్కిన కిక్కిస కలాన్ని చేతపట్టుకుని మషీరసంలో ముంచి వ్రాయ నారంభించేవాడు.

తనకు సందేహం ఉన్న యే విషయాన్నైనా ఆయన పాఠకులకు వెల్లడించక మానువాడుగాడు. "ఇదెల్లా జరుగు తుందో నాకూ తెలియదు. ఏదేమైనను యితరులవల్ల నేను విన్నది, యింతే" అని వ్రాసేవాడు, అనేక సందర్భాల్లో.

నమ్మరాని యీ కట్టుకథల్లో కొన్నింటికైనా వివేకంగా ఉండే వివరణనో, వ్యాఖ్యానాన్నో గావించేవా డాయన, అవ కాశ మున్నంతలో నే.

ఒక కపోతం డోడోనాకు యెగిరివెళ్ళి 'యిక్కడే దేవా లయం నిర్మించాలి!' అన్నదను కథవ్రాస్తూ, హెరొడోటస్ యీ క్రింది వ్యాఖ్యానం చేర్చేడు. "బహుశః యీ మాట నొక స్త్రీ చెప్పివుంటుంది. ఆమె యెవరో విదేశీయురాలై, తెలియని భాషలో మాట్లాడి వుంటుంది. ఆ భాష పక్షులు కిచకిచలాడినట్లుండి వుంటుంది!"

ఉత్తరదేశాల్లో రాత్రులు ఆరు నెలల కాలం ఉంటవని ఆయన విశ్వసించలేదు. కాని, భారతభూమిలో బంగారు నిలవచేయు రాక్షసి చీమలను గురించి ఆయన నమ్మేడు! హెరొడోటస్ మస్తిష్కంలో పురాతన నమ్మకాలకూ, కొత్త భావాలకూ నిరంతరం సంఘర్షణ సాగుతూండేది. ఈ సంఘర్ష ణలో ఒక్కొక్కపుడు పాత విశ్వాసములే నెగ్గుతూండేవి. నదులలోని నీరు సూర్యకిరణముల కావిరిగా మారునని ఆనాటికే తత్త్వశాస్త్రజ్ఞులకూ, విజ్ఞానులకూ తెలుసును. కాని, హెరొడోటస్ మాత్రం యింకా సూర్యుడు దేవుడేనని విశ్వ

సంచేవాడు. ఆకాశమార్గంలో ప్రయాణంచేస్తూ సూర్య దేవుడు దప్పిగొని, నదీజలాలు త్రాగుతాడట ! అనక్షిమందర్, అనక్షిమినిస్, పైథాగొరస్ పండితు లానాటికే ఖగోళముల పరిభ్రమణాదుల్ని గూర్చిన నియమములను తెలిసికొన్నారు. కాని, హెరొడోటస్ మాత్రం చల్లని గాలులు సూర్యుని నిర్దిష్టపథంలోనుంచి యెగురగొట్టేస్తూంటాయనీ, అందువల్లనే చలిగాలులూ, శీతకాలాలూ వస్తున్నాయనీ నమ్ముతూండే వాడు. ఎంపిడోక్లిస్ పండితుడు ఖగోళములూ, వాటి భ్రమణ మునూ వివరించేవాడు. కాని, హెరొడోటస్ యింకనూ అవి దేవతలూ దయ్యాలూ అని భావించేవాడు !

కాని, మరొకప్రక్క విజ్ఞానం తన పనేమో తాను గావి స్తూనే ఉంది. గ్రీకులు అధికాధిక సంఖ్యలలో నూతనదృష్టితో వస్తువులనువీక్షిస్తూన్నారు,తమ కండ్లతో ప్రత్యక్షంగాచూచిన వాటినే గ్రహిస్తూన్నారు. హెరొడోటస్ తన గ్రంథాలను చదివి వినిపిస్తూంటే ఏథెన్సువాసులు గుంపులుగా మూగేవాళ్లు. ఆయన గ్రంథాలు వినేటందుకు ఆహ్లాదకరంగానూ, విజ్ఞాన దాయకంగానూ కూడా ఉన్నవనే విషయాన్ని అందరూ గ్రహించి మెచ్చుకొనేవారు. నూతనంగా కనిపిస్తూన్న హెరొ డోటస్ గాథలు వింటూంటే దేవతల్ని, వీరుల్ని గురించిన పురాణగాథలు మరిచిపోయేవారు, జనులు. గరిడీశాలల్లో, క్రీడారంగాల్లో, విందుభోజనాలదగ్గర, రేవుల్లో, ప్రతిచోటా జనులు సూర్య చంద్ర నక్షత్రాల దగ్గరనుంచీ సమస్త విష యాల్నీ గూర్చి చర్చిస్తూ, మాట్లాడుకుంటూండేవాళ్ళు.

కలుషితమై, నిర్జీవములైన శాస్త్రీయ సాంకేతిక చర్చలు గాక కుతూహలకరములై, సజీవ సమస్యలను గూర్చిన ప్రసంగములే యెక్కడవిన్నా ! ఎల్లా జీవించితే ఉత్తమం ? ఏమని విశ్వసించాలి ? ఎట్లు ఆలోచించాలి ? ఉచితమైన యోగ్యప్రవర్తన ఏది ? — మొదలైన సమస్యలు యేనోటవిన్నా చర్చించబడుతూండేవి.

## ఏథెన్సులోని ఒక సమావేశం :
## తాజావార్తలనుగురించిన ప్రసంగం

ఏథెన్సులోని మహాప్రాసాదం అది. పెరిక్లిస్ అక్కడే నివసిస్తాడు, ఎవరీ పెరిక్లిస్ ? మహావీరుడు, పరిపాలనాదక్షుడు, వివేకి, ప్రజానాయకుడు, కిరీటంలేని రాజు పెరిక్లిస్ ! విందు ప్రారంభమైంది. ప్రముఖులెందరో అక్కడ ఉన్నారు. అతిథులు తమ క్షుత్తును కాస్త తృప్తిపరచుకున్నారు. వారందరూ పుష్పదామాభిశోభిత శిరస్కులై సోఫాలమీద విశ్రాంతిగా సుఖాశీనులై వున్నారు. గేస్తుయొక్క మర్యాదకు సూచకంగా మధువు వడ్డించబడింది. ద్రాక్షాసవాన్ని నీటితో కలుపుకొని, చప్పరిస్తూ త్రాగుతూన్నారు, అతిథులు. గృహిణి అస్పాషియా నాట్యకత్తెలను పంపించేసి, మురళీ గీతాన్ని మానిపించింది. ఒక్కసారి నిశ్శబ్దంగా వుందంతా. అతిథులు యేదో చర్చ నారంభించేరు.

పెరిక్లీస్ గృహంలో యీ విందు యే సందర్భంలో చెప్తా? కేవలం ఆహార పానీయాలతో కుక్షి నింపుకొని, సంగీత నాట్యాలు విని చూచి ఆనందించేటందుకూ, సుగంధాదులు పూసికొని కులికేటందుకూనా?

అబ్బే! కాదు. వారిక్కడకు చేరినదెందుకో తెలుసా? 'ఇత్యర్థలు కూర, ఇత్యాహాలు ధప్పళం' అన్నట్లు వారంతా యిక్కడ తర్క-వ్యాఖ్యానాల విందుకోసం చేరేరు! విజ్ఞాని, బోధకుడూ యైన అనక్షగోరస్ ప్రసంగాలు వినేందుకే వారిక్కడ గూడినది. వారందరూ ఆయన శిష్యులూ, అనుచరులూను. ప్రభుడూ, నాయకుడూ నైన పెరిక్లీస్ తరచుగా రాజ్యాంగవ్యవహారాల్లో బోధకుడైన అనక్షిగోరస్ సలహా స్వయంగా అడిగి తీసికొనేవాడు. ఆతడే తనయింట మిత్రులందరకూ విందులూ, సమావేశాలూ యేర్పాటుచేసి, అనక్షిగోరస్‌ను ఆహ్వానించి, ఆయన బోధనలచేకూడ శ్రోతల శ్రవణ తర్పణం గావించేవాడు. ఏథెన్సు ప్రజానాయకుడు, ప్రభుత్వాధినేత, సేనాపతి, వీరాగ్రేసరుడు, యుద్ధతంత్ర ప్రవీణుడూ అని పేరుపొందినవాడు పెరిక్లీస్. ఆతడు స్వయంగా మాపితుడు గాక అనక్షిగోరస్ సలహాలను తీసికొనుటచేతనే గ్రీకుచరిత్రలో స్వర్ణయుగమునకు కర్త కాగలిగేడు. ఎథీనియను ప్రజలను అడుపాజ్ఞలలో పెట్టడం, కృషి శిక్షణల నొసగడం విద్యాబోధలు గావించడం పెరిక్లీస్‌కే తగింది. ఏథెన్సులో ఆయనను 'ఒలింపియన్' అని పిలిచేవాళ్లు. ఒలింపస్ శిఖరవాసియైన

నిస్వపురుషుడని దీని కర్థం. పెరిక్లిస్ సభల్లో ఉపన్యసించేటప్పుడు దేవేంద్రుడైన జ్యూస్ వలె మేఘగంభీర నిర్ఘోషంతో పిడుగులు మెరుపులు విసరుతూ వాడ నేవాళ్లు!

పెరిక్లిస్ ఆధిపత్యాన ఏథెన్స్ మహోన్నతస్థితిని చేరుకుంది. కొద్ది సంవత్సరాల్లో ఆ నగరాన్ని ఆయన ప్రపంచంలోకెల్లా మహా సౌందర్యవంతంగా తయారుచేసేడు. ప్రజానాయకాగ్రగణ్యుడైన యీ మహాపురుడు తత్త్వవేత్తయైన అనక్షిగోరస్ సలహాలను, బోధనలను అర్థించేవాడు. గురువు రచించిన 'ప్రకృతి శాస్త్రం' అనే ఉద్గ్రంథంనుంచి గైకొన్న వాక్యాలతో తన ఉపన్యాసాలకు సౌందర్యాన్ని సమకూర్చుకునేవాడు!

గృహిణి అస్పాషియాతో కూడ అనక్షగోరస్ సుదీర్ఘ సంభాషణల నొనర్చుతూన్నాడు. ఆ కాలపు సామాన్య గృహిణులవంటిది కాదామె. గృహాంతర్భాగంలో కూర్చుని పనమంతా రాట్నం వడకడంలోనే గడపుతూండేవారు స్త్రీలు. అస్పాషియా అట్లుగాక రాజకార్యాల్లో పాల్గొంటూ, శాస్త్రీయచర్చలు గావిస్తూండేది. మహావిజ్ఞాని సోక్రటీస్ సశిష్యుడై తరచు ఆమెను చూచి వెడుతూండేవాడు.

పెరిక్లిస్ ప్రథమ భార్య సంపన్న ప్రభుకుటుంబానికి చెందినది. ఆమెకు విడాకులిచ్చి, ఆయన యీ విదేశీయ స్త్రీని వివాహం చేసుకున్నాడు. ఈ వివాహానికై పెరిక్లిస్‌ను చాలమంది దూషించేవాళ్ళు. పురాతనపు ఆచారాలు, సాంప్రదాయాలు బలవత్తరమైనవిగదా! కాని, పెరిక్లిస్ అస్పాషియా మీది తన ప్రేమను అణచుకొనుట కిష్టపడలేదు.

ఆ విందులో యింకా యెవరున్నారు?

మహాశిల్పి, కళావేత్త, స్థపతియైన ఫిడియాస్ అక్కడున్నాడు. ఏథెన్సును సౌందర్యవంతంగా పునర్నిర్మాణం గావించేటందుకు ఆతడు పెరిక్లిస్‌కు తోడ్పడుతూన్నాడు. రాజధానియైన అక్రోపోలిస్‌లో పనిచేయు వేనవేలు స్థపతులు, శిల్పులు, తక్షులు, స్వర్ణకారులు, కర్మకారులు, చిత్రలేఖకులు మొదలగువారు యీయన నాయకత్వంక్రింద పనులు చేస్తూండేవాళ్ళు. సర్వసేనాధిపతి ఫిడియాస్‌క్రింద వివిధ శాఖలకు సేనాపతులు, ఉపసేనాపతులు, వారిక్రింద పటాలాలుగా శిక్షిత కర్మకారులు పనులు గావిస్తూండేవాళ్ళు.

ఈ మహాసైన్యానికి ఆయుధాలు కత్తులు కఠార్లు గావు. చెక్కడపు పనిముట్లు, శిల్పసాధనాలు, ఉలులు, బంపాలు, సమ్మెటలు మొదలైనవే వీరి ఆయుధాలు. మనుష్యుల్ని చంపడం, జీవంతోవున్న వాళ్ళని నిర్జీవులుగా చేయడంకాదు, వీరిపని. నిర్జీవములైన రాళ్లు, కొయ్య, లోహాలు మొదలైనవాటికి జీవంపోయడం, నిర్జీవపదార్థాల్ని సజీవములుగా చేయడం వీళ్ళపని. జీవం రూపంలేని రాళ్ళనూ, మట్టినీ దేవతాప్రతిమలుగా జేసి, చూపరులను దిగ్భ్రాంతులనుగాజేసే కళను వాటిలో కలిగించి, దేవాలయాల్లో స్థాపించేవారు. సమోన్నతములై, గంభీరములైన స్థంభాల వరుసలను నిలిపి, వాటిపై మంటప నిర్మాణం గావించేవారు. స్థంభాగ్రాలమీదా, గంటచూరుల

క్రిందా అమర్చిన చంద్రకాంత శిలలను మలచి, సాలంకృత మొనర్చి, వాటికి జీవం పోసేవాడు !

గండశిలలు, చలువరాళ్లు, రాగి, బంగారు, దంతం, చీకటి ద్రాక్షలు మొదలైనవి ద్వీపాంతరాలనుంచి తేవడంలో వందల కొలది ఓడలు, పడవలు, పనిచేస్తూండేవి. ఏథెన్సు రేవులు, పర్వతసానువులు కూడ కర్మకారులతో సందడిగా వుండేవి. శిల్పి ముఖ్యుడైన ఫిడియాస్ ఏథెన్సు నగరాన్ని సౌందర్యవంత మొనర్చటే గాక దాని కీర్తిని చిరస్మరణీయంగా, దేదీప్యమానంగా నిలిపేడు. రాజుల సొమ్ము రాళ్ళపాలుగానిచో మానవసంస్కృతి చిహ్నంగా మన కీనాడేమీ మిగిలేవేగావు !

ఫిడియాస్ తరువాత కూచున్నవాడే యూరిపిడిస్. ఇతడూ అనక్షగోరస్‌కు శిష్యుడే. జనుల పాతనమ్మకా లన్నిటినీ విజ్ఞానమనే గీటురాతిమీద పరీక్షించినవాడు, యీయన. పండితుడూ, కవీ, నాటకకర్తా. ఈయన రచించిన విషాదాంత నాటకాల్లోని ప్రతివాక్యమూ భయకంపితమొనర్చి, ఉత్తేజపరచి, పాతదేవుళ్ళలోగల మూఢనమ్మకాన్ని సడలగొట్టేది. దేవుళ్ళకూ, అదృష్టదేవతలకూ ముందర తన తలను వంచని ధీరుడు, ఈయన.

యుద్ధరథానికి పూన్చిన నాలుగు గుర్రాల్ని నడపడం కష్టమైనపనే. వేలాదిప్రేక్షకుల మనస్సులనే గుర్రాల్ని కనబడని కళ్ళెములతో నడపడం మరీకష్టమని వేరే చెప్పాలా ? కాని, యూరిపిడిస్ మహాకవి వేలాది ప్రేక్షకజనుల మనో జవనాశ్వా

లను సాహిత్య సూత్రాలతో సారథ్యం వహించి నడుపుతూ, ఒకే జీవితం, ఒకే ఆలోచన, ఒకే అనుభూతి, రసావేశం అనుభవించునట్లు చేయగలిగేవాడు.

నాటకశాలలోని ప్రేక్షకులు చాలమంది పురాణ దేవతల యందే నమ్మకం ఉన్నవాళ్ళు. వాళ్ళ ఆత్మలు బలహీనములు, అంధవిశ్వాసాలు గలవీను. కాని, యూరిపిడిస్ కళ్ళెముల నెట్లు బట్టవలెనో తెలిసినవాడు. ప్రేక్షకులలో అతిబలహీనుడుకూడా, పిరికిపడుతూనైనా, అయిష్టంగానే ముందుకుసాగేవాడు. దేవతలపై యెంత నమ్మకం వున్నవాడైనాసరే, వాళ్ళంటే యెంత ఒణికిపోయీవాడైనాసరే, నాటకం చూచేక యీ మాదిరి అభిప్రాయాన్ని ఘోషించి తీరేవాడు: "న్యాయశీలురు, అపాప విధులూ గాని-చో దేవతెలుకూడ దేవతలు గాజాలరు..."

పెరిక్లిస్, అస్పాషియా, ఫిడియాస్, యూరిపిడిస్...

ఆహా! గురువుకు తగిన శిష్యులు! పురాతనకాలంలో నాయకులు అనుచరులతోకూడ తమ దుర్గ కుడ్యాంతరాల్లోనే విందులు గుడిచేవారు. దేవతలకు బలిగా వందలాది పశువులను వారు అర్పించేవారు. దేవతాప్రీతిగా వారు వేల్చిన హోమద్రవ్యాల వాసనలు, ధూమం దిగంతాలకు వ్యాపించేవి. బలిహోమ సమయాల్లో వారి ఉత్సాహధ్వనులు, సంతోష ఘోషలు, మంత్రాలు, గీతవాద్యాది ధ్వనులు, విందులు గుడిచేవారి తృప్తహాసములు యెంతో దూరంవరకూ విన వచ్చేవి. భీమబలుర, వృకోదరుల విందులవి!

కాని, పెరిక్లిస్ ప్రాసాదంలోని విందులు మరో తరహావి.

యూరిపిడిస్ కవి అఖిల్లిస్ వీరునితో సముడుగాడా ? అఖిల్లిస్ మానవులను తనతో ద్వంద్వయుద్ధానికి రమ్మని సవాలు చేసేవాడు. యూరిపిడిస్ దేవతలనే పోరాటానికి ఆహ్వానించేవాడు !

ఇంక పెరికిలిస్‌ను చూద్దాం. ఆతడు ఒడెస్స్యూస్‌తో సమానుడే ! ఒడెస్స్యూస్ ఇథాకా అనే చిన్న ద్వీపానికే రాజు. కాని పెరికిలిస్ యెన్నో ద్వీపాలూ, నగరాలతో గూడిన సాగర సమితికే ప్రధానసేనానీ, ప్రభుత్వ నాయకుడూను !

పోనీ అంటే వీరి దేహాలూ, కండరాలూ హోమర్ పురాణాల్లోని దివ్యవీరుల వాటికంటె చిన్నవేకావచ్చు. ఐతేనేమి ? బుద్ధిబలమే కండరబలంకంటె గొప్పది ! హోమర్ పురాణ నాయకులకంటె యిక్కడినాయకులు నిస్సందేహంగా సమర్థులూ, దీర్ఘదర్శులూను !

అటువంటి శ్రేష్ఠజనులు పెరికిలిస్ యింట చేరినది ఎందుకోసం ? తమకంటె పండితుడూ, విజ్ఞానీ, వయోవృద్ధుడూ ఐన అనక్సిగోరస్ బోధలు వినేందుకే ! ఋషితుల్యుడైన ఆ తత్త్వవేత్త తన శిష్యుల కేమని ప్రబోధం గావించేడు ?

కాల యవనిక మనల నా పూర్వకాలాన్నుంచి వేరుచేస్తూన్నందున మనకాయన మాటలు సరిగా వినరావు. వినబడిన వాక్యాల నైనా అతికష్టంమీద అర్థం చేసుకోగలుగుతూన్నాము.

అర్ధచంద్రాకారంగా అమర్చబడిన సోఫాలమీద అతిథు లంతా సుఖాసీనులై వున్నారు. సోఫాలముందు చిన్న బల్ల లమర్చబడినాయి. వాటిపై ద్రాక్షపండ్లతో నింపిన బుట్ట లుంచేరు. వారు కూర్చుని అనక్షగోరస్ చెప్పేది వింటూ, శ్రద్ధాసక్తులతో కూర్చునివున్నారు. ఇప్పుడొకరు, అప్పుడొకరు స్థానం మార్చుకుని, సర్దుకుకూర్చుని, దిండ్లపై మోచేతి నాను కోవడమో, ప్రక్కవానివైపు తిరగడమో చేస్తూన్నారు. వాళ్ళ పెదవులు కదులుతూన్నాయి. వాళ్ళ ప్రశ్నలను, సమాధానా లను కూడ మనం దాదాపు వినవేగలం. కాని, వాళ్లు చెప్పేది యిప్పుడు ఊహించుకోవాల్సిందే, మరి. వారు మనకు ఛాయా మాత్రులుగానే కనబడతారు. ఒకప్పుడు యదార్ధమైన, విస్పష్ట మైన జీవితాలను గడపినట్టి వీరందరూకూడా యిప్పుడు మన భావనాశక్తిచే ప్రత్యక్ష మొనర్చుకోబడిన ఛాయారూపులు మాత్రమే.

అదుగో! వారంతా అనక్షగోరస్ వైపు తిరిగి కూర్చుని శ్రద్ధతో వింటున్నారు.

వారి ప్రసంగవిషయం ఏమిటి? ఈ సృష్టిలోని వస్తువుల ఉత్పత్తి, వినాశముగురించి అనక్షగోరస్ చెపుతూన్నారు. ప్రతి వస్తువు కొన్ని సూక్ష్మతమ కణములతో నిర్మించబడివుంటుంది. ఈ కణములనే బీజములని చెప్పవచ్చు. వీటి సంయోగ వియోగ ముల వల్లనే వస్తువులు దృశ్యంకావడంగాని, అదృశ్యమవడం గాని జరుగుతూంది. వస్తువులకు ఉత్పత్తి వినాశం వున్నదేగాని,

అవి వేటితో చేయఃబడినవో అట్టి కణాలకు మార్పులేదు. కాని, ఆ కణములు కూడుట, విడిపోవుట యెట్లు, ఎందువల్ల జరుగుతూంది ? వాటికి ఆ శక్తి స్వతహాగానే వుందా ? అబ్బే ! లేదు. కణములలో యీ శక్తి లేదని అనక్షగోరస్ నిశ్చయించేడు. అన్నిటికీపైన 'సంకల్పశక్తి' లేక 'ఇచ్ఛాశక్తి' ఉన్నదని ఆయన చెప్పేడు. ప్రకృతికి తోడ్పాటుగా యిచ్ఛాశక్తి ఉన్నదనీ, అందువల్లనే అన్నీ నిర్మాణం అవుతూన్నాయనీ ఆయన భావించేరు. *

ఖగోళాల్ని గూర్చికూడ అతడు వివరించేడు. మనభూమియే గాక యితర ప్రపంచాలుకూడా వున్నాయని ఆయన చెప్పినప్పుడు వారత్యంతాశ్చర్య నిమగ్నులయేరు. ఉదాహరణకు చంద్రలోకంలో పర్వతాలు, చెట్టుచేమలు, ప్రాణికోటి కూడ వున్నాయి. జాజ్వల్యమానమైన మహాగ్నిజ్వాలలతో గిరగిర

---

* కణాదమహర్షి వైశేషికదర్శనంతో యిది పోలివుంటుంది.

*పరమాణులక్షణానిత్యా / వై. ద. అ 4. ఆ 1, సూ 1.*

*కార్యలక్షణా త్వనిత్యా /*

*అణూనాంకర్మ అదృష్టకారితం /*

*ద్రవ్యగుణయోః సజాతీయారంభకత్వం సాధర్మ్యం /*

*సాధర్మ్యం వైధర్మ్యంచాతి ద్వివిధం సంయోగం /*

ద్రవ్య గుణ కర్మ సామాన్యధర్మ విశేష సమవాయము లనే ఆరు పదార్థములు వీరు సృష్టిస్తాగు.

*యతోఽభ్యుదయ నిశ్శ్రేయస సిద్ధిః సధర్మః / వైశేషికం.* **1-1-2**

*తద్వచనా దామ్నాయస్య ప్రామాణ్యం /* **1-1-3**

*సంయోగాభావే గురుత్వాత్ పతనం /*

*విభవాన్ మహాన్ ఆకాశో తథాచ ఆత్మా /*

పరిభ్రమించే అగ్నిగోళమే సూర్యుడు. దాని పరిభ్రమణంవల్ల చెదిరిపోయే నెరసులే ప్రత్యేక గోళాల్నీ, లోకాల్నీ సృజిస్తూన్నాయి. ఆ లోకాల్లోని సమస్తమూ దానివల్లనే జనిస్తూంది. చీకటినుంచి వెలుతురు, శీతలాన్నుంచి వేడిమి దానివల్లనే కలుగుతూంది. సముద్ర ఫేనంలోనుంచి ఓడ దున్నుకుంటూ పోయినట్లే సూర్యుడు ఆకాశపథంలో తరణియై దున్నుకుంటూ పోతూన్నాడు. దాని మహావేగంవల్లనే అది అంతకంతకు వేడి యెక్కుతూంది. సూర్యగోళపు దురితగమనంవల్ల దానినుంచి కొన్నితునకలు చెదరి పడిపోతూంటాయి. అవే కొన్ని ఉల్కలుగా భూమిమీద పడుతూన్నాయి. మూఢవిశ్వాసంగల జనులు వీటిని చూసినపుడు భయభక్తులతో దూరంగానే నిలబడిపోతారు గాని దగ్గరకుపోరు! దాన్ని సమీపించి పరిశీలిస్తే మాత్రం ఆకాశాన్నుంచి పడిన అదిన్నీ సాధారణమైన శిలాఖండమేనని గ్రహించగలరు.

అనక్షిగోరస్ పండితుడు అప్పటికింకనూ యెవరూ చూడని, వినని, ఆలోచించని విషయాలను బోధిస్తూంటే శిష్యులంతా బహుశ్రద్ధగా వింటూన్నారు. ఆ విజ్ఞాని మేధాశక్తి ఆకాశాన్ని భేదించుకొనిపోయి, యితరులంతదనుక స్వప్నేపి ఊహించియుండని లోకాల్ని కనిపెట్టింది. ఏథెన్సువాసులీ పండితునికి 'తార్కికుడు' 'న్యాయవేత్త' అను బిరుదుపేర్లు పెట్టి పిలిచేవారు. సనాతన దేవతల్లో విశ్వాసంగల జనులు అల్లాంటి విందులకు వచ్చినపుడు సూర్యచంద్రాదుల దివ్యత్వమునందే

నమ్మకంలేని ఆ పూానవునికి సాధ్యమైనంత దూరంలో ఉండే టందుకే వారు ప్రయత్నించేవాళ్లు! ఎందుకో తెలుసా? అటు వంటి అపచారంచేస్తే తరువాత తాము వీధిలోకి పోయినప్పుడు సూర్యదేవుడు తన కిరణ బాణాలతో అటువంటి అపవిత్ర ప్రసంగం వినినందుకు కొట్టి బాధిస్తాడని భయపడేవాళ్ళు.

కాని, పెరిక్లీస్ సహచరులు, అతిథులు మరో కొత్తతరహా మనుష్యులు తమ తాతముత్తాతలు విశ్వసించిన వేటినీ వారు విశ్వసించరు. ప్రతివిషయాన్నీ పరీక్షించినగాని వదలరు. పెరిక్లీస్ కూడా మానవబుద్ధిశక్తినీ, తర్క-శక్తినీ అన్నిటికీ మిన్నగా గౌరవిస్తాడు.

ఆలంకారికులు పెరిక్లీస్‌ను గురించిన కథ ఒకటి చెప్తారు. ఒకసారి పెరిక్లీస్ నూటయాభై ఓడల్ని ఆయత్తపరచి, తానే స్వయంగా నాయకుడై బైలుదేరబోతున్నాడట. ఆ సమయంలో సూర్యగ్రహణం పట్టింది. ఇదొక పాడు శకునంగా తలచి అందరూ భయపడ నారంభించేరు. కాని పెరిక్లీస్ నిర్భయంగా ఉన్నాడు. అతడు అనక్షిగోరసుని శిష్యుడు. సరంగు ఓడను వదలేటందుకు వెనుకాడడం చూసి, పెరిక్లీస్ ఒక వస్త్రాన్ని కర్ణధారి ముఖంమీద ముసుగులా వేస్తూ 'ఈ చాటుకి భయపడతావా?' అనడిగేడు. భయపడనని కర్ణధారి జవాబిచ్చేడు.

"ఐతే, గ్రహణంలో మాత్రం భయపడడాని కేముంది? గ్రహణం యీ వస్త్రంకంటె పరిమాణంలో పెద్దది! అంతే." అన్నాడుట, పెరిక్లీస్.

రాత్రి సమావేశం ముగిసింది. నిద్రాముద్రితములైన పుర వీథులలోబడి స్వగృహానికి బైలుదేరి పోయీవాడు, అనక్షిగోరస్. చంద్రుడు నడిమింట వెండిపళ్లెంలా వెలుగు లీనుతూన్నాడు. వెన్నెల్లో అడవి అత్తిచెట్లు వెండినీరానినట్లు తోపిస్తూన్నాయి. ఏథెన్సు నగరోపరిభాగంపైన దుర్గకుడ్యముల నీడలు నల్లగా పడుతూన్నాయి. దేవతాలయములన్నీ ఉన్న దీ పర్వత సానువులమీదనే. పల్లాస్ అథీనాదేవి తన బంగారు బల్లెమును ఆకాశంలోనికెత్తి పట్టుకుని నిలచిన చోటు యిదే. ప్రాణికోటి యావత్తూ నిద్రాముద్రితమై వుంది. బజారుల కూడలి అగోరా కూడ నిర్మానుష్యంగా ఉంది.

అనక్షిగోరస్ ఒకపరి ఆగి, చంద్రబింబంవైపు చూచేడు. కళ్ళు చికిలించి, ప్రయత్నపూర్వకంగా చంద్రబింబాన్ని పరిశీలనగా చూస్తున్నాడు. చంద్రునిమీద కొన్ని నల్లని నీడల నాయన చూడగలిగాడు. అవి పర్వతాలూ లోయల్లోని నీడలూనని ఆయన నిశ్చయించేడు. అంతా కొత్తగాఉంది. పైన ఆకాశపథంలో ప్రతిరాత్రీ దేవయాని (ఆంద్రోమిడా)ని ఉచ్చైశ్రవం (పెగాసస్ = పేద్వఘూశ్వము) గొనిపోతూండడం, పెర్స్యూస్ వీరుడు భల్లముతో భయంకర సర్పాన్ని (డ్రేగన్) పొడవబోవుచోట అసంఖ్యాక తారకాగణముతో నిండియున్న విశాల నభోప్రదేశాన్ని చూసేడు. జ్వలించే యీ గోళాలన్నీ ప్రాణిరహితములేనా?

చంద్రుడింకా ప్రకాశిస్తూనే వున్నాడు. కాని తెల్లవారుటకు యింకెంతో వ్యవధిలేదు. ఎక్కడో తొలికోడి కూస్తూంది.

చర్మకారుడు మేలుకొని, నూనెదీపాన్ని వెలిగించి, పని ప్రారంభించాడు. తెల్లవారులోగా మరొక్క జత పాదరక్షలను గనుక పూర్తిచేసినచో యింకొక కుంచెడు ఓటుపిండిని సంపాదించుకో గలుగుతానని వాని తాపత్రయం. ఎప్పుడో గృహయజమాని దాసదాసీలను కేకలువేస్తూ, లేచి పనులు ప్రారంభించమని పిలుస్తూ సందడిగావున్నాడు. త్వరలోనే తిరుగళ్లు విసరు ధ్వని వినవచ్చింది. నాటికి రొట్టెలపిండిని విసరేపని తెల్లవారేసరికి పూర్తికావాలిగదా. తినడానికి యేదైనా పెట్టమని గోలచేస్తూ పిల్లలు లేస్తూన్నారప్పుడే. ద్రాక్షపళ్ళ గంపలు, ధాన్యపు గోనెలు వేసుకుని పల్లెలనుంచి రైతులు పట్టణంలోకి వస్తూ న్నారు. ద్రాక్షగుత్తులమీద నాటిమంచు యింకా మిలమిల మెరుస్తూనేవుంది. బజారులో జనం మూగుతూ, సందడి చేస్తూ న్నారు. తెలతెలవారుతూండగానే వారు తమ గుడారాలను విప్పి, కంబళ్ళుపరచి, అమ్మకపు సామానులు సర్దుతూన్నారు. రాత్రి పట్టణమంతా యెంత నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా ఉంది! పగటిపూట అదే యెంతసందడిగా గోలగా వుంటుందో! తైల విక్రేతలు పోటీలుపడి, తమ సరకునమ్మ యత్నిస్తూన్నారు. తనకోసమై రవ్వంత నూనె కొనుక్కుందామంటే కూడ ఒక్క దమ్మిడీ (ఓబోల్) కూడ అనక్షగోరస్ దగ్గర ఉండేదిగాదు. ఆయన కొకప్పుడు విశాలమైన ఆలివ్ తోటలుండేవి. కాని, వాటి నాతడు మేకలకూ, గొర్రెలకూ మేతకై వదలిపెట్టేశాడు! ఈ సంసార తాపత్రయాలతో తన మనస్సును 'తపస్సు' నుంచి మరలించడం యిష్టంలేకనే ఆయన యిట్లు చేశారు!

## మానవుని కీర్తించే సూక్తం

ఏ తెగ కా తెగ మనుజులు తాము చూస్తూన్న నది ఒక్కటే యీ లోకంలో ఉన్నదని భావించిన కాలమొకటి ఉండేది గదా.* తరువాత వారు హెర్క్యులిస్ స్థంభాల దగ్గరికి (జిబ్రాల్టరు) వచ్చి, మహాసముద్రాన్ని చూచేరు. అది కూడ ఒక పెద్ద నది యనే వారు భావించేరు! దానికి 'మహాసముద్ర నది' యని పేరుపెట్టి, ప్రపంచాన్ని చుట్టుముట్టినదిగా భావించేరు. వారి ముత్తాతలు తాము చూచిన మొదటి సింహాన్ని కుక్క యని పిలిచినట్లే వీరున్నూ సముద్రాన్ని నది యని పిలిచేరు!

క్రమంగా వారి ప్రపంచదృష్టి విశాలం గాజొచ్చింది. ఎన్నో నదులున్నాయనుకున్నారు. సముద్రాలుకూడా వున్నాయని గుర్తించారు. కాని, భూమిమాత్రం ఒకటే నని వారు చాల కాలంవరకూ భావిస్తూవచ్చేరు. ద్వీపాలు చాల వున్నాయని

---

* అంబతమే నదీతమే దేవితమే (ఋగ్వేదం 2–4–9–16)

మొదలుగాగల వాక్యాలతో నదులను కీర్తిస్తూండేవారు మా ప్రాచీనులు.

అవాసృజస్సర్తవే సప్తసింధూన్, (ఋ. 4–3–7–1)

మొదలగు ఋక్కులలో ఏడు నదులను సృజించిన ఈశ్వర కరుణను కీర్తించుటచూస్తే, ఏ ఒక్క నదినో గాకున్నను పరిమిత ప్రపంచమునే దృష్టిలో ఉంచుకున్నట్లు స్పష్టమవుతుంది. చాలకాలం క్రిందటనే భ్రాంతీయులు తాను మునిగిన దొక్కటే గంగ యను స్థితినుంచి ముందుకు సాగేరు. వైదిక యుగం నాటికే నావలను కలిగి, నదీసముద్రయానములు గావిస్తూన్నటు నిదర్శనాలు కానవస్తున్నాయి. (అను)

కూడా వాళ్ళు గుర్తించడానికి కొంతకాలం పట్టింది. తరువాత వారు యింకా దూరముగా చూడగలిగిరి. ఆకాశంలోని గోళాలన్నీ అన్నిలోకాలుగా గుర్తించేముందు అవన్నీ సర్పాలనీ, నక్షత్రగ్రహాలనీ, రెక్కల గుర్రాలనీ తలుస్తూండేవాళ్ళు!

ఇప్పుడు వారిలోని మేధావులైనవారు యీ భూమ్యాకాశములు రెండూ వేరువేరు వస్తువులనే భావం సరికాదని గుర్తించ నారంభించేరు. కుతూహలంగల కండ్లకు కుతూహలం గల బుద్ధి సాహాయ్యం చేసేదిగా తయారైంది.

అనక్షగోరస్ అన్నాడు: "చంద్రబింబం మరొకలోకం. ఈ విశ్వంలో భూమి ఒక్కటే లోకం గాదు."

మహాజనులు చూపిన బాటవెంబడే సాగి, మానవుడు నక్షత్రాలకూ, అక్కడనుంచి అనంతపథానికీ పయనమయ్యేడు. మొదట్లో చిన్న మైదానంలోనే దారి తప్పేవాడు. పెద్దవీ చిన్నవీ అనీ, దగ్గరివీ దూరపువీ అనీ స్పష్టంగా గుర్తించలేక పోయేవాడు. హెసియడ్ కవి యేమనేవాడో తెల్సునా? 'నక్షత్రాలమీంచి గనుక దాగలిని విసిరితే మన భూమిని చేరేందుకు తొమ్మిది పగళ్ళు, తొమ్మిది రాత్రులూ పడుతుంది!'...కాని, నక్షత్రాలు మనం లెక్కపెట్టజాలనంతటి దూరంలో వున్నాయని క్రమంగా మానవుడు గుర్తించేడు. ఈ భూమిమీదే వున్న మహోన్నత పర్వత శిఖరాన్నే కొలవలేకపోయాక మానవుడు నిరాధారమైన ఆకాశంలోకిబోయి నక్షత్రాలకు దూరాన్ని ఎల్లా కొలవగలడు? అప్పటికింకా

పర్వతాలమీాది మంచు పరిథిని దాటిపో సాహసించనేలేదు, మానవుడు. పెలోపొన్నిసస్ (గ్రీసు) ద్వీపకల్పం కన్న సూర్యుడే బృహత్కాయుడని అనక్షగోరస్ అన్నాడు. ఆయన యింకా భూమిమీాది మానదండములనే ఖగోళాల్ని కొలిచేటందుకు కూడ ఉపయోగించేవాడు. కాని, అదీ ఒక ముందడుగేనని చెప్పాలి. అసలు వీటినన్నిటినీ కొలిచి, సరిపోల్చిచెప్పే ప్రయత్నమైనా చేసే డాయన. భూమికి సమీాపస్థమైనదేది? సూర్యుడా? చంద్రుడా? అని ప్రశ్నించి, చంద్రుడే మనకు దగ్గరలో వున్నాడన్నాడు. ఎల్లాగ? గ్రహణంపట్టడం, సూర్యుడికీ భూమికీ మధ్యగా చంద్రుడు అడ్డురావడంవల్లనే నని ఆయన నిశ్చయించేడు. ఈ విధంగా గ్రహణములే ఆకాశపు లోతుల్లోకి చూచే అవకాశాన్ని మానవునికి యిచ్చేయి. గ్రహణములే మనకి ఖగోళజ్ఞానాన్ని ప్రసాదించి, దారి చూపినాయని చెప్పవచ్చు.

మానవుడు భూమిలోనికి కూడ అంతకంతకు లోతుగా చొచ్చుకుపోతూ వచ్చేడు. వెండిని త్రవ్వుతూ మూడువందల అడుగుల లోతుకిజొరబారాడు! సాగరజలాలమీాదనే నడిచిపోవడం నేర్చుకున్నాడు. నీటిమీాదవేస్తే తేలే పెద్ద పెద్ద నౌకలలో అటునిటు పోవడం సామానులు కూడా తీసుకుపోవడం నేర్చుకున్నాడు! ఓడ లిప్పుడు ద్వీపాంతరాలనుంచి పెద్ద దారు ప్రస్థరాలను, దంతపు బారులను, క్రిమియానుంచి ధాన్యాలు పశువులను, కోల్చిస్ నుంచి ఊలూ నైనమును, అరాబియా

నుంచి అత్తరు నూనెలను మోసుకుని వచ్చి, ఏథెన్సు రేవుల్లో దించుతూన్నాయి.

అలవాటు, పరిచయం అవుతూన్నకొద్దీ మానవుడు యీ భూమిమీద మరింత ధైర్యసాహసాలతో కదులాడ జొచ్చేడు. పెద్ద కాలువలను త్రవ్వి, వాటిలో పడవలను నడిపించ నారంభించేడు. సముద్రతీరాల వెంబడే అలల తాకిడిని అడ్డేటందుకై రాళ్ళతో గోడలను నిర్మించుతూవచ్చాడు. పదిమంది ఒకరి భుజాలమీద ఒకరు నిలుచున్నా కానీ మునిగిపోయేటంత యెత్తైన గోడలవి ! మరొక-చోట కొండల్లోనే విశాలమైన రంగస్థలాలు, గోదాలు యేర్పాటుచేశాడు. ప్రేక్షకులు కూర్చునేందుకు వీలుగా వాటిచుట్టూ రాతిసోపానాలు మలచేడు. ముప్పై ఖవేల మంది సుఖంగా ఆసీనులు కావచ్చు నా సోపానములపైన ! నేలను త్రవ్వి చలువరాళ్ళు తీసి తెచ్చి, సుందర గంభీరమైన దేవాలయములను నిర్మించేడు. దేవుళ్ళ పూజా పునస్కారాలకై నిర్మించిన యీ దేవాలయాల్లోని ప్రతి చలువరాతి స్థంభమూ కూడ మానవుని ఘనతను చాటునవిగానే వుండేవి !

శతాబ్దాలు గడిచిపోతూన్నాయి. దేవేంద్రుడు జ్యూస్, విద్యాదేవత అథీనా ప్రభృతి దేవతలలో విశ్వాసం సడల నారంభించింది. కాని స్వీయనిర్మాణములైన యీ దేవాలయములు పవిత్ర స్థలములేనని యింకా జనులు విశ్వసిస్తూనే వున్నారు. హెల్లాస్‌లో గాలివాన లంతగా ఉండకపోయినా శతాబ్దులు గడిచేసరికి సాధారణ శీతవాతాతపాదులవల్లనే

యీ దేవాలయపు గోడలకూ, స్థంభాలకూ బోలెడు వినాశం జరిగింది. అవన్నీ వన్నె దరిగి, మాసిపోవడమేగాక అరిగి విరిగి తరిగి కూడా పోయినాయి.

పైన కప్పుగాని, చూరుపలకలుగాని లేకండా యీనాటి కింకా కొన్ని స్థంభాలు, గోడలు నిలిచి వున్నాయి. కూలి పోయినవాటికి లెక్కయేలేదు. ఎన్నో శతాబ్దాల వాతావర ణం, ప్రకృతీ కూడా చేయలేని వినాశాన్ని మానవులే వీటికి చేశారు. శత్రునాకల నుంచి ఫిరంగిగుండ్లు, బర్బరమూకల పలుగుపారలు చేయగలిగినంత వినాశాన్నీ చేసే వదలినాయి. కాని, ఎంత శిథిలావస్థలోనున్నా యీ దేవాలయాలు యెప్ప టికీ తమ యౌవనసౌందర్యాన్ని గోల్పోవు. అంగవిహీనము లుగా జేయబడిన యీ దేవతావిగ్రహాలను, యీ శకలము లను చూచిన మానవులు 'ఆహా! ఎంత సౌందర్యంగా వున్నాయి!' అంటూనేవుంటారు. వీటిని నాశనంచేయ ప్రయ త్నించిన ఆ సౌందర్య విద్వేషులు, బర్బరులు నామరూపాలు లేకండా యేనాడోపోయారు. కాని, యీ దివ్యసౌందర్యాన్ని సృజించిన ఆ సౌందర్యోపాసకుల పేర్లు మాత్రం మానవులు శాశ్వతంగా గుర్తుంచుకుంటున్నారు. స్రష్టయైన మానవు డెంతటి అద్భుతవ్యక్తి! అసలు మానవుడు సృజనాత్మక కర్మను చేయ నారంభించేకనే తాను యితర ప్రాణిలోకం కంటె విశిష్టత గలవాణ్ణని గ్రహించ నారంభించింది!

కొండలనే మలచి నిర్మించిన ఆ రాతి సోపానములపై ఆసీ నులై వేలాది ప్రేక్షకులు ఊపిరి కూడ విడువకుండా, రెప్ప

వాల్చకుండా, ఉండేటంతటి యేకాగ్రతతో ఐస్కిలస్, సోఫో క్లీస్, యూరిపిడిస్ మొదలైన మహాకవుల నాటకాలను చూస్తూండేవాళ్ళు. వారి నాటకాలు విషాదాంతములే. ఐస్కిలస్ రచించిన ప్రామిత్యూస్, సాఫోక్లీస్ వ్రాసిన ఆంటిగోనీ, యూరిపిడిస్ యొక్క ఇఫిజీనియా వగైరా నాటకాలను చూస్తూ, ప్రేక్షకులు లోకేవిధమైన ఆలోచనలను, భావోద్రేకములను అనుభవిస్తూండేవాళ్ళు. పరుల బాధలలో సహభాగులై పాలుపంచుకోడం, తమ్ముగురించేకాక యితరుల కష్టసుఖాలను గురించి కూడా ఆలోచించడం, యితరులపట్ల సహానుభూతిని చూపడం నేర్చుకుంటూ వచ్చారు. అంధప్రాయులైన అదృష్టదేవతకూ, మానవుని పురుషకారానికీ * జరిగే నిరంతర సంఘర్షణను మానవులు యెప్పటినుంచో చూస్తూనేవున్నారు. దేవేంద్రుడైన జ్యూస్ శాసనంచే హెఫేస్టస్ ప్రామిత్యూస్‌ను కకేషస్ పర్వతశిఖరాలకు శృంఖలాబద్ధుని గావించేడు. అదృష్టదేవత అతనికి వ్యతిరేకంగావుంది. స్వర్గలోకాన్నుంచి అగ్నిని దొంగిలించి, భూమికి దెచ్చి మానవుల కిచ్చినందుకు

---

* మానవుడు స్వతంత్రుడా? కాడా? స్వతంత్రుడైతే యెంతవరకు స్వతంత్రుడు? ఇవి చిరకాలంగా తత్త్వశాస్త్రాలన్నీ చర్చిస్తూన్న సమస్యలు. కర్మ లేక ప్రారబ్ధముచే నియమితుడై మానవుడు నడుస్తాడని కొందరూ, స్వేచ్ఛాయిచ్ఛగలవాడని కొందరూ, కొంత యిదీ అదీ కలిసి వుండని కొందరూ అభిప్రాయపడుతూన్నారు, తత్త్వవేత్తలు. ఆధునిక విజ్ఞానియైన ఐన్‌స్టీన్ పండితుడు, కార్యకారణసూత్రము సర్వత్రా చెల్లదని నిరూపించేడు. అంటే సాధారణంగా చెల్లుతుందనే. ఇదిన్నీ మన కర్మ, పురుషకారము, - వీటితో తుల్యమైనదే. — అనువాదకుడు.

ప్రొమిత్యూస్ పశ్చాత్తాప పడనే లేదు. అదృష్టదేవతకి లొంగి పోయి, జ్యూస్ దేవుని ప్రోల, దేవతల దివ్యశాసనాలముందర మోకరించుటకు ఆతడు అంగీకరించలేదు. ఏస్కిలస్ మహాకవి ప్రొమిత్యూస్ పాత్రను సృష్టించి, అజరామరం గావించేడు. ఇక సాఫోక్లిస్ కవి ఆంతిగోనీ పాత్రలో మానవుల కుండ వలసిన కొన్ని గుణాలను బహు శక్తివంతంగా చూపించేడు. ఆంతిగోనీ స్త్రీసహజమైన సోదరప్రేమ గలది. సోదరుడు పాపియేగావచ్చు. కాని, లోకంలోని శక్తు లెన్ని అడ్డినను ఆంతిగోనీ తన సోద రుడు ఓరిస్టిస్ కు అపరకర్మలు గావించే తీరింది. సోదరునిపట్ల తన అంత్యధర్మాన్ని నెరవేర్చడానికి ఆమె భయమందలేదు. ఈ తప్పునకై ఆమెకు మరణదండన విధించబడింది. పరిస్థితులకు లొంగక, సోదరునిపట్ల అవ్యాజప్రేమ చూపి, సాంఘిక శాస నాల్ని ధిక్కరించినందుకై ఆంతిగోనీ దండించబడింది. కాని, ఆమె హృదయంలోని ప్రేమను మానవకృతమైన యే శాసన మున్నూ పెరికివేయజాలక పోయింది. బృందగీతంలోని వాక్యా లను విన్నప్పుడు శ్రోతల హృదయాల్లో విద్యుదాఘాతం కొట్టి నట్లయింది.

ప్రకృతిలో అద్భుతశక్తులెన్నో వున్నాయి. కాని, అవేవీ నరుని మించినవిగావు; శీతలవాయువులు వీచు కాలంలోనైనా హేమంతపు తుపానుల్లో తరగల జొచ్చిపోవు; అజరామరమైన భూమాత యెద మీదనే ఏటేటా నాగేటితో చాళ్లుచేస్తాడు; ఆకాశాన యెగిరే పక్షులూ, అఖాతజలాల యీదే చేపలూ వలల్లో బంధిస్తాడు; పవన వేగంగల జనవాశ్వాలను మచ్చిక చేశాడు; బలమైన బలీవర్దముల

> కాడికి పూన్చేడు; హేమంతపు మంచుతుపాను లతనికి లెక్కే లేదు; వర్షర్తు జలధారలతనికి జీవనధారలు; సర్వరుజల కౌషధశాంతుల నన్వేషించె; కాని, మృత్యువొకటే దురతిక్రమమైనది; వాక్కు నేర్పరించె, మనోవేగము నమించె, బహుపుర నిర్మాత, శాసనస్థాత స్వీయజన సంపదల రక్షింప దక్షుడు; బుద్ధిలో, ఉపాయశాలిత్వంలో కర్తృసు కౌశలంలో సంపన్నుడు.
>
> ఆశలచేగాక ఆశయాలచే నడువనేర్చె.

ఆహా! మానవుని శక్తి నెంత సమర్థంగా చిత్రించేడు, కవి! మానవుడు స్వీయబలాన్ని గుర్తింప నారంభించిన కాలమది.

ఒకప్పుడు ప్రకృతి మానవుణ్ణి శాసించేది. ఆమె కనుబొమ ముడికే ఆతడు వణకిపోయేవాడు. ఆమెముం దాతడు సాంజలియై మోకరిల్లువాడు. హేమంతపు హిమపాతానికీ, గ్రీష్మపు వడగాడ్పులకూ, వర్షకాలపు వరదలకూ ఎందరెందరో చనిపోయేవారు. క్రమంగా తలదాచుకొనుటకు నివాసాలు, అందులో అగ్నిని స్థాపించుకోవడం నేర్చుకున్నాడు. అగ్నిని కాపాడుకునే కృషిలోనే సమిధలను సమకూర్చుకోడం, కుటీరాన్ని నిలబెట్టడం సాధించేడు. *

---

* వైదికవాఙ్మయంలో యీ దశను నిరూపించే శబ్దాలు యెన్నో వున్నాయి. 'దంపతు'లను మాటలో దమ్ = ఇల్లు, పతి = యజమాని అని అర్థంవుంది దంపతులనగా గృహయజమానులైన స్త్రీపురుషులన్నమాట. ఇది చాల ప్రాచీనశబ్దము. గృహము, అందులో అగ్ని, దానిని కాపాడే మిథునము తప్పక ప్రతిదెగకూ, గణానికీ ఉండే కాలంలోనే యీ సమాసం వాడుకలోకి వచ్చింది. — అనువాదకుడు.

మానవు డిప్పు డిప్పుడే ప్రకృతిశక్తుల్లో కొన్నింటిని జయించు తూన్నాడు. కవి యీ విషయాన్నే యిల్లా చెప్పేడు :

ప్రకృతి మనల్ని జయించాలనుకుంటే కౌశలంతో మనమే దాన్ని జయించేం.

మానవుడు భూమిని దున్నేడు. నీటి మీద పోయేందుకు నావలను నిర్మించేడు. వాయువును పడవలు నడపడంలో తోడ్పాటు చేసుకున్నాడు. అగ్నిని శీతలబాధ పోగొట్టు కోడా నికే గాక అన్నం పచనం గావించేటందుకూ, లోహాదులను కరిగించేటందుకూ ఉపయోగించేడు. భూమి తనకు అన్న మును, పానీయములను యిచ్చునట్లు చేసుకున్నాడు.

శీతువును తన యింటిదగ్గరికి చేరనీయలే దాతడు. సము ద్రాలమీద తుపానులు చెలరేగి అల్లకల్లోలం గావిస్తూన్నా తన నావలు సురక్షితంగా ఉండేటందుకు ప్రశాంతమైన నౌకా శ్రయాల నేర్పరచుకున్నాడు.

ప్రప్రథమంలో ఆతడు దేవతలు వినా మరే శక్తినీ, జగ త్తును శాసించే దాని నెరుగడు. దేవతలు తన బిడ్డలను బలి యిమ్మన్నా యెంతమాత్రం సందేహించక యిచ్చేసేవాడు. *

యూరిపిడీస్ రచించిన 'ఇఫిజెనియా' నాటకంలోని బృంద గానంలో యిల్లా వుంటుంది : "ఆర్తెమిస్ దేవతా, అదృష్టదేవ

---

* హరిశ్చంద్రుడు వరుణునికి తన పుత్రుని బలి యిస్తానంటాడు. కాని తప్పించుకొన ప్రయత్నిస్తాడు. ఈకథ వేదములలో నున్నది. దేవతలను గికు రించే కోరిక అప్పటినుంచే వున్నట్లుంది ! — అనువాదకుడు.

తలూ నీమీాద కార్పణ్యం వహించినట్లున్నారు, ప్రియతమా ! ఇఫిజెనియా !" ఆమె విముక్తయై, గౌరవనీయ అయింది. ఇఫిజెనియా అంటుంది: "దేవతలేగానీ, ధర్మబద్ధులు, న్యాయశీలురు గానిచో వారు దేవతలేగారు !"

అదివరలో కులీనులతోనూ, ప్రభువులతోనూ సామాన్యజనులు నోరెత్తి మాటలాడువారే గారు. తెగ లేక జాతి జనులందరూ సమావేశమైనప్పుడు సామాన్యుడెవడైనా లేచి మాట్లాడబోతే రాజు తన దండంతో వానిని కొట్టి 'ఇతరులు పెద్దలున్నారు. వాళ్ళు చెప్పేది విను !' అని కూర్చోబెట్టువాడు. అట్లాంటి దిపుడు జనులు గణసభలలో తామే పాల్గొని నిర్ణయాలు గావిస్తూన్నారు. తమ తెగకు నాయకుల్ని తామే యెన్నుకుంటున్నారు. ఆ నాయకులు యోగ్యంగా ప్రవర్తించకపోతే వారిని తామే పదభ్రష్టుల్ని గావిస్తూన్నారు.

జనులు స్వతంత్రులై సంతుష్టులుగా వున్నారు. ఆ సంతుష్టియే, ఆత్మగౌరవమే వారికి పదింతలు బలాన్నిచ్చి, శత్రువులపైన విజయాన్ని యిస్తూంది.

## డెమోక్రిటస్

నిట్టంగావున్న పర్వతమార్గం వెంబడే దుర్గమమూ, దురత్యయమూ నైన శిఖరంమీాదికి మానవులు మెల్లగానే కానీ, యెక్కుతూ బోతూన్నారు. మబ్బుల్లో మంచులో లీలగా కని

పిస్తూన్నది, గమ్యస్థానం. అక్కడెక్కడో వుంది తెలియవల సిన నిజం. అతని కండ్ల ముందు దిజ్మండలంవరకూ వ్యాప్తమైన పథదృశ్యం అంతకంతకు విస్తృత తరంగా ఆనుతూంది.

క్రమంగా మానవుడు తన కండ్లముందర నీ విశాలవిశ్వపు అసీమమైన విస్తృతిని గాంచు యుగ మాసన్నమైంది. అంతే గాదు. ఆకాశమందలి మహాగోళముల యొక్కా భూమి మీంది అల్ప రేణువుల యొక్కా నిర్మాణంలో యిమిడివున్న పరమాణువులను అతడు వీక్షించే సమయం రానే వచ్చింది. వీటిని గూర్చి ప్రప్రథమంలో చెప్పిన గ్రీకువిజ్ఞాని డెమోక్రిటస్. ఈ అనంత విశ్వాన్ని గూర్చిన రూపకల్పన గావించిన మహామేధావి యీతడు.

థ్రేస్ రాజ్యంలోని అబ్దేరా నగర నివాసి, యీ డెమోక్రిటస్. అబ్దేరా నగరంలో అందరి చేతనూ గౌరవించబడే డెమోసిప్పస్ ఈతనికి తండ్రి.

పర్షియా చక్రవర్తి జైత్ర యాత్రా సందర్భంలో నొకసారి అబ్దేరాపట్టణానికి వచ్చేడు. ఆయనకు డెమోసిప్పస్ మిత్రుడు. ధనికుడూ, ఉదారుడూ నైన డెమోసిప్పస్ ఆతిథ్య గౌరవాలకు పర్షియాచక్రవర్తి ప్రీతుడయేడు. చక్రవర్తి తిరిగి పోయేటప్పుడు డెమోసిప్పస్ నేదైనా కోరుకోమని చెప్పేడు. డెమోసిప్పస్ కేవలం ధనమేగాక వివేకంకూడా గలవాడు. అతడు తన కుమారుల విద్య విషయమై చక్రవర్తికి నివేదించుకున్నాడు. పర్షియా చక్రవర్తితోకూడ నిరంతరం తూర్పు దేశాల విద్వాం

సులు, పండితులు, శాస్త్రజ్ఞులు కొలువుతీరి వుంటూండేవారు. వారిలో కొందరు విద్వాంసులను డెమోసిప్పస్ బిడ్డలకు విద్యగరపుటకు చక్రవర్తి దిగవిడచి పోయాడు.

తూర్పు దేశాల పండితులు, జ్ఞానులు, గ్రీకు సాంప్రదాయిక దృష్టితో గాక మరొక దృష్టితోనే వస్తువిషయాదులను చూచువారు. అసంఖ్యాకమైన దేవతల నారాధించేవాళ్ళూ, విగ్రహాలను పూజించేవాళ్లూ కేవలం అవివేకులని వారిభావం. రెండు ప్రపంచాలున్నవనీ; వాటిలో మొదటిది మహాప్రపంచం—విశ్వమనీ; రెండోది అల్పప్రపంచం—మానవుడనీ వారి వాదన.

ఈ గురువులు డెమోక్రిటస్‌కు అన్ని విద్యలు నేర్పుతూన్నారు. భారతీయ పండితుల బోధనలనుగూర్చి కూడ వీరే అతనికి చెప్పేరు. ఈ జగత్తు సర్వమూ పరమాణువుల కలయిక వల్లనే యేర్పడుతూందనే వాదం కూడ యీ భారతీయ దర్శనాల్లో ఒకటి. ఎన్నో చుక్కలు కలిస్తే గీతలు, కొన్ని గీతలు కలిస్తే తలములు, తలములు కలిస్తే ఘనములు తయారవుతూన్నాయి. చుక్కలలో అణువులేకదా వుంటాయి. పరమాణువాదం అని దీనినే పిలిచేవారు.

తూర్పుదేశాల విజ్ఞానాన్నీ, విచారధారలనే గాక గ్రీకు సాంప్రదాయిక విజ్ఞానాన్నికూడ కూలంకషంగా మరొక గురువు చేత చెప్పించేరు, డెమోక్రిటస్‌కు. ఆ గ్రీకు పండితుని పేరు లూసిప్పస్. ఈయనవల్లనే మిలిథుస్ తత్త్వవేత్తల బోధనలను డెమోక్రిటస్ గ్రహించేడు. విశ్వమందలి ప్రతిదానికీ పదార్థమే మూలమని వాటి సారాంశం.

తండ్రి మరణానంతరం డెమోక్రిటస్ అబ్దేరా నగరమందలి సంపన్నులలో నొకడయేడు. స్వగృహంలో సుఖంగా నివసిస్తూ, శాంతిసమృద్ధులతో, అధికార గౌరవాల నందుతూ ఉండగల డాతడు. ప్రజ లాయనను 'అర్కోన్' అనగా ప్రధాన న్యాయ మూర్తిగా కూడ యెన్నుకున్నారు. డెమోక్రిటస్ గౌరవా ర్థమై నగరరాజ్యంవా రొక నాణెమును కూడ ముద్రించేరు. ఆ నాణెముపై ఆయన పేరు, వీణె బొమ్మ ఉండేవి. కాని, కుడిచి కూర్చుండుటే కైలాసంగా భావించే తత్త్వం కాదు ఆయనది. ఈ సుఖ జీవితం నిజమైనది కాదని డెమోక్రిటస్ భావం. జ్ఞాన తృష్ణ ఆయనలో బలీయంగా ఉండేది. అందు చేత డెమోక్రిటస్ జ్ఞానాన్వేషణాతత్పరుడై, యిల్లువిడచి, దేశాటనకై బైలుదేరేడు.

"నా కాలంలోని జను లందరి లోనూ నేనే విశేషంగా విదే శాలు పర్యటన గావించేను. అతి దూర భూములలోని విషయా లను కూడ సేకరించుకొని వచ్చాను. భూమ్యాకాశాలలో విశాలతర భాగాల్ని పరిశీలించేను. ఎందరెందరో పండితులు, విజ్ఞానులతోనూ సంభాషించాను. వారి బోధలు విన్నాను." అని ఆయనే వ్రాసుకున్నారు.

డెమోక్రిటస్ స్వదేశానికి యెట్టకేలకు చేరుకునేసరికి ఆతడు చేత కాసులేనివా డయ్యేడు. సోదరుడేగనుక ఉండేందుకు ఇల్లు యీాయనిచో ఆయనకు తల దాచుకొను చోటే లేకపోయి వుండేది. ఆయన తన సంపద నంతనూ దేశాటనమునకై,

యాత్రలకై వెచ్చించేడు. వర్తకులూ దేశాలన్నీ తిరుగుతారు గాని వారు అందువల్ల ఆర్జించేది ధనం. ఈయన విజ్ఞాన ధనం కోసమై విద్యార్థియై లోకమంతా తిరిగేడు. ధనం వ్యయమై, విద్య సమకూడింది. ఆయన తీసికొనిపోయిన ప్రతి ఓడయును వ్యయమూలకమే ఐనదిగాని ఆదాయమును దెచ్చినది గాదు.

ఏ దేశానికైనా, పట్టణానికైనా కావలసినవి సంపదలు, వెండిబంగారాలు. విద్య, విజ్ఞానం కూటికా? గుడ్డకా? అని చాలమంది అనుకుంటారు. అబ్దేరా పౌరులు ఈయన చేసినది చూచి చాల కంటగించుకున్నారు. తా మెంతో గౌరవంతో చూచిన యీతడు, తమ నగరానికి సంపదలను ఆకర్షిస్తాడను కున్న యీ డెమోక్రిటస్ ఆకతాయి కుర్రవానివలె పూర్వార్జి తాన్నే పాడుచేసేసేడు! తండ్రి యిచ్చిన ధనరాశుల నన్నిం టినీ ఐగుప్తు, పర్షియా మొదలైన విదేశాలలో రాజమార్గాల మీద వెదజల్లేడు!

దేశ సంపదను వమ్ముచేసినవా డెవడైనాసరే ఆతడు దోషిగా పరిగణించబడే కాలం, అది. డెమోక్రిటస్‌ను విచారణకు బెట్టేరు. న్యాయాధిపతుల యెదుటకువచ్చి, ఆయన ఓ పెద్ద గ్రంథాన్ని విప్పేడు. తన్ను సమర్థించుకొనే వాదనలను గాదా యన యేకరుపెట్టింది! ఆ గ్రంథాన్ని చదువనారంభించేడు, వాళ్ళముందు. 'విశ్వస్వరూపం' The Great Order of the Universe అను ఆ గ్రంథం యెందుకు చదువుతూన్నాడో న్యాయాధిపతులకు మొదట అర్థంకా లేదు. సృష్టిక్రమాన్ని,

విశ్వరూపాన్నీ గూర్చిన ఆ గ్రంథస్థ విషయాలకూ, అతనిపై తేబడిన అభియోగాలకీ సంబంధమే లేదు! కానైతేనేమి? ఫిర్యాదీలు కూడా తమ పితూరీలను మరిచిపోయేరు. న్యాయాధిపతులు శిలాప్రతిమల్లాగ వింటూండిపోయారు. డెమోక్రిటస్ చదివిన విశ్వరూప వర్ణన మంత అద్భుతంగా ఉంది!

పఠనం పూర్తి ఐన తరువాత న్యాయాధిపతులు తీర్పును చదివి వినిపించారు: "డెమోక్రిటస్ మన నగర సాంప్రదాయాలనూ, శాసనాలనూ అతిక్రమించలేదు."

ఆయన తన యాత్రలకై వేనవేలు టాలెంటులను ఖర్చు చేసినమాట నిజమే. (ఒక్కొక్క టాలెంట్ సుమారు పంథొమ్మిది వీసెల బరువు గలిగి, మూడువేల రూపాయల విలువ గలది.) కాని దీనికి మారుగా ఆయన మరో రకమైన సంపదను,-విజ్ఞాన సంపదను గొని వచ్చాడు. అబ్దేరా వర్తకు లెవ్వరూ యింతవరకు యిల్లాంటి లాభసాటి వ్యాపారమును చేసి వుండలేదు! ఆయన తెచ్చిన విజ్ఞాన సంపదకు వెల గట్టగల షరాబు లేడు! పైగా న్యాయాధిపతు లేమన్నారంటే డెమోక్రిటస్ పండితునికి ఐదువందల టాలెంట్లను బహూకరించాలనీ, ఆయన జీవితకాలం లోనే కాంస్య విగ్రహాన్ని స్థాపించాలనీ, చనిపోయాక అపరకర్మల కగు ఖర్చు అంతా నగరమే భరించాలనినీ!

కాని, డెమోక్రిటస్ అంత శీఘ్రంగా చనిపోవలసినవాడు గాడు. ఆయన దగ్గరకు మళ్లా ధనం వచ్చింది. దానికి కూడా

విజ్ఞానాన్వేషణలోనే ఖర్చుపెట్టాలని ఆయన నిశ్చయించుకున్నాడు. ఈసారి ఆయన ఏథెన్సుకు బైలుదేరాడు. ఏ గ్రీకు నగరంలోనూ లేనందరు పండితులు అక్కడున్నారు, మరి. అనక్షగోరస్, సోక్రటీస్ మొదలగు మహానుభావు లెందరెందరో!

తన గ్రంథములను గూర్చి ఏథెన్సు వాసులు ఆవరకే యెరిగి వుంటారనుకున్నా డాయన. కాని, తీరా తా నచ్చటికి వెళ్లేక తనపేరేనా అక్కడ యెవరూ యెరుగరని డెమోక్రిటస్ తెలుసుకున్నాడు. తాను సోక్రటీస్ పేరు యెరుగును కాని ఆయన తన పేరు యెరుగడు. డెమోక్రిటస్ అనక్షగోరస్‌ను సందర్శించేడు. కాని, పూజనీయుడైన ఆ వృద్ధపండితుడు తనను శిష్యుడుగా గాని, మిత్రుడుగా గాని స్వీకరించలేదు. జ్ఞాన స్వరూపుడైన ఈశ్వరుని యందు విశ్వాసం లేని యీ యువ విజ్ఞాని, అద్వైరా తత్వవేత్త, అనక్షగోరస్‌కు యెంతో చిరాకు కలిగించేడు. ఒలింపియన్ శిఖరవాసులైన దేవుళ్ళను నిరాకరించిన ఘటికుడు అనక్షగోరస్ పండితుడు. కాని, యీ విశ్వరూప మహా యంత్రాన్ని మొట్టమొదట చలనంలో పెట్టిన మహాశక్తి యేదో ఒకటి ఉండే ఉండాలని అనక్షగోరస్ నిర్ణయించేడు. * ఆ శక్తి ఉనికినికూడ డెమోక్రిటస్ విజ్ఞాని నిరాకరించేడు. ఈ ప్రకృతే

---

* మన వైశేషికులున్నూ అణువులం దేనివల్ల సంయోగ వియోగాలం పొందుతున్నాయా ? అనేదానికి అణూనాం కర్మ అదృష్టకారితం। అని జవాబిచ్చేరు. —అనువాదకుడు.

అనంతమూ, అనాదీ యనిన్నీ, అంచేత దీని ప్రారంభాన్ని గూర్చి మాట్లాడటంలో వివేకమే యనిన్నీ ఆయన అన్నాడు.

డెమాక్రిటస్ భావాలు చాల దుస్సాహసయుక్తము లని అనక్షగోరస్ అభిప్రాయం. అనక్షగోరస్ అభిప్రాయాలు యుక్తిసహములు గావనిన్నీ, అందుచే నిర్జీవములనిన్నీ డెమాక్రిటస్ అభిప్రాయం.

వృద్ధతత్వవేత్తలు డెమాక్రిటస్ అభిప్రాయాల నంగీకరించక పోయినా యువకు లాతని భావాలను, మాట మాటనూ అత్యాతురతతో స్వీకరించేవాళ్లు. అటుపిమ్మట కొన్ని యేళ్ళకు, డెమాక్రిటస్ వృద్ధాప్యంలో ఆయన గ్రంథాలు బహుళ ప్రచారంలోకి వచ్చి, యీ సృష్టిక్రమాన్ని గూర్చిన సిద్ధాంతాలను జనుల కందరకూ కరతలామలకం గావిస్తూండేవి.

ఆయన గ్రంథం చదువుతూంటే పాఠకుల నా వృద్ధవిజ్ఞాని ఒక ప్రపంచంలోనుంచి మరో ప్రపంచంలోకి, అనంతపథం గుండా తీసికొని పోతూన్నట్లుండేది! ఎగురుట కాయనకు రెక్కలు లేవు. కాని ఆయన ఆకాశ పథానికి పోయి యెవరూ చూడని వాటిని చూచేవాడు. ముందుతరాల వారెవ్వరూ చూడనివీ, తెలుసుకోనివీ ఆయన చూచేడు, తెలుసుకున్నాడు. ఈ భూమి ఒక బొంగరంలాంటి దన్నాడు. దీనిచుట్టూనూ, సూర్యచంద్రాది గోళాళచుట్టూనూ మహావాయువులు వీచుతూంటాయి. జల ప్రవాహంలో యిసుక రేణువుల్లాగ యీ మహా వాయుపథంలో చిన్న చిన్న మిణుగురులు కొట్టుకుపోతూంటాయి. గమన వేగాని

కవి చాల వేడెక్కి, యెర్రగా కాలి అతుక్కుపోతూ వచ్చాయి.* వాటిని ఆర్పడం అసాధ్య మవడంవల్ల అవే వివిధ గోళాలుగా అయినాయి. ఈఅసంఖ్యాకలోకాల్లో యేరెండూ ఒక్కపోలికగా లేవు. ఇద్దరుమనుష్యులు ఒక్కపోలికగా ఉండనట్లే నన్న మాట. అవే సూర్య చంద్ర భూమ్యాదులు. వాటిలో కొన్నిటికి చంద్రులున్నారు. కొన్నిటికి సూర్యుడున్నాడు. మరికొన్నిటికి సూర్యచంద్రాదు లెవరూ లేక పూర్తిగా అంధకార మయంగా వుంటాయి. కొన్ని లోకాల్లో శబ్దమే ఉండదు. కొన్ని అరాబియా యెడారివలె నిర్జలములుగా ఉంటాయి. కొన్నిలోకాలు తేజోవంతములు. మరికొన్ని ఇంద్రధనుస్సులా సప్తరశ్ములు కలిగి, నిరంతర శ్రావ్య సంగీతముతో నిండివుంటాయి !

ఈ సజీవ లోకాలకి ప్రక్కనేకొన్ని మృతగోళాల తునకలు, అవశేషాలు ఉంటూంటాయి. అవికూడా గిరగిర తిరుగుతూ, కొన్నికొన్ని కలిసి నూతనలోకాలుగా తయారవుతూంటాయి.

మానవుల వలెనే యీలోకాలున్నూ ఒండొంటితో సంఘర్షిస్తూ, పోట్లాడు కుంటూంటాయి. ఆ యుద్ధాల్లో పెద్దవాటికే విజయం లభిస్తూంది. చిన్నవి తునాతునక లైపోతాయి. కాని, మళ్లా యీ తునుకలలోనుంచే కొత్త లోకాలు, కొత్త భూములు, కొత్తసూర్యులు జన్మిస్తూంటాయి. ప్రదేశం అనంత

---

* అస్య బ్రహ్మాండస్య సమంతత: స్థితా న్యేతాదృశా న్యనంతకోటి బ్రహ్మాండాని స్థావరాణి జ్వలంతి ।

అను మహా నారాయణోపనిషత్ వాక్యం గమనార్హము.

మైనది.*1 లోకాలు అనంత సంఖ్యాకములు*2 వీటిసంఖ్య కూడా నిరంతరం మారుతూంటుంది?

అటుతరువాత డెమోక్రిటస్ తన శిష్యుల్ని బ్రహ్మాండ గోళాల రాజ్యం నుండి పరమాణు లోకానికి గొంపోతాడు. ఈ పరమాణువులతోనే సమస్తమూ నిర్మించబడినాయి. జగద్రహస్యం వీటిలోనే ఉంది. అణువుల సంయోగం వల్లనే బ్రహ్మాండగోళాలన్నీ, ఖగోళాలన్నీ, తక్కిన వస్తువులన్నీ నిర్మించబడినాయి.

గురువు శిష్యులతో యిల్లా చెప్పేడు: 'ఒక పాత్రలో బూడిద నింపండి. దానిలోకి నీటినిపోస్తే కాళీగావున్నప్పటివలె కొంతనీరు దానిలో యిముడుతుంది. మరొక పాత్రను నీటితో నింపి, గట్టిగా మూతబెట్టి, నిప్పుమీద కాచండి. కాగిన నీరు పాత్రను పగులగొట్టుకుని పైకివచ్చేస్తుంది!'

ఎందువల్ల యిల్లా జరుగుతూంది? ఈ లోకంలోని సమస్త వస్తువులూ,బూడిద, నీరు మొదలైనవన్నీ కూడా కోట్లకొలది కణములతో, పరమాణువులతో నిర్మించబడినాయి. అవి బహు సూక్ష్మములగుట చేత మనం వాట్లని చూడలేము. ఐతే అవి

---

* 1 దిక్ అనవచ్ఛిన్నమైనదని భారతీయ దర్శనములంటాయి.

*2 *సంఖ్యాచేత్ రజసామస్తి విశ్వానాం నకదాచన । ప్రతి విశ్వేషు సంత్యేవ బ్రహ్మ విష్ణు శివాదయః ॥*

లోకము లనంతములనీ, వాటన్నిటికీ సృష్టి స్థితి లయములనే అవస్థాత్రయము లున్నవనీ భారతీయుల భావన. — అనువాదకుడు.

వున్నాయని యెల్లా తెలుసుకుంటున్నాము? త్వక్ చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణము లైదు జ్ఞానేంద్రియముల చేతా మనం గ్రహించ జాలని యే సూక్ష్మవస్తువునైననూ ఆరవదైన మనస్సుయొక్క సాహాయ్యంవల్ల గ్రహించగలము.

బూడిదతో నింపిన పాత్రలో నీరు పోస్తూంటే, అది పైకి పొర్లిపోలేదు. అప్పుడు మన మనస్సు విశదీకరిస్తుంది, బూడిద పరమాణువులను ప్రక్కకు ఒత్తిగించి జల పరమాణువులు చోటు చేసుకున్నాయని. సంతలోని జనసమూహంలోంచి మరొకవ్యక్తి సందుచేసుకుంటూ త్రోసికొని పోయినట్లున్న మాట !

మూసి బిగించిన జలపాత్ర నగ్ని మీద ఉంచినపు డది విచ్చి పోవడం చూసి, మనస్సు విపులీకరిస్తుంది– జలపరమాణువులు వేడిమికి పెద్దవై, తమను బంధించివుంచిన జైలుగోడలను బ్రద్దలు చేసినాయి.

దేవాలయంలో స్వామివారి స్వర్ణవిగ్రహం ఉంటుంది. దాని స్వర్ణహస్తం కొన్ని యేళ్ళయేసరికి అరిగి తరిగి పోయి వుంటుంది. ఎల్లా తరిగిపోయిందా ? అని మనకు ఆశ్చర్యం కలుగుతుంది. అప్పుడు మనస్సు విశదపరుస్తుంది– భక్తులు దానిని స్పృశించడంవల్ల బహు సూక్ష్మతర అణువులు దాని నుండి విడివడిపోతూ అది చిన్నదవుతూంది. అనగా అరిగి పోతూందని అర్థం. చీమలు ప్రాకిన శిల లరుగునను సామెత ఊరికే పుట్టలేదు !

ఈ రీతిగా స్పష్టమైన విషయాలు కొన్నిటిని చూచి, అస్ప ష్టమై మరుగున వున్న కొన్ని సంగతులను తెలుసుకోడానికి అవకాశం వస్తూంది. "ప్రత్యక్షేణా ప్రత్యక్షస్య సంబద్ధస్య ప్రతి పత్తిః అనుమానం" అన్న న్యాయసూత్రంలో చెప్పినట్లు పొగనుబట్టి నిప్పున్నదని ఊహించునట్లు మనసే తోడ్పడు తూంది. దీనినే అనుమాన ప్రమాణం అంటాము.

డెమోక్రిటస్ బోధనా విధానం యిల్లా వుండేది. ఆయన తరువాత నాయన శిష్యప్రశిష్యులుకూడ అదృశ్యాణువులు, పరమాణువులు గూర్చి పరిశీలనలు, పరిశోధనలు సాగించారు.

పరమాణు ప్రపంచంలో విరామ విశ్రాంతులు లేనేలేవని డెమోక్రిటస్ చెప్పేడు. అణువులు నిరంతరాయంగా పరిభ్ర మిస్తూ, పరిక్రమిస్తూ, సంఘర్షిస్తూ, సంయోగం పొందుతూ, చిన్నా పెద్దా అనేక వస్తురూపాలుగా నిర్మాణం చెందుతూ న్నాయి. ఇంటికప్పు రంధ్రంలోనుంచి పడే సూర్యరశ్మిలో బహుసూక్ష్మములైన అసంఖ్యాక రేణువు లిటునటు నాట్యం చేస్తూంటాయి. వీటినే పీలువులంటాము. అవి అన్ని రకాల రూపాల్లోనూ వుంటాయి. కొన్ని గుండ్రంగా, కొన్ని చతుర స్రంగా, కొన్ని కోణాలుగా, కొన్ని చిన్నవిగా, మరికొన్ని పెద్దవిగా ఉంటాయి. కాని, వీటికి యెప్పుడూ మార్పు అనేదే వుండదు. ఇవి అభేద్యములు. అణువు లొండొంటితో కలిసి నప్పుడు వివిధవస్తు రూపాత్మకములుగా ప్రత్యక్షమవుతూ న్నాయి. అవి విడిపోయి, దూరంగా యెగిరిపోయినప్పుడు

వస్తురూపాలు అదృశ్యములవుతూన్నాయి. నిరంతరము, అనంతము ఐన యీ పరమాణు స్పందనములవల్లనే వివిధ రూపములు, వర్ణములు, రుచులు, వాసనలు మొదలైనవి సృష్టించబడుతూన్నాయి.

పరమాణువుల దగ్గరనుంచి తిరిగి ఒకసారి నక్షత్రలోకానికి వద్దాం.

ప్రదేశపు అనంత అవకాశాల్లో పరమాణువులు గందరగోళంగా గిరున తిరుగుతూ పరిభ్రమిస్తూంటాయి. ఆ పరిస్థితుల్లో సాధర్మ్యంగల వాక చోటికి చేరుతూంటాయి. (సాధర్మ్యం వైధర్మ్యంచేతి ద్వివిధం సంయోగం – ద్రవ్యగుణయోః సజాతీయారంభకత్వం సాధర్మ్యం కణాదుని వైశేషికసూత్రాలు) ఎట్లంటే ఒకజాతి పక్షులు ఒక మందగా చేరినట్లు. పావురాలు పావురాలతో జట్టుకడతాయి; కొంగలు కొంగలతో చేరుతాయి. అల్లాగే నన్నమాట. సజాతీయాణువుల యీ ఆకర్షణవల్ల పరమాణువుల పరిభ్రమణ కక్ష్యలు మారుతూన్నాయి. సుడిగాలిలో చిక్కిన ధూళి, ప్రవాహపు సుడిలో చిక్కిన పుల్లలు వలెనే యివి గిరగిర సుడులు తిరుగుతాయి. సుడిగుండాల్లో భారమైనవి మధ్యకు చేరడం, తేలికైనవి వెలుపటి అంచులకు చేరడం మనం చూస్తూనే వుంటాము. సరిగా అల్లాగే యిక్కడా జరుగుతుంది. భారమైన పరమాణువులు కేంద్రానికి లాగబడి, తేలికైనవి ప్రక్కలకి గెంటబడతాయి. బ్రహ్మాండమనే యీ పెద్ద సుడిగుండంలో కూడా యిల్లాగే జరుగుతూంది.

సమ్మర్దంగా ఉండే చోటులోని జనులమాదిరిగానే యీ పరమాణువులు కూడ ప్రవర్తిస్తాయి. మొదట్లో జనం పల్చగా ఉన్నపుడు వారొకరొకరితో జోక్యం లేకుండానే విశాలంగా తిరుగుతారు. కాని, చోటులోకి జనం చేరుతూన్నకొద్దీ సంఘర్షణలు పెరుగుతాయి. బలమైనవాళ్ళు ఒత్తిడికి తట్టుకుని నిలద్రొక్కుకుంటారు. బలంలేనివాళ్లు ప్రక్కలకి ఒత్తిగిలిపోతారు.

ప్రపంచ కేంద్రానికి ఆకర్షించబడిన బరువైన అణువులు భూమిగా యేర్పడ్డాయి. అంతకన్న తేలికైనవి జల రూపంలో దాని మీదికి చేరినాయి. చాలా తేలికైన వాయు పరమాణువులు కేంద్రాన్నుంచి యింకా దూరంలో చేరినాయి.

జల పరమాణువులు భూకేంద్రానికి చేరబారి, దానిమీది రెండు పల్లపు ప్రదేశాలను నింపినాయి. వాటిలో నొకటి మధ్యధరాసముద్రము. దానిచుట్టూ జనులు నివసిస్తూన్నారు. భూమికి ఆవలివైపున రెండో పల్లం వుంది. అక్కడకూడ జనులు నివసిస్తూనేఉండాలి. వారి పాదాలు మిాదికి ఉంటాయి. అందుచే వారిని యాంటీ–పోద్ (anti pode) లంటే 'విరుద్ధపాదులు' అనవచ్చును. మనకు 'పైన' అయినదే భూమి ఆవలి ప్రక్కవారికి 'క్రింద' అవుతుంది!

భూమి మార్పుజెందుతూనే వుంది. సముద్రతలమును బైటబెడుతూ, జలం ఆవిరిగా మారుతూంది. అందుచేతనే నత్తగుల్లలు వగైరాలు ఉన్నత పర్వతాలమీాద కూడ కానవస్తూన్నాయి; పర్వతగుహాల్లో మత్స్యముల శిలాజములు, తిమింగిలాదులైన జలచరముల కంకాళములు కనబడుతూన్నాయి.

భూమి గిరగిర తిరుగుతూ ఆకాశంలో పరుగిడుతూ నేవుంది. దారిలో అది పృథుశిలాతలములనూ, యితర గోళాల తునుక లనూ కలుసుకుంటుంది. అవికూడ భూమితో బాటు తిరుగుతూ, ఉపగ్రహాలైనాయి. భూమికి యెంత దూరంగా ఉంటే అంత వేగంగా అవి తిరుగుతాయి, అంత అధికోష్ణం వాటిపై జనిస్తుంది.

ఇంక మరి యీ భూమిమీదకు జీవజంతువులు అస్తిత్వం లోని కెట్లు వచ్చినాయి ?

ఆ తత్త్వవేత్త దీనికి జవాబు నిట్లు ఊహించి చెప్పేడు : భూమి యింకా పూర్తిగా గట్టిపడకముందే లోనున్న ఉష్ణా ధిక్యతవల్ల దాని ఉపరిభాగాన బుద్బుదరూపమైన ఉబుకులు బైలుదేరినాయి. చెట్లమీద చిగుళ్ళు పొటమరించినట్లుగా యీ బుద్బుదాలు విచ్చిపోయి, వాటిలోనుంచి వివిధప్రాణులు బైలుదేరినాయి. పృథ్వీ అణువులు అధికంగాగలట్టి ప్రాణులు భారంగావుండి, నేలమీద నివసిస్తూన్నాయి. జలాణువు లధి కంగా గల ప్రాణులు జలచరములుగా వున్నాయి. అతితేలి కైన వాయు అణువులతో కూడినట్టివి రెక్కలుగలవై గాలిలో యెగురుతూన్నాయి. యీ ప్రథమ ప్రాణుల్లో చాలమట్టుకు పూర్తిగా నశించిపోయినాయి. కొన్నిమాత్రం వాటి ఉపాయ శాలిత్వం, సాహసం, వేగంవల్లనూ రక్షించబడి మిగిలి వున్నాయి.

ఈ ఆదిమ ప్రాణులనుంచి మానవుడు తరువాత వచ్చాడు. మొదట మానవుడు జంతువుల వలెనే నగ్నంగానే ఉండేవాడు. ఇల్లు లేదు, బట్టలు లేవు, నిప్పు యెరుగడు, నిరంతరం భుక్తి కోసం తడుముకుంటూండేవాడు. ప్రతి మనిషీ తానుగాపోయి తినదగినట్టి తృణ విశేషాలనూ, పండ్లను, దుంపలను వెతికి తీసి కొని తింటూ, సెలయేళ్ళలో నీటిని త్రాగుతూ కాలక్షేపం చేస్తూండేవాళ్ళు. అది స్వర్ణయుగం మాత్రంగాదు. జనులు బహు శ్రమ పడాల్సి వుండేది. బలహీనులు చాలమంది నశించి పోతూండేవాళ్లు, పురుగుల్లాగ. బలవంతులు, లాఘవం గల వాళ్ళు మాత్రం యెల్లాగో జీవించి వుండగలిగేవాళ్ళు.

క్రూర జంతువులనుంచి ఆత్మరక్షణ గావించుకోవడంలోనే మానవులు పరస్పర సహకారం గావించుకో నారంభించేరు. భయభీతులే వారి నొక్కొక్కచోటికి మందలుగా చేర్చినాయి. క్రమంగా వారొకరినొకరు పరిచయం చేసికోవడం జరిగింది. కటుతరమైన అనుభవాలవల్ల ప్రబోధితులై మానవులు గుహాంతరాల్లో రక్షణ తీసుకుంటూ, వర్ష కాల శీతకాలాలకోసం కంద మూల ఫలాదులను, గింజలను భద్రపరచుకో నారంభించేరు. అగ్నిని మచ్చికచేయడం నేర్చుకుని, చేతిపనులు ప్రారంభించేరు. కోకిల వారికి పాడడం నేర్పింది. పిచ్చుక గూడు కట్టుకోడం చూపింది; సాలీడు నేతనేయడం బోధించింది. చీమలు కలిసి కృషిచేయడాన్ని, తేనెటీగలు ఆహార సంచయాన్ని చెప్పినాయి. కళలు, వ్యుత్పన్నత మొదలైనవి దైవదత్తములు

గావు. మానవులకి గురువు, బోధకుడు, ప్రతి విషయంలోనూ, యే మినహాయింపూ లేకండా 'అవసరం' అనేదిమాత్రమే. ఏపని చేయడానికైనా 'అవసరం' * యేర్పడినప్పుడే మానవుడు పూనుకుంటూ వచ్చాడు. తరువాత నా పని చేయడంలో నేర్పు సంపాదిస్తూ వచ్చాడు.

క్రూర మృగాలతో పోట్లాడడమే మానవులను గుంపులు గుంపులుగా ఒకచోటికి దెచ్చిన తరువాత వాళ్లు త్వరలోనే తమలోతాము పోట్లాడుకోడం ఆరంభించేరు. ఒకడు మరొకనియం దసూయచెంది, యేదో ఒక అపురూప వస్తువు నాతని నుంచి లాగుకో ప్రయత్నిస్తూ వచ్చేవాడు. అందువల్ల ఒక రొకరికి అపకృతి గావించుకోకండా నిబంధనలను చేయుట అనసరమైంది.

రాజ్యాంగమనేది యిందువల్లనే ప్రాముఖ్యత వహిస్తూన్నది. ప్రతి వ్యక్తీ రాజ్యాంగాన్ని వీలైనంత నిర్దుష్టతరం గావిస్తూండాలి. తనకు రావలసిన దాని కంటె అధిక గౌరవాన్ని ఆశించకండా, మొత్తం సాంఘికక్షేమానికి అవసరమైనంతవరకే

---

* అవసరం — Necessity అను నీమాటకు తాత్త్విక పరిభాషలో మనం 'కర్మ' అని నిర్వచించుకోవాలి. కర్మ ప్రారబ్ధమై అంటే ప్రారంభించబడినదై యొడతెగనిది అవుతూంది. తరువాత నిదే మానవుని సాధారణంగా నడుపుతుంది. కాని, మానవునికి 'స్వేచ్ఛ' కూడావుంది. ఇదే పురుషకారం. పురుషకారం ప్రారంభించబడినాక అది మళ్లా పారంపర్యంగల దవుతూంది. స్వేచ్ఛాప్రారబ్ధం, పరేచ్ఛాప్రారబ్ధం అనికూడ ప్రారబ్ధంలో భేదాలున్నాయి. — అనువాదకుడు.

అధికారాన్ని చేజిక్కించుకో యత్నిస్తూండాలి. రాజ్యాంగం క్షోభ రహితంగా ఉంచేనే ప్రతీదీ కుశలంగా వుంటుంది. అది నశించేటట్లయితే మిగతా సర్వమున్నూ కూడా నశించిపో తాయి.*

సమానత్వం అత్యద్భుతమైన భావం. రాజరికంలో ధన వంతుడుగా నుండుటకంటె ప్రజాతంత్రంలో బీదవాడుగా నుండుటయే అధిక వాంఛనీయము. ముప్పొద్దులా గుడుచుచు బానిసగా నుండుటకంటె ఒక్కపూట తిన్నైనా స్వేచ్ఛా జను డుగా నుండుటే వాంఛనీయము గదా ......

లోకంలోని సమస్తమూ యీ విధంగా సృజించబడి, నడు స్తూన్నాయి. భూమి, సూర్యుడు, సముద్రాలు, పర్వతాలు, మానవుడు, మానవుల చట్టాలు, సర్వమూ కూడా దైవోద్దిష్ట ములుగా గాక కార్య కారణ సూత్రంయొక్క అనివార్యత చేతనే అభివ్యంజకము లవుతూ వచ్చాయి.

డెమోక్రిటస్ బోధనలు యీ రీతిగా వుండేవి. వాటిని పఠిస్తూ, ఆ గురుశిష్య పరంపర నక్షత్రాల నుంచి పరమాణు

---

* ఈ భావాన్ని మన భారతీయ సాంప్రదాయంతో పోల్చి పరిశీలించండి.

*గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం।*
*లోకాస్సమస్తాః సుఖినో భవంతు।*
*దేశోయం క్షోభ రహితో బ్రహ్మణాస్సంతు నిర్భయాః।*

మానవుని శారీరక స్థితికి అవసరమైన గోవును, మానసిక సాంఘిక సువ్య వస్థకై బ్రహ్మణు లనగా విద్వాంసులను ముందుగా భద్రంగా చూసుకోవా లని దీనిభావం. — అనువాదకుడు.

వులకున్ను, పరమాణువులనుంచి నక్షత్రాలకున్నూ పునః పునః ప్రయాణాలు గావిస్తూ, వచ్చేరు. మిలిథుస్ నివాసి లూసిప్పస్ పండితుడు గూడ యీ విధమైన పరమాణు విజ్ఞానాన్ని యెరిగివున్నవాడే. ఆయన బోధనలతో కూడ డెమోక్రిటస్ బోధనలు సరిపోల్చి చూడబడినాయి. ఈ విశాల అనంత సృష్టియొక్క పటం ఒకటి కొత్తగా రచించబడి, మానవజాతి కొసగబడింది. డెమోక్రిటస్ సిద్ధాంతాలు గ్రంథరూపం దాల్చినాయి.

## పురోగాములు – అనుయాయులు

మానవ మహా ప్రస్థానంలో యీ ఘట్టానికి వచ్చుసరికి దారి రెండుగా చీలింది. ఆ కూడలి దగ్గర మానవులు నిలిచి యున్నారు. కుడివైపు బోతే నాదారి నక్షత్రముల బ్రహ్మాండ లోకాలకూ, యెడమకుబోవు నీదారి పరమాణువుల సూక్ష్మ ప్రపంచానికీ గొనిపోతాయి. తరువాతి రెండువేలేండ్లలో మానవుడీ రెండు మార్గాలలోనూ పురోగమించేడు. మానవుడు మహా పర్వతాలను, సముద్రాలను, యెడారులనూ కూడా స్వాధీనతకు దెచ్చుకొని, వాటిని వెల్లడి గావించేడు.

తాను నివసించు నదీతీరమే యావత్ప్రపంచమూ ననుకొనే కాలమొకటి ఉండేది గదా. ఆ తరువాత నీ భూమండలం సముద్ర ముద్రితమై వుందనిన్నీ, సముద్ర మధ్యంలోని భూప్రదేశంలోనే జనులు చెరువులోని కప్పలవలెవున్నారనిన్నీ అను

కునేవారు. ఆ తర్వాత మానవుని ప్రపంచం యింకా విస్తృత మైంది. ఈ భూమి వృత్తాకారంగానో లేక గోళాకారంగానో ఉన్నదని మానవు డూహించేడు. ఆఖరికి యీ సృష్టిలో అసంఖ్యాకములైన గోళము లున్నాయనీ, యిట్టిదే విశ్వ స్వరూప మనిన్నీ భావించేరు.

ఇంక రెండో మార్గం వెంటకూడ మానవుడు బైలుదేరేడు. అదే సూక్ష్మలోకం, పరమాణు ప్రపంచం. ఇసుక రేణువులే అత్యల్పతమ వస్తువులని అతడు భావించిన కాలం ఒకటి ఉండేది. మహా పర్వతాలు ఏ రీతిగా అరుగదీయ బడుతున్నాయో, ధాన్యపుగింజలు తిరుగలిలో యేరీతిగా పిండిగా చేయబడుతూన్నాయో, దేవాలయంలోని లోహ విగ్రహాలు యేరీతిగా అరిగి తరిగి పోతున్నాయో మానవుడు గమనించేడు. తన్నే తానొక ప్రశ్న వైచుకొన్నాడు. 'ఈ సూక్ష్మ కణములను యింకా విభాగం చేస్తే యేమవుతుంది?' సూక్ష్మ కణములు యింకా సూక్ష్మకణములతో నిర్మించబడినాయని ఆతడు నిశ్చయించుకున్నాడు. ఐతే యిదే కొసా? ఎక్కడో అక్కడ తప్పకండా కొస వుండే తీరిందని అతడు అనుకున్నాడు. అనంతంగా యిల్లాగే సాగుతూంటాననీ, దీని కెక్కడా అంతం లేనే లేదనీ భావించడం చాల కష్టతరమైనది. ఇక నెంతమాత్రం విభజించ శక్యంగాని సూక్ష్మతర అణువులతో నీ లోకమందలి సమస్త వస్తువులూ నిర్మించ బడినాయని నిశ్చయం గావించుకొన్నాడు, మానవుడు. ఈ సూక్ష్మతర కణములకు 'పరమాణువు' లేక 'అవిభాజ్యము' అని పేరుపెట్టాడు.

ఈ విధంగా మహాబలుడైన మానవుడు రెండు మార్గాల్లోనూ పురోగమనం సాగించేడు.

ఔను! వ్యక్తి మానవు డెట్టివాడైనా మానవజాతి మాత్రం ఒక మహాశక్తియే! కోట్లాది వ్యక్తులతో గూడిన యీ మహాసైన్యం అతి శక్తివంతమైనది. అతిరథులు, మహారథులు ఐన మహాత్ములు ఒకరిద్దరు పురోగమిస్తూంటే సామాన్యజనులు అత్యధిక సంఖ్యాకులైనవాళ్ళు వెనక దిగబడిపోతూ, తోకపీకుడుగా ఉంటూ వచ్చేరు.

పురోగామి దళంలోనివారే లూసిప్పస్, డెమోక్రిటస్ ప్రభృతులైన విజ్ఞానులు. ఈ మహాజను లొకవైపున యిట్టి మహత్తర సత్యాల్ని నిర్వచిస్తూంటే మరొకవైపున చాలమంది మౌఢ్యం, మూఢాచారాలూ, సంకుచితత్వం, కుక్షింభరత్వంలో మునిగి వుంటూన్నారు. అడుగో! ఆ బీద కుంభకారుణ్ణి చూడండి. ప్రొయ్యిమీద నరమేష రూపంగల దేవతా విగ్రహాన్ని వ్రేలాడదీసి, భూతప్రేత పిశాచాది దుష్ట గ్రహ పీడలను దరికి రాకండా కట్టుదిట్టం చేసుకున్నాడు! ఈ కుంభకారుడే బానిసలచే చచ్చే చాకిరీ చేయించుటలో సంకోచించడు. వాళ్ళని తిట్టి, కొట్టి, బాధిస్తూంటాడు. బానిసల నీతడు మానవులుగానే పరిగణించడు. ఒక బానిస చక్కని కుండ నొకదాన్ని చేసి యిచ్చినపుడు, దానిని తయారుచేసిన దెవరో మరచి, ఘనత యావత్తూ తనదే యైనట్లుగా ప్రగల్భాలు చెప్పేవాడు. బానిస లెంతపని గావించినా వాళ్ళకి ఒక్క కాసుకూడా ముట్టదు!

అప్పుడప్పుడు యెవడో అదృష్టహీనుడైన బానిస యేదో శోకగీతం ఆలాపిస్తూ, ఆ కుంభకారుని కర్మశాల గుమ్మంవద్దకు వచ్చేవాడు. యజమాని ఆ నిర్భాగ్యుని చూచి, ఆ శోక గీతాన్ని విని, తనమీద యిది యే శాపనార్థాన్నో విసరుననీ భయపడతాడు. శాపం గనక తగిలిందంటే తీరా సరుకు తయారైనాక అమ్మబోతే అడివిగా తయారై లాభం గూబ ల్లోకి వస్తుంది! కనుబొమలు చిట్లించి, పళ్ళు బిగించి ఘుర్ఘు రిస్తూ, యేదో కాసో వీసమో జేబులోంచి తీసి వానికి ముష్టి వేసి పొమ్మంటాడు! అతగానికి యింకా మంత్ర తంత్రాలు, శాపాలు, దృష్టితగలడం వగైరాలంటే చచ్చేటంత నమ్మకం! ఈలాంటి ఆసామీలు చెప్పాల్సివస్తే యెందరో! వీరంతా కూడ డెమోక్రిటస్‌కు సమకాలీనులే, సజాతీయులే.

అంతవర కెందుకు? డెమోక్రిటస్ బోధనలలోనే సనాతన విశ్వాసాల చిహ్నాలున్నాయి. ఆయనకు దేవుళ్ళయందు విశ్వాసం లేకున్నా దృష్టిదోషం ఉంటుందని నమ్మేవాడు! అసూయాపరుడైన మనుష్యుడు శాపనార్థాలు పెట్టగలడని ఆయన నమ్మకం! డెమోక్రిటస్ చిన్నతనంలో చదువుచెప్పిన పర్షియన్ పండితులు మంత్ర తంత్రాది విద్యల్లోనికి అతడిని ప్రవేశపెట్టేరు. అందుచేత డెమోక్రిటస్ శకునాలు, స్వప్న ఫలాలు, అదృష్టం, గ్రహచారం మొదలైన వాటియందు నమ్మకం గలిగి యుండేవాడు.

మంత్ర తంత్ర విద్యలు, రసవాదం మొదలైన వాటిల్లోంచి విజ్ఞానం మెల్లమెల్లగా అభివృద్ధి చెందుతూంది. కాని జను

లందరూ, అన్నప్పుడూ మంచిచెడ్డలను, సత్యాసత్యాలను, హేతువాద విశ్వాసాలనూ విడమర్చి చెప్పలేరు. సాంప్రదాయిక విశ్వాసాలకు గల బలమును యిది స్పష్టంచేస్తోంది. డెమోక్రిటస్ వంటి పండితుడే యెంత ప్రయత్నించినా యీ ప్రాచీన అకారణ విశ్వాసాల నుంచి పూర్తిగా విముక్తుడు గా లేక పోయాడు !

ఆయన యిల్లా అన్నారు: "వెనుకటి రోజుల్లో మంత్ర కత్తెలు సూర్యచంద్రాదుల్ని ఆకాశపథంనుంచి తొలగించ గల రని జనులు నమ్మేవాళ్ళు. మన కాలంలో కూడ చాలమంది గ్రహణాలను గాంచినపుడు యిటువంటి తొలగింపే జరిగి వుంటుం దనుకుంటారు."

డెమోక్రిటస్ యెప్పుడూ ప్రతి కార్యానికి ప్రాకృతిక కారణాల్ని అన్వేషించేందుకే ప్రయత్నించేవాడు. అసూయా ద్వేష భావాలు గలవాని చూపులో విషం యెందువల్ల వుంటుంది? బహుశః అటువంటి వాని కండ్లనుండి దుష్టమైన కిరణాలు వెలువడి, జనుల లోకి చొరబడి, వాళ్లకి హాని చేస్తాయేమో ! ...మానవులకు దుస్స్వప్నాలు యెందుకువస్తాయి? నిద్రలో కూడ మంచి చెడ్డ భావాలు, ఛాయలు వాళ్ళ మనస్సుల్లో ఉంటూనే వుంటాయి గనుకనేమో !... చూపులు, ఛాయలు మొదలైనవి కేవలం అయదార్థములే గావు. వివిధ వస్తువుల నుంచి వెలువడిన వాయు పరమాణువులు ఐవుంటాయి. ఈ పరమాణువులే కంటిని జొచ్చినపుడు కన్ను చూడగలుగుతుంది. ఇవే చెవిని జొచ్చినపుడు మనం వినగలుగుతాము.

ఈ రోజున, యిరవైనాలుగు శతాబ్దాల అనంతరం డెమోక్రిటస్ భావాలు అమాయికంగానూ, కళా విహీనములుగానూ గాన్పించవచ్చు. నేడు పరమాణువులంటే డెమోక్రిటస్ నిర్వచించిన వాటికంటె విభిన్నమైనవని మనం యెరుగుదుము. పరమాణువుల స్వభావ ప్రవర్తనలను వివరించేందుకు మనం వాటిని కొంగలతో గాని, బజారులోని జనంతో గాని పోల్చము. పరమాణువులను శాసించే సూత్రాలకున్నూ, పక్షిజాతులను, గ్రీకు పౌరులను నడిపే సూత్రాలకున్నూ సంబంధం లేదని మనకు తెలుసు. అందుచేత డెమోక్రిటస్ చూచిన 'సత్యం' నేడు మనకు 'సత్యం' గాజాలదు.

ఏదేమైననూ ఆధునిక విజ్ఞానశాస్త్రాలు డెమోక్రిటస్ బోధనలతో ఆరంభించేయని చెప్పవచ్చును.* ఆయన గ్రంథాలు పూర్తిగా మనకీనాడు లభించవు. కాని, మిగిలియున్న గ్రంథ శకలాలను చూచినను, కాలవశం గాకుండా యున్న భావాలు వజ్రపు తునకలవలె అత్యద్భుతంగా మెరుస్తూ గానవస్తాయి. ఆయన చెప్పిన పరమాణువులు మనం అనుకొనే పరమాణువులు గాకుంటే వచ్చిన పుట్టి మునకేమీ లేదు లెండి! కొన్ని లోపాలుండనీ గాక డెమోక్రిటస్ పండితుడు అదృశ్య పరమాణు ప్రపంచమును సరిగానే నిర్వచించేడని చెప్పితీరాలి.

---

* ఈ విషయంలో కణాదకృత వైశేషిక దర్శనమును ప్రథమ విజ్ఞాన శాస్త్ర బోధనగా విజ్ఞులు చెప్పుతూన్నారు. పదార్థపు పరమాణు నిర్మాణమును, పదార్థము అవినాశ్యమనిన్నీ అది నిర్వచించింది. — అనువాదకుడు.

'గమనం' లేక కదలిక యొక్క నిత్యత్వం, విశ్వముయొక్క అనాది, లోకముల అసంఖ్యాకత్వం, ప్రాణుల్లో సమర్థమైనవే మనగలుగుట, మిగిలియుండుట మొదలైన డెమోక్రిటస్ సిద్ధాంతాల్లో యెన్ని యీనాటి మన విజ్ఞానులచే అంగీకరించబడినాయి ? ఆయన గావించిన నేరసుల కేమిటెందు ! వాటికై ఆయనను తప్పు పట్టుట యుక్తి యుక్తముగాదు !

ఆకాలంలోకి డెమోక్రిటస్ మహామేధావి, పండితశ్రేష్ఠుడు. ఐనను అందరివలెనే ఆయన కూడా పరిసరములు, దేశకాల పాత్రలుచే నియమితుడూ, పరిమితుడూ అవుతున్నాడు. అల్ప సంఖ్యాకులకు పెత్తనము, ప్రజాతంత్రము, బహుళ సంఖ్యాకులకు బానిసత్వముమీద ఆధారపడియుండిన సాంఘిక విధానంలో ఉండిన డెమోక్రిటస్, స్థితిగతులు వారి వారి అదృష్టముచే నిర్ణయించబడతాయని భావించేవాడు. 'నీ కాలుచేతులనుపయోగించినట్లే బానిసల నుపయోగించుకో!' అనేవాడాయన. సమానతయందు నమ్మకం గలవాడైనను అలగా మూకలకి రాజ్యాంగాధికారం ఉండరాదని వాదించేవాడు. సంపన్న కులీనులైన ప్రభువర్గాలమీద తిరుగుబాట్లు గావించే 'ఓడమాలీ మూకలకి' అధికారం యిస్తే లోకం నడవదని డెమోక్రిటస్ అనేవారు.

రాజ్యాంగంలో గానీ, అణుప్రపంచంలో గానీ బలవంతులదే అగ్రతాంబూలము. బీదలు, అధములు, హీనులు ప్రభుత్వాధికారం వహించేందుకు తగినవాళ్లు కారు.

ధనికులైన బానిస యజమానుల భావాలే యివి. డెమాసిప్పస్ కుమారుడైన డెమోక్రిటస్ భావాలు యివే.

## అంతు దొరక్కుండానే మార్గం ఆఖరైంది.

అదృష్టంమీద అధికారం సంపాదించి, తాను స్వేచ్ఛనొందడానికి పురుష ప్రయత్నం చేస్తూ మానవుడు చాల దూరం ప్రయాణం గావించేడు.

కాని, గమ్యం యింకా చాల దూరంవుంది. ఇంతలో సంబర పడేందుకు వీలు లేదు.

స్వాతంత్ర్యానికి పుట్టినిల్లు ఏథెన్సు నగరమే అన్నారు. కాని, అది మిథ్యావాదమే కావచ్చు. ఎందుచేతనంటారా ? అక్కడే నగర వీధులలో నొసట కాల్చిన ఆనవాళ్ళతో తిరిగే యీ మానవు లెవరు ? చెరుపరాని మచ్చ, 'నేను బానిసను ! నన్ను పట్టుకోండి ! ' అని ఆహ్వానిస్తూన్నట్లున్న ఆ నొసటి మచ్చతో నున్న వీరే బానిసలు. ధాన్యమును నూర్చుచున్న యీ స్త్రీల మెడలలో నీ విచిత్రపు కొయ్యకంటె లేమిటి ? బజారులో అన్ని సరకులవలెనే అమ్మకానికి ప్రదర్శించబడు తూన్న యీ విదేశీయులు మానవులే కాదా ?

కొనడానికి వచ్చిన గృహస్థులు యీ బానిసలను ఒళ్లు పట్టి చూచీ, అటునిటు పరుగెత్తించీ, పెలివలు పరీక్షించీ, కండలు ముట్టుకునీ, సంతలో పశువులనువలె చూస్తూన్నారే ! స్వేచ్ఛా

స్వాతంత్ర్యాలు వున్న మానవులనైతే యిట్లు అమర్యాదకరంగా చూడగలరా ?

లేదు ! వాళ్ళంతా బానిసలు గనుకనే పాపమూ దురదృష్ట వంతుల్ని యిట్లు పరిశీలించు సాహసము ! ఏథెన్సులో స్వతంత్ర పౌరుల సంఖ్యకంటె నీ బానిసల సంఖ్య యెన్నో రెట్లధికము. ఎక్కడచూసినా బానిసలే. ఏ పని చేసినా బానిసలే. వంటచేయడం, పిల్లలను పెంచడం, అంగళ్ళలో పనులు, కార్ఖానాల్లో చాకిరీ, అన్నీ బానిసలే చేస్తారు.

పిండి విసరు నామె బానిసే. ఆమె మెడలోని కొయ్య కంఠె ఎందుకో తెలుసా ? విసరుచున్న గింజలను నోట బోసికొని తినకుండుటకే ఆ మెకా కంఠె ! బజారులో నిలబెట్టి, విక్రయిస్తూన్న వారందరూ కూడ బానిసలే. అన్నివస్తువులవలెనే వీరినీ అమ్ముతారు. ఒక యెద్దు ఖరీదు నూరు డ్రాక్మాలు. మన రూపాయివంటి వెండి నాణెమది. బానిస మనిషి ఖరీదు కూడ సుమారు యింతే వుంటుంది. ఒక్కొక్క బానిస వెల నూరు నూటయేబది డ్రాక్మాలు. ఏదేనా కార్ఖానాను అమ్మేటపుడు, దానితోబాటు అందులో పనిచేయు బానిసలనూ విక్రయించేవాళ్లు. మూడు దాగళ్లు, మూడు సమ్మెటలు, ఐదుగురు బానిసలు. ఏథెన్సులో యే మనిషిని పలకరించినా సరే, బానిసలు లేనిచో సంఘం ఒక్కరోజు కూడ నడవ దంటాడు. పండితుడూ యిదే మాట, పామరుడూ యిదే పలుకు ! బానిస అంటే సజీవమైన పనిముట్టు అన్నమాట.

అంతకంటె భేదం యేమీలేదు. పడవమీది చుక్కాని, తెడ్డు,—యివి నిర్జీవమైన పనిముట్లు. చుక్కానికాచే బానిస, తెడ్డువేసే బానిసలు, వీళ్లు సజీవమైన పనిముట్లు. భేదం యింతకంటె వేరేమీ లేదు. కాని, తాము పనిముట్లమని అంగీకరించేటందుకు బానిసలంత సుముఖులుగా వుండేవాళ్ళు గారని గుర్తుంచుకోవాలి. దాగలి మీద ఎన్ని దెబ్బలు కొట్టినా అదేమీ బాధపడదు, దాని మనస్సు వికలమూగాదు. సమ్మెటకి స్వాతంత్రమంటే తెలియదు. కాని, బానిస ఐనా మానవునికి అనుభూతి వుంది. కొడితే బాధ, తిడితే అవమానం, పెడితే తృప్తి వున్నాయి, వుంటాయి.

తన కష్టాల్నిగూర్చి యెంతగా ఆవేదన జెందితే అంత తీవ్రంగా బానిస, యజమానిని ప్రతిఘటించి నిలబడతాడు. తన యిష్టమును యజమాని యిష్టానికి వ్యతిరేకంగా ఒడ్డి యెదుర్కొంటాడు.

సమ్మెట దాగలి మీదనుంచి యెగిరివచ్చి, కమ్మరి నెత్తిమీద దెబ్బతీయ జాలదు. అల్లాగే దాగలి రాత్రివేళ కమ్మరంలోంచి పారిపోయి, అడవిలో దాగొననూ లేదు.

కాని, బానిస యిల్లా చేయగలడు, తరచు చేస్తాడు.

ఈ రీతిగా సజీవమైన పనిముట్లు బానిసలకూ, వాటి యజమానులకూ పోరాటాలు ఆరంభమయ్యాయి. బానిసలు తిరుగబడే వాళ్లు. కమ్మరం పాకలనుంచీ, కార్ఖానాలనుంచీ, గనులనుంచీ, పారిపోయేవాళ్లు యెక్కువైనారు. గని పనివానికి

పోయేందు కేముంది? ఎడారిలో ప్రాణికి గుక్కెడునీరు కరవైవట్లే గనిలో పనివానికి ఊపిరి పీల్చుకునేందుకు గాలికూడా అపురూపనే. ఆఖరి కాతడు గాలి లేకండా చావాల్సిందే. సజీవమైన పనిముట్లు పారిపోయి అరణ్యాల్లోనూ, పర్వతాల్లోనూ దాగొంటున్నాయి. వాళ్ళని తరిమి పట్టుకున్నపుడు ఆనవాలు ముద్రలు కాల్చివేసి, బొండకొయ్యలు తగిలించేవాళ్ళు. ఇద్ద రిద్దరికి యీ రీతిగా దారునిర్మితమైన బొండకొయ్యను వేసే వారు. రాత్రులు వాళ్ళను తాళంపెట్టేస్తారు. ఒకడు లేచి నిలుచుంటే రెండోవాడు క్రిందపడునట్లుగా ఉండేది, దాని యేర్పాటు. అతి యిరుకైన రాతికొట్లలో వాళ్ళని బంధించే వారు. ఆ గదులు సన్నగా, యిరుకుగా వుండేవి. కాలుచాచి పండుకొనేందుకు గాని, తలెత్తుకు కూర్చునేందుకు గాని చాలని యిరుకుకొట్లు, అవి. రక్తమాంసాలతో గూడిన మనుష్యుల్లాగ కాక రాళ్లూ పాషాణాలూ వలె చూచేవారు, వీళ్ళని. వాళ్లకి కూడ కష్టసుఖాలూ, సుఖదుఃఖాలూ వున్నట్లు పరిగణించే వారేగాదు!

ఎవరు తమ స్వాతంత్ర్యాన్ని ప్రాణాధికంగా చూసుకొనే వారో, ఎవరు మానవ శరీరంయొక్క సౌందర్య స్నిగ్ధత్వాలను గూర్చి మిక్కిలి మెచ్చుకొనేవారో, ఆ నాగరకులైన ఎథీని యనులే బానిసలైన తోటి మానవులపట్ల యిల్లాటి కృపణ వృత్తి చూపుతూండే వారని జ్ఞాపకం వుంచుకోండి.

తమ యీ కృపణావృత్తి చివరకు తమకే ప్రమాదకరమని వారు గుర్తించలేకపోయారు! మొదట యింకా యెక్కువ

బానిసలను సంపాదించేటందుకై వారు నిత్యమూ యుద్ధాలు చేయవలసి వుండేది. మరేమో యుద్ధాలు అత్యధిక వ్యయమూలకము లాయెను. ప్రతీ యుద్ధమూ దేశాన్ని వినాశం వైపుకే గొంపోతూ ఉండేది. క్రమంగా యజమానుల కంటె బానిసల సంఖ్య బాగా పెరిగిపోతూ వచ్చేది. ఎథీనియనులు అందరూ బానిసలను కలగివుండేటంతటి సంపన్నులు గారు. బానిసలు గాని స్వేచ్ఛాపౌరులు కొందరుండేవాళ్ళు. వాళ్ళు యేదోపనులు చేయడం, సైనికులుగా బోవడంవల్లా జీవిస్తూండేవాళ్ళు. కూలియిచ్చి పౌరులచే పని చేయించుకోడం కంటె సజీవమైన పనిముట్టు, బానిసను కొనుక్కోడం చౌకగా ఉంటుంది. ఒక కొత్తబానిస ఏథెన్సులోనికి తీసికొని రాబడినాడంటే ఒక స్వాతంత్ర పౌరునికి పని పోతూండేది. యుద్ధాలనుంచి తిరిగివచ్చిన సైనికులకు జీవనోపాధులు దొరకడం అసాధ్యమైపోతూ వచ్చింది. ఏథెన్సులో యేడాది యేడాదికీ నిరుద్యోగులైన పౌరుల సంఖ్య పెరిగిపోతూంది. తాము స్వాతంత్ర పౌరులమన్న గర్వం తప్ప వారి కింకే ఆస్తిపాస్తులూ లేవు. రోజులు గడిచినకొద్దీ జీవయాత్రను సాగించేటందుకై నాలుగు డబ్బులు 'గోకి' తేవడం దుస్సాధ్యమైపోతూంది. వాళ్ళ రాబడి అంతా ప్రోగుచేస్తే బహిరంగ సభలకు ఆహ్వానితులై వెళ్ళినపుడు ప్రభుత్వం యిచ్చే మూడు ఓబోల్స్ (ఓబోల్ అను ప్రాచీన గ్రీకు నాణెం సుమారు అణాన్నర విలువ గలది.) మాత్రమే. ఆ సభలు జరుగుతూండ

గానే, అక్కడి గోడవా గందరగోళంలోనే, పిల్లికూతలూ బుసకొట్టడాలూ మధ్యనే చాలమంది తినుబండములు, మద్యమూ కొనుక్కొచ్చి, తింటూ తాగుతూ కేరింతాలు కొడుతూండేవాళ్లు. రాను రాను క్రమంగా యిటువంటి సుదినాలు కూడా ఎథీనియనుల జీవితంలో తక్కువయిపోతూ వచ్చాయి.

ఈ నిరుద్యోగ పౌరులు న్యాయస్థానాల్లోకి గుంపులుగా మూగుతూండేవాళ్లు. న్యాయస్థానాల్లో పంచాయతీదారులుగాను, మధ్యవర్తులుగానూ స్వతంత్ర పౌరులనే యేర్పాటు చేసేవారు. అల్లాగ నియమితులైన వాళ్ళకి దినానికి మూడు ఓబోల్సు భత్యం యిచ్చేవారు. తమకు అటువంటి అవకాశం వస్తుందేమోననే వీళ్ళు అక్కడికి మూగేవాళ్ళు. తిండీ, పదవీ కూడా లభిస్తే మరి కావాల్సిందేముంటుంది ? అది లభించిన రోజున నక్క నడుంత్రొక్కి వచ్చిన వారే ! వారి రొట్టె విరిగి నేతబడినట్టే !

కాని, నిరుద్యోగులందరికీ పంచాయితీ దారులు గానో, మరో పనిలోనికో తీసికొనబడే అవకాశం దొరకదుగదా. మరేదేనా ఉపాయాంతరం ఉందా ? ఆఁ ! ఉంది. ఏ వ్యాజ్యంలోనైనా ఫిర్యాదీగా ఉన్నవాళ్ళకి కూడ భత్యం యిచ్చే ఆచారం ఉండేది, ఏథెన్సులో. గాన చాలమంది పౌరులు తోటివాళ్ళ మీద అబద్ధపు ఫిర్యాదులు చేసేవాళ్లు. లేదా యెవరిమీదనో తప్పుడు ఫిర్యాదు చేస్తానని బెదిరించి, వాళ్ళ దగ్గరనుంచి డబ్బు

గుంజుకునేవాళ్ళు! ఇట్టి పాడుపనులే నిత్యకృత్యంగా, బ్రతుకు తెరువుగా పెట్టుకున్న వాళ్లుండేవారంటే పరిస్థితు లెట్లుండేవో ఆలోచించండి.

వీధుల్లో తిరిగే క్షుద్బాధితుల సంఖ్య దిన దినానికీ పెచ్చు పెరిగి పోతూంది. ధనికు లెదురైతే వాళ్ళని మింగేసేటట్లు చూసేవాళ్లు, యీ జనులు. సంపన్న కుటుంబీకులు సుందర వస్త్రాలంకారాలు ధరించి, మట్ట మధ్యాహ్నపు వేళల్లో సౌధ ప్రాంగణాల్లోని చెట్లక్రింది చల్లని నీడల్లో సుఖాసీనులై బాతా ఖానీ కొడుతూనో, సుగంధతైల స్నాతులై బాగా అలంకరించు కొని, సువాసనలు వెదజల్లుతూ యే సంపన్న మిత్రుల యింటి విందుకో బోతూనో కనబడితే ఆ దురదృష్టవంతులు బిభీషికగా చూసేవాళ్లు. కనీసం యిరవై డ్రాక్మాలు (యిదొక వెండినాణెం) విలువచేసే నెల పొడవుటంగీ ధరించి, ఠీవిగా రొమ్ము విరుచుకొని నడుస్తూ పోతూండే ప్రభువుల్ని చూస్తే వీళ్ళకి మరీ కళ్ళల్లో కారం చల్లినట్లుండేది. ఇరవై డ్రాక్మా లంటే మాటలా, మరి? ఒక కుటుంబం మూడు నెలలు సుఖంగా బ్రతికేందుకు యీ మొత్తం చాలునే! ఆ సంప న్నుల వెంబడే బానిసలు పరుగెత్తుతూ, మడత కుర్చీ మోసు కెడుతూండేవాళ్ళు. ఆయన దారిలో యెక్కడైనా కూర్చుని విశ్రాంతి తీసుకోవాలనుకుంటే, కుర్చీ వేయడానికే యీ బానిసలు కూడా వెళ్ళడం! మరికొందరు యజమానులు లాలకీల్లో కూర్చుని, బానిసలచే మోయించుకొని వెళ్ళేవాళ్లు.

వాటి నాలుగు కొమ్ములూ యెనిమిదిమంది బానిసలు మోస్తూంటే, యిద్దరు బానిస లిరుప్రక్కలా పరుగులెడుతూం టారు. ఈ రకంగా బానిసల కాళ్ళకీ చేతులకీ కూడా పని కల్పించేవారు. ఉన్నవాళ్ళ సంపదలకూ, ధనానికీ పరిమితే లేదు. విదేశాలనుంచి వాళ్లు తేనె, సువాసన ద్రవ్యాలు, కుక్కలు, సన్నబట్టలు మొదలైనవి దిగుమతి చేయించుకునీ వాళ్ళు. పర్షియానుంచి వచ్చిన రత్నకంబళ్ళతో వారి గృహ కుడ్యాలు అలంకరించబడి ఉండేవి. వాళ్ళకి మరేమీ పని లేనం దున కోతుల్ని పెంచుతూ, వాటికి కొంటెపనులు నేర్పు తూండే వాళ్ళు.

ఏథెన్సులో స్వాతంత్ర్యమే ఉంది గాని, దాని పునాది బానిసత్వం. ఆ విధానం కొందర్ని బండచాకిరీ చేసేవాళ్ళనిగాను, కొందరిని పనిలేనివాళ్లుగను, మరికొందరిని సోమరులుగా, పరి శ్రమోపజీవులు గాను చేస్తూండేది. సోమరులైన ధనికులను నిరుద్యోగులు ద్వేషించేవాళ్ళు. అప్పట్లో ఏథెన్సులో రెండు జీవిత విధానా లుండేవి. ఒకటి కటికి పస్తుల బ్రతుకు, రెండోది కుక్షింభరత్వం, భోగలాలసత్వంతో గూడినదీను. నిరుద్యో గుల క్రోధం దినదినానికీ పెచ్చుపెరుగుతూ, బహిరంగ సమా వేశాల్లో గలాటాలను రేగొట్టు దశకు వచ్చింది. ఆ నాటి ప్రధాన సమస్య, యీ తుపాను నివర్తించే మార్గ మేమిటా? అనేదే. అక్రోపోలిస్‌లోని దేవాలయాలకూ, అక్రోపోలిస్‌కూ చుట్టూ శిలాప్రాకారాల్ని నిర్మించే పనిలో యీ నిరుద్యో

గుల్ని నియమించేరు. కాని, యీ పనంటే యెంత? అంద రికీ యీ పనులు చాలవు. అదీగాక యిది యెంతకాలం వుం టుంది? అదీగాక, నిజం చెప్పాలంటే ఏథెన్సులో పౌరులు అసలు పనంటేనే పశువృత్తక్కువ అనేవాళ్లుగా తయారయేరు! బానిసలు వుంటూన్నప్పటినుంచిన్నీ పనిచేయడమంటే బానిస లకు అర్హమైన, అవమానకరమైనదనే భావిస్తూన్నారు. పని చేయడం అవమానకరమైనదనీ, మర్యాదగల పౌరులు చేయ దగినది గాదనీ వాళ్ల భావం! ఒకానొకప్పుడు యే పనీ చేయ కండా సోమరులుగా ఉండడమంటేనే అవమానకరంగా పరిగ ణించబడే కాలం ఉండేది! ఆ కాలంలో దేవతలు సోమరుల నాశీర్వదించరని చెప్పబడేది. కాని నేడో? పనిచేయడనే అవమానకర మనుకునే కాలం వచ్చింది. పనిచేయడం శరీ రాన్నీ, మనసునూ కూడ మొరటు దేరునట్లు చేస్తాయనే వాళ్ళు. "మనిషి దినమంతా నడుంవంచి పని చేస్తూంటే అతని వెన్ను వంగే వుంటుంది. అల్లాంటివాడు రాచకార్యాల్ని గురించి యోచించేందుకు అవకాశమే వుండదు. పని చేయా ల్సినవాడు ఆత్మాభివృద్ధికై కావలసిన దేనినీ ఆలోచించ జాలడు. శరీరం అలసిపోయి, బలహీనంగా ఉంటే ఆత్మకూడా తన బలాన్ని కోల్పోతుంది."

మానవులకు ఆలోచించడం నేర్పినది పని లేక కర్మయే. కాని, వారిప్పుడు పనిచేయడాన్నే అసహ్యించుకొంటున్నారు. మహా మేధావియే గానిండు, అతడుకూడ అనుభవం ద్వారానే

ఆలోచించడం నేర్చుకొని వుంటాడు. అటువంటి దిప్పు డదంతా తల్లక్రిందులు గావించి, ఆలోచనయే మానవునికి పని చేయడం నేర్పిన దని వాదించ నారంభించేరు! ఇదే విజ్ఞానాభి వృద్ధిని అరికట్టినది!

ఈ భ్రమ నుంచి బైటపడేందుకు మార్గమేమిటి? బానిసత్వా నికి ఉద్వాసన చెప్పడమే దీనికి మార్గం. కాని, యీ పని చేయాలని యెవడూ అనుకోడాయె. జను లీ విషయం గ్రహించే సమయం యింకా రాలేదు. బానిసలు లేనిచో అసలు రోజు గడవనే గడవదనీ, బానిసత్వాన్ని దేవుడే ఉద్దేశ్య పూర్వకంగా యేర్పరచేడనీ చాలమంది భావించేవారు!

ఐతే క్షుద్బాధనుంచిన్నీ, యాచనా దైన్యాన్నుంచిన్నీ తప్పిం చుకోడానికి బీదవాళ్ళు ఏం చేయాలి? దేశాన్నుంచి పారిపో వాలా? కొందరు అందుకూ ప్రయత్నించి చూచేరు. దేశా న్నుంచి బైలుదేరే ప్రతీ పడవలోనూ యెందరో వలసకు బోనారంభించేరు. జన్మభూమిలో కష్టాలూ, దుఃఖాలూ తప్ప మరేమీ యెరుగని జనులు విదేశాల్లో సుఖమూ, సంతోషమూ లభిస్తాయనే ఆశతో అన్వేషణా తత్పరతతో బోతూన్నారు. కాని, వారి కింకనూ ఏథెన్సే జన్మభూమి. అదీ యిప్పుడు దూరమై పోతూంది. రాజధాని అక్రోపోలిస్ క్రిందనున్న పట్ట ణంలోని యిండ్లవంక చూస్తూ, కడపటిసారి వీడ్కోలు తీసి కొంటూంటే చాలమంది కనులు అశ్రుపూర్ణము లైనాయి. అందులోనే తమ గృహాలూ వున్నాయి. నగరం క్రమంగా

కనుమరుగైపోతూ, ఆఖరికి కనబడకుండా పోయింది. దూరాన కొండలుమాత్రం పచ్చగా, నీలంగా కనబడు తూన్నాయి. పల్లాస్ ఎథీనా దేవత యెత్తి పట్టుకున్న స్వర్ణభల్లపు మిలమిలలు మాత్రం యింకా చూచాయగా కానబడు తూన్నాయి. అదిగో! ... అంతలో అవిన్నీ మాసిపోయినాయి.

అయ్యో! ఈ ఏథెన్సు పౌరులు తమ జన్మభూమికి దూరమై పోయిన దెందువల్ల? బానిసత్వ విషఫలాలను అనుభవించక తప్పునా? తాను చేసిన పనియొక్క ఫలితాలనే గాదు, మానవు లనుభవించాల్సింది. ఇతరులు గావించిన శుభాశుభ కర్మల ఫలాల్నికూడ కొంతవరకు అనుభవించాల్సి వస్తుంది...

## మానవుడు వెనక్కి చూస్తాడు.

అధికాధికంగా ఆ మానవులు గతాన్ని స్మరిం చేవాళ్ళు. గత కాలంలోనే పరిస్థితులు బాగా వున్నట్లు వారికి తోచేవి: ఎప్పుడూ 'గత కాలము మేలు వచ్చుకాలము కంటెన్' గదా! వెనుకటి రోజుల్లో సత్యం స్వర్గంలో గాకండా భూమి మీాదనే ఉంటూండేది. ఆ రోజుల్లో బానిసలు, యజమానులు అనే భేదం లేదు. పేదలు, ధనికులు అనేది అసలే లేదు. దివోని సస్ దేవతోత్సవ దినాల్లో జనులు స్వర్ణయుగాన్ని గూర్చి గానం చేస్తూండేవాళ్లు. యుద్ధాల నెరుగని స్వర్ణ యుగాన్ని గూర్చిన ఆనందగీతమే అది. అప్పుడు ప్రకృతి అంతా ప్రశాం

తంగా సాగిపోతూండేది. రుజాది బాధలే అప్పుడు లేవు! మానవులకు కావలసిన వాటి నన్నిటినీ ప్రకృతి మాత అత్యు దారంగా ఒసగుతూ ఉండేది. తేనె సోనలూ, పాల వాగులూ ఉంటూండేవి! తేనే రొట్టెలు పుష్కలంగా ఉండేవి. 'ఎంచ క్కగా దోరగా ఉన్నాం, చూడండి. మమ్మల్ని భక్షించండి, కావాలిస్తే!' అనేవి అవి. విస్తళ్ళల్లోకి చేపలు వాటంతట అవే ఎగ్రుళ్ళిపడి వచ్చి, 'మమ్మల్ని తినండి! ఎంతో బావుంటాం!' అనేవి. చెట్లమీంచి ఆకులకు మారుగా, పచనమైన పక్షులే రాలుతూండేవి!

ఆదిమ కాలపు యీ సంతోషమయ గీతం దిక్కులు మార్మోగ్రోయు లాగున గానం చేయబడు తూంటే, పల్లవి అందుకూంటూండే వాళ్లు: 'పుణ్య యుగమది బోనిస యను పేరే యెవరూ వినలేను!' అదొక సుఖమయ ప్రపంచం. ఈ సుఖాన్ని యింత తరచుగా వారు స్మరిస్తూన్నారంటే కారణం వేరేమీ గాదు. వారు యిప్పుడు అసుఖులై వున్నారు. ఆ సుఖాన్ని తలచుకుని, దానికై అర్రులు చాచుతూన్నారు, వాళ్లు. పాపం, ఇప్పుడు వాళ్ళని నిరంతరం ఆకలి బాధ వెంట బడుతూనేవుంది. స్వర్ణయుగంలో పుట్టకండా లోహ యుగంలో పుట్టడం వాళ్ళ దౌర్భాగ్యం గాకేమిటి?

జనులు యీ రీతిగా వెనక్కి చూస్తూండేవాళ్ళు. తాము పోయేది ముందుకే. కాని, భవిష్యత్తు అంతా నిరాశాపూరి తంగా, అంధకారమయంగా ఉంది. తమ ప్రస్తుతపు అయో

మయ జీవితంలో యీ గత స్మృతులను గూర్చి పాడుకుంటూ ఆకొంచెంసేపైనా వారు తమ కష్టాలు మరచిపో ప్రయత్నించే వాళ్ళు.

కాని, యిది ఒక స్వప్నం మాత్రమే. ఐనా స్వప్నాల్లో కూడా యేదో అర్థం ఉండనే ఉంది. స్వర్ణయుగాన్ని గూర్చి మొదటిసారి మానవుడు కలలు గాంచిన దప్పుడే. పల్లవిని వాళ్లు మనసారా ఒత్తి ఒత్తి పలికేవాళ్లు: 'బంగారు కాలమది బానిసలే లేరూ!' సుఖమయకల్పన, గత కాలపు దివ్యస్మృతి, వాళ్ళలో ఆశల్ని రేకెత్తించి, జీవించడానికి ధైర్యాన్నిస్తూ వచ్చింది. ఆ నాడు ప్రారంభమైన స్వప్నం యింకా యీనాటికీ కొనసాగుతూనేవుంది! కాని, యిప్పుడిప్పుడే జనులు ఆ స్వర్ణయుగం గతంలో గాక భవిష్యత్తులోనే వున్నదని గ్రహిస్తూన్నారు! భవిష్యత్తులో స్వర్ణయుగమా? ఏమిటీ విరుద్ధం? అంటారా? చెపుతా. స్వర్ణయుగమంటే యేమిటి? ఎప్పుడు ప్రకృతి మానవుని ఆజ్ఞాపాలనం గావిస్తూంటుందో, ఏ నాడు యుద్ధాలనేవి లేక సర్వత్రా శాంతి సౌభాగ్యాలు తాండవమాడుతూంటవో, ఏ రోజున ప్రతి మానవుడూ స్వేచ్ఛాస్వాతంత్ర్యాల ననుభవిస్తూంటాడో, ఆ రోజు వచ్చిననాడే యీ భూమిమీద స్వర్ణయుగం స్థాపించబడిందని చెప్పవచ్చు!

కాని, అంతవరకూ జనులు లోహయుగంలోనే జీవించాలి. ఇందులో జీవితం రోజు రోజుకీ దుర్భరతర మవుతూంది కూడాను.

ఏథెన్సులో అంతా డోలాందోళనలోనూ, భయ భీతుల్లోనూ మునిగివుంటూంది. అసంతృప్త జీవుల గొంతు లంత కంతకు బిగ్గరగా వినవస్తూన్నాయి. రోజు రోజుకీ జను లధికాధికమైన ఆవేశంతోనూ, ఆశతోనూ గతించిపోయిన స్వర్ణ యుగాన్ని గురించి, తమ తాత ముత్తాతలు నివసించిన ఆ 'మంచి దినాల'ను గురించి కలలు గంటూ పరితపించిపోతూన్నారు. అంతకంతకి వారు ఏథెన్సులోని స్వతంత్ర పౌరులే నేడు శాంతి సౌఖ్యాలకి శత్రువులని భావిస్తూ, వారిని ద్వేషించ నారంభించేరు.

ఒలింపియస్ వీరుడు పెరిక్లిస్‌కు అంతకంతకు యీ పెను తుపాను నదుపులో నుంచడం అసాధ్యమైపోతూ వచ్చింది. ప్రతి పౌర సభలోనూ తీవ్ర నేరారోపణలను గావించే గొంతు లధికమై పోతూన్నాయి. సముద్రంమీంది తుపానునైనా తప్పించుకోవచ్చును గాని యింటిలోని యీ తుపానుల నెదుర్కొనుట దుస్సాధ్యము. పెరిక్లిస్‌కి బహిరంగ శత్రువు లధికంగా తయారయేరు. ఆతడు రాజ వంశీకుడు. కాని, ప్రజా క్షేమానికై పాటుబడిన పాపమున కాతనిని రాజవంశీకులే అధికంగా ద్వేషిస్తూన్నారు. ప్రాచీనులైన ప్రసిద్ధ ప్రభువుల, వీర వరుల కుటుంబీకులకు కర్మకారులు, సాలీలు, కుంభకారులు, చర్మకారులు వగైరా సామాన్య జనులన్నా, వాళ్ళ మూకలన్నా, కాకిగోలన్నా మహా మంట. ప్రభుత్వాధికారాన్నంతనీ తిరిగి తమ చేతుల్లోకి తీసికోవాలని వాళ్ళు ప్రయత్నాలు

చేస్తూ నేవున్నారు. దానితో ప్రజలు వాళ్ళ కుట్రల్ని నిర్మూలించి, ఆ కులీనుల్ని దేశాన్నుంచి తరిమివేసేరు.

రాజ కులీనులు చాలమంది జనులు తమ పక్షీయులను ఓడించి తరిమివేసేవరకు వేచియుండక, ముందరనుంచీ స్పార్టాకు వలసబోతూ వచ్చారు. స్పార్టాలో జనులు కొండలమీద నివసిస్తూ, పూర్వ సాంప్రదాయాలను గౌరవిస్తూ, కులీన ప్రభువుల అధికారానికి లోబడివుంటూన్నట్టివారు. వారి ప్రధాన వృత్తి వ్యవసాయం. సముద్రంమీద ద్వీపాంతరాలకు బోవడం గాని, చేతిపనులు, వాణిజ్యం గాని వారు స్వీకరించలేదు. భూమిని సాగుచేసే పనిని 'హెలోట్లు' అనబడే బానిసలచేత బలాత్కారంగా చేయించుకుంటూండేవాళ్లు, స్పార్టనులు. ఈ హెలోట్లు హీనజాతివారు. దివ్యులు, మహా శూరులు ఐన వారి వంశీకులకు యీ హీనజాతివాళ్ళు తలవంచి లొంగి పోయినవాళ్లు !

స్పార్టనుల నాణెములు కూడ విచిత్రమైనవే. అవి యెల్లా వుంటాయో చెప్పనా? ఎన్నో కాండ్ల ఎడ్లు పూన్చినకాని కదలని పెద్ద పెద్ద యినుపదుక్కలే వారి నాణెములు! వాట్లని అసలు కదిపేవారేగారు. అవి వారి భవనాల్లోపడి వుంటూండేవి. వాటి ఉపయోగం కూడ బహు అరుదుగనే ఉండేది.

స్పార్టనులు ఏథేన్సును చూచి గొణుక్కుంటూండే వాళ్లు: "ఏథెన్సు యిప్పటికే సాగర తీరంలోని పది రాజ్యాల్ని తన నాయకత్వం క్రిందికి తెచ్చుకొంది. మిగతా రాజ్యాల్ని కూడ

తన ఆధిపత్యం క్రిందికి తెచ్చుకోడానికి యత్నించదు గదా? మనలను కూడా లోబరచు కుందంటే మన పురాతన ఆచార సాంప్రదాయా లన్నిటికీ నీళ్ళచుక్క వదలుకోవలసిందే!"

క్రమ క్రమంగా ఏథెన్సు, స్పార్టా రాజ్యాలమధ్య వైరం ప్రజ్వరిల్లుతూవుంది. ఏథెన్సు సముద్రములపై ఆధిపత్యం గలది. స్పార్టా భూతలముపై అమేయ బలంగల రాజ్యం. ఏథెన్సు నూతన యుగ ప్రతినిధి. స్పార్టా పురాతన భావాలకు, సాంప్రదాయాలకు ప్రతినిధి. ఏథెన్సు నెదుర్కొనేందుకుగాను వాళ్ళ శత్రువుల నందరినీ సంఘటితపరచాలని స్పార్టానులు యోచన చేసేరు.

కాని, ఏథెన్సుకు ప్రధానశత్రువులు ఏథెన్సులోనే వున్నారు. వాళ్ళు గొప్ప శక్తివంతులుకూడాను. దైనందిన జీవితం కష్టతరంగా వున్నవారే ఆంతరంగిక శత్రువులు. ఈ ఆంతరంగిక సంక్షోభాన్ని నెరసులనుంచి మహాజ్వాలగా చేయడమెట్లని స్పార్టనులు ఆలోచించేరు. మహాజన సభల్లో పెరిక్లిస్ నేతకు వ్యతిరేకంగా వినవచ్చే కలకలమూ, ఘోషా అంతకంత కధికమవుతూ వచ్చాయి. సరాసరిగా, ముఖాముఖిగా పెరిక్లిస్ నెదిరించడం అసాధ్యమని భావించి, స్పార్టనులాయన ఆంతరంగిక మిత్రవర్గీయు లొక్కరొక్కరి మీదనే అసంతృప్తిని రేగొట్ట నారంభించేరు. మహాశిల్పి ఫిడియాస్ మీద నేరం ఆరోపించబడింది. పల్లాస్ అథీనా దేవతా విగ్రహపు డాలు మీద ఫిడియాస్, పెరిక్లిస్‌లను పోలిన బొమ్మలను చెక్కేడనీ,

అది దేవతా ద్రోహమనీ ఆరోపణ! అమరులైన దేవతల మధ్య మర్త్యులైన నరులను నిలుపుటకు సాహసించిన ఫిడియాస్ నేమనాలి? ఆతడు బందీచేయబడి, ఖైదులో మ్రగ్గుతున్నాడు.

మహాశిల్పి ఫిడియాస్ ఖైదులోనే చనిపోయాడు. పెరిక్లిస్ ప్రియురాలు అస్పాషియాకు మరణదండన విధించబడింది. సనాతన దేవతలు, ఆచారాలు పట్ల నిరసనభావం గలిగి వుండడం, అవినీతి ప్రవర్తన,— యివి ఆమెపై ఆరోపించబడిన నేరాలు! ఆమెకు ప్రాణభిక్ష పెట్టమనీ, దుర్మరణాన్నుంచి రక్షించమనీ వినీతుడై వేడుకుంటూ పెరిక్లిస్ నగరమంతటా తిరిగి అందరుపౌరుల్నీ ప్రార్థించేడు. ఎల్లాగో ఆమె ప్రాణాలు కాపాడుకొన్నాడాతడు. కాని, శత్రువులు శాంతించలేదు.

## వివేకం ఏథెన్సును వదలి వెళ్ళిపోయింది.

దివోపీథిస్ అనువాడొకడు యిప్పుడు దివ్యవాణిని ప్రకటించేవాడుగా భావించబడుతూన్నాడు. వాడు పౌరసభల్లో లేచి ప్రసంగించడం అధికమైంది. సనాతన విశ్వాసాలను గౌరవించి అనుసరించుటలేదని జనుల నీతడు తరచు నిందిస్తూన్నాడు. ఆతడు దేవాలయంలోనే వుంటూ, ప్రార్థనాధికములను నిరంతరం వల్లిస్తూంటాడు. చిన్నా పెద్దా యనకండా సమస్త దేవతలకూ యెల్లవేళలా కోడి పిల్లలూ, గొఱ్ఱె పిల్లలూ బలిగా అర్పణ చేస్తూంటాడు, యితడు. ఐస్కులాపియస్, అథీనా,

శక్తిరూపిణి అఫ్రొడితి, అపోల్లో మొదలగు దేవతలందరూ యీ భక్తుని పూజాపునస్కారాలను పొందుతూండేవారు. అనుశ్రుతంగా వస్తూన్న పుక్కిటిపురాణా లన్నిటినీ యితడు నమ్ముతూ, పునరుద్ఘాటిస్తూండేవాడు. ఒంటికొమ్ము గొఱ్ఱె పిల్ల పుట్టినపుడు ఏథెన్సు నగరం పతనమైపోతుందని భవిష్యత్తును చెపుతూండేవాడు. పాతగాథల నక్షరశః విశ్వసించే యీ వృద్ధభక్తుడు అనక్షగోరస్‌ను నిందిస్తూండడం తరచు వినిపిస్తూంది. దేవతలు తమ కీర్తిని ప్రకటించేందుకని స్వయంగా సృజించిన నక్షత్రాదులను కేవల ప్రాకృతిక విషయాలుగా, ఖగోళములుగా చూడాలని చెపుతాడా, యీ నాస్తికుడు? అనక్షగోరస్, తాను నాస్తికుడగుటతో సరిపెట్టక అందరినీ అల్లాకమ్మని బోధిస్తున్నాడు. తా జెడ్డకోతి వన మెల్ల జెరచె నన్నట్లుంది! చంద్రుడు దేవతకాదట! అది భూమిలాంటి మరొక గోళమట! సూర్యుడు కేవలం జాజ్వల్యమానమైన గోళమని చెప్పడానికి అనక్షగోరస్ సంశయించలేదే! అల్పజ్ఞుడైన మానవుడు సర్వమునూ తెలుసుకోవాలనీ, భూమ్యాకాశాదులలో ఉన్న సమస్త వస్తువిషయాదులనూ విశదం గావించుకుంటూండాలనీ ఆయన అన్నాడు! అనక్షగోరస్ దేవతలను గుర్తించపోవుటే గాక యితరులనూ గుర్తించవద్దని బోధించుతూన్నాడు! ఔర! ఎంత విదపకాలం వచ్చింది! చెట్టు చెడు కాలమునకు కుక్కమూతి పిందె లన్నట్లుంది!

పెరిక్లిస్ శత్రువులు నూతనమై, అభ్యుదయ శ్రేయోదాయకమైన, ప్రతీదానికీ శత్రువులే. పౌర మహాసభలో వీరికి

అధిక సంఖ్యాకమైన సమ్మతులు ఉన్నాయి. భూలోకంలోని పరిస్థితులేమో మారినాయి. కాని, ఒలింపస్ పర్వతం మీద యింకా దివ్యులు యథా పూర్వంగానే నివసిస్తూన్నారు. అక్కడ దేవేంద్రుడు జ్యూస్, దేవతాగణ పరివేష్టితుడై పాలిస్తూన్నాడు. ఆయన సుతులకూ, శూరులకూ తండ్రివంటి వాడు. దివ్యాంశ సంభూతులైన సుతులు, శూరులునుంచే రాజ వంశాలన్నీ సరాసరిగా బైలుదేరినాయని చెప్తూంటూరు. ఏథెన్సు ప్రజలు చాల కాలం క్రిందటనే జ్యూస్ దేవుని వంశీకులైన రాజుల నందరినీ ఓడించి, అధికారాన్ని కైవసం చేసుకున్నారు. కాని, జ్యూస్ దేవుడు మాత్రం యింకా స్వర్గాధిపత్యంలో నుంచి త్రోసివేయ బడలేదు. జను లాయనకు ఆలయాల్లో పూజా పునస్కారాలు వెనకటివలెనే చేస్తూ, బలు లర్పిస్తూనే వున్నారు.

అగ్నిని స్వర్గాన్నుంచి భూమి మీదకు తేప్రయత్నించిన ప్రోమిత్యూస్ వంటివాడు యింకొకడు బైలుదేరాడు. మళ్లా యితగాణ్ణి కూడ జ్యూస్ శృంఖలాబద్ధుని గావించేడు. దివ్యుల అధికారాన్ని కొంచెపరిచే యేప్రయత్నాన్నీ దేవతలు సహించి వూరుకోరు. అనక్ష గోరస్‌ను ఖైదులో బెట్టేరు. తలకు గుడ్డ చుట్టుకొని, ఆ ఖైదు కొట్టులో పడివుండి, ప్రశాంత చిత్తుడై మృత్యువుకోసం యెదురు చూస్తూన్నాడు, ఆ తత్త్వవేత్త. వాళ్ళు తనను చంపగలరు గాని, సత్యమును మాత్రం చంప జాలరు గదా.

హఠాత్తుగా ఖైదుగది తలుపులు బాగా తెరుచుకు న్నాయి. అనక్షగోరస్ శిష్యులు చాలమంది లోపలికి జొర బడ్డారు. తమ్ము పెరిక్లిస్ పంపించేడనీ, త్వరగా బైలుదేరితే రక్షణకు అవకాశం ఉందనీ అనక్షగోరస్‌తో చెప్పేరు. ఒక పడవ వానికి లంచం యిచ్చి, రేవులో పడవను సిద్ధంగా ఉంపించేరు. తక్షణం బైలుదేరి వెళ్ళేరు, పడవ దగ్గరకు. గాలి అనుకూల దిశలో వీస్తూంది. తెరచాపలు ఎత్తేరు. ఆ నావ హెల్లాస్ దేశాన్నించి ఆ వృద్ధ పండితుడు, మహావిజ్ఞాని యైన అనక్ష గోరస్‌ను తీసికొని వైదొలగిపోయింది. గ్రీకు దేశపు పూర్వ నామం హెల్లాస్.* హెల్లాస్‌కు బుద్ధి వంటివాడని అనక్ష గోరస్‌ను పొగడేవారు. బుద్ధికి ఆ శరీరంలో స్థానం లేదు! బుద్ధి, వివేకము హెల్లాస్ భూమినుంచి తరిమివేయ బడి నాయి!

---

* హెల్లెన్ అనువానినుంచి ఆ దేశం హెల్లెనియోస్ హెల్లాస్ అని పిలువబడేది. హెల్లెన్, డ్యూకాలియోన్ అనువాని పుత్రుడు. ఇతడు గ్రీకు లకు మనువు వంటివాడు. నోవా అనువాడు కూడ మనువే. — అనువాదకుడు

# నాలుగో మండలం
## జ్ఞానప్రస్థానం
### అపరిణతబుద్ధియె మానవుడు గర్వి యౌతాడు.

సత్యం, స్వేచ్ఛ దగ్గరలోనే ఉన్నవని భావించిన మానవుడు పొరబడ్డాడు. ప్రకృతిమీద విజయసాధన యెంతకష్టమో తెలిసింది. తాను స్వాతంత్ర్యం పొందితినని భావించేడు. కాని, అదెల్లాటి స్వాతంత్ర్యము? బానిసత్వంమీద నధిరోహించి వచ్చిన స్వాతంత్ర్యము! తాను సత్యమును కనుగొనగలిగితి నని భావించేడు, మానవుడు. కాని, తనకూ సత్యమునకూ మధ్య అంధ విశ్వాసములనే దుర్భేద్యమైనగోడ యింకా నిలిచే వుంది. సంపద్వంతుడనైతి ననుకొని, ప్రగల్భములు పలుకు నాతని వెనువెంటనే దారిద్ర్యము వదలకున్నది. లోహము లను కనిపెట్టితినని సంతోషించేడు. లోహవిద్య, కర్మ కౌశ లము సాధించితినని మురిసేడు. కాని, ఆ లోహాదులంతో నాగేటి కర్రులనే గాక కత్తులను కూడ చేసేడు. తను గావిం చిన పనియొక్క విషఫలాలను తానే అనుభవిస్తూన్నాడు. పంటచేలను, ఫలవృక్షాలను, ద్రాక్షతీగెలను, ఆలివ్ తోపు లను వేసి పెంచుతూ వచ్చేడు. కాని, మళ్ళా అంతలోనే వాటిని నరికేసి, నాశనంగావిస్తూ వచ్చాడు. జలములను, సాగరములను తరించు తరణులను నిర్మించుకున్నాడు. కాని, తరంగాలూ, తుపానులూ కూడ ముంచియుండనన్ని ఓడలను తానే ముంచివేసుకుని, అమూల్యమైన సంపదలను మున్నిటి

పాలౌనర్చేడు. ప్రకృతిలో యెన్నిటినో స్వాధీన పరచుకొంటి ననుకున్న అతడు తననుమాత్రం గెలువనేరక పోయాడు !

మానవునికి శత్రువులు చాలమంది ఉన్నారు. ఆత్మరక్షణకు ఆయుధాలేమీ లేనప్పుడు ఆతనిపైన క్రూరమృగాలు పడేవి. హిమానీ ప్రవాహాలు ఆతని నెన్నోసార్లు శుభ్రంగా తుడిచి పెట్టేసేవి. భూమాతయే కళ్ళ యెదుట పాయలుగా విచ్చిపోయి, మానవుని సర్వస్వాన్నీ దిగమింగివేస్తూ వచ్చింది. కాని యివేవీ కూడ మానవుడు తనకు తాను గావించుకొన్న వినాశంలో యెన్నోవంతో కలిగించనేలేదు. తానే తనకు శత్రువుడు, మానవుడు ! ఎంత విపరీతము ! మానవ చరిత్ర అంతా కూడ తనతో తాను గావించుకొన్న పోరాట చరిత్ర మేనని చెప్పాలి.

ఈ పోరాటం ఒక కొలికికి వచ్చేరోజు రానేవస్తుంది. వచ్చే తీరుతుంది. అప్పుడింక మానవులు తమతో తామే పోరాడుతూ కాలం వ్యర్థపరచరు. మానవులు తమ యావచ్ఛక్తినీ యేకోన్ముఖం చేసుకుని, ప్రకృతి శక్తులతోటి పోరాటంలో వినియోగ పరుస్తాడు. కాని అంతవరకూ మానవుడు తరచు దారితప్పుతూ, తూలిపడుతూ, తడుముకుంటూ, మెల్లగా, అతి కష్టంతో ముందుకు నడువ గలుగుతాడు. మాటిమాటికీ వెనకకు చూస్తూంటాడు. తిరిగి వెనక్కి వెళ్ళిపోవుదమని అనుకుంటూంటాడు గాని వెనుకకు వెళ్లడం మాత్రం అసాధ్యమే ! అతనికి ఆత్మశక్తియందు విశ్వాసమే లోపించిన సమయాలూ, తన్ను తానే శంకించిన ఘట్టాలూ కూడ యెన్నో వున్నాయి.

నాటక రంగం మీద ఒకానొకప్పుడు తన శక్తిని గూర్చి ప్రగల్భాలు పలికిన మానవుడు యిప్పుడు తననూ, తన అల్ప జ్ఞతనూ చూపి, పరిహాసించు కుంటున్నాడు. ఒక మహాకవి వ్రాసిన నాటకంలో నీ క్రింది సన్నివేశాలను చిత్రించేడు: రంగస్థలంమీద నొక మహా విజ్ఞాని గృహం, ముంగిట నొక శిష్యుడూ ప్రదర్శించ బడతారు. శిష్యుడు వంగి, నేలమీద దేనినో వెతుకుతూంటాడు. ఏమిటి వెతుకుతున్నావు? అంటా రెవరో. ఏదేనా ముల్లెకోసమా? అబ్బే! కాదు. తార్తారస్ (పాతాళ లోకం) కి బోవు మార్గం కోసం వెతుకుతున్నా నంటాడు, శిష్యుడు. మరొక శిష్యుడు యేకాగ్రతతో గణితం వేస్తుంటాడు! ఏమిటి అతగాడు గుణించేది? అబ్బే! మరేమీ లేదు. ఈగ ఒక్క గెంతులో యెన్ని అడుగులు దాటుతుందని లెక్కలు కడుతూన్నాడు! ఇక నా మహా గురువుగారే ప్రవే శిస్తారు. ప్రేక్షకు లాయనను గుర్తిస్తారు. ఆయన సోక్రటీసు. ఎథీనియను లందరిలోకీ యెన్నికైనవాడు, మహా మేధావి, ఉజ్జ్వల కీర్తిమంతుడు! ఆయన ఆకాశంమీద దృష్టినిలిపి, ఖగోళములను పరిశీలిస్తూ, పరిక్రమిస్తూన్నాడు. అంతలో ఆయన తన కాళ్ళముందున్న గోతిలో కూలుతాడు! ఆయన రిక్తహస్తుడు, పూటకు గతిలేనివాడు!

ఈ నాటక రచయిత మరెవరోగారు. అరిష్టో ఫణీస్ యే! ఆతడు పరిహాసించిన దెవరిని? తమ దృష్టినంతనూ ఆకాశం లోనికే నిగుడ్చి, యెక్కడో, దేన్నో చూస్తూంటారు. కాని

తమ యెట్ట యెదుట నున్నవాటిని కానలేరు. నక్షత్ర వీక్షకు లైన వీరే తత్త్వవేత్తలు, మహాపండితులు. వీరినే గాక సామాన్య జనులనూ అరిష్టోఫనీస్ కవి పరిహసించేడు. వీరికి కడుపే కైలాసం. వెల్లుల్లిపరక దొరికితే చాలు మురిసిపోతారు. పెన్నిధి కంటె యిదే గొప్ప దనుకుంటారు, యీ జనులు !

ఔను ! మహాకవి ఊరకనే మాటాడడు ! మానవతా దశ లనే మనం మహాకవుల రచనల్లో చూస్తాం. మానవుడు, యీ రచనలో తనను తానే పరిహసించుకొని, తన శక్తినే శంకి స్తాడు. ఇందులో ఆశ్చర్యం లేదు, మరి. జీవితమంటే ఒక గండం తరువాత మరో గండంగా ఉంటూంటే యింకే మను కుంటాడు ? హెల్లాస్‌కు, యీ ఉత్తమభూమికి పాడురోజులు వచ్చి పడ్డాయి. స్వాతంత్ర్యానికి పుట్టినిల్లు, కళలకు కాణాచి, విజ్ఞానానికి వేగుజుక్క యైనది, హెల్లాస్ ! అయ్యో ! ఎట్టి దేశానికి ఎట్టిగతి ! యుద్ధంమీద యుద్ధం వచ్చి, పండువంటి దేశానికి విచ్ఛిత్తినీ, వినాశాన్నీ తెచ్చి పెట్టినాయి.

ఐతే, ఎవరు, ఎవరితో నీ యుద్ధం చేస్తూన్నది ?

ప్రతివాడూ మిగతా అందరితోనూ !

బానిసలు యజమానులతో; పేదలు సంపన్నులతో; సామాన్యులు రాజులతో; సాగర ప్రభువులు భూమీశులతో. ఈ యుద్ధాల్లో కత్తులే గాక భావాలు కూడా ఉపయోగించ బడుతూన్నాయి. కొందరు వర్తమానం అధ్వాన్నంగా వుంది గాన గతానికి మరలిపోవుద మంటారు. మసలుటకు సందు

లేకున్నా సనాతనమైనది గాన పాతకాలపు సంకుచిత లోకా నికే మళ్లా వెడదామంటాారు, వాళ్ళు. మరికొందరు, యీా ప్రపంచపు సరిహద్దుల్ని పోంతస్ నుంచి సముద్రం వరకూ జరు పుద మంటాారు. యుద్ధం చెలరేగుతూనే వుంది. జనపదము లెన్నో పరశురామ ప్రీతి యవుతూన్నాయి. యుద్ధరాక్షసి నడచిన మార్గమంతా కాందిశీకులతో, ఆక్రందనాలతో నిండి వుంది. జనులు సకుటుంబంగా, ఆస్తిపాస్తులతో సహా నగరా ల్లోకి చేరిపోయి, చుట్టూవున్న రాతిగోడలను మరింత బలప రుస్తూ, వాటి వెనుక ఆత్మరక్షణ గావించుకోవా లనుకుంటు న్నారు. కాని, అసలు తలదాచు కొనేందుకే యెవరికీ యిళ్లు లేవు! వందలూ, వేలూ కుటుంబాలు ఆరుబైటనే కంబళ్ళు పరుచుకుని, వాటిమీాదనే పండుకుంటున్నారు. దేవాలయాల చుట్టూ, శిలా సోపానాలమీాదా, ఆఖరికి వట్టి నేలమీాదా కూడా మానవులు గుంపులుగా కాలక్షేపం చేస్తూన్నారు.

తినుటకు అన్నమే దుర్లభమై పోతూంది. నగరాల్లో చాల మంది ఆకలికి నకనక లాడిపోతూన్నారు. నగర ద్వార కవా టాలు మూసే వున్నాయి. నగర ప్రాకార కుడ్యాలు యింకా గట్టిగానే వున్నాయి.

యుద్ధంవెంట కరువు, కరువు అడుగులో రోగాలు. గోరు చుట్టుపై రోకటి పోటువలె అన్నార్తులైన ఆ దురదృష్ట వంతు లను ప్లేగు మహామారి యెదుర్కొంది. రాతి గోడలు కాని, ఇనుప తలుపులు గాని యీా మహామారిని నిలువరించనే లేవు.

నగర వీథుల్లో సర్వత్రా నేలమీదనే గుంపులుగా పండుకొని వున్న మానవుల్లోంచి యీ మహామారి తక్కుతూ తారుతూ మెల్లగా తిరుగుతూంది. సమ్మర్దంగా ఉండే బజారుల్లో కూడ అది కాలుపెట్టింది. కొందరికి దాని హిమస్పర్శ చాలు, మరి కొందరికి దాని ఊపిరి సోకిన చాలు, యీ లోకాన్నుంచి మూట కట్టేయ్యడానికి. అది అందరినీ సమంగానే చూచింది. బానిస, స్వతంత్రుడు, పేద, సంపన్నుడు,– ఆ యీ భేదాలు లేకండా సమస్త జనులనూ అది ఒకటే రీతిని సంభావించింది. పిన్నలు మృత్యువువాత బడ్డారు; వృద్ధులు మిగిలిపోయారు! మృత్యువుకు వారూ వీరూ అనేమిటి? యుద్ధరంగం లోనికి దూకబోతూన్న యోధునీ పడగొట్టింది; డబ్బును మూటలు కట్టుకుంటున్న లోభినీ యెత్తుకుపోయింది! వీథులన్నీ శవాలతో భీతావహం కలిగిస్తూన్నాయి. చనిపోయినవాళ్ళు బ్రతికున్నవా ళ్ళని వీథుల్లోంచి తరిమివేశారు. దారుణంగా వేధిస్తూన్న విదాహాన్ని ఉపశమింప చేసుకునేటందుకై, పాపం, తీవ్ర ప్రయత్నం చేసి, రోగులు నూతులవద్దకు ప్రాకుతూండేవాళ్లు. దేవుళ్ళకు ప్రార్థనాదులు గావించేందుకై జనులు ఆలయాలకు మూగేవాళ్లు. కాని, దేవుళ్లు యెవరిప్రార్థనలనూ విన్నట్లే లేదు. ఈ శిలా విగ్రహాల హృదయాలు కూడ శిలా నిర్మితములే ఐ వుంటాయి! లేని-చో శిలలను కరగించు నా దీనుల ప్రార్థనలు వాళ్ళని కరగించలేక పోవునా? ఆకాశవాణి యేమైనా దారి చూపకపోతుందా? అని చాలమంది ప్రయత్నించేరు. కాని,

దైవవాక్కులు కూడా అజ్ఞేయములుగానూ, సమస్యలు గానూ ఉండిపోయినాయే గాని, వాటి వల్లనూ ప్రయోజనం లేకపోయింది.

మత విశ్వాసాలు సడలిపోయినాయి. కాని, అంతవరకూ కార్యకారణ వివేచన గావిస్తూండే లోకాయతులు మాత్రం నిరాశోప హతులై మతంవైపు మొగ్గనారంభించేరు. అనక్షగోరస్ శిష్యుడైన పెరిక్లిస్ శూరుడు, కార్యదక్షుడు. తాను మరణశయ్యపై నున్నపుడు మెడలో నొక చిన్న కొయ్య విగ్రహాన్ని కట్టుకున్నాడు! ఆ చిన్న కొయ్య విగ్రహం తన్ను ఉద్ధరిస్తుందని! *

స్వార్థపరత్వం, సంకుచిత భావాలు, ఇంద్రియలోలత, దుష్టబుద్ధులు బంధనాలు త్రెంచుకున్న క్రూరమృగాల్లాగ సర్వత్రా స్వైరవిహారం చేస్తున్నాయి.

సైనికులు యుద్ధాల్లోనే ఆనందాన్ని అనుభవించేవారు. వాళ్ళకి మానవ హత్యాకాండలే పెద్ద పండుగలైపోయినాయి. ఆహార పదార్థాలను అమ్మేవాళ్లు సరకులు దాచి, అధిక ధర

* మనవాళ్ళు చాలమంది ఆంజనేయులు బిళ్లలో, మరే దేవుళ్ల బొమ్మలు గల బిళ్ళలో ధరిస్తూంటారు. క్రైస్తవులూ, మహమ్మదీయులూ, బౌద్ధులూ, అన్ని మతాల వాళ్ళకీ యిల్లాటి ఆచారంవుంది. ఆధునికుల మనుకున్నవారికి కూడ యేదో ఒక ఆరాధ్య వస్తువు వుంటుంది. ఏదో వస్తువు నాశ్రయించనిదే మానవుని ఆలోచనలు, భావాలు, నిరాశ్రయంగా ఉండలేవేమో. బోధన లేవైనా ఆచరణలో మానవులు ఏదో ఒక చిహ్నానికి భక్తులుగాను, దాసులుగాను ఉండడం పరిపాటిగా కనబడుతుంది. — అనువాదకుడు.

లను రాబట్టేవాళ్లు. అబద్ధపువార్తలు వ్యాపింపజేసి, తినుబండారాల ఓడలు మునిగిపోయినాయనీ, అందుచేత సరకులకు గిరాకీ యేర్పడిందనీ చెప్పి, దగాచేయ యత్నించేవారు, వర్తకులు.

థుసిడైడ్స్ అనే సుప్రసిద్ధ చరిత్రకారుడు తన కాలంలోని జనుల ప్రవర్తనను గాంచి, విస్తుబోయాడు. తాను కనులారా చూచిన విషయాలను అప్పటి కప్పుడే, అక్కడే వ్రాసినవి చూస్తే మనకు తెలుస్తుంది:

"జనులు తమకు యేమి గతి మూడనై యున్నదో తెలియక, ఈశ్వరాదేశాలను, మానవ శాసనాలనూ కూడ గౌరవించడం మానేశారు ......అదివరదాకా చెదురుతో, రహస్యంగా చేస్తూన్న పనులనే యిప్పుడింక యెల్లాంటి దాపరికమూ లేకండా, బాహాటంగా చేసేస్తున్నారు. అంతా నేడో రేపో చావనున్నవారే గాదూ? అందుచేత దైవ శాసనాలను, మానవ చట్టాలను లెక్కజేయ వలసిన పనేముంది? ఏ శాసనాలను అనుసరించు, ధిక్కరించు; దేవతలను భూషించు, దూషించు; ఏమిచేసినా ఒకటే ఐనప్పుడు విచక్షణ దేనికి? తాను చేసిన పనులకు శిక్ష ఒకవేళ పడినా, అది అనుభవించేవరకు తాము బ్రతికి వుంటే గాదూ? భవిష్యత్తులో ఆశ లేదు, విశ్వాసంలేదు. అందుచేత జనులందరూ యిచ్చకు వచ్చినట్లు ప్రవర్తిస్తూన్నారు. మృత్యు వుగ్రసించే లోపున యీజీవితంలో తక్షణమే అనుభవించదగిన దేమైనా వుందంటే అదికాస్తా అనుభవించే చచ్చిపోదామని అందరూ భావిస్తూన్నారు."

ఒక యుద్ధం ముగిసి మరోయుద్ధం వచ్చే లోపున విరామం వుంటేగదా ? విదేశాలతో యుద్ధాలు, ఆ వెంబడే అంత ర్యుద్ధాలు ! జనులు యిళ్ళల్లోనూ, బహిరంగంగానూ కూడా ఒకరినొకరు హత్యలు గావించు కుంటూండేవాళ్ళు. పురుషు లనే గాక స్త్రీలను కూడా తరచు చంపుతూండేవాళ్లు. స్త్రీలు యిళ్ళ కప్పుల మీదనుంచి శత్రువులను పెంకులు విసరుతూ యెదుర్కొనేవారు. జనులు కులీనులనూ, రాజ వంశీకులనూ నిర్మూలించేవాళ్లు. మిలిథుస్ పట్టణంలో జనులు చిన్నపిల్లలను పట్టుకుని, శరీరాలకు తారుపూసి, సజీవంగానే దహనం గావిం చేరు. ప్రభు వర్గాలూ తమకు ఆధిక్యత లభించినచోట్ల ప్రజ లను యింత దారుణంగానూ హింసించేరు. పొలాలు దున్నే వారే లేకపోయారు. ఆలివ్ తోపులు నరికి, చలిమంటలు వేసుకొనేవారు శత్రు సైనికులు.

జను లొకరొకరిని బీభత్సంతో ప్రశ్నించుకొనేవారు: 'ఈ ఘోర దురంతాలకు మూలం ఏమిటి ?' మానవులు సహజం గానే రాక్షస ప్రవృత్తి గలవారు గాన లోకం యిల్లా తగుల బడుతూందని చాలమంది అనేవారు. మరికొందరు మానవులు గావించిన శాసనాలదే బాధ్యత అన్నారు. సరియైన చట్టాలు చేసి, మంచి ప్రభుత్వాన్ని గనుక స్థాపిస్తే అంతా చక్కబడు తుందని నిరూపిస్తూ తత్త్వవేత్తలు గ్రంథాలు వ్రాస్తూన్నారు.

కాని, మంచి ఏది ? చెడ్డ ఏది ?

ఈ ప్రశ్నకు అంతా తలొక రీతిగానూ జవాబిచ్చేవాళ్ళు. పౌరులకు మంచి అన్నది బానిసలకు చెడ్డగదా! ప్రభువర్గాలకు మేలైనది సామాన్య జనులకు కీడు.

బోధకులు బైలుదేరి, శిష్యుల్ని చేర్చుకుని, వాళ్లకి బోధలు గావిస్తూన్నారు: "అందరికీ మేలుచేసే పరమ ధర్మం, న్యాయం అనేవి యెక్కడా లేవు, ఉండవు. ప్రతి మానవుడూ తన కేది మేలు ? అని మాత్రమే ఆలోచిస్తాడు."

జనులలో విశ్వాసం నశించిపోయింది. ఏదైనా ఒకరికి సత్యమూ, మరొకరికి అసత్యమూ ఐనచో జనులు దేనిని గౌరవించాలి, అనుసరించాలి ? జ్ఞానం ఏది ? అజ్ఞానం ఏది ? సత్యమును మానవుడు అసలు తెలుసుకో గలడా ? ప్రతివానికీ యేదో ఒక సత్యం ఉండనే ఉందన్నప్పుడు మిగిలిన వాళ్ళకి ఆ సత్యంపట్ల ఎల్లాంటిదృక్పథం ఉండాలి ? ఒకరాయి ఒకనికి తెల్లగా కనిపించింది. కాని, అది నిజంగా తెల్లగాఉందా ? మరొకలా నిర్మితమైన కంటికి అదే నల్లగా కనబడునేమో ? అసలు ఈ ప్రపంచంలో ఏవస్తువైనా సత్యమేనా? అది జనుల మనస్సులలో యెన్నెన్నో సంశయాలు బైలుదేరేవి. సంశయాత్ములైపోయి, ప్రతివాళ్లూ యిల్లా అనుకునేవారు: "ఇదిగో ! రాయి. కాని, ఏమో, ఈ రాయి యిక్కడవున్నట్లు మనకి ఊరికే కనిపిస్తూం దేమో ? ఒకవేళ నిజంగానే యిక్కడది వున్నా దాని యదార్థ రూపం వేరే ఏదేనా ఉందేమో ? మనం ఒకవేళ దానిని కను గొన గలిగిననూ మరొకరికి దాని యదార్థాన్ని చెప్పనే

లేమేమో !" ఏ సమస్యకూ నిజమైన పరిష్కారం లేనేలేదనే దశ వచ్చేసింది. ముందుత్రోవ బంద్దైపోయింది. మానవుడు తన వివేక బుద్ధుల ప్రామాణికత్వాన్ని అంగీకరించక దేనిని గ్రహించేందుకూ ప్రయత్నమే మానుకుంటున్నాడు. పంచ జ్ఞానేంద్రియములూ, బుద్ధీ, — వీటితో మనం తెలిసికొన్నదేదీ సత్యంగాదనే దశ, అది !

## మహాత్ముడు సోక్రటీసు.

మహా మేధావులు కూడా తమ కేమీ తెలియదని చెప్తూండేవాళ్లు. 'నా కేమీ తెలియదని మాత్రమే నాకు తెలుసు !' ఈ వాక్యాన్ని సోక్రటీసు పండితుడు కంఠోక్తిగా అంటూండేవాడు. మొదటిసారి ఆయనను చూచినవారు ఆయనే సోక్రటీసు అనిన్నీ, సుప్రసిద్ధ తత్త్వవేత్త అనిన్నీ నమ్మడం కష్టమే. పాదరక్షలైనా లేకుండా, చినిగిన అంగీతో, బట్టతల, బుర్రముక్కు, బొర్రకడుపు గల వామన స్వరూపి యాతడు. ప్రతి గ్రీకు గృహంలోనూ 'సైలినస్' పేటిక లుంటాయి. వాటిమీద బానకడుపు, బట్టతల, బుర్రముక్కు గల వృద్ధ వామన విగ్రహం చెక్కబడి వుంటుంది. ఆ పెట్టె తెరిస్తే గృహంలోని అమూల్య వస్తువులన్నీ అందులోనే భద్ర పరుపబడి వుంటాయి. వామనాకార సైలినస్ వాటికి రక్షక దేవత. సోక్రటీస్ సరిగ్గా సైలినస్‌ను పోలివుండేవాడు, వికా

రంగా. ఆయన మాటలు, సంభాషణలు కూడ నిరలంకృతం గానూ, అతి సాధారణంగానూ ఉండేవి. కాని, సోక్రటీస్ తన వాదనాక్రమమును నిర్మించుకుంటూ పోవునపుడు ఒక్క సారి ఆగి విన్నావంటే అమూల్యములైన మహోన్నత భావా లను తెలుసుకోగలవు !

సోక్రటీస్ యేమని బోధించేవాడు ? ఏ రకమైన విజ్ఞాన మది ?

అరిష్టోఫణిస్ రచించిన 'మేఘములు' అను సుఖాంత నాట కంలో సోక్రటీసు నాయన చిత్రించేడు. భూమ్యాకాశాలమధ్య గంపలో కూర్చుని వ్రేలాడుతూ, నక్షత్రమండలాన్ని పరిశీ లిస్తూన్నట్లుగా ఆయన్ని చూపుతాడు, అరిష్టోఫణిస్. కాని, సోక్రటీసు ఖగోళ పరిశీలనము గావించేవాడేగాడు. ఆయనకి ప్రకృతి పరిశీలనలో విశ్వాసములేదు. ప్రకృతి పరిశీలనము మానవుణ్ణి సుఖిగా చేసిందా యేమిటి లెండి ! అనక్షగోరస్ గావించిన దీ ప్రయత్నమేగాదూ ? ఆ పిచ్చివాడు సూర్యుని ఒక అగ్నిగోళమన్నాడు ! కాని, మంటలను చూడగల మానవ నేత్రాలు సూర్యుని చూడలేవనే విషయాన్ని ఆతడు గమ నించలేదు !

సోక్రటీసు పండితులను గేలిచేసేవాడు. వారు ఒకరొక రితో యెప్పుడూ యేకీభవించరుగదా ! పండితానాం అనేక త్వం అనేది మనం వింటూంటాము. తన ఎదుటివాడే వెర్రి వాడని ప్రతీవాడూ అనుకునేవాళ్ళు. కొందరు పండితులు

పదార్థం అంతా ఒకటే అనుకునేవాళ్ళు. మరికొందరు పదార్థం అనంతమైన వైవిధ్యం గలదనుకొనేవారు. కొందరేమో సృష్టిలో ప్రతీదీ జననమరణాత్మకమై వున్నదనేవారు. మరికొందరు అసలు జననమరణాదులనే లేవనీ, యేదిన్నీ నూతనంగా పుట్టడంగాని, నశించడంగాని లేదనీ అనేవాళ్లు. మానవులు ప్రకృతిని తమ యిచ్ఛవచ్చినట్లు శాసించాలనుకునే వాళ్లు. కాని అది జరిగేపనా? అల్లుడు వచ్చేవరకూ అమావాస్య ఆగుతుందా? వాన రాకట ప్రాణపోకట యెవరు శాసించగలరు? దేవతల చర్యలను నరులు తెలుసుకోడం సాధ్యమా? అబ్బే! అంతేగాదు. తాము నిగూఢంగా వుంచాలనుకొనే విషయాల్ని వెల్లడిచేయాలనుకొనే మానవుల పట్ల దేవతలకు సద్భావం యెంతమాత్రం ఉండదు కూడాను!

ఐతే, యిక మనం తెలుసుకోవలసిన దేమున్నది? అని ప్రశ్నించుకున్నాడు సోక్రటీసు. దైవకార్యములుగాక మానవ కృత్యములనే మనం తెలుసుకోవాలి. ప్రకృతి రహస్యములుగాక మానవ బుద్ధినే మనం విశదంచేసుకో ప్రయత్నించాలి. 'నిన్ను నీవు తెలుసుకో!' ఇదీ మానవుని ఆదర్శం. మానవుని కిటువంటి జ్ఞానమే నిజంగా ఉపయోగకరమైనది.

ఏథెన్సులో 'సోఫిస్టులు' చాలమంది సుప్రసిద్ధులుండేవాళ్లు. వారు డబ్బు తీసికొని బోధించేవాళ్ళు. తత్త్వశాస్త్రాన్నే తాము బోధిస్తామని వాళ్ళ ప్రతిజ్ఞ. సోక్రటీస్ ఉచితంగానే

గాని డబ్బు తీసికోడు, బోధనలకు. "నేను యెవరికీ బోధించడం లేదు. అందరినుంచీ నేనే నేర్చుకుంటున్నాను!" అనేవాడాయన. సత్యాన్వేషణ గావిస్తున్నానని ఆయన చెప్తూండే వాడు. ఎవరేనా తనకంటె తెలివైనవారు లభించి, ఆయన నుంచి యేకొంచెమైనా నేర్చుకోగలిగితే ధన్యుణ్ణనేవాడు, సోక్రటీసు. ఆయన మిత్రులు కొందరొకసారి డెల్ఫీలోని అపోలో దేవాలయానికి వెళ్ళి, అక్కడి ఆకాశవాణిని ప్రశ్నించేరు: "సోక్రటీస్ కంటె తెలివైన వాళ్ళున్నారా?" ఆ దేవాలయ పూజారి పితియా నోటనే దివ్యవాణి వెలువడుతూంటుంది. ఈ ప్రశ్నకు పితియను దివ్యవాణి యిల్లా జవాబిచ్చింది: "లేరు! ఆయనకంటె తెలివైనవారెవరూ లేరు!"

ఈ విషయాన్ని సోక్రటీసుతో చెప్పినపుడాయన ఆశ్చర్య సంభ్రమాలతో, కించిల్లజ్జతో "పితియన్ వాణి అల్లా అనడంలో ఉద్దేశ్యమేమిటో? ఎందుకు? ఏమిటి? నాకేమీ తెలియదే!" అన్నాడట.

సోక్రటీసు ప్రపంచమంతటా పర్యటన గావించాలనీ, నిజంగా తెలివైన వానిని అన్వేషించాలనీ నిశ్చయించుకున్నాడు. మొదట్లో ఆయన ఏథెన్సు ప్రభుత్వంలో అత్యున్నతాధికారంలో వున్న బుద్ధిమంతుని వద్దకు వెళ్ళేడు. ఈ అధికారి మహా తెలివైనవాడని అందరూ అనుకుంటూండేవాళ్ళు. ఆయన తానంతటివాడనే అనుకొనేవాడు. ఏథెన్సులో అత్యున్నత పదవికి ఈయననే యెప్పుడూ యెన్నుకునేవారు,

జనులు. తాను అన్వేషిస్తూన్న బుద్ధిమంతుడు యీాయన కాదనే విషయం విస్పష్టం గావడానికి సోక్రటీసుకు ఎంతోసేపు పట్టలేదు! కొంచెంసేపు సంభాషించేసరికే సోక్రటీసు ఆయన తెలివిని గ్రహించేసేడు. అప్పవంట పప్పులో తెలిసింది!

ఈ రాజకీయాధికారితో యెట్టి దాపరికమూ లేకుండా సాక్షుల సమక్షంలోనే సోక్రటీసు మాట్లాడేడు. "ఎవడురా వీడు, నాతో యిల్లా మాట్లాడ సాహసించువాడు?" అని చెప్పి ఆ రాజకీయాధికారికి ఒళ్లు మండిపోయింది. చాలా తెలివైన వాడననుకొనే యీా పెద్దమనిషితో సంభాషణ ముగించిన తర్వాత సోక్రటీసు తామిద్దరిలోనూ తానే తెలివైనవాడనని చెప్పేడు. ఎందుచేతనంటే 'మనకిద్దరికీ యేమీా తెలియదు. కాని, నాకేమీా తెలియదనేనా తెలుసు. నీకు అంతా తెలుసు ననుకోడమే గాని నీకేమీా తెలిదనేదైనా తెలియదు గనక!' అన్నారాయన.

తరువాత ఆయన మరొక పండితమ్మన్యునితో 'కవిత్వం — కళ' అను విషయాన్ని గూర్చి మాట్లాడేరు. అక్కడా యిదే పరిస్థితి. ఏ ఉపన్యాసకుడైనా తాను మహా మాట్లాడగలడు గాన తాను చాల తెలివిగలవాణ్ణి అనుకుంటూంటాడు. కవి, శిల్పి కూడ తమ విద్యల్లోనూ, కళల్లోనూ తాము గట్టివాళ్ళమే గనుక తాము తెలివైన వాళ్ళ మనుకుంటూంటారు. సరిగా యిదే వాళ్ళని తెలివిహీనులుగా జేస్తూంది! సోక్రటీసు అనుచర శిష్యబృందంలో యెందరో మేధావంతులైన యువకు

లుండేవాళ్ళు. వాళ్ళు కూడా గురువుగారికివలెనే తమకు యేమీ తెలియదనీ, సత్యమునుగూర్చి యే కొంచెమైనా తెలుస్తుందేమోనని అన్వేషిస్తూన్నామనీ అంటూండేవారు.

సోక్రటీసు సశిష్యుడై యీ రీతిగా ఏథెన్సు వీధుల్లోనూ, పరిసర ప్రదేశాల్లోనూ సంచారాలుచేస్తూ, నిజం తెలిసిన బుద్ధిమంతులను అన్వేషిస్తూండేవాడు.

ఒకసారి సోక్రటీసు పలయెస్ట్రాకు వెళ్ళేరు. ఏథెన్సులోని విశ్వవిద్యాలయ మనదగిన దది. అక్కడొక చో నాయన శిష్యులైన యువకులు చాలమంది గుమిగూడి, గురువును సగౌరవంగా ప్రత్యుత్థానం గావించేరు. సోక్రటీసు నొక బల్లపై గూర్చుండబెట్టి, శిష్యు లాయనచుట్టూ చేరి, సంభాషణ కుపక్రమించేరు. యథాప్రకారంగానే వారి సంభాషణము, సర్వజనులకూ శ్రేయోదాయకమైన దేది? అను విషయంపైకి మళ్ళింది.

శిష్యుల్లో కనిష్ఠుడైన క్లినియాస్‌ను సోక్రటీసు ప్రశ్నించేరు:

"ప్రతివారూ సుఖమునే అన్వేషిస్తూన్నారనేది నిజమా? లేక యిది అసందర్భపు ప్రశ్నమా? ఈ ప్రశ్న లడుగుట కేవలం పరిహాసాస్పదం కాదుగదా? సుఖమును ఎవరు కోరుట లేదు?"

"సుఖమును కోరనివాడు జీవించినవారిలో ఉండడు!" అని జవాబిచ్చేడు, క్లినియాస్.

"సుఖం దేనిలో ఉంది? సంపదలలోనా?"–అని తిరుగప్రశ్న.

"ఔనండి! అదే నేను చెప్పాలనుకుంటున్నాను." అన్నాడు క్లినియాస్.

"ఐతే, సంపదలలో సుఖం యెల్లప్పుడూ ఉంటూందా? ఆరోగ్యం, బలం మొదలైన వాటిలో సుఖం లేదా?"

"ఉంది, స్వామీ! వాటిలోనూ సౌఖ్యం ఉంటుంది."

"మరి, కీర్తి, ప్రతిష్ట మొదలైనవాటి విషయమో? స్వదేశంలో కీర్తి ప్రతిష్టలు కలిగియుండుట వాంఛనీయమే గదా?"

"తప్పక వాంఛనీయమే."

"మంచిది. మరి, ధైర్యసాహసాదులు కలిగి యుండుటో?"

"అదీ గొప్ప విషయమే!"

"అంటే ఏమన్న మాట? సంపదలు, బలం, ఆరోగ్యం, కీర్తి, ధైర్యం మొదలగున వన్నీ గలవాడు సుఖవంతు డన్న మాట...కాని, మరోసంగతి చెప్పు. ఒక మనిషి తాను కలిగి వున్న వాటి ప్రయోజనాన్ని పొందుతూన్నప్పుడు అతడు సుఖంగా ఉంటాడా? ఉండడా?"

"అటువంటప్పుడే సుఖియై వుంటాడు, నిజంగా."

"ఐతే, తను ఉపయోగించని వస్తు విషయాదుల వల్ల యెవనికేనా ప్రయోజన మున్నదా? ఒక వడ్రంగిదగ్గర అన్ని పని ముట్లూ ఉన్నాయి, పనిచేయు కుశలతా ఉంది. కాని, చేసేందుకు పని యేమీ లేదు. ఆ పరిస్థితుల్లో వాటివల్ల ఆతనికి యేమైనా ప్రయోజన మున్నదా?"

"లేదు. ఆతని పని ముట్లు, కౌశల్యమూ కూడ వ్యర్థమే."

"సరే. మానవుని సుఖంకోసం వుండాలీ అనుకొన్న వన్నీ ఒకనికి వున్నాయనుకో. కాని, వాటిని ఆతడు ఉపయోగించడు. అప్పుడు వాటి ప్రయోజనం?"

"ఏమీలేదు. అతనికి వాటివల్ల ప్రయోజన మేమీ లేదు."

"అంటే ఏమని తేలుతూంది? ఒకనికి సుఖసామగ్రి అంతా ఉండడమే గాక ఆతడు దాని నుపయోగించు తూండాలి కూడాను. అంతేనా?"

"ఔను! నాకూ అల్లాగే తోస్తూంది."

ఈ మాదిరి సంభాషణలు, భావాల్లోని, అభిప్రాయాల్లోని వైరుధ్యాల్ని వెలికితీస్తాయి. ఒక క్షణంలో బలం మానవునికి సుఖదాయకమని క్లినియాస్ అనుకున్నాడు. కాని, ఆ బలమే తెలివిగలవాని కొక రీతిగానూ, తెలివి లేనివాని కింకొక రీతి గానూ ఉపయోగపడుతూంది–తెలివిహీనులకి బలం వరమగు టకు మారు శాపంగా కూడ పరిణమిస్తూంది! అందుచేత బలం మానవునికి సుఖదాయక మనుట పూర్తి సత్యం గాదు! ఈ విషయాన్ని శిష్యులు గ్రహించేందుకు ఆట్టేసేపు పట్టలేదు. *

సోక్రటీస్ తోటి సంభాషణలలో శిష్యులు కేవలం మాట్లాడడమే గాక ఆలోచించడం, వస్తువిషయాదుల పునాదుల కంటా వెళ్ళి, వాటిలోని వైరుధ్యాలను వెలికితీసి, సత్యం

* ఇది మన ప్రాచీన తార్కిక పద్ధతివంటిది. ప్రతి విషయమును పలు కోణములనుంచి పరీక్షించి, దాని యదార్థ్యమును తేల్చువారు. ప్రత్యక్ష అనుమాన ఉపమాన శాబ్దములను ప్రమాణముల ద్వారాను, పూర్వపక్ష సిద్ధాంతముల ద్వారాను ఒక ప్రతిపాదనను నిగ్గుతేల్చేవారు. ఈ పద్ధతినే గ్రీకులు డైలెక్టిక్స్ అనేవారు. —అనువాదకుడు.

మొక్క యదార్థ స్వరూపాన్ని తెలుసుకోవడం చేసేవాళ్లు. సోక్రటీస్ కూడ శిష్యులతో బాటు సత్యాన్వేషణ గావించే వాడే. సత్యమును గ్రహించడమే ఆయన పరమార్థం. ఆయన సంభాషణలు వింటూంటే శ్రోతలు బహు గాబరా పడిపోతూండేవాళ్లు. ఏది మంచి, ఏది చెడ్డ, ఏది న్యాయం, ఏది అన్యాయం, — అనేది గుర్తించలేని స్థితిలో పడిపోయేవాళ్ళు!

ఆ కాలంలో జనులు ఒక గాథను చెప్పుకుంటూండేవాళ్లు, జ్యూస్ దేవుని కుమార్తెలలో సత్యము ఒకర్తె. దినమంతా ఆమె పల్లెలు, పట్టణాలు అనకండా ప్రతి-చోటా తిరుగుతూ గడపి, రాత్రి తండ్రి దగ్గరకు ఒలింపస్ పర్వతాగ్రానికిబోయి, భూలోకంలో తాను చూచినది సర్వమూ నివేదించేది. ఆ రోజున తనను అవమానించిన వారిని గూర్చి, దూషించిన వాళ్ళని గూర్చి సత్యదేవత తండ్రితో మొరపెట్టుకునేది. సత్యమును అవమానము చేసిన వాళ్ళను జ్యూస్ శిక్షించువాడు. ఇప్పుడు జనులు ఆ దశను దాటారు. వారేమనుకుంటున్నారంటే 'సత్యం' భూలోకాన్ని పూర్తిగా వదలిపెట్టేసి, ఒలింపస్ పర్వతానికి వెళ్ళిపోయిందని! మానవుల అంతరాత్మ, మనస్సాక్షి కూడ సత్యంతో బాటు వెళ్ళిపోయింది. మనస్సాక్షి మంచువలె తెల్లనైన అవకుంఠనంలో దివ్యమైన శరీరాన్ని కలిగివుంటుంది! అది యిప్పుడింక యీ లోకాన్ని విడిచిపోయింది. అన్యాయం సంపూర్ణ విజయం పొందింది.

ఎక్కడ చూసినా దురాశా, దుష్టత్వం, — యివే కనపడుతూ న్నాయి. జనులు సత్యము నెంతమాత్రం ఖాతరు చేయడం లేదు. వారొకరినొకరు క్రూరమృగాల్లా భక్షించుకుంటూ న్నారు.

అటువంటి కాలంలోనే సోక్రటీసు జన్మించేడు. ఆయన మరల సత్యమును అన్వేషణ గావించ నారంభించాల్సివచ్చింది. ఆయన నగరమంతా పర్యటిస్తూ, అందరితోనూ చెప్పేవాడు : "మానవుడుగా జన్మించడం అదృష్టం. అందులోనూ ఏథెన్సులో నివసించగలగడం మరి అదృష్టం. ఎందుచేతనంటే ఏథెన్సు వాసులు తెలివితేటలకూ, మనో నిబ్బరానికీ, ధైర్య సాహసాలకూ పేరుపొందినవాళ్ళు. అంతేగాదు. వాళ్ళు కేవలం సంపదలకోసమే గాక అజరామరమైన కీర్తి ప్రతిష్ఠల కోసం కూడ పాటుపడుతూ, యీ మూండింటినీ పొందడానికి తీవ్ర కృషి గావిస్తూంటారు. కాని జనులు తమ ఆత్మోన్నత్యా నికై తగినంత శ్రద్ధను చూపడమే లేదు." *

యీ విషయాల్ని సోక్రటీసు పండితుడు నిరంతరం ప్రతి వాళ్ళకీ బోధిస్తూండేవాడు. బజారులో జనానికి కూడ ఆయన

---

* మానవుడై జన్మించుట, అదృష్టం; అందులో పురుషుడై పుట్టడం మరీ అదృష్టం; తత్రాపీ పండితుడగుట మరీ గొప్ప అదృష్టమని మన ప్రాచీను లనేవారు. భారతదేశం విశిష్టతగల భూమియనీ, యిక్కడ జన్మించుట పుణ్యావిశేషం వల్లనే లభిస్తూందనీ వారి భావం. ధర్మార్థ కామమోక్షము లనే చతుర్విధ పురుషార్థాల సాధనయే మానవుల కర్తవ్యమని వారు బోధించేవారు. గ్రీకుపండితుల బోధనలకంటె భారతీయుల బోధనలలో స్పష్టత, విశిష్టత, న్యాయసంబద్ధత కానవస్తాయి. — అనువాదకుడు.

యివే సంగతులు చెప్పేవాడు. కాని, అక్కడవాళ్ళకి అమ్మడం, కొనడం, లాభం మొదలైనవి తప్ప మరో గొడవే పట్టదు. పౌర సన్మానాల్లోనూ, విందు భోజనాల దగ్గరా కూడ ఆయన యీ విషయాలు నొక్కి వక్కాణిస్తూండేవారు. విందుల్లో చాలమంది దృష్టి పిండివంటలమీదా, మధుపానంమీద మాత్రమే ఉండేది. మరికొందరు గుర్రపు పందెములు, ధనార్జన గురించే ఆలోచించేవాళ్లు. కొంతమంది అధికారపదవులకు యెన్నుకోబడుటకై తాపత్రయపడుతూ, తమ వాగ్ధోరణిని చూపుతూండేవాళ్ళు. చాలమందికి తిండి, ధనం, పదవులు, — యివే ప్రాప్యములు, పరమార్థములు, అక్కడ. ఆ వాతావరణంలో కూడ సోక్రటీసు ఆత్మీయ సౌందర్యం, ఆత్మాభివృద్ధి, వీటి ప్రాధాన్యతనే నొక్కిచెపుతూ వుండేవాడు. ఇల్లాగ చెపుతూండడంవల్ల చాలమంది ఆయనకు శత్రువులుగా తయారయేవారు. కాని, యిల్లాటి శషభిషలకు సోక్రటీసు భయపడువాడు గాడు. నిద్రిస్తూన్న వాళ్ళ అంతరాత్మలను మేల్కొల్పడమే, జనులలో ఆత్మప్రబోధమును గావించడమే ఆయన తన విధ్యుక్త ధర్మంగా భావించేవాడు.

"నీ ఆత్మనుగూర్చి చింతించు. నిన్ను నీవు తెలుసుకో! నీ నగరం యెంత సంపద్వంతమైనదో, నీ నగరకీర్తి యెంత దూరం వ్యాపించిందో తెలుసుకుని తృప్తిజెందకు. అసలు నగరమంటే యేమిటో మూలానికిబోయి తెలుసుకోండి!" అనువా డాయన.

సోక్రటీసు తన జన్మప్రదేశమైన ఏథెన్సును గాఢంగా ప్రేమించేవాడు. చాలమందివలెనే ఆయన కూడా గతించి పోయిన సుదినాలకోసం ఆసక్తితో చూచేవాడు. చేతి పనులూ, వస్తుమార్పిడీ వచ్చాకనే ప్రజలు పాడైపోయినా రంటూ, ఆయన వాటిని నిందించేవాడు. సాంకేతికాభివృద్ధీ, శాస్త్రీయజ్ఞానమూ జనుల సౌఖ్యాన్నేమీ అభివృద్ధిగావించ లేదని ఆయన వాదన. ప్రాచీనకాలమే మంచిదనీ, ఆ మంచి కాలమునకు సమాజం తిరిగిపోవాలనీ, సాంకేతిక శాస్త్రీయ అభివృద్ధి యింకా జరిగితే అధర్మం, అసౌఖ్యం యింకా పెరిగి పోతాయనీ అనేవాడు. జనులందరూ తమ స్వాతంత్ర్యాన్ని గూర్చి బడాయికొట్టుకుంటున్నారే గాని నిజంగా వాళ్ళందరూ ధనానికి దాసులుగా వున్నారు! సోక్రటీసు చెప్పినది విని, చాలమంది తిరిగి పూర్వకాలపు నిష్ఠుర నియమాలు, కఠిన శాసనాలు పునస్థాపించ బడితేనే గాని బాగుపడమనే వాదన సత్యమేనని భావిస్తూండేవాళ్ళు.

"మన తాత ముత్తాతలనాటి నియామాలు, శాసనాలు తిరిగి స్థాపించబడాలి!" అనే విషయాన్ని గురించే నిరంతరం కులీన యువజనుల సమాజాల్లో చర్చలు జరుగుతూండేవి. ఈ మాదిరి సనాతన జీవితవిధానం యింకా నిలిచియున్నది, ఒక్క- స్పార్టా నగరంలోనే. ఏథెన్సుకూ స్పార్టాకూ యుద్ధం జరుగు తూనేవుంది. కాని, ఏథెన్సు వారు ప్రతివిషయంలోనూ, చివ రకి వేషభాషల్లో కూడా స్పార్టావాసులవలె ఉండేటందుకు

ప్రయత్నిస్తూండేవాళ్ళు. వారుకూడ బహువైన ముతుక ఉత్తరీయములను ధరించి, పొడవుగా జుట్టును, గడ్డములను పెంచెడి వారు. కొందరు రహస్యంగా శత్రువులతో సంబంధములను కూడ పెట్టుకొన నారంభించారు.

సోక్రటీసు రాజ వంశీకుడు గాడు. శిల్పియైన సాఫ్రోనికస్ అను సామాన్యుని పుత్రుడు, యీాయన. సోక్రటీసు బాల్యంలో ఉలి, సుత్తె చేతబట్టి పనిచేసినవాడే. ఈయన చెక్కిన ఛారైట్స్ అను సోదరీత్రయం యొక్క విగ్రహాలు రాజధానియైన అక్రోపోలిస్‌లో స్థాపితములై వున్నాయి. ఈ ఛారైట్స్ అనువారు సౌందర్యాధి దేవతలు.

కాని, సోక్రటీసు తండ్రి వృత్తిని వదలిపెట్టేడు. చేతిపని మేధస్సును బలహీనపరచి, రాజ కార్యాలలో పాల్గొను అవకాశాన్నీయదని ఆయన భావన. వర్తకులు, వ్యాపారస్థులు, సాలీలు, కుంభకారులు, చర్మకారులు మొదలగువారు సభలు చేసి, రాజకీయాలను నిర్ణయించడంలో వివేకం లేదని ఆయనకు తోచింది. చర్మకారుని పని పాదరక్షలను సుష్ఠుగా తయారుచేయడమే కాని రాజ కార్యాలను నిర్వహించడం కాదు! రాజకార్య నిర్వహణలో తర్ఫీదు నొందినవారే ప్రభుత్వ యంత్రాన్ని నడపాలిగాని మరొకరు గాదని సోక్రటీసు సిద్ధాంతం.

సోక్రటీసు యొక్క యీా అభిప్రాయాలను సంపన్నులైన రాజకుటుంబాల యువకులు సహజంగానే యెంతో మెచ్చు

కుంటూ వచ్చారు. ఈ విధంగా ఒక సామాన్య శిల్పి కుమారుడు, చినిగిన ఉత్తరీయమే ధరిస్తూండే నిరుపేద, మాతృభూమి కోసం యెన్నో యుద్ధాల్లో పోరాడిన వీరాగ్రేసరుడు, మానవులలో కల్లా నిస్వార్థుడు ఐనట్టి సోక్రటీసు అనుకోకండానే గర్విష్ఠులు, దురాశాపరులు, అధికార వ్యామోహం గలవాళ్లూ నైన దేశద్రోహులకు గురువూ, బోధకుడూ ఐనాడు!

పోరాటంలో ఎథీనియను ప్రజలు ఓడిపోయారు. అధికారమంతా స్పార్టనుల అనుయాయులైన రాజకుటుంబీకుల చేతుల్లోకి వెళ్లిపోయింది. వేలాదిగా ఉన్న సామాన్య వర్తకులు, వృత్తిపనివాళ్లూ గాక కేవలం ముప్ఫదిమంది ప్రభు కుటుంబీకులే నిరంకుశులై ఏథెన్సునగర పాలన గావిస్తూన్నారిప్పుడు! సోక్రటీసు శిష్యులు క్రిటియాస్, ఛార్మిడీస్‌లు యిప్పుడు ప్రభుత్వ అధినేతలుగా వున్నారు. న్యాయం, సత్యం, వివేకం, ధర్మం మొదలైనవాటిని గూర్చి సోక్రటీసు తన శిష్యులతోను, మిత్రులతోనూ గావిస్తూ వచ్చిన దీర్ఘ ప్రసంగాలను, చర్చలను విన్న ప్రజలు, అవన్నీ యింక ఆచరణలోనికి రావచ్చుగదా యని, తమ ఆశలు ఫలిస్తాయని ఆశించేరు. కాని, జరిగిందేమిటి? ఇప్పుడింక ఏథెన్సులో న్యాయం, ధర్మం మొదలైన మాటలే యెవరినోటా వినబడకుండా పోయినాయి!

నిరంకుశ ప్రభువులు తమ ప్రత్యర్థులను నిర్దాక్షిణ్యంగా చూసేవారు. నిరపరాధులను కూడ వూరకనే శిక్షించి, వారి ఆస్తులను స్వాధీనం గావించుకొంటున్నారు. తమ అధికా

రంలో ఏదో బలహీనతను, అరక్షిత స్థితిని ఊహించుకుని వారు అడ్డమైనవాళ్లనూ పట్టి ఖైదుచేసీ, ఉరితీసీ, పిరికిపందల్లా, మానవ విద్వేషులుగా ప్రవర్తించేరు.

ఏథెన్సు వాసియైన లియోన్ సుప్రసిద్ధుడు. ఆతడు స్వీయ ప్రాణ రక్షణార్థమై సలామిస్ ద్వీపానికి పలాయనం గావించేడు. క్రిటియాస్, చార్మిడిస్‌లు తనను ఉరితీసి, తన ఆస్తులను లాక్కోవాలని కుట్ర గావిస్తూన్నారని లియోన్ మెరుగును. సలామిస్ దీవికి వెళ్ళి లియోన్‌ను గొనిరమ్మని ప్రభువర్గం వారు సోక్రటీసును, మరో నలుగురినీ ఆజ్ఞాపించేరు. న్యాయవిరుద్ధమైన యీ ఆజ్ఞను నెరవేర్చ నిరాకరించినవాడు సోక్రటీసు ఒక్కడే! తన పూర్వ శిష్యులైన ప్రస్తుత అధికారుల్ని ఆయన బహిరంగంగానే విమర్శించి, వాళ్ళు చెడ్డ గొల్ల లన్నాడు. తమ మందను తగ్గించేటందుకు యత్నించే వారు మంచి గొల్ల లెట్లా అవుతారు? అందుపై ఆ నిరంకుశులు, యువజనులతో సోక్రటీసు మాట్లాడరాదని నిషేధం గావించేరు.

క్రిటియాస్, ఛార్మిడిస్‌లు సోక్రటీసును పిలిపించి, ఆయనతో యిల్లా చెప్పేరు: "సోక్రటీసూ! జాగ్రత్తగా మసలుకో! లేకపోతే మా మందలో యింకో జీవాన్ని తగ్గించాల్సివస్తుంది!"

ప్రభువర్గాల పరిపాలన అంటే యేమిటో యిప్పుడు సోక్రటీసుకి స్వానుభవంలో తెలిసింది. జనులు గొఱ్ఱెలవంటివాళ్ళనీ, తాము మందను కాయవలసినవారమనీ వారి అభిప్రాయం!

సోక్రటీసుకు ప్లేటో అనే మరొక శిష్యుడున్నాడు. ఆయన రాజకుటుంబీకుడు, క్రిటియాస్‌కు బంధువు. కాని, యితడు కూడా యీ ముప్పది మంది పరిపాలనతో పోలిస్తే బహుజనపాలనమే బాగుగా వున్నదని మిత్రులందరితోను చెపుతూన్నాడు.

ఆఖరికి యీ నిరంకుశులు కూలద్రోయబడ్డారు. ప్రజాతంత్రమునకు శత్రువులుగా ఉన్న వారి నందరినీ క్షమించుతూ ప్రజాతంత్రవాదులు ప్రజా పరిషత్‌లో ఒక శాసనాన్ని గావించారు. కాని, వారు సోక్రటీసును మాత్రం క్షమించదలచలేదు. ప్రజాతంత్రమును ద్వేషించ నేర్పిన దీయనే గాదా? హత్యలుగావించి, దోపిడీలు సాగించినవారికంటె యీయనే ప్రమాదకారి. హత్యలు, దోపిడులు గావించిన వాళ్ళని లోకం పరమ క్రూరులు, రాక్షసులు అనే భావిస్తుంది. కాని, సోక్రటీసు అంటే లోకానికి యెంతో గౌరవము! ఆయన ఉదాత్త చరిత్రుడు, లోకమాన్యుడూను. నిరంకుశులు ఖడ్గవాదులే గాని సోక్రటీసు ఆయుధం, తర్కం అంతకంటె నిశితమైనది. ఆయన యితరులతో వాదించి ఒప్పించే కళలో, విద్యలో అద్వితీయుడు, ఉద్దండుడూను!

ప్రజాపరిషత్ గావించిన క్షమాదాన శాసనం వల్ల సోక్రటీసును ప్రజాతంత్ర వ్యతిరేకిగా శిక్షించేటందుకు వీలులేకపోయింది. అందుచేత ఆయనమీాద యితర నేరాల నారోపించాలి. అవేమిటి? యువకుల్ని భ్రష్టులుగా చేయడం, కొత్త దేవుళ్ళను ప్రవేశపెట్టడం, యివే ఆయనపై ఆరోపించిన

నేరాలు. పరమ పవిత్రమైన అంతర్వాణి తనకు కర్తవ్యనిర్దేశం గావిస్తూంటుందని ఆయన నిరంతరం చెప్పడం మామూలు. అంటే దైవద్రోహం గావించినట్లే నని అర్థంగాదా ?

ఆఖరికి అంతాకలిసి ఆయన్ని న్యాయస్థానాని కీడ్చేరు. ఆయనపై ప్రధాన ఫిర్యాదీలు ముగ్గురు. మెలితస్ అనే ధని కుడు, దీకోన్ అను న్యాయవాది, అనీతస్ అను నాటక రచయిత; సందర్భం వచ్చింది గనక చెపుతూన్నాననుకోండి, యీ రచయిత నాటకాలేవీ జయప్రదం గాలేదు.

ఆత్మసమర్థనకై సోక్రటీసు యేం చెప్తాడో వినేందుకు ప్రజలంతా వేచియున్నారు. న్యాయస్థానం కిటకిట లాడుతూ వుంది, జనంతో. ఆయన యెల్లాంటి జంకూ గొంకూ లేకండా యిల్లా చెప్పేడు :

"మీరు నాతో యిల్లా అంటారనుకోండి : 'అనీతస్ చెప్పే దేమీ వినిపించుకోకండానే మేము నిన్ను వదలిపెట్టేస్తాం. కాని, ఒక్క షరతు. తత్త్వశాస్త్రాన్ని గురించి యిక నీ వేమీ ప్రసక్తిపెట్టుకోరాదు.' కాని, మీ రల్లా అంటే నేనేమి జవా బిస్తానో తెలుసా ? నా బొందిలో ప్రాణం ఉన్నంతవరకు నేను తత్త్వబోధకుడను, తత్త్వాన్వేషకుడనూ గాకుండా ఉండను. ఆబాలగోపాలమూ ప్రజలు తమ నశ్వరశరీరములు, సంపదలు గురించిన తాపత్రయం తగ్గించుకొని, తమ ఆత్మలను గురించి యోచించుకోమనీ, స్వీయజ్ఞానాభివృద్ధికై పాటుపడమనీ చెప్ప కండా ఉండజాలను. నేను చెప్పేది యెప్పుడూ ఒకటే : 'ఓ

ఎథీనియనులారా! అనీతస్‌ను నమ్మండి, నమ్మకపోండి! మిమ్మల్ని బట్టి నా నమ్మకాలను, చర్యలను మాత్రం మార్చు కోను. నేను నూరుసార్లు చావనలసివచ్చినా సరే కాని నా ప్రవర్తనలో మార్చుకోవాల్సింది లేదు! ఈ విషయంమీద పెద్ద రాద్ధాంతాల్లోకి దిగకండి. నేను చెప్పేది శ్రద్ధగావినండి, అర్థంచేసుకోండి. మీకు నావంటి మనిషి యింకోడు దొర కడం కష్టం. అప్రియమైన హితవు చెప్పడానికి యెవరికేమి పట్టింది? మిమ్మల్ని ముందుకు త్రోలుతూండడానికి కొరడా లాంటి వాణ్ణనుకోండి! నా మీద మీకు కోపం రావచ్చు. నిద్రపోతూన్న వాణ్ణి లేపుతే, లేపినవానిమీద అతగాడికి కోపం రాదూ? కోపంతో వాణ్ణి తిట్టడూ? తన శేషజీవితాన్నంతనూ మంచాన బడివుండి నిద్రిస్తూనే గడపాలని అతగాడను కుంటూంటే, మధ్యలో పానకంలో పుడకలా వచ్చి లేపుతే కోపంరాదా? తిట్టడా? ఐనప్పటికీ నేనేమో ఒకరి కోపతాపాలకు వెరవను. నా విధాయకాన్ని చేసే తీరుతాను. మీరు మీ పనులు చూచుకోండి. కాని, నగరంలోని క్రమరాహిత్యాన్ని గూర్చి అంతగా పట్టించుకోవద్దు. నేను కలుసుకున్న ప్రతి వ్యక్తితోనూ మాట్లాడుతూనే వుంటాను. ప్రతి వ్యక్తినీ మంచి వానినిగా మార్చేటందుకు ప్రయత్నిస్తూనే వుంటూ, నగర పౌరులకు మిత్రుడుగా, శ్రేయోభిలాషిగా వానిని మార్చే టందుకు ప్రయత్నిస్తూనేవుంటూ..."

ఈ ధోరణిలో ఉపన్యసించడంతో న్యాయమూర్తులు సోక్రటీసును దోషిగా నిర్ధారణ చేసేరు. ఆయనకు మరణదండన

విధించాలని ఫిర్యాదీలు సాధికారంగా చెప్పేరు. కాని, ఏథెన్సు శాసనాల ప్రకారంగానే యీ శిక్షకు ప్రత్యామ్నాయముగా మరొకదండనను సూచించే అధికారం, హక్కు ముద్దాయికి సోక్రటీసుకు వుంది. ఫిర్యాదీ ముద్దాయీలలో యెవరు చెప్పిన శిక్షను అంగీకరించాలీ ? అనేది నిర్ణయించే అధికారం అప్పాడింక న్యాయమూర్తులదై యుంటుంది.

కాని, సోక్రటీసు ఏమన్నాడో చెప్పనా ?

"ఏ శిక్షను తీసికోగలనని నన్ను మీరు అడుగుతున్నారు గాదూ ? నేను యేమి అపరాధం చెల్లిస్తాను ? మృత్యువా ? ప్రవాసమా ?...కాని, నేను యెక్కడికి వెడతాను ! ఎక్కడికి వెళ్ళినా నాకు యువకులు లభిస్తానే వుంటారు, నా ప్రసంగాలు వింటూనే వుంటారు. 'సరేకాని నువ్వు నోరుమూసుకుని ఉండు. నీ కింకేబాధా వుండదు' అంటారు, మీరు. కాని, మీరు నమ్మండి, నమ్మకపోండి, అల్లాగ ఉండడం నాకు సాధ్యంకాదు. అంతేకాదు. మానవునికి మహాభాగ్యమైనదీ, ఆనందదాయకమైనదీ యేమిటో తెలుసా ? ప్రతి దినమూ ధర్మస్వరూపమంటే యేమిటో, గుణదోషము లెట్లా నిర్ణయించాలో చర్చ చేయగలగడమున్నూ, ధర్మాధర్మ విమర్శ, గుణదోష నిరూపణ యెల్లాగో తెలుసుకుంటూండడమున్నూ; యివే నిజంగా మానవులకు ఆనందదాయకములు. ఈ పనిలో గడపిన జీవితమే సార్థకమైనదని చెప్పాలి. ఈ విచారం లేని జీవితం వృథాయే. నేను చెప్పేది మీరు నమ్మకపోవచ్చు, తృణీకరించనూ వచ్చు. కాని, యిదే సత్యం."

న్యాయాధికారులు మళ్లా యేకాంతంలోకి వెళ్లి, సంప్ర దించుకున్నారు. ఈసారి వాళ్లు తిరిగివచ్చి, ధర్మాసనాలలో ఆసీనులై సోక్రటీసునకు మరణదండనమును వినిపించేరు.

"కడసారి నీవు చెప్పుకునే దేమైనా ఉందా ?" అని న్యాయ మూర్తులు సోక్రటీసును అడిగేరు.

"ఇదిగో ! ఇక్కడ నేను, ఒక నిర్దోషిని, వృద్ధుడను, సమ్మా నార్హుణ్ణి నిలచి యున్నాను. నాకు మరణదండన విధించబడింది! జీవితంలోంచి నిష్క్రమించేటందుకు సమయం నాకు ఆసన్నమై యుంది. మృత్యువులోనికి నేను వెడతాను. మీరు జీవితం లోకి పోతారు."

సోక్రటీసు నిశ్చలుడై ఖైదు గదిలోనికి నడిచిపోయాడు. నేర విచారణలో తన్నుదా రక్షించుకొనేందుకు ఆయన ప్రయత్నించలేదని శిష్యులు, మిత్రులు, అందరూ కూడా పర మాశ్చర్యపడ్డారు. ఇంతకన్న తేలిక శిక్షతో సరిపెట్టుకు పోయే టందు కాయనకు అన్ని అవకాశాలూ ఉన్నాయి. ప్రవాస శిక్షను కోరితే యిచ్చేటందుకు న్యాయాధిపతులు సంసిద్ధులు గానే వున్నారు. కాని, తన ప్రాణాలు కాపాడుకోటానికి ఆయన ఏ ప్రయత్నమూ చేయలేదు ! 'ఏమిటి, మహాత్మా ! యిల్లాచేసేరు?' అనడిగితే 'నాయనలారా ! చనిపోవడమే నాకు పరమశ్రేయస్సు !' అని జవాబిచ్చారాయన. ఖైదులోనుంచి పారిపోయేటందుకు కూడా ఆయనకు అవకాశం యిచ్చేరు. కాని, సోక్రటీసు యిల్లా అన్నారు :

"బిడ్డలారా ! ఒద్దు. అది ధర్మంకాదు. అది సరియైన మార్గంకాదు. నేను నా స్థానంలోనే ఉండాలి. జీవితమంతా ధర్మప్రవర్తనను గూర్చే మాట్లాడుతూ బోధిస్తూవున్న నేను ఆఖరికి నా మాతృభూమి నిర్ణయించిన అర్హప్రదేశంలో నిలబడకండా పలాయనం గావించేనని లోకం చెప్పుకోవలసి రావడమా ? అది నా కేమంత శ్రేయస్సు ? అపకీర్తి భాజనమైన పనిచేయడం కంటె మరణించడమే మేలు. ఉత్తరీయం పైన కప్పుకుని, మృత్యుచ్ఛాయలలోనికి నిష్క్రమించడమే నాకు మంచిది. చివరి దినాల్లో నేను పతితునివలె పలాయనం గావించలేదనే విషయం యెరిగి వుండడంలో యెంత సంతృప్తివుంది ! నేను మూడుకాళ్ళ ముదుసలిని. ఏ పక్షాన చూచినా పరలోకంలో ఒకకాలు, యిహలోకంలో ఒక కాలుపెట్టి వున్నవాణ్ణి. ఆఖరికి యీ విధంగా ప్రవర్తించేడని అనిపించుకోవడం యెంత క్షూణత ? నా జీవితంలోని అత్యధిక భాగాన్ని యే గడ్డమీద గడిపితినో అట్టి నా మాతృభూమిని నా అవసానదశలో వదలిపోనా ? ప్రాణాలమీది తీపివల్ల మాతృదేశపు శాసనాన్ని అతిక్రమించేనని యితరు లాడుకొనేటట్లు ప్రవర్తించడం యెంత తప్పు ?"

శిక్ష అమలు జరుపవలసిన రోజు వచ్చింది. అంతా యథావిధిగా స్నానం చేసుకోడానికై సోక్రటీసు పెందలకడనే లేచేడు. తన శయ్యచుట్టూ చేరిన శిష్యులతో ఆఖరి సంభాషణను సాగించేడు.

ఆఖరిరోజున ఆయన శిష్యులతో దేన్నిగురించి మాట్లాడేరు?

మృత్యువంటే ఏమిటి? మానవుడు అమరత్వమును సాధించ గలడా? శరీరాన్నుంచి విడదీయబడినపుడు ఆత్మ యేమవుతూంది? శరీరంలేని ఆత్మ జీవించియే వుంటూందా? లేక అదికూడ నశిస్తూందా? శరీరం నాశంచెందడంతో ఆత్మ కూడా గాలిలో చెదరిపోతూందా? ఈలాంటి ప్రశ్నలను గూర్చి ఆయన మాట్లాడేరు.

సోక్రటీసు పండితుడు ప్రశాంత చిత్తంతో మృత్యువునెదుర్కోడానికి ఆయత్తమవుతూన్నాడు.

సూర్యాస్తమయం కావచ్చింది. సూర్య భగవానుడు దృష్టి పథమునుంచి తొలగి, నగరానికి వెనుకవైపున దిగిపోతూం డగా విష పాత్రను తీసికొని వచ్చాడు, మరణదండన మమలు చేసేవాడు. సోక్రటీసు శిష్యుడొకడు అంత తొందరేమని దండకుని మందలించేడు. దూరస్థ పర్వతాగ్రాలమీద యింకా సూర్యకాంతి ఉందనీ, సూర్యాస్తమయం యింకా కాలేదనీ, విషపాత్రను తేవడానికి అంత తొందరేమనీ అతడు ఆక్షేపించాడు.

"విషం సిద్ధంగా ఉంటే తెమ్మనండి!" అన్నారు, సోక్రటీసు.

విషపాత్రమును గొనివచ్చిన వానితో ఆయన యిల్లా అన్నారు: "ఉత్తముడా! నేనేం చేయాలో చెప్పు. నీవు యిల్లాంటి విషయాల్లో అనుభవశాలివీ, ప్రజ్ఞానిధివీ అని భావిస్తా."

ఈ మాటలంటూ ఆయన శిష్యులవైపు తిరిగి–"మరిచిపోకండి సుమా, నేను ఆస్క్లెపియస్‌కు ఒక పుంజు బాకీవున్నానని!" అన్నాడు.

ఇవే సోక్రటీసు ఆఖరి మాటలు.

మృత్యుదాత విషపాత్ర నందిస్తూ అన్నాడు: "విషం తాగండి. తరువాత పాదాల్లో భారంగా ఉందనిపించేవరకూ వేచివుండి, అప్పుడు పండుకోండి. విషం తనపని నారంభించిం దని దానికి అర్థం."

కొద్ది క్షణాల్లోనే సోక్రటీసు పండుకొన్నాడు. ఆయన పెదవులు కదలడం మానేశాయి.

సోక్రటీసు మరణం దండన అనిపించలేదు! జీవితంలోనుంచి యిచ్ఛాపూర్వకంగానే నైతొలగిపోవడంలా వుంది! లోకం వేలసంవత్సరాలుగా సోక్రటీసు శిష్యులు ఆయన జీవితం, బోధ నలు, మరణం మొదలైన వాటినిగూర్చి వ్రాసిన కథలను చదువుతూనేఉంది. కాని, సోక్రటీసు పండితుని విషాదాం తాన్ని గూర్చి మనం యింకా యిప్పు డిప్పుడే గ్రహిస్తూన్నా మనిపిస్తూంది.

జనులు న్యాయంగా ప్రవర్తించాలని ఆయన బోధించుతూ వచ్చేరు. కాని, ఆయన శిష్యులు ఆయన ఉద్దేశ్యాలకు భిన్నంగా నికృష్టులుగా, ద్రోహులుగా తయారయేరు! ప్రజ లను న్యాయమార్గానువర్తులుగా చేయాలంటే న్యాయమంటే

యేమిటో వాళ్ళకి విశదీకరించి బోధించడమే ఏకైకమార్గమని సోక్రటీసు అనుకున్నారు. కాని, ఆయన శిష్యులు క్రిటియాస్, ఛార్మిడిస్‌లు న్యాయమంటే తెలుసుకొన్నవారే యైననూ అన్యాయమునే ఆచరిస్తూవచ్చేరు! పైపెచ్చు సోక్రటీసును కూడా తమ దుష్కృత్యాలలో భాగస్వామిగా చేశారు. ఎట్లంటే, వారికి గురువు, బోధకుడు ఆయనయే గదా!

ఇతర తత్త్వవేత్తలవలె సోక్రటీసు ప్రకృతినిగూర్చి తెలిసికో ప్రయత్నించలేదు. 'మానవుని పనులనే' ఆయన సవిమర్శగా పఠించ నారంభించేరు. ఈ పరిశీలననే సోక్రటీసును మహా దుష్టకార్యాల్లో భాగస్వామిగా ఉండేటట్లు చేసింది. 'మానవుల్లోకల్లా అత్యుత్తముడుగా' యెంచబడిన సోక్రటీసు యీ రీతిగా తప్పటడుగువేసి, దారీ తెన్నూ లేని అధ్వాన్నపుటడవిలో పడిపోయాడు. చివరకు ఆయనకు బలవన్మరణం సంభవించింది.

ఆయన శిష్య ప్రశిష్యులు వ్రాసిన యెన్నో గ్రంధాల్లో సోక్రటీసు మరణాన్ని గూర్చిన కథలు వర్ణించబడి వున్నాయి. వాట్లని చదువుతూంటే ఆ వృద్ధపండితుని పట్ల మన కత్యంత గౌరవమూ, సానుభూతీ కలుగుతాయి. న్యాయాధిపతుల ముందు ఆయన తన్ను కొంచెపరచుకోలేదు, అవకాశం వున్ననూ ఖైదునుంచి ఆయన పలాయనం గావించనూ లేదు. 'శాసనాన్ని అతిక్రమించడం కంటె మరణించడమే మేలు!' అంటూండేవారు ఆయన.

తత్త్వవేత్తలను యెప్పుడూ వాళ్ళ ఆత్మబలమును బట్టి ఉత్తమ మధ్యములుగా నిర్ణయించడానికి మనం అంగీకరించము. అట్లుగాక మానవజాతి అభివృద్ధికై, పురోగమనానికై ఒక తత్త్వవేత్త తోడ్పడినాడా? లేక ఆటంకంగా నిలిచేడా? అన్న దాన్ని బట్టే మనం వారి న్యూనాధిక్యతలను కొలుస్తాము. సోక్రటీసును గూర్చి యీ దృష్టితో చూచినపుడు మనం ఏమంటాము? మానవుని అభివృద్ధికి ఆయన యెంతవరకు తోడ్పడ్డారు?

మానవుడు స్వాతంత్ర్యంకేసి పురోగమిస్తూన్నాడు, నిరంతరం. ఏథెన్సులోని ప్రజాతంత్ర పరిపాలన, యీ మార్గంలో ఒక ముందడుగే. ప్రస్తుతపు కొలమానాన్ని బట్టి చూస్తే అది సరియైన ప్రజాతంత్రం కానిమాట నిజమే. ఎందుచేతనంటే కొద్దిమంది ఏథెన్సు పౌరుల ప్రజాతంత్ర రాజ్యాంగం లక్షలాదిగా వుండిన బానిసల, విదేశీయుల పరాధీనతమీద ఆధారపడినదే గనుక! ఏదేశ్మైనను నిరంకుశ రాజరికంతో పోల్చి చూస్తేమాత్రం యిది ఆ కాలంలో అభివృద్ధికరమైన ప్రభుత్వ విధానమే. మరి అటువంటి ప్రజాతంత్రానికి సోక్రటీసు విరుద్ధంగా ఉన్నాడాయె! స్వాతంత్ర్యము నాయన మత్తు పానీయములతో పోల్చి, దుష్టులైన మద్యవ్యాపారులు దీనితో జనులను మతిభ్రష్టులుగా జేస్తూన్నారన్నాడు.

మానవుడుక్రమంగా సత్యంవైపునకు పురోగమిస్తూన్నాడు. ప్రకృతి విజ్ఞానం, ప్రకృతిమీద యితోధికారం, – వీటివైపు

మానవుని పురోగమనం ఉద్దేశించబడి సాగుతూంది. కాని, సోక్రటీసు ప్రకృతి పఠనమునకు అనుకూలుడు గాడు. 'ఆత్మను తెలుసుకో!' అనేవాడు, ఆయన. ఆత్మ అనేది పదార్థప్రపంచానికి వెలుపల, ప్రకృతికి అతీతంగా యెక్కడనో ఉంటూన్నట్లు !

ఈ రీతిగా సోక్రటీసు పండితుడు తన బోధనలతో సమకాలీన ప్రజలకే గాక రాబోవు కొన్ని తరాల వరకూ కూడ మానవజాతికి హాని కలిగించేరు. మానవజాతి అభివృద్ధిగాక తమ స్వార్థమును కోరే ప్రతివారూ కూడ సోక్రటీసు వచనాలను ప్రమాణంగా ఉదహరిస్తూ వచ్చారు. వెనుకటి కాలంలోని, మన తాత ముత్తాతల ఆచారాలకు, పురాతన విశ్వాసాలకు మరలిపోవాలి ! అన్నదే వారి ఘోష.

సోక్రటీసు పండితుడు తన వాదనాక్రమములో నిశితమైన తర్కము నుపయోగించి సత్యార్థ ప్రకటన గావిస్తూండేవారు. ప్రతిపాదనా పూర్వపక్ష సిద్ధాంతాలతో గూడిన మూడు సోపానములు గల నిచ్చెనవంటి దది. దానినే గతితార్కిక విధానమని పిలిచేవారు. తన వద్దకు వచ్చే పండితు లందరకూ వస్తువిషయాదుల నింకను నిర్దిష్టంగా నిర్వచించే యీ విధానమును బోధిస్తూ వచ్చేరాయన. కాని, స్వయంగా యీ విధానాన్ని ఉపయోగించి వస్తు పరిశీలనము, సత్యాన్వేషణము గావించ ఆయన యత్నించనేలేదు. సోక్రటీసు, ఆయన అనుయాయులూ కూడా గతితర్కమును అర్థరహితమైన దానినిగా,

వట్టి ఖడ్గవాదంగా, వ్యర్థమైన వితండవాదంగా తయారు చేశారనిపిస్తూంది. ఒక్క తప్పటడుగు యెప్పుడైతే వేశాడో సోక్రటీసు అప్పుడే తన శిష్య ప్రశిష్యులనే గాక ఆ తరువాతి తరాలవారైన యెందరో జ్ఞానాన్వేషకులను కూడ తప్పుదారి పట్టించేడు.

## దివ్యభూమికి పునరాగమనం

సోక్రటీసు శిష్యులలో ప్లేటో అను నాత డొకడుండేవాడు. ప్రజాతంత్రాన్నీ, విజ్ఞానాన్నీ ద్వేషించడంలో యీతడు గురువును కూడ మించినవాడు. యువకుడైన ప్లేటో యోచనాపరుడైన మనీషి, తపస్స్వాధ్యాయ నిరతుడైన నియమ వంతుడుగా ఉండేవాడు. ఈత డెప్పుడూ ఆలోచనాధీనుడై, ప్రశాంతంగా ఉండేవాడే గాని గందరగోళం, కంగారు మాత్రం యీయనలో యెన్నడూ గనవచ్చునవిగావు. తన సహాధ్యాయుల నీతడు చిన్నచూపు చూస్తూండేవాడు కూడాను. ఈయన ప్రారంభంనుంచీ చక్కని కార్యదీక్షను గనపరచేవాడు. తన గురువుగారి బోధనల నన్నిటినీ గ్రంథస్తం గావించి, మానవాళికై భద్రపరచాలని ప్లేటో సంకల్పించేడు. ఆయన తలపెట్టిన యీ కార్యము సామాన్యమైనది కానేకాదు. తన గురువైన సోక్రటీసు లోకోత్తరుడని ప్లేటో గ్రహించగలిగేడు. సోక్రటీసుతో సంభాషణ ఒక్కొక్కసారి పూర్తియైన తర్వాత ప్లేటో యింటికివచ్చి కూర్చుని, గంటము చేతబట్టి మైనపు పలకమీద తమ సంభాషణల నన్నిటినీ, మాట మాటనూ

జ్ఞాపకంచేసుకుని వ్రాస్తూండేవాడు. కాని, అదే సమయంలో తన స్వంత వ్యాఖ్యానమును కొంతైనా చేర్చి, దానిని సుబోధకముగా చేయకుండా ఉండలేక పోయేవాడు. గురు శిష్య సమావేశ వృత్తాంతము నంతనూ నాటక రంగంమీది పాత్రల సంభాషణలవలె ప్లేటో వ్రాసేవాడు. శిష్యగణ పరివేష్టితుడై సోక్రటీసు కూర్చుని, వాళ్ళతో ప్రశ్నోత్తర రూపంలో మాట్లాడుతూన్నట్లు చిత్రించబడుటవల్లనే యీనాటికీ ప్లేటో రచించిన 'సంవాదములు' లేక సంభాషణలు' (డైలాగ్స్) చవులు బుట్టిస్తూ, అత్యంతాశక్తిజనకంగా, సజీవమై, నాటకము వలె రమ్యతరమై వుంటాయి.

సోక్రటీసు చిరునవ్వునవ్వి, శిరఃకంపం గావించి, అంటాడు: "అమరులైన దేవతలు! ఈ యువకునికి నన్ను గురించి యెల్లాంటి భావాలున్నాయి!"

సోక్రటీసు మరణానంతరము ప్లేటో వెంటనే మాతృభూమిని విడిచిపోయేడు. ఏథెన్సులో ఉండడం ప్రాణాపాయకరమని ఆతడు గ్రహించేడు. పూర్వపు రాజవంశీకుడు, ప్లేటో. ఆతని సమీప బంధువర్గాలు బహు చురుకుగా కుట్రలు చేస్తున్నారు, ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి. ప్లేటో కూడ ప్రజాతంత్ర నాయకులపట్ల తన వ్యతిరేకతను యెప్పుడూ ప్రకటిస్తూనే ఉండేవాడు. ప్రజాతంత్ర నాయకు లందరూ సామాన్యులేగాని ఆభిజాత్యంగలవా రొక్కరూ లేరు. వర్తకులు, నౌకానిర్మాతలు, చర్మకారులు, శిల్పులు, దాను

శిల్పులు, పడవల స్వంతదార్లు మొదలైన వారే, వారందరూ. వీరే మహాత్ముడైన సోక్రటీసును మరణశిక్షకు గురిజేసినవారు.

ఈ కారణంవల్ల ఆయన ఏథెన్సునుంచి పారిపోయేడు.

సత్యం, ధర్మం, న్యాయం క్రింద జీవించు ప్రజలు గల దేశం యేదైనా యీ లోకంలో ఉందా? సమస్త సందేహాలను నివృత్తిచేయగల, అన్ని ప్రశ్నలకూ జవాబీయగల శాస్త్రం యేదైనా ఉందా?

జిజ్ఞాసియై ప్లేటో సముద్రం దాటి ఐగుప్తదేశానికి వెళ్ళేడు. ఐగుప్తీయుల ఆచార విచారాలూ, విశ్వాసాలూ కూడా ఆయనకు విడ్డూరంగానే కనిపించాయి. అక్కడ అధికారం అంతా పురోహితులదే. అది ప్లేటోకు ఆమోదయోగ్యంగా తోచలేదు. ఐగుప్తులో ప్రతివారూ తనకు విధ్యుక్తమైన పనినే చేస్తారు. ఆ యా వృత్తులు గావించువారి బిడ్డలుగా ఆ వృత్తుల్లోనే వుంటారు. ఈ విషయం ప్లేటోకు అతి సహజంగా, న్యాయంగా కనిపించింది. కర్షకులు కృషియందే నిమగ్నులై వుంటారు. రైతుబిడ్డ మరొకవృత్తి నేర్చుకోడు. ఏదో చేతివృత్తి చేసుకునే వాని కొడుకు రాజుకొలువులో చేరాలనుకోడు, పురోహితవృత్తి చేద్దామనీ అనుకోడు. ఏథెన్సు ప్రజాప్రభుత్వంలో యిల్లాకాదు. ప్రతి కుంభకారుడూ, చర్మకారుడూ, రేవుకూలీ, క్షురకుడూ కూడ పౌర సదస్సులలోనికి వచ్చి, రాజ్యాంగ వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోగలడు! రాజవంశీకులకే ప్రత్యేకించబడిన రాజ్యాంగ వ్యవహారాల్లో

యితరు డెవడైనాసరే జోక్యం కలిగించుకుంటే విగుప్తులో కఠిన దండనకు గురవుతాడు.

ఇదంతా పరిశీలించిన ప్లేటో క్రమంగా ఒకతరహా రాజ్యాంగ విధానాన్ని యోచించ నారంభించేడు. దానిలో రైతులు వ్యవసాయాది కృషులు సాగిస్తూంటారు. చేతిపనులవాళ్ళు వివిధవృత్తులు చేస్తూ ఉంటారు. శూరులు, తత్త్వవేత్తలు ప్రజలను పాలిస్తూంటారు, రక్షిస్తూంటారు. ఈ మూడెరి ప్రభుత్వం చాలమంది జనులను బండచాకిరీ చేయమనీ, కొలది మందిని పెత్తనం చేయమనీ విధిస్తుంది. చాలమందిని అజ్ఞానంలో ఉంచుతూ కొద్దిమందికే జ్ఞాన సంపాదనావకాశాల నిస్తుంది. కాని, యిదే ప్రజాతంత్రం కంటె న్యాయతరమైనదని ప్లేటో భావించేడు.

రాజ వంశీకుడైన ప్లేటో భావనాక్రమం సామాన్య జనుల్ని గూర్చి అంతగా శ్రద్ధతీసికోదు. "చర్మకారు డెవడో, వాని కేమి జరుగుతున్నదో నని రాజ్యాంగం యొంతమాత్రం పట్టించుకోదు. రక్షకశ్రేణుల వారే ముఖ్యులు. ఎందుచేత ? రాజ్యాంగం సక్రమంగా నడవాలంటే, సువ్యవస్థ స్థాపించబడాలంటే రక్షకు లుండితీరాలి. చర్మకారుడో, క్షురకుడో యేమైపోతాడోనని దిగులుచెందుతూ ఉండలేదు, రాజ్యాంగం. అందుచేతనే రాజ్యాంగ రక్షణ కవసరమైనవారే 'ఉత్తమ జనులు.' వారే ప్రధానులు."

కాని, 'ఉత్తమ జనులు' న్యాయశీలురుగానూ, ధార్మికులుగానూ, గౌరవనీయులుగానూ ఉండి ఉండాలని అర్థంగాదు.* రాజ్యాంగ క్షేమంకోసం పరిపాలకవర్గాలవారు అబద్ధాలాడడం, మోసం చేయడం అవసరపడవచ్చు. వారు శిక్షార్హులు కాజాలరు. కాని, సాధారణ జనులు, కర్మకారులు, రైతులు దగా చేస్తే, అబద్ధమాడితే, శిక్షార్హులగుదురు. ఇట్టిదే ప్లేటో యొక్క 'ధార్మిక రాజ్యాంగం' యొక్క రూపురేఖలు.

ప్లేటో అతి విచిత్రమైన, ద్వైధీభావంగల జీవితం గడపువాడు. ఆయన అందరు మనుజులవలెనే తిరుగుతూ, అంతా చూస్తూ, జనులాడుకొనేది వింటూ, అడిగినవారికి జవాబులిస్తూనే ఉండేవాడు. కాని, ఆయన దృష్టి మరొకచోట ఉండేది. శరీర మొకచోట మనసు మరొక దిక్కున. మరణించిన తన గురువు సోక్రటీసుతో ఆయన ఆత్మ సంభాషిస్తూండేది. సాధారణ నేత్రాలతో తిలకించజాలని దేనినో ప్లేటో ఆత్మ చూస్తూండేది. ప్లేటోకు సోక్రటీసు సజీవుడుగానే

---

* భారతీయ స్మృతులు చెప్పుదానిని దీనితో పోల్చిచూడుడు. యథా రాజా తథా ప్రజాః గాన రాజు ధర్మస్వరూపుడై ఉండాలని మన సాంప్రదాయం. ఆ ధర్మమును నిర్ణయించే అధికారం మాత్రం విజ్ఞులూ, వృద్ధులూ, సచ్ఛీలురూ నైన బ్రాహ్మణులదని చెప్పేరు. రాజ్యాంతే నరకం ధ్రువం అని కూడ చెప్పడంవల్ల పరిపాలనాక్రమంలో ధర్మవిరుద్ధంగా నడిచితీరాల్సి వస్తుందని మనవారు గుర్తించినట్లు తోస్తుంది. ఆ యా కులాలకు కర్మభేదం ఉన్ననూ నైతిక ధార్మిక సూత్రాలలో మినహాయింపులు అంగీకరించలేదు.

— అనువాదకుడు.

కనిపించేవాడు; కాని, సజీవంగావుండి, అటునిటు తిరుగు జనులు మాత్రం ఆయనకు యదార్థవ్యక్తులుగా గాక కేవలం ఛాయా మాత్రులుగా కనబడేవారు.

ఆయన విషయంలో జాగ్రత, సుషుప్తి అటు నిటు తారు మారైనాయి. ఆయనకు కనిపించు సమస్త వస్త్వాదులున్ను కలలోనికినలె వెంటనే అదృశ్యమైపోయీవి, కరిగి మరుగై పోయీవి. మానవుని జీవితము, అదృష్టము, శాసనము మొదలైనవన్నీ కేవలం అనిశ్చితములున్నూ, అశాశ్వతము లున్ను. అట్టిచో తాను దేనిపై నాధారపడి యుండగలడు? ఈ లోకంలో స్థిరమైన దేది? మానవుని కేడుగడ ఏది?

ప్లేటోకు వృద్ధ సోక్రటీసుతో జరిపిన సంభాషణాలన్నీ జ్ఞాప కమే. నశ్వరమైన యీ దృశ్య విషయ ప్రపంచాన్నుంచి సోక్ర టీసు తన్ను పైకెత్తి భావనా ప్రపంచంలోనికి ప్రవేశపెట్టేడు. అక్కడ పనిచేయగలవి వివేకచక్షువులే, మనోనేత్రాలే. అగో చరమైనతర్కసోపానపంక్తిపై నడచివెళ్ళగలిగినమహామహుడు, తన గురువు సోక్రటీసు. చుట్టూ తామరతంపరగా యెన్నో చెట్లు, ఓకు, పొన్న, గంగరావి మొదలైనవి ప్లేటో చూసే వాడు. కాని, అవేవీ శాశ్వతములు గావుకదా. ఏ తుపానో వాట్లని నాశంగావించవచ్చు, లేదా గొడ్డలికి లోబడి అవి రూపుమాసిపోవచ్చు, అదీగాకుంటే దావాగ్నిజ్వాలల్లో భస్మ మాత్రావశేషణం గానూవచ్చు. బ్రహ్మాండమైన ఓకు చెట్లు కూడ నాశనమై యీ భూమిమీదనుంచి ఆనవాలైనా లేకండా

అదృశ్యమై పోవచ్చు. ఐతే శాశ్వతమైన దేదైనా ఉందా? చెట్లు అశాశ్వతములు, క్షణభంగురములు కావచ్చు గాని 'చెట్టు' అనే సాధారణ సమిష్టిభావం అవినాశమైనది గదా. వృక్షభావమును యేదీ నాశనం చేయనే లేదు. కాలానికి ఆ భావంమీద ప్రభావం లేదు! నాశాన్నీ, వినాశాన్నీ కూడ ధిక్కరించి నిలువగల దది. ఒక త్రిభుజం ఉందనుకోండి. దానిని నీవు చెరపగలవు. కాని, త్రిభుజమనే భావమును నీ వేమియు చేయజాలవు. భావములపైన మానవునికి గాని, కాలమునకు గాని ప్రభావము లేదు. మనం చూచుచున్న సమస్తమునూ నాశనంచేయగలది, కాలము. కాని, ఆ వస్తువిష యాదుల భావములను మాత్రం కాలము స్పృశించనైన లేదు. భావములు దిక్కాలానవచ్ఛిన్నములు!

ఐతే యీ భావములు ఎక్కడ ఉంటాయి?

వాటి ఉనికి 'భావలోకం' లో; కాలాని కవ్వలి తీరాన; కేవలం కార్యకారణ వివేకం మాత్రమే ఆ లోకానికి చేర గలదు.

ప్లేటో యోచన అనే వాహనంమీ దెక్కి భావలోకానికి చేరుకున్నాడు. ఆ లోకంలో వర్ణభేదం, రూపభేదం లేదు. అక్కడ దేనినీ తాకనూ లేము, చూడనూ లేము. ఆ లోకం లోనే సత్యంయొక్క అత్యున్నత రూపాన్ని ఆత్మ దర్శించ గలదు. అదృశ్యమై యున్న ఆ భావలోకపు ప్రతిబింబం మాత్రమే, మనం చూస్తూండే యీ లోకం.

ఈ రీతిగా ఆ పండితుడు తన సందేశాన్ని జనులకు వినిపిస్తూ వచ్చాడు. తాను సత్యమార్గాన్ని కనుగొన్నా ననుకొని, యితరులకు కూడా ఆ సత్యపథమునుగూర్చి చెప్పి, వాళ్ళని కూడ స్వతంత్రుల్ని గావించాలనుకున్నాడు. ఇతరులు తన మాటలు వినేలా చేయడం చాల కష్టమని ఆయన యెరుగును. తనతో వితండవాదం చేస్తారు, గేలిచేస్తారు, ఆఖరికి తన్ను చంపేయాలని కూడ వాళ్లు ప్రయత్నిస్తారని ఆయనకు తెలుసు.

అల్లాగని ప్లేటో భయపడి ఊరుకోలేదు. ఆయన యువకులకు బోధిస్తూనే ఉండేవాడు. వాస్తవమైన లోకపు కాంతికి అలవాటుపడండని జనులకు ప్రబోధిస్తూనే ఉన్నాడు. గడబిడగా ఉండే వీధుల్లోనూ, బజారుల్లోనూ గాక ఆయన వివిక్తమూ, ప్రశాంతమూ నైన తన తోటలోని చెట్ల నీడల్లోనే శిష్యవర్గానికి బోధనలు గావిస్తూండేవాడు. తన గురూత్తముడైన సోక్రటీసు యెంత గడబిడగా ఉన్నా వీధుల్లోనే బోధలు చేస్తూండేవాడు. ఆయన నీ విషయంలో ప్లేటో అనుసరించదలచలేదు. ప్రశాంత వివిక్త వాతావరణం గల తోటలో తరుచ్ఛాయల క్రింద మహావీరుడైన అకాడిమస్ విగ్రహ పాద సమీపాన సుఖాసీనుడై ప్లేటో పండితుడు శిష్యులతో ప్రసంగిస్తూండేవాడు. యదార్థమైన ప్రపంచంకొరకు, జ్ఞానసంపాదన కొరకు ప్రయత్నించమని ఆయన హెచ్చరిస్తూండేవాడు. ఆ ఉద్యాన ద్వారంమీద ఆయన యిల్లా వ్రాయించేరు :

"క్షేత్రమితిలో పాండిత్యం లేనివారు యీ ఉద్యానంలోనికి అడుగిడకుందురు గాక !"

గణితశాస్త్ర జ్ఞానమే సంఖ్యాజ్ఞానాన్ని కలిగించి, క్లిష్ట భావములను గ్రహించే పటిష్ఠత నిస్తుందనీ, గణితశాస్త్ర ప్రవేశం లేనివాళ్లు తన బోధనలను అర్థంచేసికో జాలరనీ ప్లేటో భావం.

ఏ దేశమైనప్పటికిన్నీ కేవల భావములను ఊహించుట, వాటినిగూర్చి పర్యాలోచించుట చాల కష్టమే. ఏ దేనొక దృశ్యవస్తు రూపం లేకండా కేవలం భావవీథిలో సంచరించడం ప్లేటోకు కూడ అంత సులభమైనది గాదు !

అకాడమిస్ నికట ప్రదేశంలో జరుగుతూన్న ప్లేటో బోధనాశాలకు అకాడమీ యని పేరు వచ్చింది. తన అంతికము నుంచి కవిత్వమును, ఛందస్సులనూ తరిమి వేస్తున్నానని ప్లేటో అన్నప్పటికీ అవి అకాడమీలో యథేచ్ఛా విహారం గావి స్తూనే ఉండేవి. అకాడమీనుంచి కవితను పారద్రోలు మార్గం ఒకే ఒకటి వుంది ; తనలో కవితా వాసన యేమాత్రం లేకండా పారద్రోలుటే ఆ యేకైక మార్గం. కాని, ప్లేటో పండితునిలోనే కవితా కన్య కాపురముండేది. ఆయన యేది మాట్లాడినా పూవులు విరిసినట్లుండేది ! చక్షురగోచరమైన భావలోకమును గూర్చి ప్లేటో పుష్పితవాక్కులతో, చక్కని కవితాభాషలో మాట్లాడేవాడు.

ప్లేటో మిత్రులూ, అనుయాయులూ మైన మరికొందరు పండితులు కూడా అకాడమీలో బోధించేవారు. విద్యార్థుల కక్కడ నాలుగు శాస్త్రాల్లో శిక్షణ లభించేది. గణిత, సంగీత,

తర్క, జ్యోతిశ్శాస్త్రాలు నాలుగూ అక్కడ బోధింపబడేవి. మిగతా విద్యలన్నీ అనగా యంత్రవిద్య, ఔషధశాస్త్రం మొదలైనవి తక్కువ తరహాకు చెందినవనై, కేవలం చిల్లరపనులు చేసి పొట్ట పోసికొను వారికి మాత్రమే తగినవని ఆయన భావం. కులీన యువకులు ఆత్మాభివృద్ధికీ, యుద్ధ తంత్రానికీ సంబంధించిన విద్యనే అభ్యసించాలని ఆయన అనేవారు. ప్రకృతి పరిశీలన, పఠనము మొదలైనవాటిని మందబుద్ధులు మాత్రమే మెచ్చుకుంటారని ప్లేటో అభిప్రాయం. గ్రహ తారకాదుల గమనాన్ని గురించీ, శృతిలయాదులను గురించీ పఠించువారిని ఆయన పరిహసించువాడు. జ్యోతిశ్శాస్త్రాన్నీ, సంగీతాన్నీ పఠించుట, వాటి నొక సోపానంగా గొని, పైకిపోయి, స్రష్టయీ ప్రపంచము నెంత ప్రయోజనకరంగానూ, వివేకయుతంగానూ నిర్మించేడో గ్రహించి మెచ్చుకోడానికే నని ప్లేటో నొక్కి చెప్పేవాడు.

తాను వేటిని ఆదర్శలక్షణము లనుకుంటున్నాడో వాటినే వారసత్వంగా పొందిన కొందరిని ఆయన తన శిష్యులలోనే చూచేడు. ఆదర్శమైన 'కులీన పాలన' నడుపదగిన తత్త్వవేత్తలుగా వారిని ఆయన తయారు చేస్తున్నాడు. ప్రశాంతమైన అకాడమీ ఉద్యానతరుచ్ఛాయల్లో ప్రపంచాన్ని ఉద్ధరించునట్టి ప్రభుత్వవిధానాన్ని నిర్మించడానికి ప్లేటోపండితులు పథకాలను వేస్తూన్నారు.

ఆ రోజుల్లో సైరాక్యూజ్ నగరంలో రెండో డియోనిశియస్ అను నిరంకుశుడు పరిపాలిస్తూండేవాడు. ప్లేటో అక్కడికి

వెళ్లేడు. కాని, యీ తత్త్వవేత్త సలహాలను వినడానికి ఆ నిరం కుశ రాజు యిష్టపడకపోవడమే గాక అనాహూతుడై వచ్చిన యీాయనను పట్టి బంధించి, ఖైదులో పెట్టించేడు. ప్లేటో మిత్రులు కలిగించుకొని సాయంచేసి యుండనిచో ఆయన మృత్యుముఖాన బడెడివాడే.

ఏథెన్సు – సైరాక్యూజ్‌ల మధ్య, అకాడమీ – రాజరిక ముల మధ్య పడి ప్లేటో యీ రీతిగా నలిగిపోతూ వచ్చాడు. ఒకానొక సమయాన ప్లేటో యీ పాడు ప్రపంచాన్నుంచి, అంధకారమయమైన యీ నీరస లోకాన్నుంచి దూరంగా ఉండదలచుకున్నాడు, విరక్తుడై. కాని, పునరాలోచనమీద ఆయన యీ ప్రపంచాన్ని తన భావాల కనుగుణ్యంగా మార్పుచేయ నిశ్చయించుకుని, కార్యరంగంలోకి దిగేడు. ఆయన బోధనలలో ద్వైరుధ్యం కనిపించేది. ఒక్కొక్కప్పుడు మగిడిరాని గతంలోనికి నిష్క్రమించమనీ, మరొకప్పుడు అస్తి త్వంలోనే లేని స్వాప్నికలోకంలోనికి దూకమనీ ఆయన జను లకు ఉద్బోధించేవారు.

అక్కడ, తన ప్రశాంత ఉద్యానంలో, నగరపు గందర గోళాలకి దూరంగా, గంగరేగు చెట్ల నీడల్లో కూర్చుని, ఆలో చనా నిమగ్నుడై ఉండేవాడు, ప్లేటో. దేవాలయంలో వలె బహునిర్మలంగా, ప్రశాంతంగా, ఉండేదక్కడ. తన విద్యార్థి దశలో గావించిన సత్యాన్వేషణను గూర్చి శిష్యులతో ప్రసంగి స్తూండే వాడాయన.

దివ్యమైన స్రష్ట యేవిధంగా శరీరమును నిర్మించి, అందులో ఆత్మను ప్రతిష్ఠించెనో * ప్లేటో శిష్యులకు బోధించేడు. బుద్ధి, మనస్సు, ప్రాణంతో కూడినదై శరీరము సజీవమై కనిపించింది. ప్రతీ నక్షత్రమూ, గ్రహమూ కూడ ఆత్మగలవే నని ప్లేటో చెప్పేడు. సూర్య చంద్ర గ్రహ నక్షత్రాదులన్నీ కూడ దృశ్యమాన దేవతలు మాత్రమే. అవి జీవవంతములు గావుననే కదులు తున్నాయి. వాటికీ ఆత్మ లున్నాయి. వృక్షాలకూ, జంతువులకూ కూడా ఆత్మలున్నాయి. శ్రేష్ఠములూ, సుందరములూనైన వాటిని సృజించిన వాడే వీటి నన్నిటినీ సృజించేడు. మనం చూస్తూన్న యీ వస్తుప్రపంచమంతాకూడ సత్యం, శివం, సుందరం ఐనట్టి ఆ దివ్యలోకం లేక ఆత్మలోకం యొక్క కేవల ప్రతిబింబం మాత్రమే. నక్షత్రములున్న స్వచ్ఛమైన స్వర్గలోకం లాగే ఆ దివ్యప్రపంచం స్వచ్ఛంగా ఉంటుంది. సముద్ర జలాల్లోపల జీవించివుంటూ, తాను పైననే ఉంటున్నాననుకొనే ప్రాణివంటి వాళ్లమే మనం. అది తనపై నున్న నీటిలో నుంచి పైనున్న సూర్యునీ, నక్షత్రాలనూ చూస్తుంది. బలహీనమైన జ్ఞానేంద్రియాదు లుండుటచే అది పైన బహుప్రకాశమానంగా నున్న సూర్యుని సరిగా చూడనేలేదు. సముద్ర జలములపై నున్న ఆకాశ మెంత సుందరమైనదో ఆ ప్రాణి యెఱుంగనే లేదు !

---

* స ప్రాణమసృజత్ । ప్రాణాత్ శ్రద్ధాం, ఖం వాయుః జ్యోతిరాపః పృథివీంద్రియం, మనో అన్నం । అన్నాద్వీర్యం, తపో మన్త్రాః కర్మలోకాః । లోకేషు చ నామ చ॥ (ప్రశ్నోపనిషత్. అ 6. మం 4.)

మనము కూడ అటువంటి ప్రాణివలెనే ఉన్నాము. గుహాలో ఉంటూకూడా భూమిపైన నివసిస్తూన్నామని మనం భ్రమ జెందుతూన్నాము. వాయులోకమే స్వర్గమని అనుకుంటున్నాము. మనం దానిని దాటి పైకి లేవజాలము గనుకనే అట్లనుకుంటున్నాము! మానవుడు తన స్వభావాన్ని మార్చుకోగలిగితేనే నిజమైన ప్రపంచాన్ని గుర్తించగలడు. ఆ వాస్తవ ప్రపంచం యెంతో మనోహరంగా వుంటుంది. అక్కడి నేల అంతా ఉదారంగుగా, రజిత స్వర్ణ వికారంగా ఉంటుంది. అక్కడి శిలలు స్ఫటిక సంకాశములు; అవి యింద్రనీల వజ్ర మరకత రత్నములే ఐ వుంటాయి. కేవలాకాశంలో ప్రాణి కోటులు గలట్టి ద్వీపాలూ, ఖండాలూ ఉన్నాయి. అక్కడనూ దేవుళ్లు నివసించే ఆలయాలున్నాయి.

గురువుగారీ విధంగా చెప్పుకుపోతూంటే శిష్యులు, దివ్య గాథలు వినే చిన్నపిల్లల్లాగ అత్యాసక్తితో చెవులు దోరబెట్టి వింటూండేవాళ్లు.

ఆయన యింకా చెప్పుకు బోతూన్నారు. దుష్టజనులు బోవు భయంకరలోకం ఒకటి పాతాళంలో ఉందనీ, సుజనులు బోవు దివ్యలోకమొకటి పైన ఆకాశంలో ఉందనీ, సుజను లా దివ్య లోకానికిబోయి తమ సత్కార్యాలకు తగిన బహూకృతి నొందెదరనీ చెప్పేరు, ఆయన. ఆ దివ్యలోకంలో చాలకాలం నివసించేక వారు తిరిగి భూలోకానికి వస్తారు, కాని తమ స్వర్గ

నివాస సౌఖ్యాలను వారు మరువలేరు. * ఈ జన్మలో మనకు కలిగే మంచి ఆలోచనలన్నీ కూడా మనం దివ్యలోకంలో ఉన్నప్పుడు చూచిన వాటి స్మృతులు మాత్రమే ననీన్నీ, అందుచేతనే మనము సమ్యక్ జీవితమును గడపుటకై ప్రయత్నించాలనీ...యిత్యాదిగా ఆయన బోధిస్తూండేవారు.

ప్రాక్పశ్చిమ దేశాల జనుల పురాతన విశ్వాసాలూ, భావాలూ అన్నీ ఒక పెద్ద దివ్యగాథగా అల్లినట్లుండేది, ప్లేటో పండితుని కథనం. ఈ కథనము యొక్క జీవితం బహు దీర్ఘమైనట్టిది. దానిని సృజించిన దొక ప్రభువంశీకుడు. ఆతడు బానిస విధానాన్ని సమర్థించేవాడు. ఐననూ యీ కథనము బానిసలకూ, బిచ్చగాండ్రకూ కూడ బాధోపశమన కారణమైనది! అది విచిత్రముగదా? ఆ మందభాగ్యులు యీ లోకంలో స్వేచ్ఛాసౌఖ్యములను కనుగొనజాలక, స్వర్గమనే మహాద్భుత సుందర ఉత్తమలోకంలో అవి తమకు లభిస్తవని ఆశతో యెదురుచూడ దొడగిరి.

ప్లేటో రాజకీయంగా కూడా తన సమకాలీనులను తిరోగమన మార్గం పట్టించేరు. ప్రజాతంత్రాన్నుంచి, – అది యెంత లోపభూయిష్టమైనప్పటికిన్నీ, – నిరంకుశ రాజరికానికి

---

* నలోకాద్భిభ్యతేపరం అనీ, క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి – అనీ మన ప్రాచీనులు చెప్పేరు.

తద్విష్ణోః పరమం పదం / సదా పశ్యంతి సూరయః / దివీవచక్షురాతతం / ఋగ్వేదం. మం. 1. సూ. 20. మం. 20.

ఉత్తమలోకాలు పైనా, అధమలోకాలు క్రిందా ఉన్నవనీ, పైనదివ్యులు క్రింద పాపులు నివసిస్తారనీ మనవారుకూడ విశ్వసించేవారు. –అనువాదకుడు

తిరిగి రమ్మని ఆయన బోధిస్తూ వచ్చేడు. బహుళజన ప్రయో
జనములను ప్రక్కకు నెట్టి, కొద్దిమంది సౌఖ్యమునే గొప్ప జేసే
విధానాలకు అంటిపెట్టుకున్న వాళ్లంతా ఆయన బోధనలను
ఆతృతగా స్వీకరించ నారంభించేరు.

విజ్ఞానం, మతం, – రెండూ ఏకీకృతంగా, సమన్వయంతో
నడచిన కాల మొకటి ఉండేది. తరువాత విజ్ఞానం మతా
న్నుంచి విడివడి, స్వతంత్రంగా అభివృద్ధిజెందింది. ఇప్పుడు
ప్లేటో తిరిగి వాటి రెంటినీ కలిపివేయదలచేడు. అంటే మత
మునకే విజ్ఞానమనే మేలిముసుగు వేయించి నిలువబెట్ట సమ
కట్టేడు.

250 ఏండ్ల క్రిందట గ్రీసు దేశంలో సోఫిస్టులంటూ ఒక
తరహా తత్త్వవేత్తలుండువారు. వాళ్ల వాదన బహు నిశితంగా
ఉండేది. అతి తెలివివల్ల వాళ్లు చివరకు జ్ఞానానికి వక్రభాష్యం
చేయ నారంభించారు. అందుచేతనే తరువాతి కాలంలో
సోఫిస్టులంటే * కుతార్కికులని వాడుకవచ్చింది! అసలు

* అద్వైతం అను వేదాంతముకూడ మన దేశంలో యిట్టి వాడుకనే
పొందింది. 'వానిదంతా అద్వైతం!' అంటాం, హేతువును అతిక్రమించి
వాదించువానిని. 'జీవేశ్వరజగన్మిథ్యా' అనునది వారి వాక్యమే. దీనిని
సమర్థించుతూ వారు చూపు ఉపపత్తులు అత్యద్భుతంగాఉంటాయి. మానవుని
బుద్ధినిగాని, జ్ఞానాన్నిగాని ప్రమాణంగా అంగీకరించ వీలులేదని వీరి వాదన
లలో నొకటి. సర్వమూ మిథ్యగా, భ్రమగా కొట్టి పారవేస్తూనే, రెండో
ప్రక్క లోకవ్యవహారార్థమై కొన్ని పరిమితులకు లోబడి విషయ ప్రపం
చపు యాదార్థ్యాన్ని అంగీకరించారు. దీన్నే 'వ్యావహారికసత్యం' అన్నారు.

సత్యమనేదే లేదంటారు, సోఫిస్టులు. ఉన్నవల్లా బహుళములైన అభిప్రాయములు మాత్రమే ననిన్నీ, అవికూడా యెందరు మనుష్యులుంటే అన్ని అభిప్రాయములూ ఉన్నాయనీ వారంటారు. విజ్ఞానాన్ని వీరు ప్రకృతికి దూరంగా గొంపోయి, అస్తిత్వమే లేని భూతలోకంలో పెట్టి, ఆ రీతిగా యదార్థప్రపంచమును గూర్చిన విజ్ఞానంతో పురోగమించకుండా మానవ జాతికి అడ్డు దగిలేరు.

ఒకప్పుడు మానవులు దివ్యలోకాల్లో జీవించుతూండేవారు. ఆ లోకాల్లో అన్నీ దివ్యరూపములే! చెట్లుచేమలు, పశుపక్షి మృగాదులు, – ఒకటేమిటి? అన్నీ ఆత్మగలట్టివే, అక్కడ! కొండలూ, బండలూ కూడ మాట్లాడేవి, చెట్లకీ, పుట్టలకీకూడ ఆత్మ, ప్రాణం ఉండేది!

కాని, మానవుడు అక్కడే ఉండిపోలేదు. నిరంతరాభివృద్ధి గాంచే ప్రపంచాన్ని ఆతడు తెల్సుకోవాల్సిఉంది. కాలం గడుచుకొలదీ బుద్ధికి గ్రహణసామర్థ్యం అధికాధికం కాజొచ్చింది. అంతలోనే మళ్లా పాతప్రపంచం తిరిగి జ్ఞానదీపికను క్రమ్ముకొని, మూసివేయజొచ్చింది. విజ్ఞాన శాస్త్రానికి పుట్టినిల్లయిన గ్రీసులో ప్లేటో పండితుడు తన శిష్యులందర్నీ తిరిగి యీ దివ్యలోకాలకే గొనివచ్చాడు. థేల్స్, అనక్షిమందిర్,

---

ప్రకృతిలోని విషయములన్నీ మిథ్య ఐనపుడు వాటినిగూర్చిన జ్ఞానంయెందుకు? యదార్థమైనదేదో దాన్ని అన్వేషించుదామని వాదించి, వీరు బుద్ధిని మరలించేరనే చెప్పాలి. —అనువాదకుడు

అనక్షగోరస్ మొదలైన విజ్ఞులు, పండితులు అసలు జనించనే లేదా ? యని అనుమానంలో పడినా పడవచ్చు, ఎవరైనా!

మానవజాతి గావించే జ్ఞాన ప్రస్థానం నిజంగా తిరిగి వెనక్కి మళ్ళించబడిందా ?

మానవోత్తములు గావించిన మహత్తరసాధనలు, మహా జనుల విజయాలు వమ్మైనవా ?

లేదు, లేదు. కొందరు యువకులు ప్లేటో బోధనలు వింటున్నా మరికొందరు బహుశ్రద్ధగా డెమాక్రిటస్ గ్రంథాలు పఠిస్తూనే వున్నారు. ప్లేటో ఒక దిశగానూ, డెమాక్రిటిస్ తద్వ్యతిరేక దిశగానూ జనులను నడపమంటున్నట్లుంది!

డెమాక్రిటస్ బోధనలను జనుల మనస్సుల నుంచి దూరం చేయడానికి ప్లేటో, ఆయన అనుయాయులు తమ శక్తివంచన లేకుండా యత్నిస్తూనే ఉండేవారు. ఎప్పుడైనా డెమాక్రిటస్ వాదనలను ఖండించవలసి వచ్చినపుడు ప్లేటో మహాశయుడు తన ప్రత్యర్థి పండితుని నామోచ్చారణమైనా చేయువాడు గాడు! ఆయనపేరు ఉచ్చరించి, ఆయనకీర్తి నింకనూ వ్యాప్తి చేయదలచుకోలే దాయన. ఐనను డెమాక్రిటస్ భావాలు జనులలో నిర్మూలమగుటకుమారు వ్యాప్తిగాంచుటను చూసి, ప్లేటో కటకట బడిపోయీవాడు. ప్లేటోయే దీనిపైన యిల్లా వ్రాసేడు: "చాలమంది యీ బోధనలు అత్యద్భుతమైనవీ, తర్కబద్ధమైనవీ యని భావిస్తారు. అందుచేతనే వీటిని చదివిన యువకులు మతాన్ని తిరస్కరిస్తూ, దేవుళ్ళు లేరని అంటు

న్నారు. శాసనరీత్యా కూడ జనులు యీ దేవుళ్ళలో విశ్వాసం ఉంచితీరవలసిందే. కాని అట్లు జరగడం లేదు. విప్లవములకు బీజం యిందులోనే ఉంది."

"జ్యూస్ దేవుడే లోకంలో సర్వమునకూ నామరూపకల్పన గావించినది. ఆయన సర్వజ్ఞుడు. సర్వమును యిచ్చువాడూ, తీసి కొనువాడూ ఆతడే." అని వక్కాణించే జ్ఞానులను డెమాక్రిటస్ పరిహసించేవాడు. ఆయన యిట్లు చెప్పేవాడు: "నశ్వరమైన ప్రకృతి వినాశనమునకు లోబడినట్టిదేనని తెలియక, జీవితములోని కష్ట నష్టముల ననుభవిస్తూ, జీవితములను తాపత్రయములలోనూ, భయములలోనూ గడపుతూ కొందరు జనులు అనంతర జీవితమును గూర్చిన కట్టుకథలను కల్పించుకుంటున్నారు."

ఈ దృక్పథము నెదిరించి, ఖండించుతూండేవాడు, ప్లేటో. అనంతరజీవితములోను, పరలోకములోనూ జనులకు విశ్వాసం కలిగించాలని ప్లేటో పండితుడు ప్రయత్నించేవాడు. ఈ లోకంలో ప్రాణుల జీవితం తాత్కాలికమేననిన్నీ, అనంతర లోకమే నిజమైన లోకమనిన్నీ, అక్కడనే జనుల దుష్కర్మలకు శిక్షణయున్నూ, కష్టములకు నివృత్తియున్నూ, ప్రతిఫలమున్నూ కలుగుననీ ఆయన బోధించేవాడు.

కాని ప్లేటోకే తన యీ బోధనల యాదార్థ్యమునందు విశ్వాసమున్నట్లు లేదు. ఎట్లంటారా? తన ప్రత్యర్థుల నాయన పరలోక శిక్షలతో భయపెట్టుటయేగాక యీ లోకంలోకూడ

శిక్షించ జూచువాడు. ఎవరి కర్మమున వారు పోతారనే యని ఆయన ఊరకోనలేదు! ఆయన యిల్లా వ్రాసేడు: "కొందరిని ఉరితీయాలి. మరికొందరిని చిత్రవధలకు, యింక కొందరిని కారాగారములకు పంపించాలి. కొందరి సంపదల నన్నిటినీ లాగివేసుకోవాలి, మరికొందరను దేశభ్రష్టులను చేయాలి." సోక్రటీసు పండితునికి మరణశిక్ష విధించిన జడ్జీలను చూచి మండిపోయి, వారిని తీవ్రంగా ఖండించిన విషయమును ప్లేటో అప్పుడే మరిచిపోయాడా? ఇప్పుడు తానుకూడా తన భావాలతో యేకీభవించనందుకు ప్రత్యర్థులకు మృత్యు దండనము విధించాలంటున్నాడే!

రెండు విరుద్ధదృక్పథముల మధ్య, రెండు తత్త్వశాస్త్రాల మధ్య సంఘర్షణ మీ రీతిగా నడచింది. ప్లేటో — డెమాక్రిటస్, ఆత్మవాదం — భౌతికవాదం,— యీ రెండు భావవాహినులు పరస్పరం పోరాడుకుంటూ సాగినాయి.

## మానవుడు దారికోసం తడుముకుంటాడు.

గురువు నైనను గ్రుడ్డిగా అనుసరించ నొల్లని వాడొకడు ప్లేటో శిష్యులలోనే ఉండేవాడు. అతడొక వైద్యుని కుమారుడు. ఆత్మ అనేది శరీరంలేకండా విడిగా ఉండగలదనేది అతను నమ్మలేకపోయేవాడు.గుండెకాయయే రక్తమును వేడిగాఉంచుతూందనీ, యీ వేడియే జీవిలో ప్రాణమును నిలిపి ఉంచుతూందనీ ఆయన తండ్రి చెప్పగా విన్నాడు. అదేగాక నిప్పు

లోనూ, రాతిలోనూ, గాలిలోనూ యే రకమైన ఆత్మ ఉంటుంది? అనేది ఆతనికి తెలియలేదు. చెట్లు ఒక రకమైన 'శాక ఆత్మ' ను కలిగియుండవచ్చును. అంటే చైతన్య రహితమై, అనుభూతి నొందజాలనిదైనను ప్రాణమును నిలిపియుంచ గలదై, విత్తులద్వారా సంతానాభివృద్ధి గావించుకోగల్గినంతటి శక్తి గలదన్న మాట. కాని రాతిని చూడండి. దానిలో జీవం లేదు; భూమిలోనుంచి రసాదులను పీల్చుకోలేదు; రాయి తన జాతిని సంతానంద్వారా వృద్ధిగావించుకోలేదు.

ఇటువంటి సంశయాలు ఆ శిష్యుని బుర్రలో అనంతములు.

సంశయాత్ముడైన యీ శిష్యునిపేరు అరిస్టాటిల్.

ఈతడు అకాడమీలో విద్యాభ్యాసం గావిస్తూ చాల యేండ్లు గడిపేడు. గురువు చెప్పిన విషయాలన్నింటినీ యీతడు మెచ్చుకున్నాడు. ప్రతి విషయమునూ తర్కయుక్తులతో సందేహించుట, ప్రశ్నించుట, ఖండించుట, వాదోపవాదముల వల్ల సత్యాన్వేషణ గావించుట, యదార్థ విషయములనుంచి కడపటి వివేచన, సిద్ధాంతం చేయుట మొదలైనవన్నీ ఆయన గ్రహించేడు. ప్లేటో మహాశయుడు యీతన్ని గురించి యిల్లా అంటూండేవాడు: "ఇతరులకు ముల్లుకర్ర కావాలి. అరిస్టాటిల్ కి కళ్లెం కావాలి!"

కాని, ప్లేటో దివ్యలోకాలకు తీసికొనపోవ జూచినప్పుడల్లా అరిస్టాటిల్ తప్పించుకు పోయీవాడు. ఆ దివ్యలోకాల్లో శరీరాలు లేని ఆత్మలే నివసిస్తాయనీ, అక్కడ వస్తువిషయాదులు

కాకుండా వాట్లను గూర్చిన భావాలు మాత్రమే వుంటాయనీ చెప్పుతూ గురువుగారు దివ్యలోకాలకు దారితీసినపుడు యితడు తప్పించుకునేవాడు.

ఈ శిష్యుడు ధైర్యశాలి,సత్యనిరతుడు,నీతిమంతుడు. గురువు తనన్ను యీ దారిలో నడుప యత్నించినపుడల్లా అరిస్టాటిల్ అనేవాడు: "నేను ప్లేటోను భక్తితో కొలుస్తాను. కాని, సత్యమును అంతకంటెనూ భక్తితో కొలుస్తాను."

ఆఖరుకు అతడు అకాడమీని విడచిపెట్టి, జ్ఞానసంపాదనకై తన మార్గమునే అనుసరించేడు.

కేవలం హేతువాదం, తర్కంవల్లనే మనము దేనినీ పూర్తిగా తెలిసికోజాలమని అరిస్టాటిల్ గ్రహించేడు. కండ్లు మూసికొని కూర్చుని, యెంత వితర్కించుకుంటే మాత్రం ప్రయోజన మేమిటి? దేనినైనా గ్రహించాలంటే మనము వినాలి, చూడాలి, స్పృశించాలి.

కాని, యీ పనులన్నీ జంతువులు కూడా చేస్తూనే వున్నాయిగదా? కొన్ని జంతువులు తాము విన్న ధ్వనులనూ, చూచిన వస్తువులనూ, అనుభవించిన విషయములనూ గుర్తుంచుకోగలవు కూడాను. ఉదాహరణకి ఒకసారి నిప్పుచురక తగిలిన జంతువు మళ్ళా నిప్పుదగ్గరికి వెళ్ళడానికి భయపడుతుంది. జంతువులకు జ్ఞాపకశక్తీ, అనుభవజ్ఞానమూ ఉన్నాయనడానికి యిదే నిదర్శనము. కాని, ఒక్క మనుష్యులలోనే కళలు, విజ్ఞానము మొదలైనవి పరాకాష్ఠను చెందినాయి. నిప్పు

కాలుస్తుందని తెలుసుకున్న మానవుడు దానికి దూరంగా ఉండ డంగాక, నిప్పును తాకకండా ఒక కుండలోనో మరి దేనిలోనో ఉంచి తీసికొనిపోతాడు. అంటే అనుభవం మనుష్యునికి కర్మ కౌశలమును నేర్పినదన్నమాట! అందుకనే అనుభవమును మంచి గురువుతో పోలుస్తారు.

సాధారణంగా ప్రతి కుంభకారుడూ నిప్పును అలవాటువల్ల ఉపయోగిస్తూనే ఉన్నాడు. ఎట్లు? ఎందుకు? అను ప్రశ్నలు అతనికి లేవు. కాని, శాస్త్రవేత్త మాత్రం తాను చేస్తూన్నది ఏదికానీ, ఎందుకో, ఎట్లో తెలుసుకొనే చేస్తాడు.

అరిస్టాటిల్ దీనిమీద సిద్ధాంతీకరించాడు: శాస్త్రం అనగా తెలుసుకోవడం, గుర్తించడం అన్నమాట. తెలియని వాడు యేదేనా కొత్తవస్తువును చూచి, ఆశ్చర్య పడతాడు. శిశువు యేదేనొక యాంత్రిక క్రీడావస్తువును చూచి, ఆశ్చర్య పడు తుంది. కాని, యాంత్రిక చలన శాస్త్రాన్ని తెలుసుకున్న ప్రాజ్ఞుడు క్రీడావస్తువు తిరిగితే ఆశ్చర్యపడడు,— అది తిరగకుం టేనే ఆశ్చర్యపడతాడు.

విద్యాహీనునికీ, విద్యావంతునికీ యిదే భేదం.

ఐతే, మనం చూస్తూన్న యీ వస్తు విషయాదులకు కారణం యేది?

ఈ ప్రశ్ననే తనకు ముందునుంచి యెందరెందరో మహా మేధావులు వేస్తూ వచ్చేరని అరిస్టాటిల్ యెరుగును. ఏదో ఒక యాంత్రిక క్రీడావస్తువు యెట్లు తిరుగుతూందో గ్రహించే

టందుకు ప్రత్యేకంగా గొప్ప తెలివితేట లేమీ ఉండనక్కర లేదు. అట్లుగాక యీ సృష్టిలోనున్న అసంఖ్యాక వస్తు విష యాదులకు మూల కారణమును తెలిసికొనగలగడం అంటే అదేమీ సామాన్య విషయం గాదు. గ్రీకు విజ్ఞానులు యిరవై ఐదు శతాబ్దాల క్రిందటనే యీ ప్రశ్నకు జవాబీయడానికి ప్రయత్నించేరు. * తాము ఊహించ గలిగిన జవాబులను కూడా వారు పుస్తకాల్లోనూ, పత్రాల్లోనూ వ్రాసేసి వుంచేరు. అజ్ఞానోపహతులైన వారికి యీ పత్రములమీది వ్రాతలు 'బ్రహ్మరాతలు' గానే ఉంటాయనుకోండి! అల్లాంటివాళ్ళు యిది పనిలేని పని అనుకోవచ్చు కూడాను. కాని, అరిస్టాటిల్‌కి యిట్టి వ్రాతలే అమూల్యమైన పెన్నిధులైనాయి. ఈ

---

* ఋగ్వేదంలోని నాసదీయ సూక్తములలో యీ సంప్రశ్నమునే చూస్తాము.

కో అద్ధావేద క ఇహ ప్రవోచత్, కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః ।
అర్వాగ్దేవా అస్యవిసర్జనే నా, థకొ వేద యత ఆబభూవ॥ 6 ఋక్॥
ఇదం విసృష్టిర్యత ఆబభూవ, యదివా దధే యదివా న దధే ।
యో అస్యాఽధ్యక్షః పరమేవ్యోమన్, సో అంగవేద యదివా
న వేద॥ 7 ఋక్॥

ఋగ్వేదం. దశమమండలం. 129సూక్తం. తైత్తిరీయ బ్రాహ్మణం2-8,9.
పైఋక్కులకు అర్థ మీ క్రింద యిస్తున్నాను.

"ఈ దృశ్య సృష్టియొక్క విసర్గము లేక వ్యాప్తి యెక్కడనుండి వచ్చినది? ఎవరినుంచి పుట్టినది? దీనిని గురించి యింతకంటె విస్తరముగా చెప్పువారెవరు? దీనిని గూర్చి యితమిత్థమని తెలుసుకొన్నవా రెవరు? దేవతలు కూడా యీ సృష్టికి అనంతరమందు పుట్టినవారే. అట్టిచో యీ సృష్టి యెచ్చటినుంచి వచ్చినదో యెవ్వరెరుగుదురు?

పెన్నిధులలో ఉండేవి ఆలోచనామణులు గాని సాధారణ భౌతిక వస్తువులు గావు. ఇట్టి నిధులకు ప్రతి తత్త్వవేత్తయును తన అంశను చేరుస్తూ వచ్చేడు. కొందరు మాత్రం తాము అత్యధికముగా యిందులో ఉంచుతూ వచ్చారు. తాత ముత్తాత లిచ్చిపోయిన భోషాణమును పుత్రు డెంత ఆతురతతో తెరుస్తాడో అంత ఆతురతతోనూ అరిస్టాటిల్ పురాతన పుస్తకాలను తెరచేవాడు. ఆయన అందులో యెటువంటి పెన్నిధులను చూచే డనుకున్నారు ! ఐతే ఆ నిధిలో వెలలేని ఆభరణములతో బాటు వెల తక్కువ యిత్తడిముక్కలను కూడా కనుగొన్నాడు, ఆయన. అందుచేత అరిస్టాటిల్ ఆ పెన్నిధుల్లోని బంగారాన్నుంచి యిత్తడిని, సత్యాన్నుంచి అసత్యాన్ని వేరుచేయ పూనుకొన్నాడు.

---

ఈ విసృష్టి, వ్యాప్తి దేనినుంచి యైనదో? ఇది సృష్టమైననూ, సృష్టము గాకున్ననూ యెవడు దీనికంతకూ అధ్యక్షుడో, యెవ్వడు పరమమైన ఆకాశమునం దుండునో, అతడైననూ దీని నెరుగునో? ఎరుగడో? ఎవరు చెప్ప గలరు?"

మానవుని మేధ యీ సృష్టికి కారణాన్వేషణ గావించుచు యెన్నెన్నో సిద్ధాంతములను గావించింది. వైదికఋషులు వేలయేండ్ల క్రితమే చేసిన యీ యోచన బహు మనోహరమై, తర్వాతి తత్త్వజ్ఞులకు ఒరవడియైనది. మానవ మేధ నిరంతరాన్వేషణము గావిస్తూ, నూతనవిషయాల నెన్నిటినో కనుగొంటూన్నా, కొంగ్రొత్త ప్రశ్నలు, సమస్యలు బైలుదేరి మానవ మనోనేత్రం ముందు నిలుస్తూనే ఉంటాయి. ఈ అన్వేషణకు ముగింపు అనూహ్యము. ప్రవాహధర్మంలో యిది సాగుతూనే ఉంటుంది. పురాతన భారతీయ గ్రంథాలలో యిట్టి మూలతత్త్వ అన్వేషణమును తెల్పు వచనము లసంఖ్యాకములుగా ఉన్నాయి. — అనువాదకుడు.

ప్రాచీన తత్త్వవేత్తలకు ఆలోచనా, వివేచనా గావించుట యెంత కష్టంగా ఉండెడిదో అరిస్టాటిల్ యీ తన అన్వేషణా కార్యం వలన గ్రహించగలిగేడు. తాను గావించే వైజ్ఞానిక యుద్ధంలోనికి యింకా కొందరు నూతన యోధులను సమకూర్చుకోవాలని తెలుసుకున్నా డాయన. కాని, పురాతన తత్త్వవేత్తలనూ, వారి ప్రయత్నాలనూ చూస్తే తనకు లభించేవాళ్లు యెంతటి అశిక్షితులూ, అకుశలురూ ఐవుంటారో ఆయనకి తెలిసివచ్చింది.

కాని యింతమాత్రానికే తాను వెనుదీయడు. సోక్రటీసు, ప్లేటోలవంటి దిగ్దంతులైన మహాపండితులకు శిష్యుడైనది తా నెందుకు? గడ్డి కోసుకునేందుకా? అబ్బే! చిన్ననాటి నుంచీ ఆలోచనలతో కుస్తీపట్టడం తనకు ఆ గురువర్యులు నేర్పలేదా? అదంతా ఆయనకి కొట్టినపిండి. ప్రాచీనుల గ్రంథాలన్నిటిలోనూ ఒక్కొక్క చోట వట్టి చెత్తవున్నా, అనేక చోట్లలో అమూల్యములైన ఆలోచన లుండనే వున్నాయి. వారందరూకూడా యీ లోకంలోని సమస్తానికీ మూలంగా యీ ప్రకృతినే తీసుకున్నారనీ, ప్రకృతి నుంచే సమస్తమూ జనించి, కడపటి కందులోనే లీనమవుతూన్నా యని వారు చెప్పేరనిన్నీ అరిస్టాటిల్ చూడగలిగాడు.

జలమే సృష్టికంతకూ మూలమని థేల్స్ భావించేడు. సర్వమునకూ మూలం వాయువే అన్నాడు, అనక్షిమినిస్. అగ్నియే అన్నిటికీ కారణమని హెరాక్లిటస్ అన్నాడు. పై మాటలతో

భూమిని చేర్చి మూలభూతాలు నాలుగన్నాడు, ఎంపిడోక్లిస్. మూలభూతములు అసంఖ్యాకము లన్నాడు, అనక్షగోరస్.

'ఔను! నిజమే!' అనుకున్నాడు, అరిస్టాటిల్. పదార్థం లేనిదే యేదీ లేదు. కంచు లేనిచో విగ్రహం చేయలేముగదా. వెండి ఉంటేనే పాత్రను చేయగలం. కాని కంచులోహమే విగ్రహంకాదు; వెండిమాత్రమే పాత్రయునూగాదు. ఏదో ఒక రూపముకూడ నిర్దేశితమై ఉండాలి. దాని నాధారంగా తీసికొనే విగ్రహమున్నూ, పాత్రమున్నూ తయారుచేయాలి.

మరోవైపున రూపమే ప్రధానం గాని పదార్థం గాదనే తత్త్వవేత్తలూ ఉన్నారు. వారి వాదనలనూ అరిస్టాటిల్ గుర్తుకు దెచ్చుకున్నాడు.

పిథాగొరస్ అనుయాయుల గ్రంధాలను తెరచి చూచేడు. గణితశాస్త్రం, సంఖ్యలు, గీతలు, బొమ్మలు మొదలైనవాటి యొక్క ప్రాధాన్యతను మొట్టమొదటిసారిగా గుర్తించినవారు వీరే. గణితమే సర్వమునూ స్పష్టంగా బోధించగలదని చెపుతూన్న వీరు, దానంతట అది రూపం దేనినీ సృష్టించలేదని గమనించలేకపోయారు. ఒక కంచుగోళమును తయారుచేయా లనుకుందాము. కేవలం క్షేత్రమితిలోని 'గోళం' అనురూప భావం ఒక్కటేఉంటే కంచుగోళం తయారవుతుందా? ఆఁ హాఁ! కాదు. దానికి కంచుకూడా ఉండాల్సిందే కదా. ఈ రీతిగానే అరిస్టాటిల్ పండితుడు వితర్కించుకున్నాడు. అకాడమీలో ఉండగా భావములను గూర్చి ప్లేటో గురువర్యుడు

గావించిన సుదీర్ఘ బోధనలను అతడు బాగా జ్ఞాపకం ఉంచు కున్నాడు. 'భావములే శాశ్వతమైనట్టివి. వాట్లనుబట్టే దృశ్య మాన రూపము లన్నీ నిర్మించబడినాయి.' యిదే ప్లేటో బోధనల సారాంశం.

కాని, గురువుగారు చెప్పినది అవిమర్శంగా స్వీకరించే రకం గాదు మరి, అరిస్టాటిల్. అతడు గురువుకితగ్గ శిష్యుడు! అరి స్టాటిల్ గురువుగారిని అనేక ప్రశ్నలు వేసేవాడు. ప్లేటో యెంతటిమేధావి యైనప్పటికిన్నీ శిష్యుడు వేసే ప్రశ్నలు యెన్ని ట్రికో ఆయన జవాబు చెప్పలేకపోయేవాడు. ఆ ప్రశ్నలు యెన్నో కొరకరాని కొయ్యలుగా ఉండేవి.

ఈ లోకంలో మనం నిత్యమూ చూస్తూన్న భౌతిక వస్తు జాల మంతా యేమిటనిన్నీ, వాటి స్వభావ మేమిటనిన్నీ అరి స్టాటిల్ తన గురువుగారిని ఎన్నిసార్లో అడిగేడు. ఒక వెండి గిన్నె ఉన్నదనుకోండి. వెండి లేకండా కేవలం గిన్నెరూపం అనేది ఎక్కడ, ఎల్లాగ ఉండగలదు? వస్తువులు, పదార్థాలు వినా రూపం అనేదానికి అస్తిత్వం యెల్లాగ ఉంటుంది? అని అరిస్టాటిల్ యెన్నోసార్లు ప్రశ్నిస్తూవచ్చాడు.

ప్లేటో చెప్పిన దేమిటి? శ్రద్ధగా వినండి. మనం చూచే భౌతికమైన గిన్నెలుకాకుండా, మరో లోకంలో, యదార్థమైన 'సాధారణపు గిన్నె' అనేది ఒకటి వుంటుందనీ, దాని ప్రతి బింబములు మాత్రమే మనం చూస్తున్న నశ్వరరూపములనిన్నీ ఆయన వాదించేవారు. లోకంలో అసంఖ్యాకములైన విడివిడి

చెట్లు యెన్నో చూస్తాము. అవన్నీ నశించిపోయేవే. కాని, నీటన్నిటికీ అతీతంగా మరోచోట నైయక్తికంగాని 'సాధారణపు వృక్షము' ఒకటి. కేవలం భావాత్మికమైనది ఉన్నదనిన్నీ ఆయన బోధించేవారు. ఈ విధంగా ప్రతీవస్తువుకూ ఛాయా రూపమును కల్పించుటలో అర్థమేమిటని అరిస్టాటిల్ ప్రశ్నించేవాడు. ఇల్లా రెట్టించి చెప్పినందువల్ల యదార్థంగా మనం చూచి, అనుభవించే చెట్లు యెల్లా పెరిగి, పూచి కాచి ఫలిస్తూన్నాయో వగైరా విషయాలేమైనా తెలుస్తున్నాయా ?

ఇది పాతపేచీయే. దీని దగ్గరకే అరిస్టాటిల్ మళ్ళామళ్ళా వస్తున్నాడు. లోహామునుంచి గిన్నెను విడదీసి చెప్పడం, ఊహించడం కూడా అసంగతమనిన్నీ, గిన్నె చేయబడిన పదార్థము, గిన్నెరూపము వేరుగావనీ ఆయన యుక్తియుక్తంగా వాదిస్తూనే ఉంటున్నాడు.

ప్రాచీనకాలంలో యెవరైనా యీ విషయాల్ని గురించి వ్రాసేరా ? అని తెలుసుకోడానికై యెన్నో పురాతన గ్రంథాలను అరిస్టాటిల్ పఠించేవాడు. కొందరు గ్రంథకారులు నామ రూపాదులను గురించి వ్రాస్తే, మరిందరు వస్తుపదార్థములను గూర్చి వ్రాసేరు. కాని, యెవరిబోధనలు, సిద్ధాంతాలు ఆయనకు సంపూర్ణతృప్తి నీయలేదు. తన ప్రశ్నలకు జవాబుల కోసం ఆయన అన్వేషణము సాగిస్తూనే ఉన్నాడు.

రూపము, పదార్థము,– యీ రెండూ ఉన్ననూ పాత్రము తయారుకాదు. మరొక కారణం, పాత్రను నిర్మించే కర్మ

కారుడు కూడా అవసరం. ఐతే, యీ జగత్తు నంతనూ సృష్టించినవా రెవరు ?

ఈ ప్రశ్నకు అనేకులు అనేక రీతులుగా జవాబు చెప్పేరు.

. అనక్షగోరస్ చెప్పినది యిది: ఈ ప్రకృతిలో 'బుద్ధి' అనే దొకటి ఉన్నదనిన్నీ, ఆ బుద్ధియే యీ ప్రపంచాన్ని సృష్టించిందనిన్నీ; పనివాడు పాత్రనూ,శిల్పి విగ్రహాన్నీ తయారు గావించినట్లే యీ బుద్ధి లోకాన్నంతనూ నిర్మించిందనిన్నీ ఆయన బోధించేరు.

కాని, అనక్షగోరస్ సృష్టికి కారణంగా 'బుద్ధి'ని యెందుకు ప్రవేశబెట్టేడు ? కేవలం మరొక సమాధాన మేమీ లేక నిరుత్తరుడై ఉండవలసి వచ్చినందుననే 'స్రష్ట' నొకనిని గొనివచ్చి ప్రవేశబెట్టేడు.

ఎంపిడోక్లిస్ రెండు కారణములను చెప్పేడు. అవి ప్రేమ, ద్వేషము. ప్రేమ సృజిస్తూంది, ద్వేషం నాశం గావిస్తూంది.

లూసిప్పస్, డెమాక్రిటస్‌లు యిద్దరూ పరమాణువుల అనవరత చలనము వల్లనే సర్వమూ సృష్టివినాశములను చెందుతూన్నాయని చెప్పేరు.

దీనంతకూ అర్థం ఏమిటి ? పదార్థము, రూపమునకు జోడుగా 'గతి' లేక 'చలనం' అనేది కూడా ఉండాలి, సృష్టికి.

ఐతే యీ 'చలనం' యెక్కడినుంచి వచ్చింది ?

ఈ ప్రశ్నకు సమాధానము అరిస్టాటిల్‌కు యే గ్రంథంలోనూ దొరక లేదు. అందుచే నాతడు తిరిగి 'ప్రకృతి' దగ్గ

రకే వేళ్లేడు. ప్రకృతియే ఆయనకు గురుత్వాన్ని నేరపింది, అనేక సంశయాలను ఛేదించడంలో. అడవులు, పొలాలు, సముద్రం, కొండలు.— ఒక చోటేమిటి ? సర్వత్రా తిరుగుతూ, తాకుతూ, వింటూ, చూస్తూ, పరిశీలిస్తూ, ఆలోచిస్తూ వున్నాడు, ఆతడు. అపార గ్రంథావలోకనం వల్ల ఆయన బుద్ధి శక్తులు నిశితమైనాయి. అరిస్టాటిల్ యిప్పుడు ఆ ప్రకృతిలోనే అధికంగా చూడగలుగుతున్నాడు.

ఆతడొక పొలంలోకి వెళ్ళేడు. పదునులో దున్ని, అదనులో విత్తుల నెట్లు రైతులు చల్లుతున్నారో గమనించేడు. పరిస్థితులన్నీ సమకూడితే విత్తులు సకాలంలో మొలకలెత్తుటను చూచేడు. మొదట విత్తు తేమపీల్చుకొని, వుబ్బి, విచ్చి బోడు పైకివస్తుంది. ఇది విత్తుకంటె పూర్తిగా విభిన్నమైనట్టిది. ఈ బోడు పెరిగి ఆకులు, రెమ్మలువేసి, పూచి, వెన్నువేసి, విత్తులు బైలు నెడలుతాయి. ఇవన్నీ ఒకదానికంటె మరొకటి విభిన్నమైనట్టివే.

ఆకసంలో యెగిరే పక్షులను చూచేడు. అవి గ్రుడ్లను పెడతాయి. గ్రుడ్డు పెంకును పగులగొట్టుకుని పిల్ల వెలువడుతూంది. ఆహారంకొరకు ఆతురతతో నోరు తెరచుకుని, నోట పెట్టినదానిని మ్రింగి పెరుగుతాయి. తల్లిపిట్ట చేయాల్సిందల్లా తన మెత్తని యీకలక్రింద నా గ్రుడ్లను వెచ్చగా నుంచడమే. మళ్లా ఆయన ఆలోచనలు వైయక్తిక విషయముల నుంచి సామూహిక, సాధారణ విషయముల మీదికి పరుగెత్తి

నాయి. మొక్కలో వెన్నులను యీానుశక్తి అంతర్గర్భితం గానే వుంది. ప్రకృతి తనంతటతానే మారుతూ తిరిగితిరిగి వస్తు జాలమును సృష్టించుతూంది. మానవుడు తన శరీరాదులను సృష్టించి వృద్ధిచేసుకోవడం లేదూ? లోహంతో పాత్రను చేస్తూన్న మానవునిలో తాను చేస్తూన్న పనిని గూర్చిన చైతన్యం ఉంది. కాని, ప్రకృతిలో యీా చైతన్యం లేదు. ఐతే నేమి? మొక్క పెరిగి వెన్ను వేసే తీరుతుంది. ఈ రెంటికీ భేదం అంతే. ఒక్కొక్కప్పుడు ప్రకృతి, తాను సృజించ దలచు కొన్న దానిని సృజించదు. నిర్దిష్టకార్యంలో కృతకృత్యత నొందజాలక, యేదో వికృతరూపాన్ని సృజిస్తుంది. 'ప్రయో జన మనుద్దిశ్య న మందోపి ప్రవర్తతే.' ఏదో ప్రయోజనము నుద్దేశించి యుండనిచో అటువంటి తప్పులు జరుగనే జరుగ వేమో! అదీ రహస్యం! అనుకున్నా డాయన.

ప్రకృతి యే ఉద్దేశ్యంతో యిదంతా చేస్తూంది? దాని ఆశయం ఏమిటి?

ఈ ప్రశ్నకు సమాధానంకోసం కూడా అరిస్టాటిల్ మరల ప్రకృతి దగ్గరకే వెళ్ళేడు.

చెట్లవ్రేళ్ళను పరిశీలించేడు. జంతువులకు నోరు యెట్టిదో వృక్షములకు వ్రేళ్ళట్టివను నిర్ణయానికి వచ్చేడు. సముద్ర తీరా నికి పోయి చేపలను చూచేడు, పరిశీలనలు గావించేడు. స్థల చర జంతువుల కంటె యీా జలచరము లెంత విభిన్నములు! గాలి పీల్చుకోడానికి వాటికి ఊపిరితిత్తులకు మారు పుప్ఫుసము

లున్నాయి. వినేందుకు వాటికి చెవులు లేవు. కాని, జాలరుల పాటలూ, పడవ తెడ్ల చప్పుడులూ మొదలైన ధ్వనులన్నీ అవి వినగలవు !

అరిస్టాటిల్ జీవ జంతుజాలాన్నంతనీ పోల్చిచూసి, వాటిని ఒక సోపానక్రమంలో నిమ్నోన్నతములుగా యేర్పరించవచ్చునని తలచేడు. నత్తలు, నక్షత్రాకార మత్స్యములు, స్పాంజి పురుగులు మొదలు చతుష్పాత్తుల వరకున్నూ, రోమలములైన వాటిలో కోతులవరకున్నూ యీ సోపానక్రమంలో క్రింది నుంచి పైకి వుంటాయి. కోతియే మానవునకత్యంత సన్నిహితమైన పోలికలు గలది. ఈ సోపాన పంక్తిలో అన్నిటికీ పైన మానవుడున్నాడు. అన్నిటికంటె క్రింది మెట్టున తృణ జాతులు, చెట్లు వున్నాయి. వాటిక్రింద రాళ్లు, బురద, మన్ను వగైరా. అవిశ్రాంతంగా ప్రకృతి ఒకదాని వెనుక నొకటి సృష్టిస్తూనేవుంటుంది. క్రిందటిదానికంటె తరువాతిది మరింత నిశితంగా, సంశ్లిష్టంగా, క్లిష్టనిర్మాణంగలదిగా వుంటూంటుంది.

ప్రకృతి ఒక్కగంతులోనే సంపూర్ణతను, ఉత్తీర్ణతనుపొందలేదు. పదార్థాదులు పొడుగునా, నిరంతరమూ ప్రకృతికి యెదురుతిరుగుతూనే వుంటాయి. శిల్పియొక్క ఉలికి మారు మసలుతూ, మొల్లాగ శిలాదులు యెదురు తిరుగుతవో మనం చూస్తూనే వుంటాముగదా.

సరే. బాగానేవుంది. కాని, యీ సోపాన పరంపరలో పై మెట్టుపై నున్నాడనీ, అత్యున్నతుడనీ మానవుని చెప్పేందుకు ఆధారం యేమిటి ?

కేవల చైతన్యరూపంగలట్టిన్నీ, జ్ఞానానందమయమైనట్టిన్నీ జీవి, పరిపూర్ణత్వమున కింకా సమీపంలోనుండే జీవి మరొకటి సృజించబడుతుందని భావించుట సమంజసము గాదా ?

ఆఁహాఁ ! ఇట్లు ఆలోచించుట సరికాదేమో ? ఈ మార్గం తిరిగి ప్లేటో మొదలైన వారి పంథాలోకే తీసికొనిపోతుంది. అరిస్టాటిల్ అనుకోకండానే అందులోకి జారిపోతున్నాడు. చాల కాలం క్రిందటే ప్లేటో చెప్పేడు : 'శరీరం లేకండా కేవలం ఆత్మ అనేది ఉండడం సంభవమే !' ఇప్పుడు అరిస్టాటిల్ కూడా శరీరం వినా బుద్ధి లేక వివేకం లేక చైతన్యం అనేది ఉండడం సంభవమని భావిస్తున్నాడే ! అట్టి కేవల ఆత్మలు నివసించేది యీ లోకం గాక మరోలోకమే గానిండు, అట్టి దొకటి ఉండవచ్చుననడమే యిక్కడ ముఖ్యం.

అరిస్టాటిల్ విషయ పరిశీలన మారంభించేడు. కట్టెలు కాలుతున్నాయి. బండెడు కట్టెలు కాలి, బుట్టెడు బూడిద మిగులుతూంది. మిగిలినదంతా యేమైపోయింది ? పొగ, ఆవిరి వగైరాలుగా మారి, గాలిలో యెగిరిపోతున్నాయి. ఈ పొగా, ఆవిరీ మొదలైనవే, మేఘాలుగా యేర్పడి, వాన, మంచు రూపంలో తిరిగి భూమిమీదికే వచ్చి చేరుతున్నాయి. ఇదంతా గమనించిన అరిస్టాటిల్ యీ నిర్ణయానికి వచ్చాడు :

పృథ్వి — అగ్ని — వాయువు — జలము, — మళ్ళా పృథ్వి, ఇదే చర్విత చర్వణ మవుతూంది.*

మిగిలిన సమస్తమునకున్ను ఆధారభూతమైన నాలుగు భూతములున్నూ యివే.

ఎంపిడోక్లిస్ కూడా యీ రీతిగానే భావించేడు.

అరిస్టాటిల్ రాత్రులు బహిరంగప్రదేశంలో నిలబడి, నక్షత్రాలు గమనించేవాడు. ఆయనకు పూర్వము కూడా యెందరెందరో తత్త్వజ్ఞులు, మనీషులు ఖగోళవేధ గావించేరు. ఈ అనంత విశ్వం యే రీతిగా సృజించబడిందో తెలుసుకోవాలని ఆయన ప్రయత్నం. మనం నివసించుతూన్న భూమి చదునుగా గాక గోళాకారంగా ఉన్నదని అప్పటికే ఆయన యెరుగును. అతఃపూర్వం పైథాగొరస్ పండితుడే యీ భూగోళ విషయాన్ని బోధించేడు.

ఆయన శిష్యులు కొందరు భూమి గుండ్రంగా ఉంటుందనే విషయాన్ని నమ్మేవారుగాదు. భూమి గోళాకారంగా ఉంటే రెండో ప్రక్కనున్న జనులు తలక్రిందుగా నడుస్తూండి ఉండాలి! సముద్రాల్లోని నీరు సమమట్టంలో లేక ఉబ్బెత్తుగా యెల్లా ఉంటుంది? ఓడలు యీ సముద్రాల్లో యెల్లా ప్రయాణాలు చేస్తున్నాయి?

---

*మన సాంఖ్యాది దర్శనములలోనూ యిట్టి ఉదాహరణములే యివ్వబడినాయి. కాని, వానిలో మూలవస్తువులు యింకా సుశితంగా విభాగం గావించబడినాయి. సాంఖ్యదర్శనానుసారం మూలవస్తుతత్త్వములను ఇరువదియైదుగా గణించేరు. — అనువాదకుడు.

ఇల్లాంటి ప్రశ్నలు విని అరిస్టాటిల్ చిరునవ్వేవాడు. ఒక రికి తల పైకి అనిపించినది మరో ప్రక్కవారికి తల క్రిందని ఆయ నకు తెలుసును. కపిత్థాకారంగా వున్ననూ భూమిమీద జనులు ఉండగలరని ఆయనకు తెలుసును.

కాని, అరిస్టాటిల్ భూమి నిశ్చలమైనదనియే భావించేవాడు. గ్రహ సూర్యచంద్రాదులు అన్నీ యేదో యాంత్రికజాలంవల్ల, విచిత్ర క్రీడాయంత్రంవలెనే భూమిచుట్టూ తిరుగుతూన్నాయని ఆయన సిద్ధాంతీకరించేడు. అంతటితో తీరిపోలేదు. మరొక ప్రశ్న బైలుదేరింది. ఈ బ్రహ్మాండయంత్రమును ప్రప్రథమంలో చలనంలో బెట్టిన దెవరు ?

ఈ ప్రశ్నకు కూడ జవాబు తాను యివ్వగలనని ఆయన అనుకున్నాడు. ఆకాశపు టవ్వలినైపున, తారకాలోకములను దాటిన తరువాత నెక్కడో యీ బ్రహ్మాండమును సృజించిన చైతన్యశక్తి, జ్ఞానరూపం ఒకటి ఉంది. కొద్దికాలం క్రిందటనే అనక్షగోరస్‌ను యీ మాటలు చెప్పినందుకు అరిస్టాటిల్ పరిహాసం చేసేడు. ఆతడు యే ప్రశ్నకు సరియైన జవాబు చెప్పలేకపోయినా యీ 'జ్ఞానరూపు' ని అడ్డుపెట్టుకుంటూండే వాడు. మనకు యేది తెలియదో, యెక్కడ మనకు దిగ్బంధం జరుగుతుందో అక్కడ యీ 'జ్ఞానరూపం' అవసరం అవు తూంది ! అరిస్టాటిల్ యింతవరకూ యీ పద్ధతిని పరిహ సించి, యిప్పుడు తానే ఆ భావానికి మరో కొత్తపేరు పెట్టి తీసికొనివచ్చి ప్రవేశపెట్టేడు ! 'సర్వారంభకము' లేక 'ఆరంభ ములకెల్ల ఆరంభము' అని దీనికి ఆయన పేరు పెట్టాడు.

చంద్రుని క్రిందనున్న మన యీ లోకంలో ప్రతీదీ మారుతూంటుందని అరిస్టాటిల్ చెప్పేడు. కాని చంద్రుని కవ్వల అక్కడ మార్పులేమీ ఉండవు. అక్కడనే అమరలోకములున్నాయి. దివ్యలోకము లన్నీకూడ ప్రాకృతపదార్థములచే అనగా పృథివ్యప్తేజోవాయుభూతములచే నిర్మించబడినవిగావు. స్వచ్ఛమై, అవినాశ్యమైన ఆకాశభూతముచే నిర్మించబడినాయి. అందుచేతనే వాటికి నాశం ఉండదు. ఈ నిర్వచనముతో అరిస్టాటిల్ తిరిగి తన గురువైన ప్లేటో సిద్ధాంతముల దగ్గరకే మరలివచ్చాడు. మన లోకంచుట్టూ యితర దివ్యలోకాల్ని సృజించేడు. అక్కడ వినాశం, మృత్యువు లేవు. ఆ లోకాల్లో యేదీ జన్మించదు, మరణించదు. అక్కడ సర్వమూ శాశ్వతమైనదే, మార్పులేనిదే! *

అరిస్టాటిల్ సరియగు మార్గమునే కనుగొన్నాడు. కాని, అంతలో మరల దారితప్పిపోయాడు. మొదట శరీరం వినాగా ఆత్మ ఉండదని ఘంటగొట్టి చాటి చెప్పినవాడు, అరిస్టాటిల్.

---

* భారతీయుల స్వర్గాది లోకము లిట్టివే. కాని, యీ స్వర్గాదులు కూడ భూమ్యాదులతో పోలిస్తే మరింత స్థిరములైననూ యివికూడ శాశ్వతములు కావనిన్నీ, కేవలమూ 'ఆత్మ' ఒక్కటే శాశ్వతమనిన్నీ వైదిక వాఙ్మయం ప్రతిపాదించింది. భాగవతంలో "పెంజీకటి కవ్వల ...... యెవ్వండు...వాని దలంతున్." అన్నారు. 'ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్. నాన్యత్ కించన మిషత్. స ఈక్షత లోకాన్ను సృజా ఇతి. ఇమాం లోకా నసృజత' అని ఉపనిషత్తులలో స్పష్టంగా చెప్పబడివుంది.

— అనువాదకుడు.

పదార్థమును విడచి రూపం ఉండదనిచెప్పి, ప్లేటోమహాశయుని సిద్ధాంతాలను అగ్ని పరీక్షకు నిలబెట్టినవాడు కూడ అరిస్టాటిల్. కాని, తరువాత తానే ప్లేటో భావాలను అనుసరించి, 'ప్రథమ కారణం' 'కారణ కారణం' అను దానిని గూర్చి సిద్ధాంతీకరించి, పార్థివాదిపదార్థ రహితమైనట్టి దివ్య ప్రపంచాలలో, మన లోకాల కవ్వల యెక్కడో యీ 'జగన్నియంత' ఉన్నాడను కల్పనను గావించి ముగించాడు !*

ఈ రీతిగా అరిస్టాటిల్ పండితుడు గ్రీసు దేశపు విజ్ఞానాన్నంతనూ ఒక్కచో సమకూర్ప యత్నించి, పరస్పర విరుద్ధ భావాల్లోనూ, సిద్ధాంతాల్లోనూ సామరస్యత సాధించవలయు ననుకున్నాడు. ప్లేటో — డెమాక్రిటస్‌లను, సనాతనమతము-అధునాతన శాస్త్రములను సమన్వయ పరచుటకు అరిస్టాటిల్ ప్రయత్నించేడు.

---

* భూతస్యజాతః పతిరేక ఆసీత్ । ఋగ్వేదం 10. 121. 1
నైవేహ కించనాగ్ర ఆసీన్మృత్యు
నైవేద మావృత మాసీత్ । బృహదారణ్యకం 1. 2. 1.

# ఐదో మండలం

## మహామేధావుల మార్గం

### లోకవిజయానికి రెండు బాటలు

ప్లేటోకువలెనే అరిస్టాటిల్‌కు కూడ చాలమంది శిష్యు లుండేవాళ్లు. ఏథెన్సు నగరంలోని ఉన్నత విద్యాలయాల్లో నొకటైన లైసియమ్ ముందున్న ముఖమంటప మొకదానిలో యిటునటు పచారుచేస్తూ, శిష్యులకు పాఠాలు చెపుతూండే వాడు, అరిస్టాటిల్. చల్లని నీడనిచ్చు వృక్షపంక్తులతో పరివే ష్టించబడిన ఆ ముఖమంటపములు యెంతో ఆహ్లాదకరంగా, ప్రశాంతంగా ఉండేవి. ఆయన యీ అలవాటువల్లనే అరిస్టా టిల్ ఆచార్యుని శిష్యులు "పెరిపటెటిక్" అనుచుండువారు. ఈ మాటకర్థం 'అటునిటు నడయాడు' అని. పాఠం చదివే శిష్యులు ఆయనతోబాటు నడుస్తూ, గురువున కతి సమీపం లోనే వుంటూ, ఆయన నోటమ్మటవచ్చే మాట ఒక్కటైనా దాటిపోనీయకండా బహు శ్రద్ధగా వింటూండేవాళ్ళు.

పాఠాలు పూర్తికావడంతోనే యెవరి పనులకువాళ్లు వెళ్ళి పోయేవారు. కొందరు శిష్యులు తమ దస్త్రాలను కూడా తెచ్చుకుని వచ్చేవాళ్ళు. ఒకరకం గడ్డి కాగితాలు, ఈక కలాలు, మసిబుర్రలు, — యివీ వాళ్ళ వ్రాత పరికరాలు. లేదా కొయ్య పలకలమీద మైనం పూసి, వాటిమీద గంటంతో వ్రాయడంకూడ ఉంది. వాళ్ళు పాఠాలు విన తరు

వాత తీరికగా కూర్చుని, ఆ రోజున గురువుగారు చెప్పిన విష యాలను జ్ఞాపకంచేసికొని, వాటిమీద లిఖించేవాళ్ళు.

ప్రభుత్వవిధానాలను గురించిన పాఠం చెప్పవలసివచ్చింది, ఒకసారి. గ్రీసులోని 158 వివిధ రాజ్యాలలోను అమలులో వున్న ప్రభుత్వవిధానాలనూ అరిస్టాటిల్ సవిమర్శంగా పఠిం చాల్సి వచ్చింది. ఎన్నో గ్రంథాలనూ సిద్ధాంతాలనూ కూడా పరిశీలించే రాయన. ఆయన ప్రసంగాల్లోనూ, గ్రంథాల్లోనూ యెన్నో ప్రమాణవిషయాలను ఉటంకిస్తూ, తన సిద్ధాంతా లను బలపరుస్తూండేవాడు. ఇట్టి భారమును వహించగల మహా మేధావీ, పండితుడూ ఆ కాలంలో అరిస్టాటిల్ ఒక్కడే. కాని ఆయన యీ భారాన్నంతనూ తన శిష్యుల సహాయం, సహకారంతోనే వహించగలిగేడని చెప్పితీరాలి.

సత్యాన్వేషణాపరులైన యీ గురుశిష్య బృందం రోజు రోజుకీ తమ గమ్యానికిదగ్గరగా వస్తూన్నారు. ముందు గురువు నడుస్తూంటే శిష్యులు ఆయన ననుసరిస్తూ, ఆయన చెప్పినది వింటూ, ఆకళింపు చేసికొంటూ, అడుగులు వేస్తూండేవాళ్ళు. ఈ బృందం గావించే పచారును బుద్ధియొక్క విజయయాత్రగా మనం చెప్పవచ్చు! విజ్ఞానశాస్త్రమనే పేరును గ్రీకులు విని అప్పటికి మూడు శతాబ్దాలే ఐంది. గ్రీకులోని నగరరాజ్యాల వలెనే యీ విజ్ఞానులుకూడా ఒకరొకరితో తీవ్రంగా స్పర్ధించే వారు. ఏ శాస్త్రజ్ఞుడైనా నూతన ప్రతిపాదన గావించాలంటే సామాన్యవిషయం గాదు. తన వెనుకటి తరాల శాస్త్రజ్ఞ

లంతా యేమేమిటి చెప్పేరో అదంతా పఠించాలి, పరిశీలించాలి; విభజించుకొని, సమన్వయం చేసుకోవాలి. ఈ గురుశిష్య బృందం తత్కాలీన పరిస్థితుల్లో సాధ్యమైనంతవరకు యీ పనులన్నీ చేస్తూ, విజ్ఞానాభివృద్ధికొరకై కృషి గావిస్తూ వచ్చారు, లైసియమ్‌లో.

అరిస్టాటిల్ గ్రంథాలు అనేకవిజ్ఞానశాఖలనూ, అనేకవిషయాలనూ స్పృశించాయి. గణితం, భౌతికశాస్త్రం, వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం, విజ్ఞానశాస్త్రచరిత్ర, నీతిశాస్త్రం, రాజకీయశాస్త్రం మొదలైనవేగాక అత్యున్నతమైనట్టి తత్త్వశాస్త్రాన్ని కూడా ఆయన మథించేడు. అరిస్టాటిల్ సాంప్రదాయాన్ని 'పెరిపటెటిక్ సిద్ధాంతం' అంటారు. ఆయన తరువాత నీ సిద్ధాంతానికి ప్రవర్తకుడు థియోఫ్రాస్టస్. ఇతడు అరిస్టాటిల్ ప్రధానశిష్యులలో నొకడు. వృక్షశాస్త్రంమీంది గ్రంథాన్ని వ్రాసి, ప్రచురించినవాడు థియోఫ్రాస్టస్ పండితుడే. విజ్ఞానశాస్త్రచరిత్రను ప్రచురించినవాడు ఇయూడిమస్. సంగీతశాస్త్రంమీంద అరిస్టోగ్జెనిస్, భూగోళశాస్త్రంమీంద డిషియార్కస్ గ్రంథాలు ప్రచురించారు.

అరిస్టాటిల్ యింకా యువకుడే. కాని ఆయన పాండిత్యప్రతిభలు చాలదూరం వ్యాపించినాయి. ఆ కాలంలో మాసిడోనియా దేశానికి ఫిలిప్ అనునాతడు రాజు. ఆతడు అరిస్టాటిల్‌కు ఒక లేఖ వ్రాస్తూ, దానిలో తన సంతోషాన్ని వెల్లడించేడు. "మహా పండితులైన మీా జీవితకాలంలో నేను

జీవించి యున్నందులకు దేవుళ్ళకు యెంతో కృతజ్ఞుడనై యున్నాను. నా కుమారుడు అలగ్జాండరు, తమవద్ద శుశ్రూష గావించి, మాసిడను రాజ్యానికి తగిన వారసుడుగా తయారవు తాడని నాకు గట్టి నమ్మకం ఉంది."

ఫిలిప్ రాజు చాల గొప్పవ్యక్తి. ఆ కాలంలో గ్రీసు అంతా వందలగొలది చిన్న చిన్న రాజ్యాలుగా ఉండేది. ప్రతి పట్ట ణానికీ ఒక్కొక్క ప్రభుత్వం యేర్పడి, ఒకరొకరితో నిరంతరం పోరాడుతూండేవి. స్వేచ్ఛా విజ్ఞాన పిపాసియైన ఏథెన్సు రాజ్యం కూడ సర్వనాశనకరమైన యీ అంతర్యుద్ధాల్లో మునిగి తేలు తూండేది. ఫిలిప్ రాజు యీ చిన్న చిన్న రాజ్యాల నన్నిటినీ కలిపి యేకీకృతంగా ఒకే ఒక పెద్ద రాజ్యంగా జేయాలని ప్రయత్నించి, కొంతవరకు కృతకృత్యుడయేడు. తన రాజ్యా న్నింకనూ విస్తృతంగా, సుసంఘటితంగా చేద్దామని ఫిలిప్ రాజు కలలు కంటూండేవాడు. తాను ప్రారంభించిన యీ పనిని తన కుమారుడు అలగ్జాండరు కొనసాగించగలవాడు గావాలని ఆయన ఆశించాడు.

యువరాజునకు గురుత్వం వహించడం సులభమైనదేం కాదు. అందులోనూ చుట్టుప్రక్కల దేశాలెన్నిటినో జయించి, సామ్రాజ్యాధిపతి గావాలనుకొంటూన్న అలగ్జాండరుకు బోధ కుడుగా ఉండడం మరింత కష్టంగదా.

అలగ్జాండరు గురువు నెంతో గౌరవంగా చూస్తూ, వివిధ శాస్త్రాలు పఠించేవాడు. ఆయనకు యెన్నో గ్రంథములనూ,

వ్రాతప్రతులనూ బహూకరించేడు. ఆ ప్రతులన్నీ రెండు యెద్దు బండ్లు నిండినవట! కాని, అలగ్జాండరు గురువుగారి దగ్గర చాలకాలం ఉండలేదు. లైసియమ్ ముఖమంటపంలో అరిస్టాటిల్ తో అటునిటు పచారుచేస్తూ, ఆయన బోధనలు వింటూన్నట్లయితే, ఆయన అలగ్జాండరును యీ లోకపు యెల్లలవరకేగాక గ్రహతారకాలోకాలకూ, దిగంతములకూ గొంపోయి వుండువాడు. అట్లే యైనచో అలగ్జాండరు కేవల మొక సామ్రాజ్యవిజేతగానే గాక మానవలోకాని కంతకూ పూజ్యుడైన విజ్ఞానలోక విజేతగా తయారై ఉండేవాడు.

కాని, అలగ్జాండరు మనస్సులో విజ్ఞానతృష్ణకంటె విజయ తృష్ణ మిక్కుటంగా ఉండేది. ఆతడు దేశాలన్నిటినీ, లోకా న్నంతనీ జయించదలచేడు. మదపుటేనుగుల పిండులు యథే చ్ఛగా విహరించే హిందూదేశపు టరణ్యభూములను, అరివీర భయంకరములైన రాజనివహములనూ కూడ అలగ్జాండరు జయించ నువ్విళ్ళూరుతూండేవాడు.

అలగ్జాండరులో యీ కోర్కె యెందుకు కలిగింది? ఆయ నను గూర్చి యెన్నో కథలు చెపుతారు. దండయాత్రకు బైలు దేరేముందాతడు బానిసల నందరనూ విడిచిపెట్టి, జమీలనూ, ఆస్తులనూ సమస్తాన్నీ విక్రయించేసేడు. ఎవరో ఆతణ్ణి ప్రశ్నించేరట: 'నీకోసం యింకేమి వుంచుకున్నావు?' 'ఆశ!' అని అలగ్జాండరు సమాధానమిచ్చేడట! ఆతడు జైత్రయాత్రకు బైలుదేరునపుడు తనతోకూడ 'ఆశాదేవత' విగ్రహమును తీసి

కొని వెళ్ళేడు. సుదూరస్థమైన హిందూదేశంలో బంగారు, రత్నాలు, పెన్నిధులు, సరిగ దువ్వాలువలు, చీనిచీనాంబరాదులు కొల్లలుగా వుంటాయని ఆతడు విన్నాడు. అలగ్జాండరు కొలిచే 'ఆశాదేవత' కు సింహాపుపంజా లుంటాయి. వాటి సాయంతో యెక్కడేమున్నా తృటిలో చేజిక్కించుకోవచ్చునసుకోవడంలో ఆశ్చర్యం లేదుగదా !

ఆయన అనుయాయు లంతా కూడ యెవరెవరికి యెయ్యేవి అత్యధిక ప్రియతమమో అదంతా హిందూదేశంలో పుష్కలంగా వుంటుందనీ, తమ కలలు నిజాలవుతాయనీ భావించేరు. అంతక్రితమే సంపన్నులుగా ఉండి, వందలాది బానిసలూ, పెద్ద జమీాలూ వున్నవాళ్ళు యింకా బానిసలనూ, భూములనూ, సంపదలనూ సంపాదించా లనుకున్నారు. అసలేమీా లేనివాళ్లు సర్వసంపదలనూ, బానిసలనూ సంపాదించి తమ దారిద్ర్యానికి స్వస్తిజెప్పి, లేమికి లేవిడీ కొట్టవచ్చు ననుకున్నారు. వాళ్లందరూ తమ భార్యా బిడ్డలనూ, తలి దండ్రులనూ, స్వదేశాన్నీ వదలి బైలుదేరేటప్పుడు కంట తడికూడ పెట్టలేదు ! ఆశాదేవత వాళ్ళందరి మనసులనూ ఆశతో నింపింది.

అలెగ్జాండరు సైనికులు ప్రతి యుద్ధంలోనూ జయమునే పొందేరు. దేశం తరువాత దేశం జయించి, మాసిడోనియా రాజ్యానికి కలుపుకుంటూ సాగుతున్నాడు, అలగ్జాండరు. కాని, ఆతడు దేశాలను గురించే ఆలోచిస్తున్నాడు గాని ఆ దేశవాసులను మరిచే పోయాడు ! జయించిన సైన్యాలు

ముందుకు పోతూంటే స్థానిక ప్రజలు వాటి వెనకనే రహస్య దళాలుగా యేర్పడుతూ, చాటుమాటులనుంచి గ్రీకు సైనికుల మీద పడి దిగ్భ్రాంతుల్ని చేసేవాళ్ళు. గ్రీకు సైనికులు తయారై దెబ్బకొట్టే లోగానే మళ్లా యీ మూకలు ఆనవాలైనా లేకండా మటుమాయ మయేవాళ్ళు. ఆఖరికి తమ ఆశలు అడియాసలు కాగా, ప్రాణాలపై విసిగిపోయిన ఆ సైనికులు తమ ఆయుధాలను పారవైచి, స్వదేశ స్వగృహోన్ముఖులయేరు. వాళ్ళ ఖడ్గాలు యీ పరదేశంలో త్రుప్పుపట్టి మట్టిలో కలిసిపోయినాయి. ఆశాదేవత యీ అభాగ్యులను ఆశచూపి, మోసం చేసింది. తిరుగుబాటు చేసి, వీళ్లు గుంపులుగా యింటి ముఖం పట్టేరు. విజేత అలగ్జాండరు వీరసైనికులుగా బైలుదేరిన వీళ్లు దెబ్బలుతిని, అలసి, పరిశ్రాంతులై, పీలికలతో, ప్రాణాలతో యింటికి చేరగలిగినందుకే సంతోషించేరు. ఎందుకంటే తమతోబాటు బైలుదేరిన మందభాగ్యు లెంతమంది నానా బాధలూ పడి, యెడారుల్లోనూ, మైదానాల్లోనూ దిక్కులేకండా చచ్చి, తమ యెముకలను గ్రద్దలకూ, నక్కలకూ వదలిపెట్టేసేరు ? తమ కా గతి పట్టనందుకు వేయి దేవుళ్ళకి మ్రొక్కవలసిందే.

ఏ దేమైనా అలగ్జాండరు ప్రపంచాన్ని జయించలేకపోయాడు. ఇటలీ నుంచి హిందూదేశం వరకూ వ్యాపించిన ఆతని సామ్రాజ్యం అదుసులేని యిటుకల గూటివలె కూలి చెదరిపోయింది.

కాని, ఆతడు తనతో గొంపోయిన వారిలో కొందరు
పండితు లున్నారు. వారు అలగ్జాండరు కంటె అధిక అదృష్ట
వంతులు. ఎందుకంటే వాళ్లు ఐహికసంపదలను, రాజ్యాలను
కాంక్షించిగాక విజ్ఞానాపేక్షతో బైలుదేరారు. అలగ్జాండరు
గొంపోయిన శాస్త్రపండితుల పటాలం విజ్ఞానరంగానికి అనేక
నూతన విషయాలను జయించిపెట్టేరు. ఈ పండితుల విజయా
నికి శిథిలత లేదు. ఆ దండయాత్రతో వెళ్ళిన వృక్షశాస్త్ర
జ్ఞులు వేలకొలది కొత్తరకాల మొక్కలను సంపాదించి, వర్గీక
రించేరు. భూగోళ శాస్త్రజ్ఞులు కొత్త దేశాల్ని చూచి, దేశ
పటాలను తయారుచేయ తలపెట్టేరు. నిజంగానే వాళ్ళు ఆ
కార్యం సాధించేరు. పురాతత్త్వ పరిశోధకులు వేలకొలది
శాసనాదులను దేవాలయాల్లోనూ, సమాధులపైనా, సత్ర
ముల్లోనూ కనుగొని, వ్రాసివుంచుకున్నారు. వాట్లని భద్రంగా
స్వదేశానికి గొంపోయి, పరిశోధనా క్షేత్రంలో గొప్ప విజ
యాన్ని సాధించేరు.

ఈ శాస్త్రజ్ఞులలో నొకడు థియోఫ్రాస్టస్. ఇతడు వృక్ష
శాస్త్రజ్ఞుడు. తాను చూచిన ప్రదేశాలలోని వివిధ వృక్ష
జాతులను గూర్చి యితడు వ్రాసిపెట్టి వుంచేడు. తూర్పు
భూములలోని అత్యద్భుత వృక్షజాతులను గూర్చి యీయన
గ్రంథాలవల్లనే పాశ్చాత్యులు తెలుసుకున్నారు. శాఖలు
క్రిందికి భూమిలోకి దిగి, ఒక చెట్టే పెద్ద అరణ్యంవలె కనిపించే
మర్రిచెట్టు; పగలు మేల్కొని, రాత్రులు నిద్రించే నిద్రగన్నేరు;

మహా వృక్షాలంతటి పొడవైన తృణజాతులు, వెదురు; ఒక మనిషి సుఖంగా నిద్రించగలంతటి ఆకులుగల అరటి,- యిటువంటివే అనేక మహాద్భుతవృక్షజాతు లున్నా యని థియో ఫ్రాస్టస్ గ్రంథాలే పాశ్చాత్యజాతులకు మొదట చెప్పినాయి. అందుకనే ఆయనను వారు వృక్షశాస్త్రపితగా భావిస్తారు.

వీరులు, సాహసులు ఐనవారికంటె శాస్త్రజ్ఞులు, తత్త్వవేత్తలు మానవజాతికి హెచ్చుగా మేలుగావించిరని నిస్సందేహముగా చెప్పవచ్చును. అట్లని వీరులపాత్రను మానవచరిత్రలో మనం కొంచమని భావించరాదు.

అలగ్జాండరును గురించినగాథ లెన్నో వున్నాయి. వాటివల్ల నేర్చుకోదగిన నీతులు మరువరానివి.

అలగ్జాండరు దిగ్విజయానికి బైలుదేరుముందు కోరింథ్‌లో విడిసివున్నాడు. ఆ సమీపంలోనే దియోజనిస్ అను తత్త్వవేత్త, సాధువు ఉండేవాడు. ఆయనను దర్శించి పోవలెనని అలగ్జాండరు తలచేడు. బానిసల బజారులో కొద్ది కాసులకు లభించే పేలికలను ధరించి వుండేవా డా తత్త్వవేత్త. శీతువు, వేసవి యనకుండ ఆతడొక విశాలమైన కొయ్యతొట్టిలో కూర్చుని ఉండేవాడు. పైన కప్పులేని ఆ తొట్టికి సూర్యరశ్మి బాగాతగులుతుంది. ఆయనతో మాట్లాడినపిమ్మట అలగ్జాండరు ఆ సాధుపురుషుని చాల మెచ్చుకొన్నాడు. ఆయన కేదైనా ఉపకృతి చేయాలనే సదుద్దేశ్యంతో అలగ్జాండరు "మహాత్మా! తమ కేదైన వలయుచో కోరుడు." అన్నాడు. అప్పుడు దియో

జనిస్ 'సూర్యునికీ నాకూ మధ్య అడ్డుగానిలుచున్నావు. కొంచెం ప్రక్కకు తప్పుకో. అంతే నే కోరునది.' అలగ్జాండరు కోప గించునని అనుచరులంతా అనుకొన్నారు. కాని, అతడు బహు శాంతంగా ప్రక్కకు తొలగుతూ 'నేను అలగ్జాండరును గానిచో దియోజనిస్ నై ఉండాలని కోరుతా!' అన్నాడట.

## మిత్రత్వం—శత్రుత్వం

మనం యిప్పుడు మానవజాతిచరిత్రను కాదు చెప్పుకుంటూ న్నది. మానవుడు తనచుట్టూవున్న గోడలుకూలగొట్టి ఒకప్పుడు ముందుకుసాగినా, మళ్లా ఆగి వెనుకకు పోతూన్నాడని చెప్పు కున్నాము. ఒక్కొక్కసారి మనకథ బహు తాపీగా నడుస్తుంది. దారిలోని ప్రతి రాయీ రప్పా, చెట్టూ పుట్టా పరిశీలిస్తూ పోవాలి. కాని, పొడుగునా యింతమెల్లిగా వెళ్లము. ఈమంద గమనంవల్ల మనం అరణ్యాన్ని చూచినా 'యేవో చెట్లులే!' అనుకుంటాం. మానవజాతి చరిత్రవైపు చూస్తే అదంతా వరు సగా జరిగిన భయంకర యుద్ధాల చరిత్రయే నని తెలుస్తాంది. రక్తపు యేరులు పారని చోటు చారెడైనా యీ పృథ్వీమీద లేదని చెప్పవచ్చు. బాబిలన్, అస్సీరియా, ఈజిప్టు, పెరిష్యా చక్రవర్తులు లోకాన్నంతనూ జయిస్తామని యెన్నిసార్లు బైలు దేర లేదు! ఆ చక్రవర్తు లందరూ దేవాలయ స్థంభాల మీాద తమ బిరుదావళిని బహు ఆడంబరముగా వ్రాయించుకొని, మురిసి పోతూండేవాళ్ళు! చతుస్సముద్ర ముద్రిత ధరామండ

లాఖండలుండు, రాజన్యకిరీటరత్న దీపితపాదాంభోజుడు, రాజ రాజు, భువనైకవీరుడు, దీన జనావన బిరుద విభ్రాజితుడు,- యిత్యాదిగా కాని, యీ చక్రవర్తులు అడుగిడిన దేశాల్లో యెక్కడైనా ఆనకట్టలు, నీటివనరులు, దివ్యభవనాలు మొదలైనవి వుంటే వాటిని నాశనం చేయక విడువలేదు. పంటలకు నీటివనరులు లేకండా ఆనకట్టలను నాశనం చేసీ, చెరువుల కట్టలు తెగగొట్టీ, జన పదాలను శ్మశాన ప్రాయంచేసీ సంతృప్తులయేవారు, ఆ రాజరాజులు. పట్టణాలు, పల్లెలు, దేశాలు శాంతిసౌభాగ్యాలు కలిగివుంటే వాటినన్నిటినీ సర్వ నాశంగావించే వరకూ వాళ్లకి నిద్ర పట్టేదే గాదు!

ఈ విజేతలలో యెందరు యీ లోకానికి అంతకూ అధిపతులు కాగలిగేరు?

అస్సీరియా చక్రవర్తులు చుట్టునున్న దేశాలన్నిటినీ, అంటే ఆర్మీనియా పర్వత ప్రాంతాలనుంచి నైలునదీ జలపాతంవరకూ, పడమట గ్రీసు నుంచి తూర్పున హిందూ దేశం వరకూ, ఉత్తరాన నల్లసముద్రం మొదలు దక్షిణాన అరేబియా సముద్రం వరకూ జయించేరు.

అలగ్జాండరు చక్రవర్తి ఈజిప్టు, బాబిలన్, పెరిష్యా, గాంధారాది దేశాలెన్నింటినో జయించేడు.

కాని, యిదే యావత్ప్రపంచం కాదు! బిరుదులు రాయించుకున్నారే గాని ఆ చక్రవర్తులు, సార్వభౌములు ఎవరూ కూడా యీ పృథ్వినంతనీ జయించలేదు, జయించనూ లేరు.

వారు ఊహించినదానికంటె, ఊహించగలినదానికంటె యీ భూలోకం పెద్దది!

అంతేకాదు. వారి దిగ్విజయాలు యెంతో కాలం మనలేదు. జయించి, రాజ్యస్థాపన గావించి వెనుదిరగడం తడవుగా అవి కూలిపో నారంభించేవి. పాతవాట్ల స్థానంలో కొత్తరాజ్యాలు బైలుదేరడం, ఆ రాజులు మళ్లా ప్రపంచాధిపత్యానికై విఫల ప్రయత్నాలు చేయడం,– యీ కథంతా మళ్లా మొదలయేది. ఓడలు, పడవలు సముద్రాలమీద ప్రయాణాలు చేస్తూనే ఉండేవి; సార్థములు, బిడారులు భూమార్గాలమీద ధూళి రేపుతూ, సాగిపోతూనే ఉండేవి. వివిధప్రజలు కలుసుకోవడం, పరిచయం గావించుకోడం, గాఢమైత్రితో సన్నిహితులు గావడం జరుగుతూనే ఉండేది. మానవహస్తాలు తరతరాలుగా, యుగయుగాలనుంచీ వివిధకర్మలు చేస్తూనే వున్నాయి. కౌశలాన్ని సంపాదిస్తూనే వున్నాయి. భూమిలోనుంచి సంపదలను సృష్టించడంలో మానవులు నిరంతరాయంగా చెమటోడ్చి పనిచేస్తూనే వున్నారు. స్పెయిన్ దీవినుంచి రాగి, నూబియా (ఆఫ్రికా) నుంచి బంగారు, తారుస్ కొండలనుంచి వెండి, ఫొనీషియా పర్వతసానువుల మీది దేవదారు అరణ్యాల్లోంచి దారుఫలకాలు, బాల్టిక్ సాగర తీరాలనుంచి అంబరు, బ్రిటను దీవులనుంచి తగరం,– యిల్లాగే ఒక్కొక్క ప్రాంతంనుంచి ఒక్కొక్క వస్తువు వస్తూండేది. మరల ఆయా దేశాలకు ఓడలమీదా, బండ్లమీదా శుద్ధిచేసిన లోహాలూ, లోహపాత్రలూ,

వస్త్రాలూ, పాపిరస్ కాగితపు చుట్టలూ మొదలైన వెన్నో గొంపోయేవారు. వేగరులూ జంఘాలురూ నైన పెరిష్యాను వేగులవాండ్రు ఒక దేశాన్నించి మరో దేశానికి జాబులు గొంపోయేవాళ్ళు. అక్షరమాల, తూనికలు, కొలతలు, కాలమును వారాలు-నెలలు-ఋతువులు-సంవత్సరములుగా విభజించడం మొదలైనవి ఒక దేశంనుంచి మరో దేశానికి మనుష్యులతో బాటుగా ప్రయాణాలు సాగించేవి. వివిధజాతులూ, దేశాలూ అనేకశబ్దాల్ని దత్తత గావించుకుంటూ వచ్చాయి. ఇప్పుడు కొన్ని శబ్దాలకి మాతృభూమిని తెలుసుకోడం మహాపండితులకి కూడా సాధ్యంగావడం లేదంటే, శబ్దాలు యెంతెంత ప్రయాణం చేసి, యెన్నెన్ని అవతారాలు ఎత్తినాయో ఊహించండి! ఏ యూరపియను భాషనుంచైనా విదేశీయశబ్దాలను తొలగించి చూడండి. మిగిలేది వట్టి కంకాళంగానే ఉంటుంది. అంతేగాదు. ఆ పని అసాధ్యంకూడాను. ఒక్కొక్క-మాట యే దేశానిదో తేలక, తలపట్లు పట్టాలి! కృషి, వృత్తిపనులు, వాణిజ్యం సాగించిన దేశాలూ, ప్రజలూ తరతరాలనుంచి ప్రోగుజేసి వుంచిన సంపద నంతనూ వారసులమై మనం పొందినాము. పైతృకమైన యీ ఆస్తినే శాస్త్రజ్ఞులు 'సంస్కృతి' అంటారు.

జాతులు తమ చేతులు జాచి ఒకరినొకరు ఆలింగనం గావించుకొనేవారు. ఒకరిదగ్గర లేనివానిని మరొకరి దగ్గర తీసికొనేవారు. ఒకరు చేయలేనిదానిని మరొకరు చేయనేర్చేవారు. సంపదలు క్రమాధికంగా వృద్ధిని జెందుతూన్నాయి.

కష్టించి పనిచేసేవాళ్ళ వల్లనే యీ సంపదలు సృష్టించబడేవి. మట్టి యెక్కడా, యెప్పుడూ వుంది. కాని, కౌశలంతో దీనిని మూకుడుగానో, కుండగానో చేస్తే, మానవులకు అధికతరంగా ఉపయోగంలోకి వస్తుంది. అప్పుడే అది సంపదగా మారుతుంది. ఈ రీతిగనే ప్రకృతిలో దొరకే ముడిపదార్థాలను మానవశ్రమవల్లా, తెలివివల్లా ఉపయోగకరమైన వస్తువులుగా అంటేసంపదలుగామారుస్తూండేవారు. ఒక్కొక్క దశాబ్దమే,శతాబ్దమే గడుస్తూన్నకొద్దీ యీసంపదలు అధికంగా ప్రోగులు పడుతూండేవి. ఈ సంపదలమీద కన్ను వేసి, వీటిని దోచుకు పోదామని చూసేవాళ్ళూ ప్రతి చోటాఉండేవాళ్ళు. తెలివైనవాళ్ళూ, కర్మకౌశలం గలవాళ్ళూ, కృషిశీలురూ ఐన జనులున్న చోట్లనే యితరులవల్ల ఉత్పత్తి చేయబడిన వస్తువులను స్వాయత్తంగావించుకోవాలని యత్నించే అత్యాచారపరులూ బైలుదేరే వాళ్ళు. అందుచే అన్యాయాపర నేత్రాల నుంచి జనులు తమ సంపదలను, అమూల్య వస్తువులను దాచుకొనేవారు. కొన్ని వస్తువులను భూమిలోనే కప్పిపెట్టేవాళ్ళు. కాని అన్నివస్తువులనూ కప్పిపెట్టడానికి వీలులేదుగదా. అదీగాక దేశం దేశమే తమ వస్తువు లన్నిటినీ మరుగుపరచుట అసంభవం, అసాధ్యం. దోపిడిగాళ్లు యీ భూమిమీద సర్వత్రా సంచరిస్తూనే వుంటారు. శ్రమజీవులైన మనుష్యులకు యితరుల జోక్యం అవసరం లేదు. వాళ్ళకేదో కొంచెం భూమి వుంటేచాలు. కాని, యీ దోపిడిగాళ్లు యెందరో కోటి మానవులను చంపి, మిగిలిన

వాళ్లని తమక్రింద బానిసలుగా చేసుకొనేవాళ్లు. ఆ యుగంలో
వాళ్ళకి దోచుకొనేందుకు వెండి బంగారాలు అంత హెచ్చుగా
వుండేవిగావు. అప్పట్లో అమూల్య వస్తువులు బానిసలే. ఈజి
ప్టులో బానిసలను 'జీవన్మృతులు'అని పిలిచేవారు. చనిపోయిన
వానివల్ల యెవరేం పని చేయించుకోగలరు? కాని జీవించియున్న
బానిసమనిషివల్ల యే పనియైననూ చేయించుకోవచ్చు. తాము
యే పనీ చేయకుండా, బానిసలచేత బండచాకిరీ చేయించు
కొని, వాళ్ళు తయారుచేసిన సంపదలను స్వాయత్తం గావించు
కొనే యీ దోపిడిగాండ్రు అంతకంత కధికబలవంతులు అవు
తున్నారు. అన్ని దేశాల్లోనూ కష్టజీవులు సంపదల నధికాధి
కంగా ఉత్పత్తి చేస్తూనే ఉన్నారు; వాటిని యీ దోపిడిగాండ్రు
నాశనం చేసీ, దోచుకొనీ పోతూనే ఉండేవాళ్ళు.

ఆశకి అంతులేదు. మానవునిలో ఆశ అంకురించి క్రమంగా
పెరిగి దురాశయై కూర్చుంటుంది. అది యేమిచ్చినా ఉపశ
మించదు. లోకమంతా లభించినా దురాశాపరునికి తృప్తి
ఉండదు. 'రాజులకు తృప్తి ఉండ కూడదు' అను నానుడి
ఉండనే వుందిగదా. ఒక పట్టణాన్ని జయిస్తే, మరో పదింటిని
వాంఛిస్తారు, వీళ్లు. ఆ పదీ చేజిక్కినవా, యిక చూసుకోండి,
మరో నూరు కావాలి! ఆ నూరూ జయించినా ఆశ తీరక
యావత్ప్రపంచమునూ జయించా లనుకుంటారు. ఈ యుద్ధా
లకు అంతులేదు. వీళ్లు యుద్ధాలు చేయాలంటే యితరులు
మరింత కష్టపడి పనిచేసి, సంపదలు ఉత్పత్తి చేస్తూండాలి.

ఇతరుల శ్రమ లేకుండా యీ దోపిడీగాళ్లు రోజు గడప లేరు. బానిసల హస్తాలు గనులు త్రవ్వి, చిట్టెములు తీసి, నలగ గొట్టి, కరిగి, కత్తులు, బల్లెములు చేస్తూంటే, వాటితోనే యింకా మరికొందరు మానవుల్ని బానిసలుగా చేస్తూండేవాళ్లు, యీ దోపిడిగాళ్లు. పడవలు నిర్మించి, వాటిలో ఆహారాలు, ఆయుధాలు సమకూర్చిపెట్టేవారు, బానిసలు. ఆ పడవలపై ద్వీపాంతరాలకు పోయి, వాటిని నాశంగావించి, దోచుకొని, జయించి వచ్చేవారు, దోపిడీగాళ్లు. ఈ దోపిడీగాళ్లు తమను మంచి మంచి పేర్లతో పిలిపించుకొనేవాళ్లేగాని దోపిడీగాళ్లని అంటే ఊరుకొనేవారుగాదు. కానైతే ఒకప్పుడొకళ్లు యీ పోరాటాల్లో జయిస్తే, మరొకప్పుడు యింకొకళ్లు జయించేవాళ్లు. ఈ ప్రపంచమునంతనూ జయిస్తామని బైలుదేరినవాళ్లే గాని ఆ పని యెవరివల్లనూ గానేలేదు.

'గార్డియన్ ముడి' కథ విన్నారా? అతి నేర్పుతో, దృఢంగా వేయబడిన ఆ ముడిని యెంతబలవంతుడూ విప్పలేకపోయీ వాడు. ఆ బ్రహ్మముడిని విప్పగలిగినవాడు ప్రపంచవిజేత అవు తాడని అనుకునేవారు. ఆ ముడిని విప్పాలని అలగ్జాండరు వెళ్లా డట. కాని, చేతులతో దానిని విప్పజాలక, కత్తితో కోసిపా రేసి, సాధించా ననుకున్నాడు. ఏ ముడినైనా ఖడ్గముతో కోయవచ్చునుగాని బిగించలేమనికూడ అలగ్జాండరుకు తెలి యును. అందుచే కేవలం ఖడ్గబలమేగాక యితర ఉపాయాల వల్లకూడా తాను జయించిన ప్రజలతో సన్నిహితసంబంధాలు

పెంపొందించుకో యత్నించే వాతడు. పెరిష్యాను జయించేక తన సేనాపతుల్లో పదివేలమందికి పెరిష్యను స్త్రీలను వివాహం చేసి, తాను కూడ పెరిష్యాచక్రవర్తి కుమార్తెను పెండ్లాడేడు. చరిత్రలో లిఖించబడిన పెద్ద సామూహిక వివాహం యిదే నని చెపుతారు.

గ్రీకు తత్త్వవేత్త దియోజినిస్ తాను ప్రపంచపౌరుడ నని చెప్తూండేవాడు. అలగ్జాండరు ప్రపంచాధినేత,విజేతగావాలని ఆశించేడు. తాను ప్రపంచ చక్రవర్తిగానే గాదు, దేవుడుగానే కావాలని అలగ్జాండరు యత్నించేడు. ఈజిప్టులోని జనాభానే మార్చేశాడు; వేలకొలది గ్రీకులను తూర్పు దేశాల్లోనూ, ఈజిప్టులోను కాపురంబెట్టించాడు. వెళ్లిన దేశాలన్నిట్లోనూ పట్టణాలు నిర్మించి, వాటికి తన పేరుంచుతూ వచ్చాడు. 'అలగ్జాండ్రియా' అను పేరిట యెన్నో పట్టణాలు దేశాలన్నిటా వెలసినాయి. కాని, కాలదేవత కరుణ జూడాలిగదా !

## ప్రాత—క్రొత్త

ఏథెన్సు నగరమే చాల పెద్దదని జనులనుకొనే కాలమొకటి ఉండేది. నిజంగా అది నగరమేగాదు, రాజ్యమే అది. ఏథెన్సులో పదివేల యిండ్లుండేవి. ఒక్కొక్క-యింట్లో ఒక పెద్ద కుటుంబం, బానిసలూను. ఈ జనాభా నంతనూ భరించలేని దిగా ఆ నగరరాజ్యం తయారైన రోజూ వచ్చింది.

బానిసల పనివల్ల వస్తువులు కుప్పతిప్పలుగా తయారై పోతున్నాయి. కాని, వాటి నన్నిటినీ కొనగలందరు క్రయకులు ఆ నగర రాజ్యంలో లేకపోయారు. అందుచే యీ అదనపు వస్తువుల్ని ఓడలమీద యితర దేశాలకి యెగుమతి చేయాలి. ఓడ యే దేశపు రేవులో ఆగినా పన్నులు చెల్లించవలసి వుండేది. అక్కడ సరకులు దించినా, దించకపోయినా పన్నులు మాత్రం విధిగా చెల్లించాల్సిందే. రేవు సుంకాలు ప్రతిచోటా రాత్రి గోడల్లా యెదురయేవి. సన్నని సముద్రపు కయ్యలకు, నదులకు యిరుప్రక్కలా ఉన్న జనులు దాని కడ్డంగా నొక గొలుసునో త్రాటినో కట్టి, ఆ జలమార్గమున వచ్చు పడవల నన్నిటినీ ఆపి, పన్నులు వసూలు చేసేవాళ్ళు.

ఒకవ్యక్తి యెంత ధనికుడుగానీ, స్వదేశంలో యెంత పలుకుబడి గలవాడుగానీ, అతనికి మరో దేశంలో గాని, మరో ప్రజలలో గాని యెల్లాటి హక్కులూ ఉండేవి గావు. విదేశంలో భూమిని గాని, యింటినిగాని కొనజాలడు. స్థానిక పౌరుల్లో యెవరో ఒకరి ప్రాపకమును పొంది, అతని ద్వారా తన ఆస్తులను, హక్కులను రక్షించుకోవలసి యుండేది.

కొందరు వర్తకులు అనేక పట్టణాలతో వ్యాపారం చేస్తూ, అనేక ఓడలమీద వివిధ వస్తువులను పంపుతూండేవాళ్లు. ప్రతీ చిన్న పట్టణానికీ రేవు సుంకాలు, వేర్వేరు నాణెములు ఉండడమంటే, విదేశీయుల నింత నిష్ఠురంగా చూచే శాసనా లుండడమంటే యీ వర్తకుల కెంత బాధాకరమో చూడండి. తమ

వ్యాపారాన్ని విస్తృత పరచు కొనేందుకు వీరికి కావలసిం దేమిటి ? బొత్తిగా చిన్నవైన పట్టణ రాజ్యాలు గాక చాల నగ రాలు, మరెన్నో గ్రామాలు కలిసివున్న పెద్దరాజ్యాలు కావాలి. అవి వీరి వ్యాపారానికి అనుకూలం. అధిక ధనవం తులై వడ్డీవ్యాపారం చేసే సంపన్నులు కూడా యిదే కోర్కెను బలపరచేవారు. వారి అవసరాలు కూడా విశాలరాజ్యాలను కోరుతాయి. వస్తూత్పాదకులైనవారు కూడ పెద్ద రాజ్యాలనే కోరేవాళ్లు. వందలకొలది బానిసలచే నడిచే కర్మాగారాల్లో తయారయే వస్తువులు ఒక్క పట్టణాన్నే గాక అనేకనగరా లను తమ సరకుల విడుదలకై కావాలనడంలో విచిత్రం లేదు.

ఏ రాజ్యపు యెల్లలనైనా విస్తృతపరచు కోవాలంటే యుద్ధం చేయాలి, దండయాత్రలు సాగించాలి. యుద్ధంచేసి జయించిన దేశాన్ని కొల్లగొట్టి, అచ్చటి సంపదనూ, అక్కడి జనులనుంచి బానిసలనూ గొనితెచ్చేవారు. తమ దేశంలో లేని ముడిసరకులే గాక అపురూపమైన రాగి, యినుము మొద లైన లోహాలూ, ఉన్ని, తోళ్ళు వగైరాలు కూడ లభించేవి.

యుద్ధాలకు యిప్పుడు వ్యాపారుల దురాశ, సంపదలు, బానిసలు సంపాదించాలనే వాంఛకూడ తోడయింది. దండ యాత్రలు అధికమయినాయి. ఏథెన్సు ప్రజారాజ్య నాయ కుడు ఆల్సిబియాడీస్ పెద్ద ఓడల దండును నిర్మించి, సిసిలీ ద్వీపంమీదికి నడిపేడు. తూర్పు పశ్చిమ గ్రీకు నగరా లన్నిం టినీ యేకాధిపత్యంక్రిందకు తేవాలని ఆతడు కలలు గంటూండే

వాడు. కాని ఆ కలలు కల్లలైనాయి. ఆ నౌకాయుద్ధంలో ఆతడు ఓడిపోయినాడు. అటుపిమ్మట చాల ఏండ్లకు మాసి డోనియా రాజు ఫిలిప్స్ తిరిగి యీ రాజ్యవిస్తరణా కార్య మును జేపట్టి కొంతవరకు సాగించేడు. గ్రీకురాజ్యా లన్నింటినీ యేకీకృతం గావించే యీ పనిని ఫిలిప్స్‌రాజు కుమారుడు అల గ్జాండరు తన భుజస్కంధంమీాద వహించాడు. అలగ్జాండరు జయించిన రాజ్యం ఆయన మరణానంతరం ముక్కచెక్కలై పోయింది. కాని, యీ ముక్కచెక్కలే వెనుకటి రాజ్యా లతో పోలిస్తే బహు పెద్దవి. సిరియా, మాసిడోనియా, ఈజిప్టు దేశాలు పూర్వపు నగర రాజ్యాలతో పోల్చేటందుకే వీలుగాదు. అంత విశాలమైనవి యివి.

పెద్ద రాజ్యమంటే అర్థం బలమైన రాజ్య మని. దండ యాత్రలు గావించాలంటే బలమైన రాజ్యాలే ఉండాలి. దేశంలోని సంపన్నుల ఆస్తుల్ని రక్షించడానికిన్నీ, రాజ్యప్రజ లను కాపాడేందుకున్నూ బలవంతమైన ప్రభుత్వాలే ఉండాలి. ఈజిప్టు, సిరియా, మాసిడోనియా దేశాల్లో రాజులు పాలించే వాళ్ళు. వాళ్ళని జనులు దేవుళ్ళల్లాగ పూజించేవాళ్ళు. నా విష్ణుః పృథివీపతిః అని సర్వత్రా పరిగణించబడేది.

ఈ నూతన ప్రభుత్వాలకు నూతన సిద్ధాంతాలు, తత్త్వ ములు అవసరమైనాయి. దైవాంశగల, దైవోద్దిష్టులైన బహు కొద్దిమంది మాత్రమే రాజ్యార్హులనిన్నీ, వారికి విధేయులై వుండడం చాల గొప్ప సుగుణమనిన్నీ జనులకు నచ్చచెప్పడా

నికి కొత్త సిద్ధాంతాలు బైలుదేరినాయి. జనసమూహం గొఱ్ఱెలమంద వంటిదేననీ, కాపరుల వంటివారే రాజులనిన్నీ, రాజులు చెప్పినరీతిగా జనులు మనోవాక్కాయకర్మలా నడచు కోవాలనీ యీ నూతనబోధనలు చెప్పేవి. విజ్ఞానం, శాస్త్రం అడుగంటినాయి. శాస్త్రవిజ్ఞానమే మానవుణ్ణి దారీ తెన్నూ లేని గందరగోళంలో పడద్రోసిందనీ, యిందులోంచి బైట పడేందుకు ఈశ్వర విశ్వాసం ఒక్కటే యేకైక మార్గమనిన్నీ తత్త్వవేత్తలు ఋజువు చేయాల్సి వచ్చింది. రాజు కూడా మనిషే. అటువంటివానికి యింతశక్తి యెక్కడినుంచివచ్చింది?* అని ప్రశ్నించి, యిది ఈశ్వరునివల్లనే వచ్చిందని నిర్ధారణ గావించబడింది. తత్త్వశాస్త్రాలకు యిది తిరోగమనమే. ఛాయామాత్రమైన దివ్యలోకాలకి తత్త్వవేత్తలు తిరిగి తిరోగ మించేరు. తమ తాత తండ్రుల విశ్వాసాలకూ, జీవిత విధానా లకూ మగిడిపోదామని అంతకంతకు జనులు గాఢంగా వాంఛించ నారంభించేరు. కాని, మానవచరిత్రలో గతానికి మరలిపోవడ మనేది లేనేలేదు, జరగనే జరగదు.

కాని, ప్రాచీనుల విశ్వాసాలవంటివి కానేకావు, ప్లేటోవంటి వారి తాత్త్విక బోధనలు. ఏ తర్కసిద్ధాంతాల్లోకీ దిగకుం డానే మన ప్రాచీనులు అమాయికంగా దేవుళ్ళయందూ, పరలోకమందూ విశ్వాసముంచేరు. ఋజువులమీాద వాళ్లు

* మహాభారతం లోని శాంతిపర్వంలో భీష్ముడు అంపశయ్య మీాదినుంచి యీ విషయాలనే ధర్మజునికి చెప్పేడు. అనువాదకుడు.

ఆధారపడలేదు. ప్లేటో మాత్రం తన సిద్ధాంతాలను శాస్త్రం వలె కనబడునట్లుచేసి, నిజమైనవిజ్ఞానాన్ని యెదిర్చి తిరస్కరించ గలిగేటట్లు తర్క వాగ్జాలంతో పైపూత పూసేడు.

మంచిచెడుగులను గూర్చి మన పూర్వులు అదేపనిగా చర్చలు సాగిస్తూకూర్చోలేదు. దైవసంకల్పానికి లోబడి, సంతుష్టుడైయుండడమే మంచి; దానిని ధిక్కరించుటే చెడుగు. ఇదే వారి దృఢవిశ్వాసం. గణితశాస్త్రజ్ఞుడు సూత్రాలను నిశితమైన తర్కంతో నిర్ధారణ గావించినట్లుగా మంచి చెడుగులను, నీతి అవినీతులను నిర్వచించేటందుకు సోక్రటీసు పండితుడు ప్రయత్నించేడు. ప్రాచీన మత విశ్వాసాలను నిరాకరించినవాడుగా, తద్భిన్న భావాలు గలవాడుగా ఆయన కనబడతాడు. అందుచేతనే క్రొత్తదేవుళ్ళను ప్రతిపాదిస్తూన్నాడని సోక్రటీసుపై నిందమోపి, విచారించి, జను లాయనకు మరణశిక్ష విధించేరు.

గతంకంటె విభిన్నమై, పాతనుంచి విడివడినవే యీ నూతన సిద్ధాంతాలూ, విశ్వాసాలూ, పరిపాలనా కూడా.

తాతతండ్రుల కాలంలో రాజవంశీకులే పరిపాలన గావించేవారు. ఇప్పుడో ? వడ్డీవ్యాపారులు, కార్ఖానాల యజమానులు, వర్తకులు, — వీరి పరిపాలన సాగుతూంది. ప్రస్తుతపు పాలకవర్గం, ప్రభువర్గం యీ సంపన్నులే.

ఏ నగరంలోనైనా పరదేశీయుడంటె శత్రుతుల్యుడుగానే భావించేవారు, పూర్వం ఒకానొకప్పుడు. కాని, యిప్పుడు

కొన్ని మహానగరాలు బైలుదేరాయి; వాటిలో ప్రతివ్యక్తీ పరదేశీయుడే, బైటినుంచి వచ్చి అక్కడ వుంటూన్నవాడే! అందుచేత అటువంటిచోట్ల పరదేశీయుడనే భావానికే తావు లేదు. ఆ నగరాల్లో గ్రీకులు, ఐగుప్తీయులు, ఫొనీషియనులు మొదలైన జాతులవాళ్ళంతా స్వదేశీయులుగానే పరిగణించబడేవాళ్ళు.

ఉదాహరణకి అలగ్జాండ్రియా నగరాన్ని చూడండి. ఒకసారి అక్కడికిపోయి చూచివస్తే తాతలనాటి జీవితానికీ, ప్రస్తుత జీవితానికీ భేదం యెక్కడుందో తెలుస్తుంది.

## పరిచితప్రదేశాన్నే గుర్తించలేము!

మన మొకసారి నైలునదీతీరాలకు తిరిగి వద్దాం. దిగువ నైలు తీరమందున్నదే ఐగుప్తదేశం. ఆ దేశపు ప్రజలొకప్పుడు దాని నొక యిరుకు ప్రదేశంగా భావించేవాళ్ళు. ఒకప్రక్క సముద్రం దుస్తరంగా ఉండేది. మిగిలిన దిక్కుల్లో యితర తెగలు ఉండేవి. కాని వాళ్ళు పిశాచాలుగా, రాక్షసులుగా కనిపించేవారు, వీరికి. వాళ్ళందరూ వీరికి శత్రువులే.

తరువాత పడవలు కట్టడం నేర్చేరు. పడవలు లేనపుడు శాపంగా ఉన్న సముద్రమే పడవలు వచ్చాక ఐగుప్తీయులకు వరంగా మారిపోయింది. ఇప్పు డేతీరానికి పోవాలన్నా సునాయాసంగా పడవలమీాద నెక్కి పోవచ్చు. సముద్రతీరాన్నే క్రమంగా ఒక మహానగరం బైలుదేరింది. పశ్చిమప్రపంచానికి

యిదొక కూడలియైనది. దీన్ని ప్రారంభించినవాడు అల గ్జాండరు. ఆయన గౌరవార్థమే యీ నగరానికి అలగ్జాం డ్రియా అని పేరు పెట్టారు.

అలగ్జాండ్రియా యింకా చాల దూరాన ఉండగానే నావి కుల తీక్ష్ణనేత్రాలకు ఆకాశాన్నంటే దీపస్థంభంమీది వెలుగు కానవచ్చేది. ఆ దీపస్థంభంమీదనే సముద్ర దేవుడైన 'పొసీ డన్' విగ్రహం నిలిచి ఉంటుంది. పొసీడన్ దేవుడు కేసరముల నల్లలాడించి, నానాదేశాలనుంచి వస్తూన్న ఓడలకు స్వాగత మిస్తూన్నట్లుండేది. పలుదేశాల ఓడలూ రేవులో క్రిక్కిరిసి నిలిచేవి. మూడు అంచీలుగా తెడ్లు అమర్చిన ట్రిరెమిస్ ఓడలు, — యివి యుద్ధపుటోడలు, పడిచెక్క ఫూటుగా వున్న ధాన్యపు ఓడలు,— ఒక్కొక్క దేశపు ఓడలు ఒక్కొక్క తరహాగా ఉండేవి. ఒక ఓడ బైలుదేరి పోయిందంటే మరోటి వచ్చి చేరు తూనే వుండేది. తీరంమీదా, రేవుల్లోనూ వున్న గుంపులు అటునిటు పరుగిడుతూ, యెన్నో విలాయితీ భాషల్లో మాట్లా డుతూ, సందడిగా వున్నారు. గ్రీకు, హెబ్రూ, ఫొనీషియను, లాటిన్, పెరిష్యను, అరబ్బు, ఈజిప్షియను, అబిస్సీనియను మొదలైన భాష లెన్నో అక్కడ వినబడతాయి. బంగారు, దంతం దొరకే నూబియా దేశాన్నుంచి వచ్చిన జంబూఫలో పమచ్ఛాయులు నూబియనులు; సువాసనాతైలముల దేశం అరేబియానుంచి వచ్చిన ధూసరవర్ణులైన షేకులు; దేవదారు వుల దేశం ఫొనీషియానుంచి వచ్చిన ఆజానుబాహులు, శుభ్ర

వన్నులూ నైన ఫొనీషియనులు,– అందరూ యిచ్చట కలిసి మెలసి, భుజాలు రాచుకుంటూనే తిరిగేవాళ్ళు. అలగ్జాండ్రియాకు భాష కూడ ప్రత్యేకమైనదే. దానిలో సమస్త భాషలపదాలూ కలిసివుంటాయి. హెబ్రూ, గ్రీకు, ఐగుప్తీయ తుర్కు, ఆరబు, పెరిష్యను, క్రీటు మొదలైన వివిధ భాషా పదాలతో యేర్పడిన దా అలగ్జాండ్రియా భాష.*

ఈ రేవు పట్టణాన్నుంచి ప్రపంచంలోని వివిధ దేశాలకూ, బైజాంటియమ్, ఏథెన్స్, సిరాక్యూజ్, కార్థేజ్, మార్సెలిజ్ మొదలైన దేశా లెన్నిటికో సముద్రమార్గాన పోవచ్చును. తూర్పు దేశాలనుంచి సుగంధ ద్రవ్యములు, దంతములు, ఏనుగులు తీసికొని వచ్చేవారు, టేకుమ్రాకులతో నిర్మించిన పెద్ద ఓడలలో. నౌకాయాన యోగ్యమై వెడల్పైన కాలువ ఎర్ర సముద్రాన్ని నైలు నదితో కలుపుతూండేది. ఈ కాలువ గుండానే తూర్పుదేశాల పెద్ద ఓడలు ఎర్ర సముద్రాన్నుంచి నైలునది మీదుగా మధ్యధరాసముద్రానికి ప్రయాణం చేస్తూండేవి. టాలెమీ చక్రవర్తుల ప్రతిమ ముద్రించబడిన బంగారు నాణెములు, గ్రీకు పూలపాత్రలు, పుష్పలతలు చిత్రించబడిన గాజుపాత్రలు, కంఠాభరములు, కంకణములు మొదలైనవి అలగ్జాండ్రియా నుంచి తూర్పు దేశాలకు పోయేవి. వివిధ

---

* భారతదేశంలోని ఉరుదూ భాష కూడ యీ విధంగానే కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో స్థానిక భాషల్లో విదేశీయపదాలను చేర్చుటవల్ల యేర్పడినదని చెపుతారు. —అనువాదకుడు.

వర్ణరంజితములై, ఆహ్లాదకరములైన శాలువలు, చీనిచీనాంబరములు చీనాదేశాన్నుంచి తూర్పుదేశాల మీదుగా జలస్థల మార్గాలు రెండిటా అలగ్జాండ్రియాకు వచ్చి చేరేవి.

తూర్పున సుదూరంలో వున్న చీనాదేశంలో కూడా జనులు తమను నొక్కిపెట్టి ఉంచుతూన్న అదృశ్యకుడ్యాలను అంతకంతకి వెనక్కి నెట్టి వేస్తూన్నారు. చీనీయులు చిరకాలంగా వారి నదుల్లో పడవలు నడుపుతూన్న వాళ్ళే. క్రమంగా ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తూ సముద్రంలో ప్రవేశించి, దక్షిణానికీ, అక్కడినుంచి పశ్చిమానికీ ప్రయాణాలు సాగించేరు. ఉత్తర చీనానుంచి పశ్చిమాభిముఖులై మంగోలియా, తుర్కిస్థానముల యెడారుల నతిక్రమించి, పడమటి దేశాలకు దారులు కనుగొన్నారు. సుప్రసిద్ధుడైన చీనాచక్రవర్తి చాన్ అను నాతడు యీ రీతిగా మొదట కాశ్యప సముద్ర తీరాలకు చేరుకున్నాడు. అప్పటి కెవ్వరూ ఆ దేశాల పేర్లైనా వినలేదు. చీనాచక్రవర్తి సైన్యాలు కాశ్యపసముద్రమును చేరుకున్నాయి. చీనావర్తకులు, సన్యాసులు యింకా దీర్ఘ ప్రయాణాలు గావించి నైలునదీతీరం చేరుకున్నారు.

గ్రీకులు తూర్పు అని పిలిచేది చీనావారికి పశ్చిమం.

వేలమైళ్ళ యెడారులు, పర్వత శ్రేణులు వేరుచేస్తూన్న గ్రీసు, చీనాదేశములు మొదటిసారిగా ఒకటినొకటి కలుసుకొని పరిచయంచేసుకొన్నాయి. నగిషీపని చేసిన గ్రీకు పుష్పపాత్ర లనుచూచి చైనీయులు మెచ్చుకున్నారు. చీనావారినుంచి నేర్చు

కోదగినది యెంతోవుందని పాశ్చాత్యప్రపంచం గ్రహించింది. 'ఈ విదేశీయులవద్ద మనం నేర్చుకోదగిన విద్యలు యెన్ని ఉన్నాయి!' అని యిరుప్రజలూ అనుకున్నారు.

పశ్చిమాన జనుల భూగోళవిజ్ఞానం పెరుగుతూంది.

హెర్క్యులిస్ స్థంభాలే (నేటిజిబ్రాల్టరు జలసంధి కిరుప్రక్కలానున్న పర్వతాలు) ప్రపంచానికి హద్దుగా జను లాడుకొను కాలమొకటి ఉండేది. ఆ తరువాత నున్నది, భూమినిచుట్టి వుండే అసీమమైన సాగరమేనని వారు భావించేవారు. ఇప్పుడు మార్సెలిజ్ (దక్షిణ ఫ్రాన్సు) నుంచి బైలుదేరిన నావికులు సముద్రమువిూద ఉత్తరాభిముఖంగా సాహసించిపోయి బ్రిటిష్ దీవులను చూసేరు. బ్రిటనుకు ఆవలగా యింకా యేవేవో దేశాలున్నా యంటూ వారనేక కథలు మోసుకొచ్చేరు కూడాను. ఆ యజ్ఞాత సుదూర దేశంపేరు 'థూలీ' యనీ, అదొక ద్వీపమనీ వారు విన్నారు.

భూమి సరిహద్దు హెర్క్యులస్ స్థంభాలేనని జనులు యింకిప్పుడు భావించడంలేదు. సుదూరమందలి 'థూలీ' ద్వీపమే భూమికి కడపటి సరిహద్దని యిప్పుడు వారు భావిస్తూన్నారు.

అలగ్జాండ్రియా అంగళ్లలో తరుణులు 'అంబరు' కొనేవారు. అది బాల్టిక్ సముద్రతీరాలనుంచి వచ్చేది. నదీదేవతల 'గడ్డకట్టిన కన్నీరు' అంబ రవుతుందని జనులు చెప్పుకునేవారు.

పూర్వపట్టణాలవలెగాక అలగ్జాండ్రియా, ప్లాను ప్రకారంగా నిర్మించబడింది. ఉత్తర దక్షిణాలుగా రెండురాజవీధులు. వాటి

వెడల్పు యాభై అంగలు. ఈ రాజవీధులను దాటుతూ తూర్పు పడమరలుగా అనేక ఉపవీధులు. ఇవన్నీ కూడ రథాలు, అశ్వాలు పోతూన్నా సమ్మర్దం గాకుండేటంత వెడల్పుగానే ఉండేవి. ఈ అడ్డవీధులన్నిటికీ గ్రీకు అక్షరమాలలోని ఆల్ఫా, బీటా, గామా మొదలైన పేర్లుంచేరు.

నగరంలో మూడోవంతు స్థలం ఆక్రమించుకొని దేవాలయాలు, రాచనగరులు, ఉద్యానాలు ఉండేవి. దేవాలయ కుడ్యములన్నీ శిలానిర్మితములై, వాటిమీద శాసనాములు లిఖించబడివుండేవి. అలగ్జాండ్రియా నగర రక్షక దేవత 'సెరాపిస్' ఆలయమే ప్రధానమైనది. ప్రాచీన నగరాలన్నిటికివలెనే యీ నూతన నగరానికీ రక్షక దేవత ఉండాలని అందరూ భావించేరు.

అలగ్జాండ్రియా నగరములోనే ఈజిప్టు చక్రవర్తులైన 'టాలెమీ'లు నివసించేవారు. తల్లులు తమ బిడ్డలకు రాజులు, దేవుళ్ళను గూర్చి యెన్నో కథలు చెప్పేవాళ్ళు. వాటిలో ఒకటి నగర దేవతను స్థాపించడాన్ని గురించింది... ఒకరాత్రి టాలెమీకి స్వప్నం వచ్చింది. అందముగా పొడుగుగా వున్న యువకు డొకడు కలలో దర్శన మిచ్చి, "నీ ఓడలలో నొకదాన్ని పోంతస్ తీరాలకు పంపించు. అక్కడనే నా నివాసం." అన్నాడట. మరునాటి ఉదయం టాలెమీ తన స్వప్న విషయాన్ని పురోహితులతో చెప్పి, దాని అర్థం చెప్పమన్నాడు. కాని, యెవరూ అట్టి స్థలాన్ని గురించి విననేలేదని

చెప్పేరు. టాలెమీ తన స్వప్నవృత్తాంతాన్నే మరిచాడు. కాని కొద్దిదినాల్లోనే యిట్టి స్వప్నం మళ్ళీవచ్చింది. స్వప్నం లోని సుందరయువకుడు ఓడను పోంతస్ తీరానికి పంపుమనే సాధికారవాంఛను తిరిగి వెల్లడించేడు. టాలెమీకి యీసారి భయభక్తులు కలిగాయి. డెల్ఫీలోని ఆకాశవాణిని అడుగుటకు నిశ్చయించుకొని, సపురోహితుడై బైలుదేరాడు. డెల్ఫీ దేవాలయానికిపోయి, తన స్వప్నదర్శన వృత్తాంతం తెలిపి, ఫలితం చెప్పవలసిందిగా ప్రార్థించాడు. "ఆ యువకుడు దివ్యసుందర విగ్రహుడైన ఒక దేవుడే. సైనోపునగరంలో ఆతని ఉనికి. టాలెమీ చక్రవర్తికి శుభమును కోరి, తన విగ్రహము నొకదాన్ని అలగ్జాండ్రియాకు పంప నను్గ్రహించేడు." అని దివ్యవాణి స్వప్నార్థమును యేర్పరించి చెప్పింది. టాలెమీ తక్షణమే తగు పరివారాన్ని తోడిచ్చి. ఓడను పంపేడు. కాని, సైనోపు రాజు ఆ దేవతావిగ్రహాన్ని యివ్వ నిరాకరించేడు. అప్పుడా విగ్రహం తనంత తానే బలిపీఠాన్నుంచి యెగసివచ్చి, రేవులో వేచియున్న ఓడలో వ్రాలిందట! వెంటనే లంగరెత్తి వేసి బైలుదేరింది, ఓడ. గాలి అనుకూలంగా వీస్తూంది. మూడోరోజుకి ఓడ అలగ్జాండ్రియా రేవుచేరి లంగరు దించింది!

ఈ రీతిగా అలగ్జాండ్రియానగర రక్షకదేవత కూడా యేదో విదేశాన్నుంచి వచ్చినదే!

అట్లే యీ ఈజిప్టు నగరంలోని ప్రతీదీ కూడ యేదో ఒక పరదేశాన్నుంచి వచ్చినదే. చివరకి అక్కడి పాలకుడు కూడ

అంతే! టాలెమీలు ఐగుప్తీయులు కారు. వారు గ్రీసు దేశీయులు. మొదటి టాలెమీ అలగ్జాండరు సేనాపతుల్లో ఒకని కుమారుడు. ఆ నగరంలో ఈజిప్టు భాషకంటె గ్రీకు భాషయే ప్రచురం. వెనుకటి రోజుల్లో ఐతే ఐగుప్తీయు డెవడూ గ్రీకువానితో సహపంక్తి భోజనమే చేసేవాడు గాడు! ఆ రోజులు వెళ్ళిపోయాయి, మరి. వెనుకటి ఐగుప్త చక్రవర్తులు 'ఫరావో' లని పిలువబడేవాళ్ళు. 'రా' 'అమ్మోన్' లేక సూర్యదేవునికి ప్రియమైనవాడు, యిష్టుడు అని యీ మాటకు అర్థం. టాలెమీ తన గ్రీకు పేరుకు తోడు 'ఫరావో' అనే ఐగుప్త బిరుదును కూడ తగిలించుకున్నాడు.

ఈ రీతిగా నీ నూతన నగరంలో అనేక దేశాల జనులు, భాషలు, దేవుళ్ళు, ఆచారసాంప్రదాయాలు, విశ్వాసములు స్వేచ్ఛగా నెలకొనడం చూస్తాము. ఒకప్పు డివన్నీ ఒకదాని కొకటి బహుదూరంగా ఉండబడినట్టివి. సముద్రాలు, పర్వతాలు, యెడారులు మాత్రమే గాక అసూయ, అనుమానము, మూఢత్వము, అజ్ఞానము, ద్వేషము కూడ వీటి నొకదాని కొకటి దూరంగా ఉంచుతూ వచ్చాయి.

అలగ్జాండ్రియా పడమటి దేశాలకు కేంద్రమైంది. ప్రపంచంలో వున్న దేశాలన్నీ అక్కడ అద్దంలోవలె ప్రతిబింబిస్తూండేవి.

ద్వీపాంతరాలకు వెళ్ళిన నావికులు విచిత్రమైన జంతువుల్ని గూర్చి రకరకాల విడ్డూరపు గాథలను మోసుకొస్తూండేవాళ్లు.

అటువంటి దిప్పుడు జనులు అలగ్జాండ్రియా జంతు ప్రదర్శన శాలకు వెళ్లి వాటినన్నిటినీ స్వయంగా చూడవచ్చు. ఏనుగులు, జిరాఫీలు, పెద్ద కొండచిలువలు మొదలైన వెన్నో అక్కడ పెంచేవాళ్లు.

ఓషధీవనం ఒకటికూడ ఆ నగరంలో ఉండేది. విచిత్ర వృక్షజాతు లెన్నో అక్కడ పెంచబడుతుండేవి. అరణ్యాధి దేవత 'పాన్' దేవుడుకూడ గ్రీసులో స్వప్నేపీ చూడని అనేక వృక్షజాతు లిచ్చట పెరుగుతుండేవి.

అలగ్జాండ్రియాలో ఒక గొప్ప గ్రంథాలయం కూడావుంది. అపురూపమైన పాపిరస్ పత్రలిఖితములు వేలాదిగా భద్రపరుపబడి ఉండే వచ్చట. వాటి జాబితాయే ఒక పెద్ద గ్రంథంగా ఉండేది ! ఈ గ్రంథాలయాధ్యక్షుడుగా ఇరాతోస్థనీస్ అను మహాపండితు డుండేవాడు. ఏథెన్సులోని అకాడమీలో ప్లేటో పండితుని కడ విద్యాభ్యాసం గావిస్తూ, చాలమంది శిష్యులుండేవాళ్ళు. అక్లే లైసియమ్‌లో అరిస్టాటిల్ పండితుని దగ్గరా శిష్యు లెందరో. అవి రెండూ గొప్ప విద్యాలయాలే, విద్యాకేంద్రాలే. కాని అవేవీ అలెగ్జాండ్రియాలోని 'మ్యూజియమ్' తో పోల్చేందుకు వీలులేదు. మ్యూజెస్ * అనే విద్యా

* జ్యూస్ దేవుని కుమార్తెలు తొమ్మండుగురు. వారు తొమ్మిది విద్యలకు, కళలకు అధిష్ఠానదేవతలు . సల్లియోప్- పురాణకావ్యము; స్లియో- ఇతిహాసము, ఇరాతో-శృంగారకావ్యము; యూటెర్పీ-గేయము; మెల్పొమినీ- విషాదాంత నాటకము; పోలిహైమ్నియా- వాక్చాతురి, ఉపన్యా

అధిదేవతల ఆలయమే మ్యూజియమ్. అదివరలో ఆలయాలు యితర దేవుళ్ళకూ, దేవతలకూ కట్టేవారు. కాని, అలగ్జాం డ్రియాలో సర్వవిద్యలకూ అధిదేవతలైన మ్యూజెస్‌కే ఒక మహాదేవాలయం నిర్మించబడింది.

టాలమీ యెందరో మహాపండితుల్నీ, శాస్త్రజ్ఞుల్నీ ఆహ్వా నించి రప్పించి, మ్యూజియంలో వారికి నివాసం యేర్పరచే వారు. తమ విజ్ఞానశాస్త్ర వ్యాసంగం, పరిశోధనలూ తప్ప వారికి అన్యాలోచనే ఉండేదికాదు. వారికి కావాల్సినదంతా రాజుగారు సమకూర్చేవారు. వారి పనులకూ, ప్రయాణా లకూ, పరిశోధనలకూ కావలసిన ధనంకూడ వారికి రాజ బొక్కసం నుంచే వచ్చేది. వారందరకూ భోజనాలు దేవా లయంలోనే యేర్పాటు. భోజనాలదగ్గర యీ పండితులంతా కలుసుకునేవారు; భోజనానంతరం యేదో శాస్త్రవిషయం మీద చర్చ సాగిస్తూండేవారు.

ఈజిప్టురాజులు ఒక ప్రాచీన మహారాజ్యానికి పాలకులు. విజ్ఞానశాస్త్రాల శక్తి వారికి తెలుసు. శత్రు దుర్భేద్యములైన దుర్గములు నిర్మించడానికీ, యుద్ధసాధనాలు తయారుచేయ

---

సము; టెర్పిస్కోర్-నాట్యం; థాలియా-సుఖాంత నాటకము; యురానియా ఖగోళశాస్త్రము; వీరి పేరట నిర్మించబడిన ఆలయమునే మ్యూజియమ్ అం టారు. విద్యలకు, కళలకు నిలయమన్నమాట. మన సాంప్రదాయంలో సంగీత సాహిత్యాది విద్యలన్నిటికీ ఒక్క సరస్వతీ దేవియే అధిష్టానదేవత.

— అనువాదకుడు

డానికీ, ఓడలు కట్టడానికీ గణిత శాస్త్రం, యంత్ర శాస్త్రం ప్రధానావసరములు. నౌకాయానానికి ఖగోళశాస్త్రం, నిరోగ మైన దీర్ఘాయువుకు ఔషధశాస్త్రం కావాలిగదా. ఈజిప్టు ప్రభువులైన టాలెమీలు కవులపట్లా, తత్త్వవేత్తలపట్లాకూడ ఉదారంగానే ఉండేవారు. సైనికశక్తినీ, సంపదలనూ పెంపొం దించుకోడానికి విజ్ఞానశాస్త్రాలు అవసరమైతే, తమ కీర్తిని గానం చేసేందుకు కవులూ, దైవాంశసంభూతులే రాజ్యపాలకు లని తర్కయుక్తులచే ఋజువు గావించడానికి తత్త్వవేత్తలూ కావద్దా ?

అలగ్జాండ్రియాలోని తత్త్వవేత్తలు చాలమంది ప్లేటో అనుయాయులే. ప్లేటో పండితుడే గనుక జీవించివుంటే వీరిని చూచి సంతోషించేవాడే. టాలమీలకు ప్లేటో అంటేనే అత్యంత ప్రీతి.

అలగ్జాండ్రియాలోని పాలకులకు డెమాక్రిటస్ సిద్ధాంతా లంటే అయిష్టమే. గ్రంథాలయాల్లో ఆయన గ్రంథాలను యెవరోగాని చదివేవారేగాదు. ఆ పుస్తకాల నిండా దుమ్ము పేరుకొని ఉండేది. ఎప్పుడో సకృత్తుగా ఒక గణితశాస్త్రజ్ఞుడో, భౌతికశాస్త్రవేత్తయో డెమాక్రిటస్ గ్రంథాలను తిరగవేసే వాడు. ఏదో గట్టిసందేహమే వచ్చివుంటుంది, వాళ్ళకి. అటు వంటి గడ్డుసమస్య వస్తే ఆయన గ్రంథాలను చూడక తీరేది గాదు. కాని అల్లాంటప్పుడైనా ఆ గ్రంథాలను సందేహిస్తూనే, దొంగచాటుగా తిరగేసేవారు. దేవాలయ పోషకులైన ప్రభు

వర్గానికి నాస్తికుడూ, సమతావాదీ యైన డెమాక్రిటస్ పండి తుని బోధనలు యెవరూ చూడడం యిష్టం ఉండదని వారెరు గుదురు.

మ్యూజియం నిర్మాతలు మొదట్లో దానిని ప్లేటో అకాడమీకి ప్రతిగా, దానికంటె పెద్దదిగా మాత్రమే ఉండాలని ఉద్దేశించేరు. కాని, తీరా చూస్తే యిది ప్లేటో అకాడమీ లాగా లేదు, అరిస్టాటిల్ లైసియమ్ లాగా లేదు. అకాడమీలో శిష్యులు పాఠాలు చెప్పుకోడం, చర్చించడం, ప్రసంగించడం మాత్రమే చేసేవారు. ఇప్పుడీ నూతన విజ్ఞాన దేవాలయంలో గురుశిష్యుల బుద్ధికేగాక చేతులకికూడా పని తగులుతూంది. వస్తుపరిశీలనలు, పరీక్షలు, పరిశోధనలు సాగించుతూన్నారు. భౌతిక, రసాయన, ఔషధ, శరీర శాస్త్రాదులలో ముందడుగు వేయాలంటే తూచడం, కొలవడం, కలపడం, కాచడం, కరిగించడం, తేర్చడం మొదలైన పనులన్నీ చేయాలి. శిష్యులు కూర్చునే బల్లలేగాక మ్యూజియమ్‌లో పొడుగాటి యెత్తుబల్లలూ, వాటిమీద వివిధపరికరాలూ, పాపిరస్ పత్ర గ్రంథాలూ పెట్టిఉంచేవారు. గ్రహవేధకూ, నక్షత్రపరిశీలనకూ ఖగోళవేత్తలు యెన్నో పరికరాల నుపయోగిస్తున్నారు. వాటిలో 'ఆస్ట్రలోబ్' ఒకటి. భౌతిక శాస్త్ర పరిశోధనాగారంలో యెన్నెన్నో పరికరాలున్నాయి. రసాయనాగారంలో నాళికలు, పాత్రలు, కల్వములు మొదలైనవి వుంచేరు. తూచడానికీ, కాల్చడానికీ, కరగడానికీ,

కలపడానికీ, మరగించడానికీ, యిల్లాగే వివిధ కర్మకలాపం సాగించేటందుకై వలసిన సాధనాలన్నీ అక్కడి బల్లలమీద అమర్చబడి వుండేవి.

అంతకుపూర్వం పండితులకు నిషిద్ధములైన పను లెన్నో మ్యూజియమ్‌లో జరుగుతూన్నాయి. గ్రంథాలయ పండితులు హోమర్ మహాకవి రచనలనే, ఇలియడ్, ఒదెస్సే గాథలనే, కుదించి, తిరిగి వ్రాస్తూన్నారు! విమర్శలు, ప్రతివిమర్శలూ గావిస్తూ, అసలు హోమర్ అనే కవే లేడనీ, యివన్నీ యేవో పుక్కిటిపురాణా లనీ వాదించేవారు కూడా బైలుదేరారు. పాపభీతి యేమాత్రమూ లేకండా హెరోఫిలస్ అను పండితుడు యాంఫీథియేటరులో శిష్యులు చుట్టూకూర్చుని చూస్తూండగా శవములను ఛేదించి చూపుతూన్నాడు! మెదడునుంచే ఆలోచనలు బైలుదేరుతున్నాయని ఆయన కనిపెట్టేరు. అంతకు పూర్వం హృదయమే ఆలోచనారంగం, కేంద్రం అని భావించేవాళ్ళు. రక్తనాళాల్లో వాయువుగాక యెర్రని ద్రవం, రక్తం ప్రవహిస్తూందనీ ఆయన ధృవపరచేడు. ఎంపిడోక్లిస్ కాలం నాటికే జంతువుల కదలికలన్నీ కూడ మెదడునుంచే నడుపబడతాయని ఆల్‌స్మయోన్ అనే క్రొటోనా వైద్యుడు ఊహగావించేడు. ఆతడు జంతువుల శరీరాలనే పరిశీలించేడు. మానవ కళేబరాలను ఛేదించరాదనే సనాతన నిషేధాన్ని ధిక్కరించి, యిక్కడ హెరోఫిలస్ శవాలను ఛేదించి, పరిశోధనలు సాగించేడు. ఈ పని చేయడం గ్రీసుదేశంలో ఐతే

సాధ్యంగాదు. ఈజిప్టులో గనకనే సుసాధ్యమైంది. ఎందుచేత నంటే అతి ప్రాచీనకాలాన్నుంచీ కూడ ఈజిప్టులో శవాల్ని తైలనిక్షేపమొనర్చడం ఆచారంగా వస్తూంది. శవం క్రుళ్ళి చెడిపోకండా ఉంచేందుకు యెన్నో ప్రక్రియలు వారు గావించే వారు.

ఈ రీతిగా యెందరో తమ బుద్ధి నుపయోగించీ, చేతుల నుపయోగించీ పనిచేస్తూన్నారు. చేతులు చేసిన పనిని మేధస్సూ, మేధస్సు సాధించిన ఊహాలను చేతులూ సమీక్షిస్తూన్నాయి. ఒకటి రెండోదాని నభివృద్ధిచేస్తూంది. కేవలం పనివాళ్ళేగాక పండితులు కూడా సుత్తీ-దాగలీ, త్రాసూ-రాళ్ళూ, టంకం-కుంపటీ మొదలైనవాట్లని ఉపయోగించడం యిక్కడే ప్రారంభించేరు. మేధస్సుచేత వచ్చిన నిర్ణయాలను చేతులతో పరిశోధనల రీత్యా ఋజువు గావించడానికి మ్యూజియంలోని శాస్త్రవేత్తలు పూనుకొన్నారు.

## తల, చేతులు

ఎన్నో శతాబ్దాలనుంచీ మానవుల చేతులే వాళ్ళ మెదడుకి బోధకులుగా ఉంటూ వచ్చాయి. చేతులనేర్పు పెరుగుతూన్న కొద్దీ మెదడు శక్తికూడా అధికమవుతూ వచ్చింది. హస్త కౌశలం, అనుభవం మెదడు శక్తిని విస్తృతం చేస్తూన్నకొద్దీ, *

---

* సర్వం కర్మాఖిలం పార్థ ! జ్ఞానే పరిసమాప్యతే॥ భగవద్గీతా 4-3

మెదడు కూడా అంతకంతకు హెచ్చుగా ప్రతి పనిమీదా పెత్తనం, అజమాయిషీ సాగిస్తూవచ్చింది.

ఉదాహరణకు ఒకపెద్ద రాతిబండను యెత్తవలసి వచ్చినపుడు, చేతులకు ఆ శక్తి లేకపోయిందనుకోండి. అప్పుడు బుర్ర సాయానికి వచ్చేది. రాతిక్రింద యే పొడుగాటి కర్రనో మీటగా పెట్టి లేపమనే ఆలోచనను మెదడే సూచించేది. మీట ఉపయోగిస్తే ఆ రాతిబండ కొంచెం యెత్తు సులభంగా వేస్తుంది. కాని ఆ రాతినే దేవాలయానికో, పిరమిడ్కో ఉపయోగిస్తున్నారనుకోండి. అంత యెత్తునకు మీటవల్ల కూడా రాయి లేవదు. అప్పుడు మళ్లా బుర్రే సాయంచేయాలి. ఆలోచించి, వాలుపలక లేక వాలుగావుండే మిట్ట నిర్మించి, దానిమీదికి మెల్లగా నెట్టుకుపోవచ్చునని సూచించింది. అనుభవంమీద మోరకకు బరువులను లాగడం కంటె దొర్లించడం సులువని తెలిసింది. ఆ రాతిక్రింద సులువుగా దొర్లే రోకళ్లవంటి కొయ్యదుంగల్ని ఉంచి, వాటితో సహా రాతిని వాలుపైకి దొర్లించుకునిపోయి, దేవాలయ నిర్మాణానికి అందిచ్చేవారు. ఇదంతా చాలక్లిష్టమైనదే. కాని, మన పూర్వులు యీ క్లిష్టకార్యాల్ని నెరవేర్చేరు.

ఈ రీతిగా కష్టమైన పనులు చేసేందుకు సులభ మార్గాల్ని బుర్ర ఆలోచించి కనిపెడుతూ వచ్చింది. నేడు మనం 'పుల్లీ' అని పిలిచే 'కప్పీగిలక' ను కనిపెట్టిందీ బుద్ధే. కప్పీలోంచి త్రాటిని దూర్చి, రెండో కొసను బరువుకు కట్టిన, ఆ బరువు

అతి సులువుగా లేస్తుంది. కప్పీ త్రాటి సాయంతో పదిమంది, యిరువదిమందీ యెత్తలేని బరువులను ఒక్కడే యెత్తగలడు!

చూసేరా, చేతులకి తల చేసిన సాయం! కాని, చేతులు ఊరికే ఉండలేదు. తల సూచించిన ఉపాయాలన్నీ పన్నుతూ, యెప్పటి కప్పుడు కొత్త సమస్యల్ని తలముందుంచుతూ వచ్చాయి.

పంటపొలం వుంది. వర్షంలేక తీరా వెన్నుమీద వున్నది ఎండిపోతూంది. నదిలోంచి నీరు మోసుకొచ్చి పొలంతడపాలి. నీరు మోసి మోసి చేతులూ భుజాలూ పడిపోతున్నాయి. దిగుడు నూతులు త్రవ్వడం కనిపెట్టింది, మానవుని బుద్ధి. అంతటితో కునికిపాట్లు పడుతూ ఊరుకోక నూతి గిలకను కని పెట్టింది. నూతిమీద కొయ్యగిలక, చక్రం; గిలకను త్రిప్పేందుకు తగినపిడి; గిలకమీంచి త్రాడూ, త్రాటికొనను బాల్చి; త్రాటి రెండోకొనను గిలకకే కట్టడం. పిడి పట్టుకొని చేతులు త్రిప్పుతూంటే, త్రాడు గిలకకు చుట్టుకుని బాల్చి పైకివస్తుంది. బాల్చినిండా అమృతోపమానమైన నీరు పైకి వచ్చింది. అద్భుతమైన వరప్రసాదం కాదా, యిది! వేలయేండ్లు గడచిపోయినా యీ జలోత్పాదన యంత్రము, నూతిగిలక యింకా సజీవంగా వుండి, చేతులకు నీరు తోడడంలో తోడ్పడుతూనే వుంది.

కాని, అధికాధిక విస్తృతంగా భూమి సాగులోకి వస్తూన్న కొద్దీ అధికాధికంగా నీటిని చేదవలసివచ్చింది. అవసరమే

ఉత్తమగురువూ, బోధకుడున్నూ. మెదడు వేడెక్కేలా ఆలోచించింది. తపస్సే చేసిం దనుకోండి. అసలు చేతులపనే అక్కర లేకండా నీటిని పారించే దెల్లాగ? మనుష్యునితో సహచరములుగా నున్న నాలుగు కాళ్ళ ప్రాణులు యిందుకు పనికి రావూ? ఈ జంతువులు అనాదిగా మానవునితో మసలుతూ, అతని బరువులు మోస్తూనే ఉన్నాయిగదా. నూతి గిలకను త్రిప్పేపనికి పశువులను నియోగించాలి. అది ఎద్దు, దున్న, గాడిద, గుర్రం, ఒంటె, యేదో ఒకటి. పశువులు చేద త్రాటిని లాగుతూ, వెనుకకూ ముందుకూ నడవడం ఒక పద్ధతి. అట్లుగాక పశువు వృత్తాకారంలో తిరుగుతూంటే పళ్ళ చక్రాలు తిరుగుతూ ఒక యిరుసును త్రిప్పుతూంటాయి. ఇరుసుకి సంబంధించిన పళ్ళచక్రం నుంచి యీ భ్రమణం మరొక పళ్ళచక్రానికీ, దాన్నుంచి నూతిగిలక తాలూకు యిరుసుకీ బదిలీ అవుతుంది. ఇరుసుతో బాటు గిలక తిరిగి, త్రాటిని విప్పుతూ, చుట్టుకుంటూ ఉంటుంది. త్రాటితో చేద క్రమంగా పైకీ క్రిందకీ దిగుతూ, నీటిని తోడిపోస్తూంటుంది. ఈ విధంగా మానవహస్తాలకు మరొక భారం తొలగిపోయి, యింకా సూక్ష్మమైన పనులను కౌశలంతో చేయడానికై స్వేచ్ఛ కలిగింది. ఇప్పుడింక చేతుల ప్రధానకార్యం యిరుసులు, పిడులు, చక్రాలు, పళ్ళచక్రాలు చేయడం, వాటికి నునుపుపెట్టడం, రంధ్రాలు తొలవడం, చీలలు కొట్టడం వగైరాలు. నీటిని తోడడానికి తొలుగూనలు కుట్టడం, వాటికి త్రాళ్లు పేనడం

కూడ మరింత నేర్పుగా చేయడం నేర్చుకున్నాయి, చేతులు. కాలం గడుస్తూన్నకొద్దీ బుద్ధి మరింత సంశ్లిష్టకార్యాలను నెరవేరుస్తూరావడం, బుర్రతోబాటుగా చేతులు కూడా సమంగా ముందుకి సాగి, అధికతరకౌశలాన్ని సంపాదించడం జరిగింది.

అదివరలో మానవుడు నదిలోనుంచి నీటిని తోలుతిత్తులలో మోయించుకుని వచ్చేవాడు. క్రమంగా అతడికి ఆలోచన కలిగింది: 'ఈ పనిని గుర్రం లేకుండా చేయించలేమా?' అని. జంతువులచేత మాత్రం యింత వెన్నువిరిగే చాకిరీ యెందుకు చేయించాలి, పాపం! ప్రవాహమే పైకిలేచి, కాలువలగుండా పొలాలకి పారునట్లు గావిస్తే? ఆఁ! బాగుంటుంది. చేతులకి కొత్తపని కల్పించబడింది. ఒక పెద్ద చక్రం చేసి, దాన్ని ప్రవాహమధ్యంలో నీటిలోకి ఉండేటట్లు అమర్చేరు. చక్రపుటంచులలో దొప్పలుంటాయి. ప్రవాహవేగం చక్రమును త్రిప్పునట్లుగా కొయ్యపలకలను బిగించేరు. నీరు పారుతూ, చక్రానికున్న కొయ్యపలకలను, దొప్పలను తోస్తూ, దాన్ని త్రిప్పుతుంది. చక్రం తిరుగగానే దొప్పలూ పైకి వస్తాయి, దొప్పలతో నీరూ లేస్తుంది. చక్ర భ్రమణంలో దొప్పలు తిరిగి క్రిందికి దిగ నారంభించినప్పుడు నీరు పడునట్లు ఒక తొట్టి వుంటుంది. తొట్టిలోనుంచి కాలువలద్వారా నీరు పొలాలకు పారి, సస్యాలను ఫలవంత మొనరుస్తుంది. ఈ విధంగా మానవుని బుద్ధీ, చేతులూ కలిసి నీటిని దాని సహజ

దిశమైన పల్లానికిగాక పైకిమరల్చి, స్వోపయోగానికి వినియో గించుకున్నాయి.

శిశిరంలో పంటలను నూర్చే తరుణం వస్తుంది. కొట్టివేతలు కాగానే ధాన్యం యిళ్ళకు చేరుస్తారు. వాటిని విసరి, పిండిని చేయడం నిత్యకృత్యం. రాతి తిరుగళ్ళు ప్రసారియింటా ఉండేవి. ఇదీ చిన్న యంత్రమే. దీనిని ఊహించినదీ, నిర్మించినదీ, మానవుని బుద్ధీ, చేతులూనూ. ఈ చేతి తిరుగళ్లు చిన్న కుంటు బానికి కావలసిన పిండినే విసరగలవు. పెద్ద పట్టణాలు, నగ రాలు బైలుదేరినాయి. అలగ్జాండ్రియా వంటి నగరాల్లో సైన్యాలుండేవి. పటాలపు మహానసములలోనికి పిండి పుష్కలొద్దీ కావాలిగదా. బానిస తండాలచే త్రిప్పించే పెద్ద పెద్ద రాతి తిరుగళ్ళుండేవి. వాటినే గుర్రాల చేతా, ఒంటెల చేతా త్రిప్పించేవారు. క్రమంగా యీ పనికి బానిసలూ కాక, జంతు వులూ కాక మరో శక్తిని ఉపయోగించ లేమా ? అని బుద్ధి ఆలోచించింది.

తిరుగలి పైరాయికి అమర్చిన కాడికి రొమ్ములను ఆన్చి త్రోస్తూ, చెమటలు కారుకుంటూ చుట్టూ తిరిగే బానిసలూ, ఆ తరువాత యింకా పెద్ద తిరుగళ్ళను త్రిప్పే గుర్రాలూ; యిప్పుడు మానవుడు చేయాల్సిందల్లా తిరుగలికాడికి పూన్చిన గుర్రాలను అదలించుతూండడమే.

క్రమంగా మరింత పెద్ద తిరుగళ్ళ నుపయోగించుట వాడుకలోకి వచ్చింది. మూడు గుర్రాలు కూడ త్రిప్పలేనంతటి పెద్ద రాళ్ళు ఉపయోగించబడేవి. ఈ దశకు వచ్చేసరికి బుద్ధి నీటి శక్తిని మచ్చిక చేసుకోకలిగింది. నదీప్రవాహం గుర్రంకంటె యెంతో బలంగలది. జలచక్రంనుంచి దొన్నెలు తొలగించి, బల్లలు మాత్రమే ఉంచేరు. చక్రమూ, దానితోబాటు యిరుసూ తిరిగేవి. ఆ యిరుసు ఒక పండ్లచక్రాన్ని, అది మరో చక్రాన్ని, యిరుసునీ, దానిమీద అమర్చిన రాతిదిమ్మలనూ త్రిప్పేది. నీటిచే తిరిగే పిండిమర, అంటే తిరుగలికే కొత్తపేరు లెండి, కనిపెట్టేసరికి మానవునికి యెంతో విశ్రాంతి లభించింది. అదొక ఆటవిడుపు, పండుగ! తిరుగలియంత్రం తమకు బోలెడు పిండిని విసిరిపెడుతూం దని వారు సంతోషించేరు. కాని, తాము అద్భుతయంత్ర మొకదాన్ని కనిపెట్టేమని వాళ్లు అనుకోనేలేదు! పిండి విసరడమే గాక లోహపుచిట్టెములు నలుగగొట్టడం, రాక్షసికోలుములకు తిత్తుల నూదడం మొదలైన పనులెన్నో యీలాంటి యంత్రాలచేత చేయించడాన్ని బుద్ధి నేర్చింది. తరువాతి క్లిష్టయంత్రాల కిదే మూలకందం. యంత్రాలు మానవులకోసం పనిచేస్తాయి. అవి అతని పంటలకి నీటినిస్తాయి, ధాన్యం పిండిచేస్తాయి, లోహాలు కరిగించి పెడతాయి, ప్రయాణం చేయిస్తాయి. క్రమంగా కట్టుకొనే వస్త్రాలను నేసి యిచ్చి, ఆకాశయానం కూడా చేయిస్తున్నాయి, నేడు.

## మేధావుల మార్గం

అలగ్జాండ్రియాలోని మ్యూజియమ్‌లో,— దీనినే సరస్వతీ నిలయం, విజ్ఞానమందిరం అనవచ్చు,—పరిశోధనలమీద ఆధార పడిన శాస్త్ర మొకటి బైలుదేరింది. వేలకొలది లోహ కారులు, కమ్మరులు, కుంభకారులు, గాజు పనివాళ్లు లేనిచో యిది సాధ్యమయేదే కాదు.

పరిశోధనలపై నాధారపడిన విజ్ఞానశాస్త్రం మొట్టమొదట అలగ్జాండ్రియాలోనే బైలుదేరడానికి కారణమేమిటి? అంతకు పూర్వం ఏథెన్సులోనే యెందుకు బైలుదేరలేదు? క్రీస్తు పూర్వం 300 యేండ్లక్రితం గాకపోతే మరో ముహూర్తం దానికి దొరకలేదా?

పోనీ, యిట్లు జరగడం యాదృచ్ఛికమందామా? కాదు.

మ్యూజియం క్రీ. పూ. 3వ శతాబ్దంలో బైలుదేరడానికి కారణం, అంతకు నూరేండ్ల ముందు లైసియమ్ స్థాపించబడడమే! అంతకుముందు ప్లేటో అకాడమీయే గనుక స్థాపించ బడనిచో అరిస్టాటిల్ లైసియమ్ స్థాపించబడేదేగాదు!

ఏథెన్సులోగాకుండా అలగ్జాండ్రియాలోనే మ్యూజియమ్ స్థాపించబడడమూ యాదృచ్ఛికంకాదు. ఏథెన్సులో పనులన్నీ బానిసలే చేసేవాళ్ళు. స్వతంత్రపౌరులైన యజమానులు సోమరులుగా ఉండేవాళ్ళు. పనంటే బానిసలదే అనే భావం వ్యాపించి ఉండేది. అలగ్జాండ్రియాలో అట్లుగాదు. అక్కడ

స్వతంత్రులే కర్మశాలలు స్థాపించి, తామూ, తమ కుటుంబీకులూ, కూలీలూ వాటిలో పనులు చేస్తూండేవాళ్ళు. తమ నగరంలో సోమరులు లేరనేదే అలగ్జాండ్రియాకు గర్వకారణంగా ఉండేది. కుంటి, గుడ్డి, మొండి, అవిటివాళ్లు కూడా వాళ్ళకి తగిన పనులను చేస్తూండేవాళ్ళు. అటువంటిచోట పండితులూ, శాస్త్రవేత్తలూ సూత్రం వట్టి మాటలప్రోగులుగానూ, సోమరులుగానూ ఉండేవారు గాదంటే ఆశ్చర్యమేముంది ?

మ్యూజియం అంటే అసలు అర్థం కళల దేవాలయం, కళాలయం అనిగదా. ఆలయమని పిలువబడుతూన్నా అది ఒక కర్మాగారాన్ని పోలే ఉండేది. అంతేగాదు. అది ఒక్క కర్మాగారమే గాక అనేక కర్మాగారాల ప్రోవులా ఉండేది! నగరంలోని విజ్ఞానశాస్త్ర నిలయం యిదే నన్నట్లుండేది. ఒకప్రక్క భౌతిక శాస్త్రజ్ఞులు, మరోవైపు ఖగోళ వేధకులు, యింకోప్రక్క యంత్రవిద్యా నిపుణులు, వారిప్రక్క గణితశాస్త్ర పండితులు,— యీ విధంగా ఆ ప్రదేశమంతా క్రిక్కిరిసి, సందడిగా ఉంటూండేది. మళ్ళా ఒక్కొక్క శాఖలో యెన్నెన్నో ఉపశాఖలు కూడా తయారైనాయి.

ఒక్కొక్క విజ్ఞానశాఖకు ఒక్కొక్క అధ్యక్షుడుండేవాడు. క్షేత్రమితి గణిత శాఖలో ఒక పండితుడే యూక్లిడ్; యంత్ర విజ్ఞానశాఖలో పండితుడు ఆర్కిమెడీస్. *

---

* ఈ నాటికీ వీరి గ్రంథాలనే మనపాఠశాలల్లో చదువుకుంటున్నాము. తరువాత దండయాత్రలు సాగించిన రోమనులు, మహమ్మదీయ మహమ్మద

రాకుమారులు, ప్రభువంశీకులు కూడ మ్యూజియంలో చదువుకోడానికి వెళ్ళేవారు. క్లాదియస్ టాలెమస్ రాకుమారుడు ఒకనాడు యూక్లిడ్ పండితుని ప్రశ్నించేడు: "గణిత శాస్త్ర విజ్ఞానం సంపాదించడానికి సులభమార్గం ఏదేనా ఉంటే చెప్పండి, గురువుగారూ!" యూక్లిడ్ అన్నారట: "గణితశాస్త్రానికి రాజమార్గం యేదీ లేదోయ్, నాయనా!"

లైసియమ్‌లోని ముఖమండపముల క్రింద అరిస్టాటిల్ పండితుడు శిష్యబృందాన్ని విజ్ఞానమార్గంలో చాలదూరం నడిపించుకొని వెళ్ళేడు.

మ్యూజియంలోని విద్యార్థులు మనీషులమార్గంలో యింకా ముందుకు బోయేరు. బోధన, సాధన వారిని ఉన్నతోన్నత శిఖరాలకు గొంపోయినాయి. భూమినంతనూ ప్రదక్షిణంచేసి, గ్రహతారకాదులకు వంతెనలు వేసి, నక్షత్రలోకాలకి నడిచిపోయారు, వాళ్లు!

పర్వతశిఖరాలే ఆకాశంలో కంటా వ్యాపించివున్నాయని జనులు అనుకొనే కాలం ఒకటి ఉండేది. ఒలింపస్ పర్వతశిఖరాలు మేఘమండలాన్ని దాటిపోయి వుండేవి. గ్రీకులు వాటిని చూచే, వాటిమీద దేవతలు నివసిస్తారనీ, కకేషియా పర్వతాల్లో ఒక శిఖరానికే ప్రొమిథ్యూస్‌ను శిక్షార్థమై బంధించి ఉంచేరనీ, భూమిమీద సూర్యాస్తమయం ఐనతరువాత

---

మూకలు అలగ్జాండ్రియా గ్రంథాలయాల నెన్నోసార్లు తగులబెట్టారు. ఎన్నెన్నో అమూల్యగ్రంథాలు పరశురామప్రీతి ఐనాయి. — అనువాదకుడు.

నాలుగు గంటలవరకూ కూడ అక్కడ వెలుతురు ఉండేటంత యెత్తుగా ఆ శిఖరం ఉంటుందనీ జను లనుకొనేవారు !

పర్వతశిఖరాల యెత్తు నెవరు కొలవగలరు ? హిమాచ్ఛాదితపర్వతశిఖరాలను చేతు లెత్తి చేరుకోగలట్టి మహాకాయుడెవడైన వున్నాడా ?...ఆఁ ? అట్టివా డొకడు బైలుదేరనే బైలుదేరాడు.

అలగ్జాండ్రియావాసి, ఇరాతోస్థనీస్ శాస్త్రజ్ఞుడు త్రిభుజాలు గీచి, కోణాలు కొలచి, అంకెలతో నింపుతూండేవాడు, పాపిరస్ పత్రాలను. ఆయన పర్వతాలు యెక్కనేలేదు. క్రింద సమతలంమీద ఉండే పర్వతశిఖరాలను కొలిచేవాడు. ఆ విధానం ఇరాతోస్థనీస్ పండితునికి కొట్టినపిండి. ఈ మార్గమును తొలుదొల్త నారంభించినవాడు అరిస్టాటిల్ శిష్యుడైన డిషియార్కస్ పండితుడు. ఆ విధానా న్నభివృద్ధిపరచి, ముందుకు గొంపోయినవాడు ఇరాతోస్థనీస్. గణనగావించి, చివరకు పర్వతాలు జను లనుకొనేటంత యెత్తైనవిగావని యీతడు తేల్చేడు. చెట్టుమీద బెరడులాగ భూతలంమీద యేదో కొంచెం మిట్టలు మాత్రమే అవి !

భూతలవైశాల్యం మాట యేమిటి ? దానిని చుట్టి వచ్చి చెప్పినవా రెవరూ లేరు. కలలోకూడ యిది సాధ్యమని యెవరూ అనుకొనేవారుగాదు. జలస్థలమార్గాల మీద యీ అసాధ్య సుదీర్ఘయాత్రను గావించకయే శాస్త్రజ్ఞులు యీ భోగట్టా నంతనీ చెప్పగలిగేరు. అలగ్జాండ్రియానుంచి శ్యేనీవరకు

ప్రయాణించినచో చాలును, భూగోళపువివరాలన్నీ గ్రహించ గలిగేందుకు. స్యేనీదగ్గర సూర్యుడు నట్టనడిమింట నున్నపుడు అలగ్జాండ్రియాలో వృత్తంలో యాబదవవంతు ఓరగా వుంటాడు. భూగోళంచుట్టూ సూర్యుడు తిరిగిరావడానికి పూర్తి వృత్తం ఐతే స్యేనీనుంచి అలగ్జాండ్రియాకు వృత్తంలో యాభయ్యోవంతన్నమాట. స్యేనీనుంచి అలగ్జాండ్రియాకు దూరం భూమండలపు చుట్టుకొలతలో యాభయ్యోవంతు అని తేలింది. ఆ రెండుచోట్లకూ మధ్యదూరం 5,000 స్టాడియాలు లేక 485 మైళ్ళు. అంటే భూగోళపు పరిధి 5,000 × 50=2,50,000 స్టాడియాలు లేక 485 × 50=24,250 మైళ్ళు.

ఈ విధంగా తాను కంటితో చూడనివాటిని కూడ బుద్ధితో ఊహించి తెలుసుకోవడం మానవుడు నేర్చుకున్నాడు. భూమిని కొలిచేందుకు సూర్యుని చూడవలసివచ్చింది. రెండున్నర లక్షల స్టాడియాలు! అంతదూరాన్ని ఇదివరకెవ్వరూ ఊహించనైనాలేదు! దీనిలో నాలుగోవంతు మేర మాత్రమే మానవనివాసంగా ఉందని భూగోళశాస్త్రజ్ఞులు అన్నారు. హెర్క్యులస్ స్తంభాలదగ్గరనుంచి ఇటలీ, ఇటలీనుంచి గ్రీసు, గ్రీసునుంచి గంగాతీరములు,—యీ ప్రాంతంలో మానవులు నివసిస్తూన్నారని వారన్నారు.

ఐతే, ఆ తర్వాత యేమున్నది? ఆ ప్రదేశంలో మానవులు లేక యెవరున్నారు?

హిందూదేశం వరకూ సాగరమే వుందని కొందరన్నారు. ఆ సువిశాల సాగరమధ్యంలో, మానవమాత్రులు అడుగిడని

చోట, 'సుఖద్వీపం' ఒకటున్నదనీ, అక్కడివాళ్ళు యింకా 'స్వర్ణయుగం' లోనే వున్నారనీ మరికొందరు అన్నారు!

సువిశాలమైన భూభాగాలమీదనుంచి, విశాల సాగరజలం మీదనుంచి, అంబరచుంబిపర్వతశిఖరాలమీదినుంచి పోయి పోయి, మానవుని యాత్ర ఆకాశపథంలోని సూర్య చంద్రుల దగ్గరకు బోయింది.

ఈ సుదీర్ఘ యాత్రను పూర్తిగావించి, చంద్రు డెంత దూరమో, సూర్యు డెంత దవ్వో, యెవ రెంతటివారో చెప్ప గల మహాజను డెవ్వడు? ఏమో!

విజ్ఞానులు యీ దారినికూడ బైలుదేరారు. ఖగోళవేధ శాలనుంచి విజ్ఞాన క్షేత్రయాత్రలు సాగినాయి. వారి కంతగా సాధనాలు లేవు గాని దృఢసంకల్పం, గొప్ప మేధస్సు, అపార పాండిత్యం వున్నాయి. ఆకాశాన్ని దిగంతాలవరకూ కొలిచే టందుకు యేతన్మాత్ర సహాయులై యీ వైజ్ఞానిక వీరులు బైలుదేరారు. ఒక జ్యోతిర్వేత్త నక్షత్రశాలలో కూర్చుండి, ఒక చక్రపరికరమును మెల్లగా త్రిప్పుతూ, దానిమీది విభాగపు గుర్తులు చూస్తూ, పాపిరస్ కాగితంమీద అంకెలు వేస్తూ న్నాడు. ఆయన యెవరో తెలుసా?...ఆయనే అరిస్టార్కస్, సామోస్ నివాసి. అరిస్టాటిల్ శిష్యపరంపరలోని వాడీయన; ఆతని తరువాత నూరేండ్లకు యీతడుండేవాడు. నక్షత్ర పరిశీలనా విద్యను అరిస్టాటిల్ నుంచి థియోఫ్రాస్టస్, అతని నుంచి స్ట్రాటోన్, ఆతని నుంచి అరిస్టార్కస్ నేర్చుకున్నారు.

శాస్త్రవిద్యలు నిజానికి యెన్నడూ, యెక్కడా కుటుంబశాస్త్రిగా, తండ్రినుంచి కుమారునికి సంక్రమించి యుండలేదు. గురువునుంచి శిష్యునికే సంక్రమిస్తూవచ్చాయి, విద్యలు. ఆ శిష్యుడు యెంతో మేధావి అవడమే గాక బహు శ్రద్ధాభక్తులూ, స్వయంప్రతిభా, వ్యుత్పత్తీ గలవాడుగా వుంటేనే అవి ఆతనికి అబ్బేవి. తీవ్రకృషీ కావాలి, శాస్త్రవిద్యలు వంటబట్టించుకోవా లంటే. అనేక సందర్భాల్లో శిష్యులు గురువుగారికి వ్యతిరేకంగానూ పోవాల్సివచ్చేది. ప్లేటో వద్ద శిష్యుడుగా వున్నా అరిస్టాటిల్ అనేకవిషయాలమీద ఆయనతో వాదించేవాడు. అరిస్టాటిల్‌తో స్ట్రాతోన్ యెన్నో సిద్ధాంతాలమీద, డెమాక్రిటస్‌ను గురించిన అంచనాల్లోనూ భేదించేవాడు. స్ట్రాతోన్ శిష్యుడు అరిస్టార్కస్; గురువు కంటె డెమాక్రిటస్‌కు యితడు సన్నిహితుడు. డెమాక్రిటస్ వలెనే అరిస్టార్కస్ కూడా భూమి ఒక్కటే లోకం గాదనీ, అనంత విశ్వంలో మన భూమి ఒక రేణువు మాత్రమే ననీ, లోకములసంఖ్యాకములనీ చెప్పాడు. *

రాత్రి తరువాత రాత్రి, పగలు తరువాత పగలూ అరిస్టార్కస్ ఆకాశగోళాల్లో పర్యటిస్తూనే వున్నాడు. ఇప్పుడాతడు ఖగోళాలనుంచి తన దృష్టిని అంకెలమీదికి మళ్ళించేడు.

---

* సంఖ్యాపేత్ రజసామస్తి
విశ్వానాం నకదాచన ।
అను ప్రాచీన భారతీయ ఋషిమతం దీనిని పోలినదే. — అనువాదకుడు.

చంద్రు డెంత దూరంలో వున్నాడో కొలిచేడు. సూర్యు డెంత దూరమో తెలుసుకొన్నాడు. చంద్రునికంటె సూర్యు డెంత దూరాన వున్నాడో కనుగొన్నాడు. కాని, ఆయన లెక్కలు సరియైనవి గావు. చంద్రుని దూరాన్ని గూర్చి ఆయన దాదాపు సరిగానే తెలుసుకున్నాడు. సూర్యుడు మాత్రం అసలు వున్నదానికంటె చాల సమీపంలోనే వున్నాడని ఆయన భావించేడు. చంద్రుడు వున్నదాని కంటె చాల పెద్దవాడనీ, సూర్యుడు వున్నదానికంటె చాల చిన్నవాడనీ ఆయన పొరబడ్డాడు.

ఉన్న మోటుపరికరాలతో లెక్కలు తీసిన అరిస్టార్కసు యింతకంటె సరియగు అంచనాలకు రావడం చాల కష్టం. ఇంతవరకూ ఆకాశాన్ని అసలు కొలిచినవాడే లేడాయె!

ఆకాశమే అరిస్టార్కస్‌కి ఆటస్థలంగా ఉండేది. ఆయనకది పరస్థలం కానేకాదు. దాని నాయన కొలిచి, దాని నిర్మాణమును గూర్చి, ప్లానునుగూర్చి అంచనాలు వేసేడు. ఈ విశ్వానికి కేంద్రం మన భూమిగాక సూర్యుడేనని ఆయన కంతకంతకు విశ్వాస మధికమవుతూవచ్చింది. రాలిన ఆకుల్లాగ సూర్యుని చుట్టూ యితర గోళాలు పరిభ్రమిస్తున్నాయి. అట్టి అసంఖ్యాకగోళాల్లో యీ భూమికూడ ఒకటి.

ఈ నిర్ణయ మాతని గణితాన్ని చాలవరకు సుగమ మొనర్చింది. జనులంతా యీ విషయాన్ని విశ్వసించడానికి చాల కాలం పడుతుందని కూడ ఆయన గ్రహించేడు. మన భూమే

విశ్వకేంద్రంగా భావించేందుకు జనులు చిరకాలంగా అల వాటు పడ్డారు. ఇట్టి విశ్వాసాన్ని ఒక్కసారి మార్చుకోవా లంటే సాధ్యమా?

అరిస్టార్కస్ క్రొత్త సిద్ధాంతాన్ని వినేందుకు చివరకు జ్యోతిశ్శాస్త్రజ్ఞులుకూడ సిద్ధం కాలేదు. అదే నిజమైతే నక్ష త్రాదులు మన దృష్టినుంచి మరుగైపోవా? పడవ సముద్రం లోకి పోతున్నకొద్దీ తీరానవున్న పర్వతాదులు క్రమంగా కను మరుగై పోవడం చూడడంలేదూ? కాని, యీ శంకకు అరిస్టా ర్కస్ సమాధానం ఆలోచించే వుంచేడు. నక్షత్రాలు అత్య ధిక దూరాన ఉండడంవలన అవి కనుమరుగు కావడంలేదనీ, చెట్టునుంచి కొంచెం దూరంపోతే అదెట్లా కనుమరుగైపోదో అల్లాగేననీ ఆయన అన్నాడు.

ప్రాచీన ప్రపంచానికి కోపర్నికస్ అనదగిన అరిస్టార్కస్, తన కాలానికి ముందు జనించిన మహామేధావి. అనక్షగోరస్, సోక్రటీస్, అరిస్టాటిల్ మొదలైన వారిని వలెనే యీయనను కూడ జనులు నాస్తికుడని తెగడువారు. పదులూ, వందలూ యేండ్లు గడచినా అరిస్టార్కస్ బోధనలను చెవిని బెట్టేందుకే జనులు నిరాకరించేరు.

శతాబ్దాలు గడచినాయి. క్రీస్తుతరువాత రెండో శతాబ్దం. క్లాడియస్ టాలెమస్ ఒక మహా గ్రంథాన్ని వ్రాసేడు. భూమ్యాకాశాలను గురించీ, వాటిలోని సమస్తాన్ని గురించీ వ్రాయబడిన విజ్ఞానసర్వస్వ మది. ముప్పది సంపుటములు గల

బృహద్గ్రంథమది! గ్రంథప్రారంభంలో ప్రపంచపట మొకదాన్ని పొందుపరచేడు. రైన్‌నదీ ప్రాంతాలనుంచి గంగాతీర భూములూ, ఆ తరువాత చీనాదేశం వరకూ గల విశాల ప్రదేశాలూ ఆ పటంలో చిత్రించబడి వున్నాయి. ఆ గ్రంథంలో నక్షత్రాల జాబితాయున్నూ, ఒక్కొక్కదాని చిరునామాయున్నూ నిర్దిష్టంగా యిచ్చాడు. విశ్వరూపాన్ని తెలిపే కొత్తపటమునూ ఒకదాన్ని తయారు గావించేడు. ఈ విశ్వపటములో భూమియొక్క స్థానం యెక్కడ? అని టాలెమీ చాలకాలం ఆలోచించేడు.

అరిస్టార్కస్ పండితుడు చనిపోయి అప్పటికి కొన్ని శతాబ్దాలే గడచినాయి. కాని ఆయనను వదలిపెట్టదలచుకోలేదు, టాలెమీ. ఆయనతో వాదానికి సంసిద్ధమవుతూన్నాడు. అరిస్టార్కస్ సిద్ధాంతాలకి వ్యతిరేకంగా అనేక సాక్ష్యాధారాలను ప్రోగుచేయ నారంభించాడు, టాలెమీ. ఈ మన భూగోళమే గనక కదలుతూ, ప్రయాణం చేస్తూంటే, మేఘాలన్నీ ఒకవైపుకి చేరిపోతాయి. ఒక రాతిని పైకెగరేస్తే, అది సరిగా ఆ చోటనే క్రిందపడదు. ఎందుకంటే రాయి గాలిలో వున్నపుడు కూడా భూమి ప్రయాణం చేస్తూనేవుందికదా... భూమితోబాటు దానిమీంది సమస్తమూ కదులుతూన్నాయని టాలెమీ యెరుగడు. ఏ వస్తువున్నూ భూమినుంచి దూరంగానూ పోలేదు, వదలిపెట్టీ వెళ్ళలేదు. కాని, యీ విషయం ఆయనకి తెలియదు. టాలెమీ యింకా అనేక నిర్ణయాలకు

వచ్చి, ఆఖరికి యీ భూమి నిశ్చలంగా వుంటూందనే సిద్ధాం తీకరించేడు. టాలెమస్‌కు అరిస్టాటిల్ యేమి అడ్డు చెప్పగలడు, పాపం? మృతులు యింకెవరితోనూ వాగ్వాదాలు గావించ లేరు గదా! కాని, ఈ విషయం యింతటితో పోలేదు. నక్ష త్రాలే టాలెమస్‌కు యెదురు జవాబు చెప్పినాయి.

ఆ నక్షత్రశాలలోనే మరికొందరు జ్యోతిశ్శాస్త్రజ్ఞులున్నా బహు ఓరిమితో గ్రహాగమనములను, నక్షత్రచలనమును పరి శీలిస్తూండేవాళ్లున్నారు. గ్రహ తారకాదులు ఒకసారి ముం దుకూ, మరొకతూరి వెనుకకూ యెట్లు నడుస్తూన్నాయో వారూ చూసేవాళ్లు. అరిస్టార్కస్ సిద్ధాంతాల్లో నమ్మకం వుంటే యీ నక్షత్రగతి ఆశ్చర్యకరంగా కనబడకపోవచ్చుగాని టాలెమస్ చెప్పినట్లు భూమి అచలమనియే విశ్వసించితే యీ నక్షత్ర గమనములను నిర్వచించడం అసంభవ మైపోతుంది. ఐతే నేమి? టాలెమస్ తన సిద్ధాంతాన్నే గట్టిగా పట్టుకుని కూర్చున్నాడు! అతడు నక్షత్రాలతోటే వాదానికి దిగాడు. తన సిద్ధాంతాన్ని సమర్థించుకోడానికై ఆకాశపటమునే ఆయన తారుమారుచేసేడు. ఉన్నది ఉన్నట్లుగాక తన బుర్రలోని భావాల కనుగుణ్యమైన పటాన్ని తయారు చేయించాడు. ఆ పటంలోని చంద్రుడు భూమిచుట్టూ గాకండా మరొక కుహనా కేంద్రకం చుట్టూ తిరుగుతూన్నట్లు చిత్రించేడు. ఇతర గ్రహాలకున్నా ఆయన భావానుగుణ్యంగా అతి విచిత్రమైన గతు లేర్పడినాయి!

ఈ విధంగానే చరిత్రలో యెన్నో సార్లు జరిగింది. అలవాటుగా చూస్తూన్న వాట్లను విశ్వసించడం మన కెంతో సులభము. ఈ సౌలభ్యంకోసం మనమెన్నో భ్రమాత్మక వివరణలను కల్పించుకొని, సంశ్లిష్టమైన చిక్కుదారిని నడవడానికి కూడా సంశయించం. పాతకాలపు విశ్వాసాలకు, ఆచారాలకు, నమ్మకాలకు అంటిపెట్టుకుని, వస్తువిషయాదులను యీ దృక్కోణంనుంచే చూడడానికి మనం యెన్నో అభూత కల్పనలను యిష్టంతోనే చేసుకుంటూంటాము.

కానిండు, ప్రస్తుత కథకు వద్దాం. క్రీస్తుపూర్వం 3 వ శతాబ్దిలోని అరిస్టార్కస్ వద్దకు పోదాం, నడవండి.

భూమినుంచి నక్షత్రాలు యెంతెంతదూరాల్లో వున్నాయి? ఈ విశ్వాంతరాళాన్ని కొలిచేందుకు మార్గమేదైన వుందా? అని అరిస్టార్కస్ విస్మితుడవుతూండేవాడు.

ఈ విషయాన్ని గురించే ఆర్కిమెడీస్ పండితుడు కూడా అన్వేషణ నారంభించేడు. అలెగ్జాండ్రియాలోని మ్యూజియంలో తయారైన మరొక పండితు డీయన. ఆర్కిమెడీస్ విజ్ఞాని సిరాక్యూజ్ నగరంలో నివసించేవాడు. సిసిలీ ద్వీపంలోని దీ నగరం. విశ్వపరిమాణమును గురించి వ్రాసిన గ్రంథాన్ని యీతడు తన దేశపు రాజుకి అంకితమిచ్చేడు. ఈ విశ్వం ఎన్ని అడుగులుందో కొలవాలని యీ విజ్ఞాని కోరిక. ఈతడిట్లా వ్రాశాడు :—

"ఓ రాజా ! యిసుక రేణువు లసంఖ్యాకములని భావించు జనులీ లోకంలో వున్నారు. సిరాక్యూజ్ నగరంలో నేగాదు, సిసిలీద్వీపం అంతట్లోనూ వున్న యిసుకను గురించే నేను చెప్పునది; అంతేగాదు, మానవుడు అడుగిడిన, అడుగిడని యావత్ప్రపంచమందలి యిసుక రేణువులను గురించియు నేను చెపుతూన్నాను."

అని ప్రారంభించి, యీ భూమండలమంతనూ కప్పేటందు కెన్ని రేణువులు కావాలో, అసలు యీ భూమిని నిర్మించే టందు కెన్ని రేణువులు పట్టివుంటవో ఆయన లెక్కలు తీసేడు. నక్షత్ర విరాజితమైన దిగ్మండలమే విశ్వమున కెల్ల యని ఆయనకూడా భావించేవాడు. ఆర్కిమెడీస్ లెక్కలవల్ల తేలిం దేమంటే – ఒకటి తరువాత అరవైమూడు సున్నలు చుడితే వచ్చే సంఖ్య యన్ని రేణువు లున్నవని ! ఇది పెద్దసంఖ్యయే కావచ్చునుగాని 'అనంతం' తో పోలిస్తే, యిదొక లెక్కగాదు !

మానవులు ఆకాశపు టగాథాల్లోకి చొచ్చుకుపో గలిగే రోజూ వస్తుంది లెండి. అన్నిటికంటె వేగవంతమైన కాంతి కిరణాలకంటె వేగంగా, వాటికే కోట్ల సంవత్సరాలు పట్టే అంతరాంతరాళాలకు మానవుడు చొచ్చుకుని పోతాడు. అంత దూరంపోయినా యింకా 'అనంతదూరం' మానవుని ముందు ఉండనే ఉంటుంది !

కాని, ఆర్కిమెడీస్ కూడ అప్పటికి అనంతమైన విశ్వ రూపాన్ని ఊహించలేక పోయాడు. భూగోళ మానంలో

మానవు డుపయోగించే సాధనాలనే ఖగోళంలో ఉపయోగించే రాయన. ఐననూ మనకూ నక్షత్రాలకూ మధ్య యెంత బ్రహ్మాండమైన దూరం ఉందో ఆయన గ్రహించేరు.

ఒకప్రక్క యిసుక రేణువు, రెండోప్రక్క మహాపర్వతం. ఇంతే మానవుని ప్రపంచం. అప్పుడు మానవులు చిన్న, యిరుకైన లోకంలో బ్రతికేవారు. ఐనా, ఆకాశపు టంచులు ఒక కోటి స్టేడియాలు ఆవలగా వున్నట్లు అంచనా వేయబడింది. యావత్ప్రపంచమూ పరమాణువులచేత నిర్మించబడిందనిన్నీ కనుగొనబడింది !

డెమాక్రిటస్ బోధనలతో ఆర్కిమెడీస్‌కు పరిచయముండింది. లోకం అంతా పరమాణు వినిర్మితమై ఉందనేదే ఆ బోధన. ఈ పరమాణువులను శాసించే సూత్రాలను కనిపెట్టడాని కాతడు సూక్ష్మాణు ప్రపంచంలోకి జొరబడి చూచేడు. ఈ లోకంలోనికి బోయేద్వారం తెరవడం చాలకష్టం. ఎంత పెద్ద సమ్మెటతోనూ పర్వతాన్ని యిల్లాంటి పరమాణువులుగా నలుగగొట్టలేము. కాని, నీటిని విభజించడం సులభం. ఆర్కిమెడీస్ జలలోకాన్ని పరిశీలించ నారంభించేడు. ఈ లోకానికి దాని నియమాలున్నాయని త్వరలో ఆతనికి తెలిసింది. దాని కాతడంత కష్టపడనక్కర లేకపోయింది. చేయి నీటి గంగాళం లోనికి దించితే, యేదో తన చేతిని పైకి గెంటుతున్నట్లు తోచింది. జలంలో వస్తువుల భారములు తగ్గుతవనే విషయా న్నాతడు కనిపెట్టేడు.

నీటిలో ప్రతి వస్తువూ తన బరువులో కొంతభాగాన్ని కోల్పోతూంది. కొన్ని వస్తువులు నీటి అడుగుకు మునిగిపోవడానికి మారు పైకి తేలుతాయి. మరోకొన్ని నీటిలో కొంత దూరం మునిగి, మధ్యంతరంగా వ్రేలాడదీసినట్లుండిపోతాయి. ప్రతీవస్తువూ సూక్ష్మకణాలతో నిర్మితమైవుం దనేది ఆర్కిమెడీస్ యెరిగియుండకపోతే నీటిలో వస్తువులు బరువు కోల్పోవడం యెందుకో, యెట్లో ఆతడు తెలుకోలేకనేపోను.

నీళ్లు దేనిలోపోస్తే ఆ పాత్రరూపాన్నే తీసుకొంటున్నాయి. ఎందుచేత? దీన్ని తెలుసుకోడాని కాతడు చాల ప్రయాసపడ్డాడు. నీరుకూడ అతి సూక్ష్మకణములచే నిర్మించబడింది. వ్యక్తులతో గూడినదే, ఒక పెద్ద జనసందోహం. ఒక గుంపు చౌకులో స్థలం ఆక్రమించుకుని నిండివుంటారు. గిన్నెలోని నీరు తన రూపాన్ని గిన్నెరూపానికి సరిపెట్టుకున్నట్టే చౌకులో జనం కూడా దానిలో సర్దుకుంటారు. ఇదీ ఆయన తర్కము.

కొయ్యముక్కను నీటిలో వేసి, అది యెందుకు తేలుతూంది? అని ఆలోచించేడు. రాయి ఎందుకు మునుగుతూంది. నీరు కణనిర్మితం. గాన పై కణాలు క్రిందివానిమీద ఒత్తిడి చేస్తూంటాయి. కొయ్య నీటికంటె తేలికైనది గనక, నీరు తనమీద తాను గావించుకొనే ఒత్తిడికంటె కొయ్యముక్క గావించే ఒత్తిడి తక్కువగా ఉంటుంది. అధిక ఒత్తిడి క్రిందనున్న కణములు, తక్కువ ఒత్తిడి క్రిందనున్న కణములను గెంటుతాయి. అందుచేత కొయ్యను త్రోస్తూన్న జలకణాలు దాన్ని నీటిపైకి గెంటుతున్నాయి.

ఘనపదార్థమైన కొయ్య తనతో సమానభారంగల నీటిని పైకి గెంటినప్పుడు 'సమ తుల' తిరిగి స్థాపించబడుతూంది.

నీటిలో కొన్ని వస్తువు లెందువల్ల తేలుతున్నాయోనని పరిశీలించి ఆర్కి-మెడీసు వచ్చిన యీ నిర్ణయమే నేడు కూడ 'ఆర్కి-మెడీస్ సూత్రం' అని పిలువబడుతూంది. ఈ రోజున ప్రతి పిల్లవానికీ, విద్యార్థికీ యీ సూత్రం బాగా తెలిసేవుంది.

గణితశాస్త్రం, యంత్రశాస్త్రం మొదలగువాటిలో అతి క్లిష్టమైన సమస్యల్ని కూడా యీయన పరిష్కరించేడు. డెమాక్రిటస్ యీ సమస్యలలో చాలవాటిని అదివరకే పూర్తి చేసి వున్నాడని ఆర్కి-మెడీస్‌కు ఆ పిమ్మట తెలిసింది. ఆర్కి-మెడీస్ అలగ్జాండ్రియాలో నివసిస్తూండగా డెమాక్రిటస్ పేరు విననేలేదు! ఆ ప్రాచీనతత్త్వవేత్త నాస్తికుడనే ప్రథ వుండడం వల్ల మ్యూజియంలోని శాస్త్రజ్ఞులు తమ చర్చల్లో యీయన వాదనలను, సిద్ధాంతాలను ప్రమాణాలుగా ఉటంకించడానికి అభ్యంతరాలుండేవి. డెమాక్రిటస్‌ను ప్రమాణంగా చూపడానికి తెలిసినవాళ్ళు కూడ జంకేవాళ్ళు. సిరాక్యూజ్‌కు వెళ్ళిన తరువాతనే ఆర్కి-మెడీస్, డెమాక్రిటస్ గ్రంథాలను చదువ నారంభించేడు. వాట్లలో ఆయనకు కావలసిన ప్రధానాంశములు లభించినప్పుడాయన పెన్నిధిని కనుగొన్నవానివలె బ్రహ్మానందముపొందేడు. "అవిభాజ్యాణువులు" అనే డెమాక్రిటస్ సిద్ధాంతం ఆర్కి-మెడీస్‌కి కీలకంవలె లభించింది.

మిత్రుడైన ఇరాతోస్థనీస్‌కు ఆర్కి—మెడీస్ జాబు వ్రాస్తూ యీ విషయాన్ని దానిలో ఉల్లేఖించేడు. ఇరాతోస్థనీస్ రాజోద్యోగీ, రాజపోషణను ప్రాణప్రదంగా చూచుకొనేవాడూను. నాస్తిక డెమాక్రిటస్ కీతడు శత్రువు. ఇరాతోస్థనీస్ జ్యోతిర్విద్యావేత్తా, తత్త్వవేత్తా మాత్రమే గాక రాజోద్యోగి కూడానని ఆర్కి—మెడీస్‌కు తెలియును. కాని డెమాక్రిటస్ పద్ధతుల నుపయోగించుటవల్ల తానెంతో పురోగమించగలిగానని ఇరాతోస్థనీస్ పండితునికి తెలుపుట విధిగా భావించేడాయన.

“నీవుకూడా ఒక ప్రధాన విజ్ఞానవేత్తవూ, ప్రముఖ తత్త్వవేత్తవూ గదా. అందువల్ల నూతన ఉపపాదనలు, న్యాయ ప్రశ్నములలో పరిష్కారమునకు తోడ్పడగలట్టివీన్నీ, ప్రయోజనకరమైనట్టివీన్నీ ప్రత్యేకపద్ధతులను విపులీకరించాలని నా కోరిక. అవే నేను ప్రతిపాదిస్తున్నాను. ఇవన్నీ యితఃపూర్వమే డెమాక్రిటస్ పండితునిచే పరిష్కృతములేనని యీ సందర్భంలో నేను చెప్పక తప్పదు. దీనినంతినూ గ్రంథస్థంగావించాలని నేను నిశ్చయించాను. ఇల్లా చేస్తేనే గణితశాస్త్రానికి నేను నిజమైన సేవ చేసినవాడ నవుతాను. నా సమకాలీనులు చాలమందిన్నీ, తరువాతి తరాలవారున్నూ కూడ యీ పద్ధతితో, విధానంతో పరిచయం గావించుకున్నట్లయితే నాకు కూడా యింతవరకూ సాధ్యంగాని అనేక కొత్త సూత్రాలను స్థాపించగలుగుతారు.”

ఈ జాబును మ్యూజియంలోని పండితులంతా చదువుతా రని ఆర్కిమెడీస్‌కు తెలియును. అంతమందికీ వ్యతిరేకంగా తానొక్కడేమైనా నిలువబడుట కాతడు వెనుదీయలేదు. విజ్ఞానాన్ని ముందుకు గొంపోవడంలో ఆతడు వారినేగాదు, మరింతమందినైనా యెదిరించాల్సిందేనని నిశ్చయించుకున్నాడు. తన జీవితమంతా ఆర్కిమెడీసు యీ రీతిగానే ప్రవర్తించేడు. అలగ్జాండ్రియా పండితులూ, మేధావులూ అందరూ నిరాక రించిన ఒక సిద్ధాంతాన్ని ఆర్కిమెడీస్ తన గణనములకు ప్రాతిపదికగా తీసికొని, ఒక మహాత్కార్యాన్ని సాధించేడు!

అప్పుడీయన యిల్లా వ్రాసేడు: "సామోస్‌నివాసి అరిస్టా ర్కస్ పండితుడొక గ్రంథం వ్రాసేరు. దానిలో యెన్నో కొత్త ప్రతిపాదనలు, ఊహానములు ఉన్నాయి. వాటినుంచి మనం రాగల నిర్ణయమేది? ఈ భూమీ, విశ్వమూ కూడా మన మనుకుంటూన్న దానికంటె యెంతో పెద్ద వనేదే. సూర్యుడూ నక్షత్రాలూ స్థిరమైనవే ననీ, భూమి సూర్యుని చుట్టూ తిరుగుతూందనీ అరిస్టార్కస్ చెప్పేరు."

ఈ విధంగా విజ్ఞానానికి రాచబాట వైచిన మహాజనుడు డెమోక్రిటస్ పండితుడేనని చెప్పితీరాలి. ఆ మార్గాననే నడి చినవారు, ప్రాచీనయుగపు మహావిజ్ఞానులు అరిస్టార్కస్, ఆర్కిమెడీస్‌లు.

కాని ఆర్కిమెడీస్ కేవలం సిద్ధాంతవేత్త మాత్రమేకాదు, ఆయన యంత్రశాస్త్రజ్ఞుడు కూడాను. ఆ కాలంలో యంత్ర

విద్య, శిల్పవాస్తువృత్తినైపుణ్యములు క్షుద్రములైనవని పండిత లోకం భావిస్తూండేవారు. శాస్త్రవేత్తలు అవలంబించాల్సిన గౌరవస్థానం యీ యంత్రవాస్తు శిల్పాదులకు ఉండేదిగాదు. ప్లేటో తనమిత్రుడైన అర్చితాస్ యంత్రనిర్మాణవిద్యపై తన కాలాన్ని వృథాచేస్తూన్నందుకు మందలించేడు, నిందించేడు. ఆర్చితాస్ (Archytas ) కొయ్యతో ఒక పావురాన్ని తయారు చేసేడు. ఆ దారుకపోతం నిజంగా యెగిరేదట! ఇల్లాంటి పనుల్లో తత్త్వవేత్తలు కాలం వృథాచేయరాదని ప్లేటో అభి ప్రాయం. యంత్రవిద్య అనేది యేదో చేతిపని, క్షుద్రవృత్తి మాత్రమేననీ, కర్మకారులే ఆ పనులతో తంటాలు పడుతూం డాలనీ ఆయన అనేవారు. ఈ విషయంమీద ఆర్కిమెడీస్, ప్లేటోను ధిక్కరించేడు. యంత్రవిద్యను కూడ విజ్ఞానశాస్త్రాల జాబితాలో చేర్చడానికి, సమానప్రతిపత్తి నీయడానికి ఆయన కృషిచేశాడు, తన తపస్సును ధారవోశాడు.

జనులు యంత్రవిద్యను చూచి సంభ్రమించి, దాని నర్థం చేసుకోలేకపోయీవాళ్లు. వారి కిదొక పరమాద్భుతంగా, మంత్రతంత్రంగా, ఇంద్రజాలంగా కనిపించేది. నూరుగురు కదపలేని పెద్దరాతిబండను, చిన్న మీటతో నలుగురు సుల భంగా పైకి లేవదీయడం వారికి పరమాశ్చర్యకరంగా ఉండేది! ప్రకృతి సూత్రాలకీ, స్వభావానికీ విరుద్ధంగా వుందే, యీ మీట! అనుకొనేవారు. ఆర్కిమెడీస్ యీ మీటలను గూర్చిన సూత్రాలను నిర్ధారణ గావించి, నిర్వచించేడు.

మీటలు కూడ ప్రకృతి సహజ సూత్రానుసారంగానే పని చేస్తున్నాయనీ, దానిలో మానవాతీతశక్తి లేమీ లేవని ఆయన ఋజువు చేశారు.

ఆర్కిటాస్ ఆర్కిమెడీస్ వలె క్రీడావస్తువులను వేటినీ చేయలేదు. నిజమైన యంత్రాలనే నిర్మించేడు. ఆయన ఖగోళపు నమూనా నొకదాన్ని తయారుచేసేడు. రాగితో చేసిన గోళాలు తిరుగుతూండేలాగున అది నిర్మించబడింది. మరుగున వున్న జలయంత్ర శక్తివలన యివన్నీ తిరుగునట్లు ఆర్కిమెడీస్ చేసేడు. ఆ యంత్రం తిరుగుతూ సూర్యోదయాస్తమయములు, చంద్రోదయం, భూచ్ఛాయవల్ల చంద్రగ్రహణాలు కలిగే విధానం, గ్రహాదులు ఆకాశంలో యెల్లా తిరుగుతూన్నాయో, యింకా అనేక విశేషాలు కనపరచేది.

ఆయన అలగ్జాండ్రియాలో నున్నపుడే నీళ్లను తోడేందుకు 'జలశంఖము'ను సవరించేడు. దానినే మనం నేడు 'నత్తగుల్ల' అంటాం. అదివరకే దానిని ఐగుప్తీయులు పొలాలకు నీరు పారించేటందుకు ఉపయోగించేవారు. అందులోవున్న లోపాల నాయన సవరించి చక్కగా పనిచేసేటట్లు, పునర్నిర్మించేడు. గనుల్లోనుంచి ఊటనీటిని తోడేటందుకు 'ఆర్కిమెడీస్ స్క్రూ' లేక 'శంఖము' లనే సాధనాలను ఉపయోగించడం ఆనాటి నుంచీ ప్రారంభమైంది. స్పెయిన్ దేశపు గనులలో నీటిఊటలు తరుచు బాధించేవి. ఏటవాలు కాలువల్లోకి నీటిని మళ్లించడం ద్వారా వారు ప్రవాహవేగాన్ని తగ్గించేవారు. తరువాత

ఆర్కి—మెడీస్ శంఖాల సాయంతో గనుల్లోంచి నీటిని తోడి వేయగలిగేవారు.

ఏదైన మందిరం ఉందనుకోండి. దాని స్థంభాలు పైన యెంత బరువును మోయవలసివుంటుంది? దీనిని గుణించి అంచనా వేయడానికి ఆర్కి—మెడీస్ ఒక గ్రంథం రచించేడు. వాస్తు శాస్త్రంలో యిదొక ఉత్తమ గ్రంథం. గృహ దేవాలయ మంటపాదుల నిర్మాణంలో యిది ఆ కాలంలో యెంతో ఉప యుక్తంగా ఉండేది.

ప్రతి వడ్రంగీ ఓడలు కట్టే రోజులు వెళ్ళిపోయేయి. సిరా క్యూజ్ రేవులో వందలూ, వేలూ పడవలు లంగరులు వేసి వుండేవి. ఓ పెద్దనగరమే నీటిమీద తేలుతూన్నట్లుండేది. వాటిలో కొన్ని పెద్ద ఓడలూ ఉండేవి. ఆ ఓడల్లో అంతస్థులు, సోపానాలు, సాముగరిడీలకు అఖాడాలు, పైతట్టున గోపురాలూ కూడా ఉండేవి. అవి నీటిమీద తేలే చిన్న దుర్గములవలె ఉండీవి. ఇల్లాంటి ఓడలను నిర్మించాలంటే సామాన్య వడ్రం గులవల్ల గాదు. మంచి శిక్షణపొందిన యంత్రవాస్తు నిపు ణులై యుండాలి. యంత్ర విద్యావేత్తలు (ఇంజినీర్లు) యిటు వంటి ఓడల్ని నిర్మించాల్సివచ్చినప్పుడు ఆర్కి—మెడీస్ పండి తుని సలహాను తీసుకునేవాళ్లు.

ఒకసారి యంత్రవాదులు బ్రహ్మాండమైన ఓడ నొకదాన్ని నిర్మించేరు. ఎంతమందిచేత లాగించినా, త్రోయించినా అది కదలలేదు. దాన్ని నీళ్లలోకి దించడానికి సిరాక్యూజ్ నగరం

లోని జనం అందరూ పగ్గాలు పట్టి లాగినా ఆ ఓడ అంగుళం కూడా కదల్లేదట! సరే, యిక కర్తవ్య మేమిటని, ఆర్కి-మెడీస్‌కి కబురంపించేరు. ఆయన కిది క్రొత్తకాదు. మీటల నాత డదివరకే కనిపెట్టి వున్నాడు. 'మీట మోపేందుకు ఆధారం వుంటే ప్రపంచాన్నే కదిపేస్తా!' నన్నాడట ఆర్కి-మెడీస్ ఒకసారి.

ఆ ఓడచుట్టూ పలుచోట్ల ఆధారాలనూ, మీటలనూ అమర్చేడు, ఆర్కి-మెడీస్. అప్పుడు ఓడపగ్గాలను నూకుగుకు పట్టుకున్నారు. చూస్తూండగా ఓడ జాయిగా జారుతూ నీళ్ళ లోకి వెళ్ళిపోయింది. ఈ అద్భుతాన్ని చూచిన తరువాత సిరాక్యూజ్ రాజు హైరో యిల్లా ప్రకటించేడు: "ఇది మొదలు ఆర్కి-మెడీస్ పండితుడు యేమిచెప్పినా ప్రజలంతా నమ్మవల సిందని నేను శాసిస్తూన్నాను. ఇది రాజాజ్ఞ!"

హెర్క్యులిస్, అట్లాస్ లనే మహాబలురు తమ భుజాలపై ఆకాశాన్ని మోసే వారంటూ విచిత్రగాథలను జనులు ఒకా నొకప్పుడు చెప్పుకునేవారు. ఇప్పుడు ఆర్కి-మెడీస్‌ను గురించే కథలు చెప్పుకుంటున్నారు, పరమాద్భుతంగా.

ఒకసారి రాజు బంగారు కిరీటం చేయించుకోవా లనుకుని కంసాలిని పిలిపించేరు. కాని, బంగారులో మరో లోహ మేదైనా కలుపుతాడేమో నని ఆయన మనస్సు పీకుతోనే వుంది. కిరీటం తయారై వచ్చింది. కాని, రాజుగారికి తృప్తి లేకపోయింది. ఆర్కి-మెడీస్‌ను పిలిపించి, కిరీటపు బంగారం

స్వచ్ఛమైనదో, కాదో చెప్పమన్నాడు. రాత్రింబగళ్లు ఆయన దీన్ని గురించే యోచించేవాడు. భోజనం చేసేటప్పుడు, వాహ్యాళికి పోవునప్పుడు, స్నానం చేస్తూనూ కూడా ఆర్కిమెడీస్ యీ సమస్యనే ఆలోచిస్తూన్నాడు. ఒక రోజున స్నానగృహంలో నీళ్ళతొట్టిలో కంఠ దఘ్నంగా ఉండగా ఆయనకీ సమస్యాపరిష్కారం స్ఫురించిందంటారు. నగ్నంగానే నీళ్ళలోంచి పైకివచ్చి, గబగబ పరుగెడుతూ, 'యూరేకా! యూరేకా!' అని అరచేడట. గ్రీకు భాషలో 'యూరేకా' అంటే 'కంటిని' 'కనుగొంటిని' అని అర్థం.

నీటి తొట్టిలోకి తాను మెల్లగా దిగుతూంటే నీరు పైకి పొర్లిపోయింది. ఈ సంఘటన ఆ జిజ్ఞాసువులో ఒక ఊహను కలిగించింది. ఇంటిలోకి పోయి కిరీటపు బరువేగల బంగారం ముద్దను నీటిలో ముంచేడు. గిన్నెలో అంచులవరకూ వున్న నీరు కొంత పొర్లి పైకి చిందిపోయింది. గిన్నెలోని బంగారు ముద్ద తన స్వీయ పరిమాణానికి సమమైన నీటని పైకిత్రోసి, దానిస్థానం ఆక్రమించుకుంది. కిరీటంకూడా స్వచ్ఛమైన బంగారమే ఐతే సరిగా యీ బంగారు ముద్దతో సమపరిమాణం గల నీటినే వెలికి త్రోసివేస్తుంది. కాని, కిరీటాన్ని ఆ రీతిగా నీళ్ళలో ముంచగా అధికపరిమాణంగల నీటిని పైకిత్రోసింది. దీని అర్థమేమిటి? సమానతూకంగల బంగారు కంటె కిరీటం అధికపరిమాణం కలిగి వుందన్నమాట. బంగారుకంటె తేలికైన లోహం, వెండి, యీ కిరీటంలో కలుపబడి వుందన్న మాట.

ఆర్కిమెడీస్ యీ ప్రయోగాన్నే మళ్ళా మళ్ళా చేసి చూసేడు. ఎక్కడా కొంచెంకూడా తేడాపాడాల రాకండా, ఖచ్చితంగా, జాగ్రత్తగా ప్రయోగాలు సాగించేడు. ఫలితం ఒక్కటే. కిరీటంలో వెండి మిశ్రమం గావడంవల్ల ప్రతిసారీ బంగారుముద్దకంటె అధికపరిమాణంగల నీటినే పైకి గెంటుతూ వచ్చింది. అందరూ ఆశ్చర్యపడ్డారు. కంసాలి ఆశ్చర్యానికి మేరయే లేదు. అతడు అతి నేర్పరియైన పనివాడు. తాను గావించిన హస్తలాఘవాన్ని యెవరూ కనిపెట్టలేరని ఆతడను కున్నాడు. కాని, అతనికంటె ఘనుడు ఆర్కిమెడీస్.

విజ్ఞానాన్ని గురించి యేమీ తెలియని సామాన్య జనులు యిదంతా యేదో కట్టుకథలా ఉందన్నారు. ఈ తర్వాత చాల శతాబ్దాలకు న్యూటన్ ఆపిల్ పండు పడడంవల్ల భూమ్యాకర్ష ణను ఊహించినపుడూ అశిక్షితజనులు 'యిదంతా కట్టుకథ!' అనే భావించేరు.

రోమనులు సిరాక్యూజ్‌ను లోబరచుకోడానికి యెన్నో సార్లు దాడులు చేశారు. ఆర్కిమెడీస్ తన శాస్త్రజ్ఞానాన్ని స్వదేశరక్షణలో ప్రయోగించాడు. రోమనులు పరాభూతులై, పరాజయాన్ని అంగీకరించవలసివచ్చింది. రోమను దండయాత్రలను గూర్చి ప్లూటార్చ్ చరిత్రకారుడు యిల్లా వ్రాశాడు:

"రోమను సర్వసేనాని మార్సెల్లస్ బహు దక్షతతో తన సైన్యాల నన్నిటినీ సిరాక్యూజ్ పైకి నడిపించేడు, మళ్ళా ఎనిమిది పెద్ద ఓడలను గొలుసులతో కలిపి కట్టించి, వాటి

మీద ఒక పెద్ద యంత్రసాధనాన్ని నిర్మించేడు. అది పెద్దపెద్ద శిలాఖండాలను, అగ్ని బాణాలను, కాలే తారు కుండలను దూరానికి విసరగలదు. ఈ మారణ యంత్రాన్ని దుర్గ కుడ్యాల దగ్గరకు నడిపించుకుని వచ్చాడు. ఈ ఉపాయం ఫలించి తీరుతుందనీ, దుర్గం లోబడక తప్పదనీ మార్సెల్లస్ నమ్మేడు. తనపేరు చెపితేనే శత్రువుల గుండెల్లో రాయిపడు తుంది. పైగా తానిప్పుడు యెన్నో ప్రయత్నాలు చేశాడు. యెన్నో జాగ్రతలు తీసికొన్నాడు; యింక యిప్పుడు విజయం తన కరతలామలకం అవుతుందనడంలో ఆశ్చర్యమేమిటి?"

"కాని, యిదంతా ఆర్కి-మెడీస్ ముందూ, ఆయన యం త్రాల ముందూ ఒక లెక్క-లోనిదిగాదు. హైరో రాజు బుద్ధి మంతుడై సకాలంలోనే శాస్త్రవిజ్ఞానపు విలువను గుర్తించేడు. ఆయన ఆర్కి-మెడీస్‌ను సబహుమానంగా ఆహ్వానించి, వివిధ యుద్ధయంత్రాల్ని నిర్మించేటట్లు ప్రార్థించేడు. ఆ యంత్రాలు ముట్టడిసమయాల్లో రక్షణకు, అవసరమైతే యెదురుదాడికీ కూడ పనికివచ్చేవి. ఆ యంత్రాలూ, వాటిని కనిపెట్టిన శాస్త్రజ్ఞుడూ సిరాక్యూజ్ ప్రజకు గావించిన సేవ నిరుపమాన మైనదనడంలో సందేహంలేదు."

"రోమనులు రెండువైపులనుంచీ, జలస్థలమార్గాలు రెంటి నుంచీ ముట్టడి ఆరంభించగానే సిరాక్యూజ్ పౌరులు విభ్రాం తులై, భయపడ నారంభించేరు. ఇంతటి మహాశక్తిని యెదు ర్కో-వడం యెవరికీ సాధ్యంగాదని యెరిగిన సిరాక్యూజ్ పౌరులు

భయభ్రాంతత్వంచేత నోటమాటకూడా లేకండా పోయారు. ఇటువంటి సమయంలోనే ఆర్కిమెడీస్ యంత్రాలు పనిచేయ నారంభించేయి. బ్రహ్మాండ పరిమాణాలుగల గండశిలలు, భల్లకుంతపట్టిసాదులు ఫెళఫెళార్భటులతో మహా వేగంగా శత్రు పదాతి దళాలమీద కురియ నారంభించేయి. ఈ యెదురుదెబ్బకు తట్టుకోగల శక్తి యేదీ కనబడలేదు. దారిలో అడ్డుబడిన ప్రతీదాన్నీ నుగ్గునుగ్గు గావిస్తూపోయి, యివి శత్రు వ్యూహాల్ని చెరగొట్టివేసినాయి."

"ఈలోగా మరొకవైపునుంచి అతి దీర్ఘములైన స్థంభములు దుర్గంలోనుంచి పొడుచుకొనివచ్చి, ఓడలమీదికి జాచబడినాయి. వాటివల్ల విడువబడిన గండశిలల తాకిడికి, దెబ్బకు కొన్ని ఓడలు పగిలి, మునిగిపోయినాయి. మరో కొన్ని ఓడల్ని యీ స్థంభాలు తమ చివరల్లో అమర్చిన యినుప కొక్కెములతో ముఖభాగములను పట్టి యెత్తి సముద్రగర్భంలోకి ముంచివేసినాయి. కొంగ ముక్కుతో చేపల నెత్తినంత సులువుగా అవి యీ పనిని చేసేసేయి."

"మార్సెల్లస్ తన ఓడలమీద నుంచిన యంత్రం పేరు 'శంబుకం.' దాన్ని దుర్గకుడ్యములకు తగినంత సమీపంగా తీసికొనిరాలేకపోయేరు. ఎందుచేతనంటే కోట గోడలలో నుంచి పది టాలెంట్లు (ఒకటాలెంటు=57 పౌనులు) బరువుగల రాళ్లు శరపరంపరగా వచ్చేసి, ఓడలను కొట్ట నారంభించేయి. పెద్ద ధ్వనులతో యీ రాళ్లు మహాసంరంభం చేస్తూ

పిడుగుల్లా పడి, శంబుకయంత్రాన్ని విరుగగొట్టి, దాని కుశు లను, చీలలను చీల్చివేసినాయి."

"మార్సెల్లస్ సేనాని మహాశ్చర్యంతో దిగ్భ్రాంతుడై పోయి ఓడల్ని వెనక్కి మరలించమనీ, పదాతి సైన్యాల్ని తిరోగమించమనీ ఆజ్ఞలు యిచ్చాడు. కాని తిరోగమిస్తూన్న సైన్యాలను వాడియైన బాణాలు కసిమసంగుతూనే వున్నాయి. కాల్బలాల్లో చాలమంది జనం నష్టపడ్డారు. ఎన్నో ఓడలు మునిగిపోయాయి. రోమను సేనలు శత్రువుకు అంతగా నష్టాన్ని కలిగించలేకపోయాయి. ఆర్కిమెడీస్ యంత్రాలన్నీ కోటగోడల లోపలనే వుండిపోయినాయి. తాము దేవతలతో యుద్ధం చేస్తున్నట్లనిపించింది, రోమనులకు. వారిని దురదృష్ట దేవత వెంబడిస్తూందా? అనిపించింది. వాళ్ళు తమ్ము చావ గొడుతూన్న శత్రువులను చివరకు చూడనుగూడ లేక పోయారు!"

"తన సాంకేతిక విద్యావేత్తల్నీ, యంత్ర నిపుణుల్నీ మార్సెల్లస్ పరిహసించేడు: 'మన మీ గణితశాస్త్ర పండి తునితో యుద్ధం చేయలేమని తోస్తూంది. ఇక లాభంలేదు. బ్రియారియాస్ (పురాణ గాథల్లోని మహాకాయుడు) లాగున మన ఓడల్ని విసరి పుచ్చుకు, గిరివాటు పెట్టేటట్లున్నాడీతడు! అతడు వదలే బాణాలసంఖ్య చూస్తే పురాణాల్లోని నూరు చేతుల రాక్షసుని మించేటట్లున్నాడు!"

తన కథనములో ప్లూటార్కు శాస్త్రశక్తిని కొనియాడేడు. బ్రియారియాస్ రాక్షసుడు తన నూరుచేతులతోనూ చేయ

లేని పనులు చేస్తూన్న యీ గణితశాస్త్రవేత్తను ప్లొటార్కు శ్లాఘించేడు. కాని ఆర్కిమెడీస్ శక్తి శాస్త్రవిజ్ఞానం ఒక్క దానిలోనే గాక మరొకదానిలోకూడ వుందని ఆ చరిత్రకారుడు గుర్తించలేదు. ఆర్కిమెడీస్‌కి నూరేగాదు వేలాది చేతులున్నాయి! ఆయన సిరాక్యూజ్‌ను పౌరులందరితోనూ కలసి సంరక్షించుకున్నాడు. వారందరి అండదండలే ఆయనను అజేయునిగా చేసినాయి. ప్లేటోకు అక్షరాలా శిష్యుడైన ప్లొటార్కు రాజ్యాంగమునకు ఆత్మయేగాని శరీరం ప్రధానం గాదంటాడు. రాజు, సేనానులు, తత్త్వవేత్తలు, పండితులు, వీరే రాజ్యానికి ఆత్మ వంటివారు. వీరే సర్వసమర్థులనీ, జన సామాన్యం కేవలం శరీరం, అంగములవంటివారనీ, యివన్నీ కూడ ఆత్మకు లోకువ అనీ ప్లొటార్కు కూడ అభిప్రాయపడ్డాడు.

కాని, శాస్త్రజ్ఞుని, ఆతని జనుల నుంచి వేరుచేయడం యెల్లాగ? అందరిలాగే ఆర్కిమెడీస్ కూడా సిరాక్యూజ్ పౌరుడే. ఆ నగరాన్ని నిర్మించిన జనుల తరాల సంతతివాడు. వారందరి పేర్లూ చరిత్రలో భద్రపరుపబడలేదనుకోండి. కాని, వారూ, వారి సంతతులూ శ్రమపడి ఆ యిండ్లనూ, వీధులను, ప్రాకారములను, ఓడలను, ఆరామములను, ద్రాక్షతోటలనూ నిర్మించేరు. పూర్వుల సంచితమునే వీరు రక్షించ పూనుకున్నారు. వేలమంది చేరి, ఆర్కిమెడీస్‌కు తోడ్పడి ఆ యంత్రాదుల్ని నిర్మించేరు. ఆయనకు పూర్వమే ఎందరో

మేధావులు చిరకాలంగా ఆధారములు, మీటలు, తులాభార ములు మొదలైన వాటి సూత్రాలు, సిద్ధాంతాలు నిర్మిస్తూ వచ్చేరు.

దీర్ఘకాలం ముట్టడించిన తరువాత రోమనులు ఆఖరుకు సిరాక్యూజ్ నెట్లు పట్టుకోగలిగేరో ప్లూటార్క్ చెపుతాడు. వారు ద్రోహంవల్లనే జయించగలిగారు, చివరకు. ఆర్కిమెడీస్, అతని మిత్రులైన బహుజనులూ చెందిన పక్షానికి వ్యతిరేకులు, ధనికపక్షంవారు పట్టణాన్ని లోబరచేందుకు కుట్రలు సలిపేరు.

రోమను సైనికులు పట్టణంలోనికి జొరబడ్డారు. ప్రజలపై వారు భయంకరంగా కసితీర్చుకున్నారు. వాళ్లు ఆర్కిమెడీస్ కోసం గాలించేరు. ఇసుకలో బొమ్మలు గీస్తూ, యేదో గణిత శాస్త్ర సమస్యను పరిష్కరించుతూన్న ఆర్కిమెడీస్‌ను రోమను సైనికులు చూసేరు. మీదకు వస్తూన్న వాళ్ళని గద్దిస్తూ 'దూరంగా పొండి! ఆ బొమ్మను త్రొక్కి పాడు చేయక !' అని ఆర్కిమెడీస్ అరిచేడు. సన్నిహితమైయున్న అపాయశంకయే ఆయనకు లేదు. కేవలం శాస్త్రవిషయమే ఆయన మనసును పూర్తిగా ఆక్రమించివుంది. ఐనా ఆ పటమును గూర్చి అజ్ఞానులైన రోమను సైనికులే మెరుగుదురు ? వాళ్లు దానిని పాడుచేయకండా ఆయన ఆ పటముపైన బోరగిల పడ్డాడు. ఆర్కిమెడీస్ అల్లా వుండగనే రోమను లాయనను చంపేసేరు.

సిరాక్యూజ్ లొంగిపోయి, రోముకు కప్పం కట్టేది ఐంది. ఆర్కి-మెడీస్ పేరైనా ఆయన జన్మభూమిలో వినబడకూడదని రోమనులు శాసించేరు. ఆయనంటే వారికి సింహస్వప్నం! ఆ మహాత్ముని సమాధిమీద గడ్డి మొలిచిపోయింది.

తరువాత చాల యేండ్లకు రోమను రచయితా, రాజకీయ వేత్తా ఐన శిశిరో బహుయత్నంమీద తాను ఆర్కి-మెడీస్ సమాధిని కనుగొన్న విధం వ్రాసేడు :

"నేను సిసిలీలో ఉండగా సిరాక్యూజ్ నివాసి ఆర్కి-మెడీస్ సమాధిని గూర్చి తెలుసుకోవాలని ప్రయత్నించాను. వాకబు చేయగా యెవరూ ఆయన భోగట్టాయే తెలియదన్నారు. ఆయన సమాధిస్థలం ఆచూకీకూడా యెవరూ తెలియదన్నారు. ఎంతో ఓపికగా, పట్టుదలతో వాకబు చేయగా, చేయగా ఆయన భౌతికదేహాన్ని సమాధిగావించిన చోటు దొరికింది. సమాధిమీది శిలాఫలకం, గడ్డిగాదం మొలచి కప్పబడిపోయి వుంది. ఆ శిలాఫలకంమీద లిఖించబడి వున్న పద్యాలవల్లనే అది ఆర్కి-మెడీస్ సమాధి యని తెలుసుకున్నాను. అంతేగాదు. పద్యాల క్రింద రెండు స్థంభాలు, గోళం కూడా చెక్కబడివుంటాయని నాకు ఆనవాలు చెప్పేరు. అవన్నీ పరిశోధించి చూచేకనే, అది ఆ మహా విజ్ఞాని సమాధి యని నిశ్చయించాను."

"సిరాక్యూజ్ నగర కుడ్యాలకు వెలుపల గల విశాల మైదానంలో యెన్నో సమాధులున్నాయి. అక్కడ వెతికి

నెతికి చిన్న స్తంభాన్ని కనుగొన్నాను. గడ్డి మొక్కలతో అది కప్పబడిపోయివుంది. ఆ స్తంభంమీద చిన్న గోళము, స్తంభిక ( Cylinder ) చెక్కబడివున్నాయి. అదే నేనన్వే షించే సమాధి యని గ్రహించినపుడు నా సంతోషానికి మేర లేదు."

"నాతో వచ్చిన సిరాక్యూజ్ పౌరులకు అదే ఆర్కిమెడీస్ సమాధి అని చెప్పేను. వారు వెంటనే దానిచుట్టూ వున్న గడ్డి గాదములను తీసి శుభ్రపరచేరు. దగ్గరకుబోయి స్తంభం మీది అక్షరాలను చదివేను. కాలాఘాతాలవల్ల కొన్ని కొన్ని భాగాలు చెరిగిపోయినా యింకా కొన్ని భాగాలు స్పష్టంగా కనబడుతూన్నాయి."

" ఈ రీతిగా మహాకీర్తివంతములైన గ్రీకునగరాల్లో నొకటి, మానవలోకాని కెందరో మహావిజ్ఞానుల నొసంగిన నగర మిప్పుడు, వారందరిలోకీ మహావిజ్ఞానియైన వానిని సమాధి చేసిన స్థలాన్నే యెరుగనేరని స్థితిలో వుంది."

సిరాక్యూజ్‌లో ఆర్కిమెడీస్ పండితుని ఆనవాలూ, స్మృతీ కూడా లేకుండా చేయాలని రోమనులు ప్రయత్నించేరు. దానిలో వారు పూర్తిగా కృతకృత్యులైరనే చెప్పాలి. కాని, విధివిహితం మరొకలా వుంది. వారు యెంతో ఆడంబరంగా జరుపుకొన్ని విజయోత్సవచిహ్నాలు వెంటనే కాలగర్భంలో కలిసిపోయినాయే కాని ఆర్కిమెడీస్ పేరుకీర్తులు మాత్రం స్థిరంగా నిలచి వున్నాయి. ఇప్పుడు కూడా యే యింజ

నీకు ఓడను నిర్మిస్తూన్నా, ఆర్కిమెడీస్ సాయం తీసుకోవల సిందే! గృహనిర్మాత యెవడూ ఆయన సాహాయం తీసి కోనిదే, ఆయన సిద్ధాంతాల నుపయోగించుకోనిదే ఒక్క అడుగు పడదు! యంత్ర నిర్మాతలున్నూ మీాట, దాని సూత్రాన్నీ ఉపయోగించుకోనిదే ముందుకు సాగనేలేరు!

ఆర్కిమెడీస్ మహాశిల్పి, వాస్తుశాస్త్రజ్ఞుడే గాదు. యుద్ధ కాలంలో మాతృదేశ రక్షణకై నడుముకట్టి, అందరకూ మార్గదర్శియైన మహాత్ముడు. ఆయన తన పనుల ద్వారా నేటికీ జీవించియే వున్నాడు.

## నిర్జీవములను సజీవంగా చేయువాడు.

ఆర్కిమెడీస్‌ను మానవులే హత్య గావించేరు. కాని, యితర మానవులు, శాస్త్రజ్ఞులు—యంత్ర నిపుణులు, ఆయన కృషిని కొనసాగించారు. ప్రకృతిలోని అంధశక్తులను కొన్ని నిర్దిష్టమార్గాల్లో నడపడం నేర్చుకున్నారు.

ఈ శాస్త్రజ్ఞుల గ్రంథాల్లో గాలి మరలు, నీటి పంపులు గూర్చిన మొట్టమొదటి వర్ణనలను చదువుతాము. ప్రవాహ వేగాన్ని అడ్డుగట్టతో నిరోధించి, నీటిమట్టాన్ని హెచ్చించి, కాలువద్వారా నీటిని చక్రంమీాద పడునట్లు చేసేవారు. చక్రం తిరుగుతూంటే నీటి తుంపురులు గాలిలో లేచి, మేఘంలా ఉండేవి. ప్రక్కనే మిల్లును నిర్మించి, నీటిచక్రాన్నుంచి మిల్లు లోని తిరుగలి రాళ్ళకు పరిభ్రమణాన్ని సంక్రమింపజేసేవాళ్లు.

నీటిచక్రపు బుజబుజ ధ్వనులు, మిల్లు రాళ్ళ గర గర ధ్వనులు జతగూడి, మనోహరంగా సంగీతంలా వినిపించేది. మామూలు తిరుగళ్ళ ధ్వనులవలె గాక దీనిలో విలక్షణమైన మాధుర్యం కనిపించేది.

"పుట్టినప్పటినుంచీ రాతి చేతిరగళ్ళమీాద పిండి విసిరి విసిరి వేసారిపోతూన్నాము. ఇంకిప్పుడు నైయదలు (నదీదేవతలు) మనకోసం యీా పని చేస్తారులెండు! రెక్కలు ముక్కలయే బండచాకిరీ తప్పింది." అనుకునేవాళ్ళు, స్త్రీలు.

నీటి ఉపయోగం మరొకటి కూడా వుంది. పీల్చుటవల్ల పనిచేసే పంపులు మొదట్లో కనిపెట్టేరు. ఇవి పూర్తిగా 'మీటా' సిద్ధాంతంమీాదనే ఆధారపడినట్టివి. నీటిని తోడి మంటల నార్పుట, ఆవిరి మేఘాలుగా మార్చుట మొదలైన పనుల కివి ఉపయోగపడేవి.

ఈ విధంగా నీరు మానవునికి లొంగి విధేయిని అయింది.

కాని ఆవిరి మాటేమిటి? గాలిసంగతి యేమైంది?

ప్రవాహాలకు యెదురుగా కూడ పడవలను నానిపోవడానికి తెరచాపల ద్వారా గాలి తోడ్పడుతూనేవుంది, అప్పటికే. కాని ఆవిరి మాత్రం కొరకరాని కొయ్యగా ఉంటూంది. దానిచేత కూడ యేదేనా పని చేయించాలని మనుష్యులు యత్నించ నారంభించేరు.

హైరో అను అలగ్జాండ్రియా విజ్ఞాని ప్రొయ్యి మీాద నీటి క్రాగునుంచి, పైన గట్టిమూతను అమర్చేడు. ఒకచుక్క

కూడ పైకి పోలేదు. ఆవిరి మాత్రం రెండు రాగి గొట్టాల గుండా పైకి పోవడానికి వీలు కల్పించేడు. ఆ రాగి గొట్టాలు క్రాగుచుట్టూ మెలి చుట్టబడివుంటాయి. నీరు మరుగుతూన్న కొద్దీ ఆవిరి యీ గొట్టాల్లోంచి అంతకంత కధిక వేగంతో బైటకి వస్తూ, ఈలలు వేస్తూ, బుసలు కొడుతూంటే అందరూ వినోదంగా చూసేవాళ్ళు. ఇది కేవలం వినోదమే ఐనా యీ నాటి ఆవిరియంత్రాలకు వంశకర్త యిదే. ఇప్పుడా ఆవిరే మనుష్యులను మహావేగంగా యెంతదూరమైనా మోసుకు పోతూంది.

అదృశ్యములై విరామమెరుగని ఆవిరికణములు మానవుని కతివిశ్వాసపాత్రములై బండచాకిరీలనుంచి ఆతణ్ణి విముక్తుణ్ణి చేసినాయి. అవే నేలను దున్నుతున్నాయి, బట్టలు నేస్తు న్నాయి, బంగారును గనుల్లోంచి తీస్తూన్నాయి, యినుమును కరిగి పోస్తున్నాయి. మానవుడు ఆవిరిశక్తితో బ్రహ్మాం డాన్నే చుట్టి రాగలుగుతూన్నాడు. ఈ శక్తిని హైరో విజ్ఞాని ఆటబొమ్మలను కదల్చడానికి ఉపయోగించేడు. మనిషి అక్క ర్లేకండా దేవాలయాల తలుపులు తెరిచేటందుకై అతినేర్పుగా ఆవిరిశక్తితో పనిచేసే మరలను అమర్చేడు. అది చూసిన జనులు దేవుని మహాత్మ్యం వల్లనే గుడి తలుపులు తెరుచు కుంటున్నాయని భావించేవాళ్లు!

జీవలక్షణం చలనం. కాని చలనం జీవం కాదు. చలనంలేని వస్తువుల్లోకి చలనం తెప్పించడానికి విజ్ఞానం ఉపయోగించు

తూంది. చలనమేగాక దానితోబాటు జీవాన్నికూడ శాస్త్ర విజ్ఞానం రప్పించగలదా? నిర్జీవములను సజీవములుగా చేయ గలవాడుగా విజ్ఞాని కాగలడా?

## అదృష్టంతో కుస్తీ

మానవుడు జీవలోకంలోకల్లా ఘనుడు. ఆతని బుద్ధి మహా శక్తివంతమైనట్టిది. కాని, ప్రకృతిమీద ఆతనికి పూర్ణాధికారం లభించేకాలం యింకా చాలదూరంగానే ఉంది. ఇంతవరకు సాధించింది అతి స్వల్పం. మానవుని బాధలు, తీరని అవస రాలు,—వీటిని గూర్చిన శోకగీతికల గందరగోళంలో ఆతని విజ్ఞాన – విజయగీతాల ఆలాపన బహుదూరాన్నుంచి మెల్లి గానే వినవస్తూంది. ఇప్పుడది పల్లవిమాత్రంగానే వుంటూంది.

క్రీస్తుపూర్వం 3వ శతాబ్దంలో రోడ్స్ ద్వీపపు నౌకాశ్ర యంలో సూర్యభగవానుని విగ్రహం ఒకటి ప్రతిష్ఠించబడింది. అది కంచుతో పోతపోసినది. సూర్యదేవుని యీ కంచు విగ్ర హాన్ని చేసేందుకు యెందరో శిల్పులు చేరి యిరవైయేళ్ళు పనిచేసేరు! ఈ విగ్రహం మనిషికంటె యిరవైరెట్లు పెద్దది. ప్రపంచంలోని యేడు మహాద్భుతాల్లోనూ యీ ప్రతిమ ఒకటి. కాని, ఒక్క చిన్న భూకంపంతో యిది కుప్పకూలి, ఛిన్నాభిన్నమైపోయింది. కంచుముక్కల ప్రోగు మిగిలింది. వీటిని యెత్తి మోసుకొని పోవడానికి రెండువందల ఒంటెలు కావాల్సి వచ్చిందట!

మానవుని చిరకాలకృషిని ప్రకృతి ఒకక్షణికంలో వమ్ము చేసేస్తూంది. ప్రకృతిని శాసించే శక్తి మానవుని కెన్నటికో ?

ఆతడు అదృష్టదేవతతోనే కుస్తీకి తలబడ్డాడు. సనాతనమైన అలవాట్లను, ఆచారాలను అతడు అతిక్రమించేడు. పూర్వుల బోధనలను, శాసనములను త్రోసివేసి, అతడు తిరుగబడుతూవచ్చాడు. కానైతే యీ పూర్వీకులే యింకా యిప్పటి మానవులమీద అధికారం చెలాయించుతూన్నారు ! అంటే మృతులు జీవించియున్నవాళ్ళమీద అధికారం నెరపుతూన్నారన్న మాట. తాతముత్తాతల ఆజ్ఞల ననుసరించే ఏథెన్సు పౌరులు అనక్షగోరస్‌కు మరణశిక్ష విధించేరు; దేవుళ్ళ నవమానించేడని అరిస్టాటిల్ మీద నేరారోపణచేశారు. అరిస్టాటిల్ లైసియమ్‌ను ఏడి, వెళ్ళిపోయేడు. ఆతడక్కడ లేకపోయినా, ఆయన పరోక్షంలోనే మరణదండన విధించేరు. అరిస్టాటిల్‌ను నాస్తికుడని వారు నిందించేరు. ఎందువల్లనో తెలుసా ? విశ్వానికి కేంద్రం యీ భూమి కాదన్నాడని !

గ్రీకు ప్రజాతంత్రపు ఉచ్చదశలో ప్రతి తత్త్వవేత్తా తన యిచ్చవచ్చిన తీరున, స్వేచ్ఛగా ఆలోచించుకోవచ్చు, బోధించనూ వచ్చు. అవి సుదినాలు. కాని ఆ రోజులు గడచిపోయినాయి. ఐగుప్తు, మాసిడోనియా, సిరియాలలో పౌరులకు మారుగా రాజులు యిప్పుడు పరిపాలన చేస్తున్నారు. రాజోద్యోగులు, అధికారులు కలసి ధనికవర్తకుల, వడ్డీవ్యాపారుల హక్కుల్ని నిరంకుశంగా రక్షించేవాళ్లు. తమ అధికా

రాన్ని కాదని యెదిరించే దేనినైనా రాజద్రోహంగా, దైవ ద్రోహంగా యెంచి శిక్షించేవారు. అటువంటప్పుడు స్వతంత్ర ఆలోచనలు గలవాడెవడైనా నాస్తికుడుగా, సనాతన ధర్మ దూరుడుగా ఖండించబడ్డాడంటే ఆశ్చర్యం లేదుగదా. దేవతల యిచ్ఛకు విరుద్ధంగా నడిచే జనులకు యీ లోకంలో దైవ ప్రతినిధియైన రాజు దండన తప్పదని ప్రజలకు బోధించేవారు.

ర్హోడ్స్ దీవిలో మరో విగ్రహం కూడా ఉండేది. అది లానోకూన్ (Laocoon) అను పురోహితుని ప్రతిమ. ఆయన ట్రాయ్ నగరవాసి. ట్రాయ్ గొప్ప నాగరికతగలదిగా ఉండేది, ఆ కాలంలో. ఈశ్వర సేవలో ఉండిన్నీ యీ పురోహితుడు దైవశాసనాలకు, ఆజ్ఞలకు విరుద్ధంగా వెళ్ళ సాహసించేడు. తత్ప్రతీకారం వెంటనే జరిగింది. రెండు మహా సర్పాలు వచ్చి, ఆయనను చుట్టి నలిపి చంపివేస్తాయి. విగ్రహాన్ని చేసిన కళాకారుడు, లానోకూన్ శరీరమునూ రెండు మహాసర్పాలూ చుట్టబెట్టి బంధించినట్లు నిర్మించేడు. పురోహితుడు సర్పబంధనాల్లోంచి తప్పించుకొనేందుకు వ్యర్థ ప్రయత్నాలు గావిస్తూన్నాడు. ఆ ప్రయత్నంలో ఆయన కండరాలన్నీ బిగిసివున్నాయి. ఐననూ వాటిని వదల్చుకోలేకపోతున్నాడు. అవి తమ భయంకర విషాన్ని ఆయన శరీరంలోనికి పంపుతూనేవున్నాయి. ఆతని చిరుత కుమారు లిద్దరు ఆయన కాళ్ళను చుట్టుకుని వున్నారు. వారున్నూ తండ్రి దుర్గతినే పొందుతూ, బ్రతిమాలుకుంటూన్నట్లు ఆయనవైపు దయనీయ

దృష్టులతో చూస్తూన్నారు. ఆతడు, అంత పెద్దవాడు, బలాఢ్యుడు, తన చిఱుతలను, ప్రాణాధికులను సంరక్షించ లేడా? వారిని దుర్విధి బారినుండి తప్పించ లేడా? లేడు! అతడే యీ అసమపోరాటంలో, మహాశక్తివంతమైన 'విధి' చేతుల్లో నిస్సహాయుడుగా ఉన్నాడు. అత డితరులను సంరక్షించు టొకటా?

ర్హోడ్సు వాసులు యీ విగ్రహాన్ని చూసి గడగడ వణకువారు. విధిముందు మానవు డెంత దుర్బలుడో, నిస్సహాయుడో వారికి ప్రత్యక్షంగా కనబడేది. విధితోడి పోరాటంలో యింతవరకు మానవుడు విజయాన్ని పొందలేదు. బంధనముల నుంచి విముక్తుడగుటకు మానవుడింకా యెంతో కాలం బాధల ననుభవించవలసే వుంటుంది. లావోకూన్ పురోహితుని కొండ చిలువలు చుట్టబెట్టి బిగించేస్తూన్నట్లే విధి కూడ తన బంధనాల్లో మానవుణ్ణి బిగించేస్తూంది.

ఈ పోరాటంలో కడపటి కెవరు జయిస్తారు?

ఈ పోరాటానికి ముగింపు అనేది అసలు వున్నదా?

ఈ చిలువ బంధనాలనుంచి తప్పించుకొని, మానవుడు ముక్తుడవుతాడా?

ఈ చిలువబంధనాలే మానవునికి చిలువదండలుగా మారే రోజు వస్తుందా?

•

# ఆరవ మండలం

## విజయులు, విజితులు

### దారులన్నీ రోముకే

'అన్ని మార్గాలూ రోముకే వెడతాయి!' అను సామెత వినుగుదుము గదా. చరిత్ర ప్రస్థానం కూడా రోముగుండా సాగనే సాగింది. మానవ మహాప్రస్థానంలో రోము కూడా ఒక మజిలీయే.

ఏథెన్సు యింక యిప్పుడొక రాజ్యంగా లేదు. కాని, నదీ పర్వతపరివేష్టితమైన ఒక చిన్న ప్రాంతం, ఒకానొకప్పుడు ప్రసిద్ధమైన రాజ్యంగా వుంటూండేదని లోకానికి చాటుతూ, ఆ నగరం మాత్రం యిప్పటికి సజీవంగానే వుంది.

పర్వతాలూ, సముద్రాలూ యెల్లలై యే దేశాన్నీ పరిమితంగావించి వుంచలేని దశలోనే రోమునగరం జన్మించింది. ఇటలీ ద్వీపకల్పాని కుత్తరపు టెల్లలుగా నున్న ఆల్ప్సు పర్వత శ్రేణులుకూడా రోమ్ యొక్క మహోద్ధృతమునకు అడ్డు కట్టలుగా నిలబడలేకపోయినాయి! ఇంతింతై... అన్నట్లు రోము నగరం పెరుగనారంభించి, మొదట నిటలీనంతనూ తన ఆధీనం క్రిందికి తెచ్చుకుంది. తరువాత ఆల్ప్సు పర్వతాల నధిగమించి గాల్ (ప్రస్తుత ఫ్రాన్సు) దేశంలోని కీకారణ్యాలకున్నూ, దక్షిణాన సముద్రాన్ని దాటి సిసిలీద్వీపానికిన్నీ వ్యాపించింది. రోము నగర వీధులే పొడిగించబడినట్లుగా రాజమార్గాలు

అన్నిదిశలకూ సాగిపోయాయి. విశాలమై తిన్ననైన ఆ బాట పైన చదునైన బండలు పరచి, అవి తాపటమగునట్లు యిసుక పరచేవారు. రోములోని ప్రధానచౌకు 'ఫోరం' నుంచే యీ రాజబాటలన్నీ బైలుదేరేవి. ఫోరంలో బంగారు రేకులు తాపిన విజయస్తంభం దగ్గర యీ మార్గాలన్నీ కూడేవి. ఈ రాజమార్గాలు దక్షిణాన సిసిలీద్వీపానికీ, ఉత్తరాన రైన్ నదీ తీరాలకూ, పశ్చిమాన స్పెయినుకూ, తూర్పున బైజాంటియమ్ నగరానికీ వెళ్లేవి. అడ్డం వచ్చిన నదులమీాద బలమైన రాతివంతెనలు నిర్మించేవారు. ఈ బాటలు సాగరపర్యంతంపోయి, ఆగి, మరల వెనుదిరిగేవి. కాని, సముద్రాలమీాదుగా ఏథెన్సుకూ, బ్రిటన్ ద్వీపానికీ, ఆఫ్రికాకూ కూడా యీ మార్గాలు సాగిపోయినాయి. గ్రీసు వలసల్లో తాము చూచిన పడవలన్నిటినీ రోమనులు బలప్రయోగం గావించి, పట్టుకున్నారు. తమకొక నౌకాదళాన్ని యేర్పాటు గావించుకుని, సముద్రాలమీాధ ఆధిపత్యాన్ని చేజిక్కించుకున్నారు. ఈ విధంగా రోమనులు పరశువులతోగాక ఖడ్గములతోనే తమకొక ఓడలదళాన్ని యేర్పరచుకొన్నారు...

మార్గాలన్నీ రోముకే. ఈ మార్గములన్నిటా, భూమిమీాదైతే సార్థములున్నూ, జలాల మీాదైతే చెక్కపూతైన ఓడలున్నూ బైలుదేరి పోయినావి. సముద్రాలను కాలువలతో కలపడం జనులప్పటికే నేర్చుకున్నారు. ఎర్రసముద్రాన్నించి నైలునది వరకూ కాలువ త్రవ్వేరు. హిందూసముద్రంనుంచి

బైలుదేరిన ఓడలు అరాబియా సముద్రంమీదుగా ఎర్ర సముద్రంలో ప్రవేశించి, యీ కాలువద్వారా నైలునదిలోకీ, అక్కడినుంచి అలగ్జాండ్రియాకూ, మధ్యధరాసముద్రం లోనికీ ప్రయాణం గావించేవి. అక్కడినుంచి చీనాసిల్కులు రోము చేరేవి. రోమను యిల్లాళ్లు వీటిని ధరించేటప్పుడు వాటిని నేసిన వారి శ్రమనుగాని, వాటిమీది పువ్వులు కుట్టినప్పుడు కళ్లులా గేలా పనిచేసిన స్త్రీల పాటును గురించికాని తలచుకొని యెరగరు కదా.

ఈ పట్టుపుట్టములు తయారుగావించిన దేశం ఎక్కడవుంది? భూగోళశాస్త్రజ్ఞులే ఆనాడు యీ ప్రశ్నకు సరియైన జవాబీయజాలక పోయీవాళ్లు. అల్లాంటి దేశాలు రెండున్నాయని వారు భావించేవారు. ఒకటి 'సీనై' జనులుండేది. సముద్ర మార్గానే యీ దేశానికి బోగలం. రెండోది 'సీరై' జనులు నివసించేది. తూర్పు యెడారుల్లోంచి భూమార్గాన ప్రయాణం చేసి ఆ దేశానికి చేరగలం. నిజానికి యీ రెండు దేశాలు ఒకటేనని యెవరికీ అనుమానమైనా ఉండేదికాదు! ఇదే చీనా దేశమని వారికి తెలియదు.

తూర్పున వున్న హిందూదేశం, చీనాల్లో జనులకు రోము అనేది యెక్కడుందో అనేది ఛాయామాత్రంగానే తెలుసు.

ప్రపంచంలోని దూరదేశాలు ఒకదానికొకటి పొగమంచులోంచి వలె, తెరమరుగున వున్నట్లు, మబ్బుగా కనబడేవి. రోము జను లేమనుకొనేవా రంటే — హిందూదేశం చుట్టూ

తెల్లని దంతంతో నిర్మించబడిన పెద్ద ప్రాకారం వుంటుందని! అందుచేతనే ఆ దేశానికి బోవడం అంత కష్టమని వారి భావం! ఏనుగులను వారు 'పాముయెద్దు' లనేవాళ్ళు! రోమనుల దృష్టిలో ఏనుగ మహా విస్తారమైన ప్రాణి. అది పెద్ద యెద్దు లాంటిదే ననీ, దానికి పామువంటి పెద్ద చెయ్యి వుంటుందనీ వాళ్లు చెప్పుకునేవారు!

కాని, ఏండ్లు గడుస్తూన్నకొద్దీ రోమనులు క్రమంగా యీ దూరదేశాల్లోకి చొచ్చుకుపోతూన్నారు. హిందూ దేవతల ఆలయాలతో బాటు అగస్టస్ చక్రవర్తి గౌరవార్థం నిర్మించ బడిన రోమను దేవాలయాలు కూడా మలయాళ తీరంలో కనబడతాయి.

అగస్టసు చక్రవర్తి రోములో ఒక మహా భవనం నిర్మించి, దానిలో రోమను సామ్రాజ్యపటాన్ని చిత్రించ నాజ్ఞాపించాడు. మొట్టమొదటి ప్రపంచపటం యిదేనని రోమనులు దంభంగా చెప్పుకునేవారు. ఆ పటంలో ఉత్తరానవున్న థూలీ మొదలు కొని తూర్పున గంగానదివరకూ గల భూములన్నీ చిత్రించ బడినాయి. లోకమంతా యింతేనని ఆరోజుల్లో భావించేవారు.

రోమనులు ఐగుప్తదేశాన్నుంచి ధాన్యం, నున్ననిరాళ్లు, పాపిరస్ కాగితములు, చిత్రవర్ణ రంజితములైన కాచపాత్ర ములు తెచ్చుకొనేవారు. గ్రీసునుంచి పారియను చలువరాళ్లు, కొరింథియను కాంస్యము, ఖియోస్ మద్యములు, హెమిథ్యూస్ మధువు, సామోస్ నెమళ్ళు, మెనోస్ హంసలు తెచ్చుకొనే

వాళ్ళు. రోమను సంపన్నుల ఉద్యానాలలో యీ హంసలు, మయూరములు అలంకారములుగా ఉండేవి. స్పెయినునుంచి మద్యము, మైనం, ధాన్యం, తాను, వెండి, బంగారు, గుల్ల చేపలు వచ్చేవి. గాల్ దేశము గోధుమ, మద్యం పంపేది. గల్లియా దేశములో తయారైన యెర్రగుడ్డ అంగీలు ధరించే వాళ్లు, బానిసలు. బహుదూరంలోవున్న బ్రిటన్‌లోని థేమ్సు నదీ తీరంలోని లండను రేవునుంచి తగరం తెచ్చేవారు. ఎల్బె నదీ తీరాలనుండి అంబరు వచ్చేది. ర్హా మహానది (వోల్గా) తీరాల్లోనూ, యూరల్స్, ఆల్టాయ్ పర్వతసానువుల మీాదా వేటగాళ్లు తోడేళ్ళను చంపేవారు, బంగారు యిసుకకోసం ఆతు రతగా అన్వేషించేవారు. కాశ్యపసముద్ర తీరస్థ మైదానాల్లో చక్రాల బళ్లమీాది గుడారుల్లోనే గ్రామాలకు గ్రామాలు నివ సిస్తూ, నిరంతరం సంచారం గావిస్తూండేవారు. నదులమీాద గూటిపడవల్లో కూడా యింకా కొన్ని దేశాల్లో జనులు నివ సించేవారు. కాశ్యప తీరాలందలి సంచారజాతులు చర్మాలు, బంగారు యిసుక అజోవు సముద్రతీరాలకు గొనివచ్చేవారు. అక్కడనుంచి గ్రీకు నావికులు వీటిని బైజాంటియం, రోమ్ నగరాలకు గొంపోయేవాళ్లు. ఒంటెలు, గుర్రాలు బారులుతీరి నడుస్తూ యెడారుల్లోంచీ, పర్వతాలమీాంచీ సరకులను మోసు కొనిపోయి, మధ్యఆసియా, అరాబియా, పెరిష్యా, హిందు స్థానం, చీనాలకు పోయి, అక్కడ నుంచి సుగంధద్రవ్యాలు, భోళము (myrrh) చీనాపాత్రలు మజిలినులు, పట్టుపుట్టములు వగైరాలు తెచ్చేవి.

తూర్పు దేశాలకు సముద్రమార్గం కూడా వుంది. సింహళ ప్రాంతంనుంచి కొబ్బరిబెరడుతో నిర్మించిన, సమమైన మట్టుగల పడవలు సముద్రంలో తుపానులను ప్రమాదాలను అన్నింటినీ యెదుర్కొని, చీనా సిల్కు బేళ్ళను గొనివచ్చేవి. మలబారు నుంచి సుగంధ ద్రవ్యాలు, మసాలా దినుసులు, వస్త్రాలు మొదలైనవి ఐగుప్తదేశపు పడవల్లో వచ్చేవి. నేర్పరులైన సరంగులు తమ పడవలను అఖాతముల్లోంచీ, ప్రమాదకరములైన సింధు శాఖల్లోంచీ నడిపించుకుని పోయేవాళ్లు. స్కాట్లండ్‌కు ఉత్తరంగా యెక్కడో వున్న ద్వీపాన్నుంచి చీనాకు పోడానికి ఆ రోజుల్లో యెన్నో మాసాలు, సంవత్సరాలూ కూడా పట్టేది.

రోమునగరం ప్రపంచానికి కేంద్రంగా వుండేది. అన్ని బాటలూ రోముకే దారితీసేవి. అన్నినదుంగా సరకుల్ని రోముకే గొంపోయేవి. ఉత్తరాన నైస్ (డాన్) నదినుంచి; తూర్పున ఆక్సస్ (అమూ-దర్యా) నదినుంచి; దక్షిణాన నైలు నదినుంచి; పడమట థేమ్సు నదినుంచి; పడవలరేవులు, సరకుదించే సేతువులు, - హిందుస్థానం, ఐగుప్తు, పాలస్తీనా, కోల్చిస్ వగైరా సమస్త దేశాల్లోనివీ కూడ రోముకు పోవు మార్గాల్లో మజిలీలు మాత్రమే!

ఛప్పన్న దేశాలనుంచి వచ్చే యీ సరుకులకు మారుగా రోము యేమిచ్చేది? ఎగుమతికి వారికి వున్నదే అత్యల్పము. రోమునగరపు నౌకాశ్రయం ఓస్టియాలో మద్యపుజాడీలు,

ఉన్ని బేళ్లు ఓడల్లోకి యెక్కించేవారు. రోములో బానిసల చేత చేయించిన వస్తువులు కొన్ని గాల్ దేశపు ఆటవికులకు పంపేవాళ్లు. కాని ప్రపంచ మన్ని దిక్కులనుంచీ వచ్చే వాటితో పోలిస్తే, రోముపంపే యీ యెగుమతు లొక లెక్కా, జమా? చీనా, హిందూదేశాలనుంచి వచ్చే వస్తువులకు మారుగా వెండి బంగారాలు చెల్లించాల్సి వచ్చేది. పట్టు బట్టలు, మజిలినులు, పచ్చలు, పద్మరాగాలు, సుగంధ ద్రవ్యాలు,—వీటికి బదులు రోమను బంగారు వెండినాణెములు, దీనారములు, సెస్టర్షియస్‌లు (యివి వెండివి; దీనారులో నాల్గవ వంతు విలువగలవి) చెల్లించువారు. రెండువేలేండ్లకు పిమ్మట రోమకనాణెములు గంగా సింధు తీరములం దెన్నో చోట్ల కనుగొనబడినాయి. ఒక్కొక్క చోట దొంగనాణెము లున్నా దొరికినాయి. రోమనులు దగా, మోసం చేయడాని కేమీ సంకోచించేవారుగారు. అమాయికులైన హిందూ దేశీయులను దగాచేయడం రోమనులకు మరింత సులభంగా ఉండేది.

రోమను లీ ధనరాసుల నెక్కడ సంపాదించేవారు?

తాము జయించిన దేశాల్నీ, ప్రజల్నీ రోమనులు దోచుకునేవారు. ఈ రోమనుల దోపిడీ రెండుశతాబ్దాల పాటు నిరాఘాటంగా సాగిపోయింది. రోమ్ తమ్ము ఓడించింది గనక వారు దానికి కప్పం కట్టాల్సి వచ్చేది. జయించబడిన ప్రతీ పట్టణమూ వెయ్యేటాలెంటులు కప్పం చెల్లించాలి. అంతే

గాక జయించినవాళ్లకైన యుద్ధవ్యయాన్నంతనూ ఓడినవాళ్లు చెల్లించాల్సిందే. బంగారు, వెండితో నిండిన ఓడలు ఒకే ప్రవాహంగా రోముకు వస్తూండేవి. ఒక్కొక్కప్పుడీ ఓడలు యే తుపానులోనో చిక్కి, సముద్రంలో మునిగిపోయేవి. సముద్రగర్భంలోని ముత్యాలు, పగడాలు మధ్యనే యిందులోని వెండిబంగారునాణెములు పడి వుండిపోయేవి.

ప్రతీ సేనాపతీ కోటీశ్వరుడై రోముకు తిరిగివచ్చేవాడు. సామాన్యసైనికులు కూడ వలసినంత దోపిడీ ధనంతో యిళ్లకు వచ్చేవారు. ప్రభు కుటుంబాలకు చెందిన యువకులు ఋణదాతల బాధనుంచి తప్పించుకోడానికి సంతోషంగా యుద్ధాలకు బోయేవాళ్ళు. దండయాత్రల్లో దోచి తెచ్చిన బంగారంతో ఋణాలు రెట్టిగా తీర్చివేసి, మిగిలిన ధనంతో కులాసాగా, సోమరులై యావజ్జీవితమూ గడిపేవారు.

రోము సేనానులు, సీజరుల పటాలాలు అద్భుతంగా పోరాడేవి. వారు చేసిన యుద్ధమల్లా జయించేవారు. దారిలో నది అడ్డు తగిలితే దానిపైన వంతెన కట్టి, నిరాలస్యంగా ముందుకు సాగిపోయేవాళ్లు. మాటున శత్రువు లుంటారేమో ననియైన వెనుదీయకుండా దుర్గమారణ్యాలలోంచి గూడ వాళ్లు వెళ్లేవాళ్లు. రోమనులు యిల్లాంటి దుస్సాహసాల్ని గావించిన దెందుకు? వాళ్ళచేత యింతంత సాహసకృత్యాలు చేయించిన దెవరు? గాల్ దేశాన్ని వడ్డీవ్యాపారుల పిడికిట్లో పెట్టేటందుకేనా? ఏమో, నిజమే అనిపిస్తుంది. రోమనులు నవ్వుతూ

అనేవారు: 'గాల్‌లో ఒక్క సెస్టర్షియస్, ఒక్క కాసు కూడా వడ్డీవ్యాపారుల చేతుల్లో కొంత దిగబడిపోకుండా కదిలేదే కాదు!'

దురాశాపరులైన కుసీదీకులు వడ్డీల రూపంలోనూ, రాజోద్యోగులు పన్నుల రూపంలోనూ గ్రామీణులను నిరంతరం దోపిడీ చేస్తూండేవాళ్లు. రోము ప్రజాస్వామికంగా ఉండిన రోజులు వెళ్ళిపోయినాయి. ఇప్పుడదొక సామ్రాజ్యం. సీజరులు చక్రవర్తులైపోయారు, యిప్పుడు. సీజరుల దోపిడీకి అధీనదేశా లన్నీ లోబడిపోయినాయి. పటాలాలతో బాటు ఉద్యోగులు కూడా గుంపులుగా వెళ్లి, ప్రతిదాని లెక్కలూ తయారుచేసేవాళ్లు. కప్పం కట్టకుండా, పన్ను చెల్లించకుండా ఏ వ్యక్తీ, ఏ సరకూ తప్పించుకుని పోలేకుండా ఉచ్చులు బిగించే వారు. ఒక్క రోమను పౌరునికి 15 గురు యితరులుచొప్పున తమ పటాలాల్లో ఉండేవారని వారే లెక్కలువేసి చెప్పేరు.

రాజమార్గాలు రోమునుంచి అన్ని దిక్కులకూ వ్యాపించి నాయని తెలుసుగదా. అల్లాగే రోమనుల ఆశకూడా అన్ని దిక్కులకూ పరుగెత్తింది. దురాశాపరమైన వాళ్ళ మనస్సులు వేనిని యెక్కువగా కాంక్షించేవి? వాళ్లకి కావలసిన ప్రధాన వస్తువేది? రోమనులకు అదీ యిదీ అని లేదు, అర్థమైన వస్తువు లన్నీ కావాల్సినవే. అందులోనూ బానిసలు వాళ్ళకి ముఖ్యంగా అవసరం. తాము యుద్ధాలకు పోతే పొలాలు బీడు పడిపోయి వుండకుండా వ్యవసాయం చేసేటందుకు రోమనులకు

బానిసలు కావాలి. ప్రపంచంలోని నలుమూలల నుంచీ బాని సలను తెచ్చి రోము బజారులో విక్రయించేవారు. బానిసల్లో కొందరి పాదాలకు సుద్ద పులుమబడి వుండేది. సముద్రంమీద పట్టుకోబడినవా రని దాని సంకేతం! లారెల్ (పొన్న) పూల దండలను శిరోజములపై అలంకరించుకున్న బానిసలు రైన్‌నదీ ప్రాంత దేశంవాళ్లు. వాళ్లకళ్లు నీలంగాను, జుట్టు బంగారు రంగు గాను వుంది. నల్లని ఉంగరాలజుట్టువాళ్ళు ఆఫ్రికనులు.

రోమనులు తమ కధిక స్వేచ్ఛను సముపార్జించుకోడానికి యితరులను బానిసలుగా చేసేరు. వారి స్వాతంత్ర్య బీజాలు బానిసత్వ క్షేత్రంలో నాటబడడంచేత విషఫలాలనే ఒసగి నాయి.

ఎడతెరిపి లేకండా యుద్ధాలు జరుగుతూనే వున్నాయి. ఒక్కొక్కడూ మిగతా అందరితోనూ పోరాడుతూనే వున్నారు. యజమానులు బానిసలతో; ధనికులు పేదలతో; ఓడినవారు జయించినవాళ్ళతో యుద్ధాలు సాగిస్తూండేవాళ్లు.

చరిత్ర పునరావృత్త మవుతూన్న ట్లనిపించేది. కాని, నిజా నికి అట్లా జరగడంలేదు. ఒకసారి జరిగినట్లు మళ్ళా జరగదు. ప్రతీదీ నిరంతరం మారుతూండడమే దానికి కారణం. అదే నదీ ప్రవాహంలో నీవు రెండుసార్లు మునుగలేవు! గ్రీకులు సాధించజాలని దానిని రోమనులు సాధించారు. మధ్యధరా ప్రాంత దేశాలన్నింటినీ వారు జయించగలిగారు.

ఎక్కడో ఐగుప్తులోనో, గాల్‌లోనో రైతులు దున్ని, చల్లి, కలుపుతీసి, కోసి, నూర్చి, విసిరి, ఆ పిండిని రోముకు పంపే వారు. అసలైన రోమనులు పనిచేయడం మానేసి చాలకాల మైంది. పిల్లలతోసహా రోమనులు మాడిపోకండా యీ విదే శాల ధాన్యమే కాపాడాలి. పని అంటే బానిసలకు మాత్రమే తగినదనీ, పౌరులమైన తాము అనుభవానికే జన్మించామనీ వారు భావించేవారు. అంతకిపూర్వం ఒక దశకు వచ్చాక గ్రీకులూ యిల్లాగే భావించేవాళ్లు. చెట్టుచెడే కాలానికి కుక్క మూతిపిందె లన్నట్లు రోమనులకూ యీ పిదపకాలపు బుద్ధులు పుట్టినాయి! తిండిలేక మాడుతూన్నా, యెంత లేమిలోవున్నా రోమను లిప్పుడు పనిచేయడంలేదు. రోము నగరవీధుల్లో తిరు గుతూ, అక్కడా అక్కడా సోమరిగా కూర్చుని బాతాఖానీ వేస్తూ, వీధుల్లో పల్లకీ లెక్కి వెళ్ళే ధనికులనుచూసి అసూయా పిశాచావేశానికి లోనవుతూండేవాళ్ళు.

ఈ పల్లకులు మోసే బోయీలంతా ఒకేమాదిరి దుస్తులు, యెర్రనివి ధరించేవాళ్లు. పల్లకుల చుట్టూ ధూళి ధూసరిత పాదులైన నల్లని బానిసలు పరివేష్టించి నడుస్తూండేవాళ్ళు. ఈ పరివారమే గాక ఆ ధనికునిమీద ఆధారపడి వుండే ఆశ్రి తులు చాలమంది కూడ పల్లకితో పరుగెత్తేవాళ్లు. ఆ ధనికులు కూడా తమ బానిసలూ, ఆశ్రితులూ పల్లకి వెంట రాగా, ఊరేగడం గౌరవంగా భావించేవాళ్ళు. అది వారి కెంతో సంతృప్తి నొసగేది. తమ గౌరవప్రతిష్ఠలు, హోదా, లోకా నికి యిందుమూలంగా వెల్లడి యవుతాయని వారిభావం.

పల్యాంకిక ఒకచో నిలిచేది. ఇరుప్రక్కలా నున్న పల్లకి తలుపుల దగ్గరికి బానిసలు పరుగెత్తేవారు. యజమాని యే వైపు తలుపులోనుంచి పైకి చూడాలనుకుంటాడో, మరి! పల్లకి తలుపులమీద దించిన పట్టు తెరలు ఒత్తిగించబడేవి. ధవళ వస్త్రధారియై ఆ ధనికుడు వెలుపలకు వచ్చేవాడు. ఆతని ధవళవస్త్రాలు గాజుతో నేయబడినట్లుండేవి. వాటిలోపల యెర్రని లోదుస్తు ధరించి వుండేవా డాతడు. ఆతడు జాచిన పాదానికి మేకపిల్ల చర్మంతో చేసిన యెర్రటి పాదరక్షలు, ఆ పాదరక్షలకు దంతంతో చేసిన కొక్కెములూ ఉండేవి. ఇవి చాల హెచ్చుఖరీదువి. గాన ప్రభువులు, మహాధనికులు, పెద్ద ఉద్యోగులూ మాత్రమే ధరించేవారు. పల్లకి దిగిన ఆ సంపన్నుడేదో అసంతృప్తుడై, బాధపడుతూన్నట్లు కనిపిస్తుంది. ఆతని ముఖంలో విసుగుదల కనిపిస్తుంది. ఆతడే గాదు, ఆ నగరంలోని జనులందరూ విసుగుజెందియే వున్నట్లున్నారు! వారిలో యే కొద్దిమందో మాత్రమే బాగాతిని బలిసి వున్నట్లున్నారు కాని చాలమంది ఆకలితో నకనక లాడుతున్నట్లే వున్నారు. క్షుత్పీడితులైన జనులు తిరుగుబాట్లు చేయకండా హద్దుల్లో ఉంచడానికై ప్రభుత్వం ఉచితంగా రొట్టెనూ కులాసా కాలక్షేపానికి సర్కసులనూ సమకూర్చేది.

ఒకప్పుడు యీ పౌరుల పూర్వులు కృషి చేసుకునేందుకై పొలాల నిమ్మని కోరేరు. వాళ్ళ వంశీకులే నేడు హీనదశకు వచ్చి రొట్టెనూ, సర్కసు కాలక్షేపాన్నీ కోరుతున్నారు!

భూమికి బదులు రొట్టె, పనికి మారుగా సర్కసు కాల క్షేపం, – యివి నేడు వీళ్ళకి కావలసినవి !

## మానవులు : జంతువులు

వా రీ సర్కసులో యేమి చూసేవారు? కొరడాలచే తరుమబడి ఒకదానితో నొకటి పోరాడే క్రూరజంతువులను. స్వభావతః యీ జంతువులుకూడ మంచివే. అవి ఒకదానితో నొకటి పోట్లాడేందుకు యిష్టపడేవి గావు. మానవులే వాటిని కొరడాలతో కొట్టి, పోట్లాడునట్లు చేయాల్సివచ్చేది. ఆ జంతువులు ఒండొంటిని చంపుకోడం, వాటి రక్తపాతం చూసినా ఆ మానవులకు తృప్తి లేదు. మానవరక్తం స్రవిస్తే చూడాలని వాళ్లు కుతూహలపడేవాళ్లు; నేరగాండ్రు, ఖైదీలు, దేశ భక్తులు రంగస్థలంలోనికి గొనిరాబడి, క్రూరమృగాలచే తమ కండ్లముందే చీల్చి భక్షించబడాలని వాళ్ళు వేగిరపడేవాళ్లు. ఇంకా ఉద్రేకకరమైన, బీభత్సకరమైన దృశ్యాలకోసమే వారు యెదురు చూచేవారు. మనిషి మనిషితో చచ్చే పర్యంతం పోరాడే ద్వంద్వ యుద్ధాలకై రోమను పౌరులు మనఃపూర్వకంగా ఉవ్విళ్లూరేవారు. ఆ పోరాటాలకే గ్లాడియటోరియల్ యుద్ధాలని పేరు. రంగంమీది యిసుకలో పోరాడేవాళ్ళలో ఒకడు మరణాసన్నుడై కొట్టుకుంటూంటే చూచి తృప్తిచెందే వాళ్ళు, ఆ మానవులు !

ఐతే రోమను నాగరీకుల్లో యీ దౌర్భాగ్యాన్ని ఖండించే వాడు ఒకడైనా లేడా ?

ఆఁ ! లేకేమి, ఉన్నాడు. ఒక్కడే, సినికా యను తత్త్వవేత్త ఒక్కడే, యీ దురంతాలను ఖండించేడు. ఈ అసహ్యాకర దృశ్యాల్ని చూసి, దుఃఖితుడై, సర్కసును వీడి యింటికి బోయీవాడు. వెళ్ళేటప్పుడు చక్రవర్తిగారి దగ్గర సెలవు ఐనా పుచ్చుకోనేవాడుగాడు. ఇంటికి బోయి, లేఖకుని పిలచి యిల్లాగ చెప్పేడు :

"ఈ రోజు మిట్టమధ్యాహ్నం సర్కసులో ఉండడం తటస్థించింది. రక్తప్లావితములూ, జుగుప్సాకరములూనైన హింసదృశ్యములన్నీ ఐపోయివుంటా యనిన్నీ, కండ్లను చల్లబరచే విచిత్ర వినోదకర దృశ్యాలు ప్రారంభించి వుంటా రనిన్నీ భావించి నేనచ్చటికి వెళ్ళేను. కాని, అబ్బే ! అల్లాంటిదేదీ లేదు ! కొరడాలతో బాదీ, కాగడాలతో కాల్చీ ఒకరొకరితో పోట్లాడేటట్లు మానవులను తొందరపెడుతూన్నారు......"

"ఓ రోమను పౌరులారా ! మానవులపట్ల మీ రొనరించు యీ ఘాతుకకృత్యముల ప్రతిఫలం మీకై వేచియుటుంది. ఏదో ఘోరవిపత్తు, దురదృష్టం మీకు అనతికాలంలోనే మూడనై యుందని తెలుసుకోండి."

సినికా చెప్పడం ఆపేడు. ఆయన పచారుచేస్తూనేవున్నాడు. ఈ పరిస్థితుల్లో తన కర్తవ్య మేమిటి ? తానేం చేయాలి ?... తన్నెవరు సమర్థిస్తారు, బలపరుస్తారు ? శత్రువులను, దీనులను

క్షమించమని జనులకు బోధించుయత్నం వ్యర్థంకదా! బానిస లపై దయచూపమని, కనికరించమని కోరడం యెంత హాస్యాస్పదమైనది!

బానిసలు కూడ మనవంటి మానవులే నని చెప్పబూని నప్పుడు జను లాయనను పరిహసించేరు. బానిసలూ ఓ తల్లి కడుపున బుట్టినవాళ్ళే! ఒకే ఆకాశంక్రింద వుంటూ, ఒకే గాలి పీలుస్తూ, మనవలెనే జీవిస్తూ, ఆఖరుకు అందరివలెనే మరణించడంలేదా, వాళ్ళుమాత్రం?

వీళ్ళంతా బానిసలా? కాదు! వీళ్ళూ మానవులే. లోకం లోని జనులందరూ అన్నదమ్ములు.* అందరికీ యీ లోకమే మాతృభూమి, తల్లి!...కాని, ఆయన మాటలను యెవరూ వినేవారూ కారు, అర్థం చేసికొనేవారూ గారు.

కర్తవ్య మేమిటి? అని సినికా ఆలోచించాడు. లోకాన్ని సంస్కరించేందుకు యత్నించాలా?...అది వృథాకాలయాపన మాత్రమే...ఒకరి యిష్టానిష్టాలతో పనిలేకుండా విధి అందరినీ తన కౌగిట్లోకి తీసికొనిపోయే తీరుతుంది. ప్రార్థనలు, వేడికోళ్ళు విధిముందర యేమీ పనిచెయ్యవు. దానికి దయా దాక్షిణ్యాలు లేవు. ఆకాశంలోని నక్షత్రాలు కూడా నియమిత విధిని మీరలేవు. అటువంటపుడు భూమిమీది మానవులా మీరగలిగేది? సమస్తమూ ప్రకృతికి, విధికి లోబడి నడవాల్సిందే. విధి తనకు ప్రసాదించేవాటి నన్నిటినీ మమత

* శ్లో. ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్ ।

లేకండా, ఉదాసీనతతో భరిస్తూ, ధైర్యం కూడబట్టి చరించ డమే యేకైకకర్తవ్యము, మానవునికి.

## ఏది మంచి? ఏది చెడ్డ?

ఏది మంచిది? ధైర్యంతో నిర్లిప్తతతో విధి ఆఘాతాలను భరించుతూండడమేనా? లేక కష్టాల నెదిర్చి, పోరాడి, జయించడమా? ఏం చేయాలి?...ఈ ప్రశ్ననే మహా కవు లెందరో వేస్తూ వచ్చారు. షేక్స్పియర్ మహాకవీ యిదే ప్రశ్న ... మానవుడు కిమ్మనకండా బానిసత్వంలో, కష్టాల్లో బ్రతుకుతూండడమా? లేక వాటి నెదిరించి పోరాడాలా? లొంగిపోయి, బానిసముద్ర వేయమని నుదుటి నందించడమా? దేహంమీదనే కాని ఆత్మమీద శత్రువుకు అధికారం లేదులే! యని సంతృప్తి చెంది, చేతులు ముడుచుకుని జీవించి వుండ డమా? లేక తమమీద అత్యాచారాలు సాగిస్తూన్న వాళ్ళ మీద చేతికి దొరికిన ఆయుధంతో కడవరకూ పోరాడుతూ మరణించడమా? * యశమా? మృత్యువా?

---

* ఈ సమస్యనే భగవద్గీత పిమర్శించి, సర్వాదరణీయమైన సమాధానం యిచ్చివుంది.

*హతోవా ప్రాప్స్యతే స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీం,*
*క్లైబ్యం మాస్మగమః, స్వధర్మేని ధనం శ్రేయః,*
*క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ,—*

ఇత్యాది వాక్యాలతో గావించిన ప్రబోధం అనన్యమైనదని అందరూ స్వీకరిస్తూన్నదే. — అనువాదకుడు.

లక్షల కంఠాలు జవాబిచ్చాయి : 'బానిసత్వం కంటె మరణమే మేలు!' 'అకీర్తి ర్మరణాదతిరిచ్యతే' యన వినలేదా?

లైసియాలోని గ్జాంథస్ పట్టణ వాసులు బానిసత్వం కంటె మరణమే మేలని నిర్ణయించుకొని, అందరూ ఆత్మహత్య గావించుకోడం గాంచి చరిత్రకారుడు ప్లూటార్క్ పరమాశ్చర్య సంభరితుడై యిట్లా వ్రాసేడు :

"స్త్రీలూ పురుషులూ మాత్రమే గాక చిన్న బిడ్డలు కూడా ఆత్మహత్యోద్రేకంతో పరవశులైనట్లు కనబడుతుంది. ఏదో విధంగా ఆత్మహత్య గావించుకోవాలనే దృఢ నిశ్చయంతో వారు అగ్నిలోనికి ఉరికేరు, ఉన్నత శిలాగ్రాల నుంచి దూకేరు. శోకగద్గదకులై మెడదలను నగ్న మొనర్చుకొని, తమవారే పొడిచేందుకు కరకుకత్తులకు యెదురొడ్డేరు. మరి కొందరు తమ్ము తామే పొడుచుకున్నారు."

ఆ దృశ్యాలను చూచి విజేతలైన రోమనులే విభ్రాంతులై పోయారు. సజీవంగా పట్టుకోబడిన వారందరికీ బహుమతు లిస్తామని సేనాపతులు ప్రకటించేరు. కాని, ప్రాణాలతో పట్టు బడ్డ వాళ్లు అత్యల్పసంఖ్యాకులే.

ఈ విధంగా ప్రవర్తించినది ఒక్క లైసియాప్రజలే కాదు. ఎన్ని ప్రదేశాల్లోనో జనులు బొందిలో ఊపిరున్నంతమటుకు పోరాడి, ఓడినపిమ్మటకూడ తిరుగుబాట్లు గావిస్తూ వచ్చేరు. ఒక తిరుగుబాటు అణిగిపోయాక మరొకటి వచ్చేది, తరంగ క్రమంలో. ఒకచోట తిరుగుబాగు నణచివేస్తే మరొకచోట

బైలుదేరేది. రోమను ప్రభుత్వం తమ సైనికశక్తి నంతనూ ఉపయోగించి, వీటన్నిటినీ అణచివేస్తూవచ్చారు. కాని, తిన్న దెబ్బలూ, కొట్టిన దెబ్బలూ కూడా రోమనులనే బలహీన పరచేవి, అలిసిపో జేసేవి. ఘాతప్రతిఘాతములు రెండూకూడా బానిసత్వముపై నిర్మించబడిన రోమను ప్రభుత్వాన్నే క్రుంగ దీసేవి.

తమ సైన్యనివహాలను సామ్రాజ్యంలో ఒక మూలనుంచి మరో మూలకు నడిపించడం రోమను ప్రభుత్వాని కంతకంతకు అధికదుస్తర మవుతూవచ్చింది. అన్ని చోట్లకూ పంపడానికి కావలసినంతమంది సైనికులూ లేరు. జర్మన్, గాల్ దేశాల్లోని తెగలనుకూడా పటాలాల్లో చేర్చుకుని, తిరుగుబాట్ల నణచు టలో ఉపయోగించ నారంభించారు. కాని, యీ బర్బరులు తమతోబాటు గాక తమమీదనే తరచు పోరాటాలు సాగి స్తూంటే రోమనులకు ప్రాణాంతకమైపోయింది.

ఉత్తర పశ్చిమ దిశలలో రోమనులు బర్బర జనులతోనే వ్యవహరించవలసి వుండేది. కాని తూర్పు దేశాల్లో అల్లాకాదు. రోమను లింకా బర్బరదశలో వుండగానే నాగరకతాపథంలో యెంతో పురోగమనం సాగించిన జాతులు, తెగలు తూర్పున వున్నాయి. తూర్పు దేశాలనుంచే ఫొనీషియనులు, గ్రీకులు ద్వారా రోమనులు అక్షరమాలికను సంపాదించుకొన్నది! ప్రాక్పశ్చిమముల కూడలిలో, ప్రపంచ రహాదారుల సంగమ స్థలంలో విజ్ఞానశాస్త్రం జన్మించింది. ఉత్తర పశ్చిమాలలోని

బర్బరజనులతో వ్యవహరించడం కంటె యీ తూర్పు ప్రజలతో వ్యవహరించడం రోమనులకు దుస్సాధ్యమైపోయింది.

ఆసియామైనరులోని చిన్నదేశం యూదియా, పరిమాణంలో తాను చిన్నదైనా శక్తిలో గొప్పదానని అనేకసార్లు చరిత్రగతిలో ఋజువు చేసుకుంది. మహాకాయుడైన గోలియత్ రాక్షసుణ్ణి అర్భకుడైన దావీదు తన ఆత్మశక్తి విశ్వాసాల వల్ల యే రీతిగా జయించేడో యూదియా పాఠశాలల్లో గురువులు పిల్లలకు బోధించుతూ, కథలు చెప్తూండేవాళ్లు. గోలియత్ ముందు దావీదు యెంతో, రోము యెదుట యూదియా కూడ అంతేగదా.

రోమను సైన్యాలు దండయాత్ర గావిస్తూంటే భూమి కంపించిపోయింది. రాతిగోడలను కూడా ఛేదించుకు పోగల 'గొట్టెపొట్టేళ్ళు' అనే దాడి యంత్రాలు; పెనుపాషాణాలు విసరే యంత్రాలు; బాణాలు వదలే యంత్రాలు మొదలైన వెన్నెన్నో భూనభోంతరాళాలు బ్రద్దలగు లాగున సందడి చేస్తూ సాగుతూండేవి. ఒక్కుమ్మడిగా విరుచుకుపడే యీ దాడియంత్రాలనుంచి యెంతటి బలవత్తరమైన దుర్గమూ కూడ సురక్షితంగా ఉండలేకపోయింది.

పటాలాలు పురోగమిస్తూంటే దేశాలన్నీ సర్వనాశనమైపోయావి. నగరాలు నామరూపాలు లేకండా నాశనమయేవి. ఉద్యానాలు, పండ్లతోటలు, ద్రాక్షతోటలు, ఆలివ్ తోపులు సర్వమూ పురుగునాకి పోయావి. రోమనులు హిందూదేశం

వరకూ విజయయాత్ర గావించి, పోంతస్‌కు మరలేరు. అక్కడ నుంచి కాకసస్, సిథియన్ దేశాలకు పోయి, జర్మన్ అరణ్యాలకూ, అక్కడనుంచి దక్షిణంగా రోముకు మరలేరు. రోమను సామ్రాజ్య సైన్యాలు యీ విధంగా జైత్రయాత్ర కుపక్రమించి, ప్రపంచప్రదక్షిణం గావించాయి.

ప్రపంచం చతుస్సముద్ర ముద్రితమై వుందని జన నమ్మకం ఉండేది. గనుక రోమను సామ్రాజ్యానికి సముద్రములనే హద్దులుగా చేయాలని వారి కోరిక. రోమనుల కడపటి సేనాని, గైయస్ జూలియస్ సీజర్ ఆజ్ఞ అయింది.

హిందూదేశానికి పోవాలంటే దారిలో మరి యెన్ని దేశాలున్నాయి! మధ్యధరాసముద్ర తూర్పుతీరంలో పటాలాలు దిగగానే ముందుగా తగిలే దేశం యూదియా. అది చాల చిన్నదీ, అనామకమైనదీను. మహా బలిష్ఠమైన రోమను సామ్రాజ్యశక్తి ముందు అర్భకమైన యూదియాదేశం నిలవబడగలదా? రాతిగోడలైనా లేవు, యూదియాకు. అక్కడి ప్రజ, యూదులకు వున్నదల్లా తమ ధర్మమునందు, ఆత్మశక్తియందు, సత్యములోనూ అచంచలమైన విశ్వాసముమాత్రమే. యూదుల దేవుడు రోమనులు పూజించే దేవతల వంటివాడు గాదు. ఆ దేవునికి విగ్రహాలు లేవు. ఆయన రూపరహితుడు, అదృశ్యుడు, ఏకమేవాద్వితీయుడూ నని వారి నమ్మిక. సత్యం యే రీతిగా నిరాకారమో అట్టే నిజమైన దేవుడున్నూ ఆకార రహితుడని యూదుల ప్రవక్తలు చేప్పేవారు.

అదృశ్యుడైన, నిరాకారుడైన దేవుడంటే రోమనులకు ఊహాతీతంగా ఉండేది. యూదు దేవాలయాలు, సినగోగ్‌లు, రోమనులకు బోసిగానూ, విచిత్రంగానూ కనిపించేవి. కను చూపు పారినంతమేర యెక్కడా ఒక్కవిగ్రహమేనా ఉండదు. రోమనులకి ప్రభుత్వ శాసనాలకు వలెనే వాళ్ళ మతానికిన్నీ ఖచ్చితమైన, నిర్దిష్టమైన రూపం ఉండేది. వాళ్ళ సుశిక్షిత సైనికనిర్మాణానికి వలెనే వాళ్ళ దేవతాగణం కూడా పెద్దా చిన్నా హోదాలతో క్రమబద్ధమై వుంటుంది. రోమనులు శాసనాలు చేయడంలో బహు నేర్పరులు. దేనికైనా నిర్దేశి తత్వం ప్రధానమని వారెరుగుదురు. దేవేంద్రుడైన జూపిటరు నుంచి క్రిందికి దేవుళ్ళు సోపానపరంపరగా పంక్తులు దీరి వుంటారు, వారి మతంలో. లోకంలోని ప్రతి వస్తువుకూ అధి ష్ఠాన దేవత లుంటారు. గుర్రాలు, గొర్రెలు, పొలాలు, పంటలు, మద్యము, ధనము, – ఒక టేమిటి, ప్రతిదానికీ దేవత లుంటారు. ధనాన్ని కాపాడుకోదలచినవారు ధనాధిష్ఠాన దేవ తను ప్రార్థించాలి. ఇంటి తలుపులకే గాక తలుపు బందుల కున్నూ ఒక దేవత ఉంది! కుంభకారులు తమ దేవతకూ, రైతులు వారి దేవతకూ మ్రొక్కుకునేవాళ్ళు. అంతేగాదు. రోమనులు పరదేశీయుల దేవతలకు కూడ మ్రొక్కడానికి సంసిద్ధులే. ఐగుప్తీయుల ఐసిస్‌కు, పెరిష్యనుల మిత్రాస్‌కూ రోమనులు పూజలు, బలులు సమర్పించేవాళ్లు. రోమను చక్రవర్తి తన తమ్ముని కుమారుడు ఆక్టేవియస్ సీజర్‌ను దేవ

తల హోదాకు యెక్కించినపుడు, వారు ఆతనినీ పూజించేరు, మొక్కులు చెల్లించేరు! ఈ క్రొత్తదేవునికోసం ఒక క్రొత్త బలిపీఠం, వేదిక నిర్మించబడింది. అక్కడ పూజల నందుకునేం దుకు కొత్తగా పూజారులు నియమించబడ్డారు. ఈయనను 'అగస్టస్' అనగా 'దీవన లిచ్చువాడు' అని సంబోధించా లన్నారు. ఈయన పేరు జూపిటర్ నామం ప్రక్కనే వుంచ బడింది. రోమను లీయననూ పూజించేరు. అగస్టస్ కోరిన దిదే. యావత్ స్వామ్రాజ్యానికీ ఒకే ఒక దేవుడు. ఇందు వల్ల ప్రజలంతా ఒకే బంధనంలో యిమిడివుంటారు. ఒక్కని యందే లౌకిక పారలౌకిక శక్తులన్నీ యిమిడి ఉండడం చక్ర వర్తికి చాల అనుకూలంగా ఉండేది.

కొత్త చక్రవర్తి వచ్చినపుడల్లా ప్రజ లాయనను పొగడు వారు: 'నీవే సీజరువు! నీవే అగస్టస్‌వు! నీవే దేవుడవు!'

దేవేంద్రుడైన జూపిటర్ అధికారానికి వలెనే సీజరు అధి కారానికిన్ని పరిమితులు లేవని ప్రజ లెరుగుదురు. సీజరు మంచివాడయితే ప్రజలను దయతో చూసేవాడు, వాళ్ళని ఆదరించేవాడు. అతడు క్రూరుడూ, దుర్మార్గుడూ ఐతే ఆయన క్రౌర్యాన్నీ, అత్యాచారాల్నీ అడ్డుకొనేందుకు కాని, నిరోధించేందుకు కాని యెవరికీ సాధ్యంకాదు.

రోమను చరిత్ర గనుక చదివితే మనకు మార్కస్ ఆరి లియస్, కమ్మోడస్ చక్రవర్తు లిద్దరూ విశిష్టంగా కనబడ తారు. మార్కస్ ఆరిలియస్ నిస్సంగి, సుఖదుఃఖసముడైన

వేదాంతి; యీాయన తత్త్వవేత్త సినికా బోధనల ననుసరించు వాడు. సింహాసనంమీాద రాజదుస్తుల్లో ఉండిన్నీ పరమ వేదాంతిగా ఉండగలిగే రాయన. వినోదం పేరిట సర్కసులో జరిగే రక్తప్లావితక్రూరకృత్యా లన్నిటినీ ఆయన ఆపుచేయిం చేడు. యెప్పుడేనా సర్కస్‌కు వెళ్ళవలసి వచ్చినా మార్కస్ ఆరిలియస్ చక్రవర్తి ఒక్కసారికూడా అక్కడి వినోద దృశ్యా లను చూడకుండా యేదో గ్రంథం చదువుకుంటూండేవాడు. మానవుడు ఉత్తమజీవితం యెల్లా గడపాలా ? అనే దాన్ని స్వోదాహరణ రూపంగా చూపిస్తూన్నట్లుండేది, ఆ చక్రవర్తి జీవితం.

ఈయన పుత్రుడే కమ్మోడియస్. అతడు తండ్రికి కేవలం వ్యతిరేకంగా ఉండేవాడు. తండ్రి తొలగించిన గ్లాడియేటర్ల ద్వంద్వయుద్ధాల నీతడు పునరుద్ధరించేడు. సర్కస్ రంగంలో జంతువులు జంతువుల్నీ, మనుషుల్నీ చీల్చి, భక్షించేటందుకు యీాయన అవకాశాలను తిరిగి కలిగించేడు !

ఒకరోజున సర్కస్‌లో కమ్మోడస్ చక్రవర్తి స్వయంగా ఖడ్గాన్నెత్తి, అక్కడి ఉష్ట్రపక్షి తలను యెగురగొట్టేశాడు. ఆ సమయంలో ఆయన యేమీా మాట్లాడలేదు గాని తన చుట్టూ ఉన్నతస్థానాల్లో కూర్చుని వున్న సెనేటర్లకు గుణ పాఠంగా ఉండాలనే ఆయన ఊహ. సెనేటర్లు యిదిచూచి గడ గడ లాడిపోయారు. వారికికూడ యిట్టి దుర్గతి యేక్షణంలో నైనా పట్టవచ్చునని చూపడానికే యిల్లా చేసేడని సెనేటర్లు గ్రహించకపోలేదు.

మనం తిరిగి యూదియాపై దండయాత్ర కథకు వద్దాం.

రోమను చక్రవర్తిని దైవంగా కొలిచేందుకు యూదులు ఎంతమాత్రం అంగీకరించలేదు. రోమను సామ్రాజ్య పౌరులందరికీ చక్రవర్తిని పూజించుట విధి విహితధర్మమైనా యూదులు దీనిని లక్ష్యపెట్టలేదు. అవాఙ్మానసగోచరుడూ, ఏకమేవాద్వితీయుడూ, సర్వజగత్స్రష్టా ఐన తమ దేవుడు, యెహోవా యందు వారికి గల భక్తి విశ్వాసాలు అకుంఠితంగా వుండిపోయినాయి. బుద్ధి, శక్తి, పవిత్రత, సత్యము, మంచి మొదలైన కల్యాణగుణములలో సుస్థిరుడున్నూ, శాశ్వతుడు, ఆద్యంతరహితుడూ నైన ఈశ్వరుడే పూజార్హుడని యూదులు నమ్మేవారు. వారి ఆ నమ్మిక అచంచలంగానే వుంది.

అట్లాంటి విశ్వాసం గల చిన్న యూదియా దేశం, ప్రజ, మహాఘోరమైన రోమను సామ్రాజ్యంమీద తిరుగబడ సాహసించింది.

రోమను లోక సైన్యనివహాన్ని పంపించేరు. ఒక నివహం రెండువారాల్లో యూదుల పవిత్రస్థానమైన యెరూషలేమ్‌ను పట్టుకోగలదని వారి అంచనా. కాని, రోమను సైన్యం శీఘ్రం లోనే పలాయనమంత్రం పఠించాల్సినస్థితి వచ్చేసింది! వాళ్ళని యూదులు తరుముతూ వెంటాడేరు. యూదులు విజయులై, రోమనుల దాడి యంత్రాలనన్నిటినీ పట్టుకున్నారు. రోమను సైనికులు ప్రాణాధికంగా పరిగణించి పూజించే గృధ్రధ్వజం,

స్వర్ణరంజితమైనది, శత్రువుల చేతిలో పడి ఛిన్నాభిన్నమై పోయింది.

కొన్ని మాసాల పిమ్మట రోమనులు పెద్ద సైన్యంతో యూదియామీద మరల దాడిచేసేరు. ఈ సారి యూదియా సర్వనాశనమైపోతుం దని అంతా అనుకిన్నారు. ద్రాక్ష తోటలు, ఆలివ్ తోపులు, దేవదారు అడవులు, సర్వమూ నాశనం చేస్తూ, రోమనులు సాగుతూన్నారు కాని, చిన్న చిన్న గ్రామదుర్గములు కూడ బహు పట్టుదగా రోమను సైన్యాల నెదిర్చి పోరాడుతున్నాయి. దండయాత్ర నెలల మీద నెలలుగా సాగుతూనేవుంది. ఈ సైన్యాల తోడుగా మరికొంత సైన్యాన్ని రోమనులు తెచ్చుకున్నారు ఇప్పటికి వారు తమ శత్రువుయొక్క శక్తిసామర్థ్యాలను అంగీకరించాల్సి వచ్చింది. రెండు సైన్యనివహాలతోనే రోమనులు ఈజిప్టు దేశాన్ని జయించగలేరు; నాలుగు సైన్య నివహాలతో గాల్స్ దేశాన్నంతనూ ఆక్రమించుకున్నారు. అటువంటిది యెరూష లేమ్‌ను పట్టుకోడానికి పది సేనానివహాలను రోమనులు పంపేరు. చక్రవర్తి స్వయంగానే వాటికి నాయకత్వం వహించి బైలుదేరాడు.

యూదియాను లొంగదీయడానికి రోమనులు సర్వవిధాలా యత్నించేరు. ఎందుకంటే చిన్నదైన యూదియానే తాము లొంగదీయ లేనిచో మిగిలిన దేశాలుకూడ తప్పకుండా తిరగ బడతాయి. అప్పుడే జర్మనీ, గాల్ ప్రాంతాల్లో కల్లోల

సూచన లారంభమైనాయి. యెరూషలేమ్ చుట్టూ యెత్తైన మట్టి ప్రాకారం వుంది.

ఇది రోమనుల 'తాబేటి' యంత్రాల ధాటికి యెదురొడ్డి నిలిచింది. ఈ 'తాబేలు' శరీరం కంచుతోనూ, తల యినుప గుదియగానూ వుండేది. ఇవి తలతో కోటగోడలను దొలుచుకుంటూపోతాయి. యూదులు సొరంగాలు త్రవ్వి, యీ రోమను తాబేళ్లను వాటిల్లో పడగొట్టేవాళ్లు. మహా భారమైన లోహ కూర్మములను మోయలేక భూదేవియే క్రుంగిపోయినట్లు శోభించేది. నగరాన్ని ముట్టడించి, లగ్గలుపట్ట జాలమని తెలుసుకొన్న రోమనులు ఆకలి దేవతనాశ్రయించేరు. యెరూషలేమ్ చుట్టూ మరొక గోడను లేవదీసి, నగరానికితర ప్రపంచంతో సంబంధాలు లేకండా చేసేరు.

యెరూషలేమ్ క్షుద్బాధకు లోనైంది. ఆకలితో మరణించిన వారిని పాతిపెట్టడంకూడ అసాధ్యమైపోయింది. శవాలను బైటి కందకంలోనికి ప్రాకారం మీదినుంచి విసరివేసేవారు. తప్పించుకుని పోవ ప్రయత్నించిన వారిని రోమనులు పట్టుకుని శిలువను వేసేవాళ్లు. కొయ్యశిలువలు యెరూషలేమ్ చుట్టూ కుక్కగొడుగుల్లా బైలుదేరాయి. తోడేళ్లు, నక్కలు, చిఱుతలు తండోపతండాలుగా వచ్చి తింటూన్ననూ శవాలు తరిగేవేగావు.

ఇంత జరిగినా యెరూషలేమ్ లొంగనేలేదు.

ప్రాకారంలోపల మరో ప్రాకారాన్ని యూదులు నిర్మించేరు. కూర్మయంత్రాలతో వెలుపలి ప్రాకారాన్ని భేదించి, లోపలకు ప్రవేశించిన రోమనులు మరో ప్రాకారం అడ్డురాగా ఆశాభంగం చెందేవాళ్లు. చివరకు దేవాలయం యెత్తుగావున్న గోడలమీంచి కానవచ్చింది, రోమనులకు. చుట్టూ బ్రహ్మాండమైన రాతిగోడలతో అది దుర్భేద్యంగా వుంది. దాన్ని తామెన్నటికైన స్వాధీనం చేసుకోగలమా ? అనుకున్నారు, వారు. దాని కప్పు బంగారు రేకులతో తాపటం చేయబడివుంది. స్తంభాలు చలువరాతివి. గోడలు దేవదారు, తమాల వృక్షముల పలకలతో కప్పబడివున్నాయి. నేలమీాద చిత్రవర్ణ రంజితములైన పెంకులు పరచివున్నాయి.

తామే మహానాగరకులమని విర్రవీగుతూన్న రోమనులు యీ సుందర దేవాలయాన్ని చూచి, విస్మయాశ్చర్య పరీతులై పోయారు. లోకంలోని మిగిలిన వాళ్ళంతా బర్బరులూ, ఆటవికులూ నని వాళ్ల విశ్వాసాభిప్రాయం !

కాని నిజానికి బర్బరు లెవరు ? దేనినిగాని నిర్మించినవారా ? నాశనం గావించేవారా ? ఆత్మరక్షణకై ప్రాణాలను ఒడ్డి నిలిచినవారా ? ఇతరులను నాశనం చేసేందుకు వచ్చినవారా ?

ఒక జాతికి దేవాలయాలున్నాయి. అవి వారికి పరమ పవిత్రములైనవి; గర్వకారణమైనవీను. మాతృదేశానికీ దేవాలయాలు హృదయకమలం వంటివి. రెండో జాతి వారికి గలదంతా యితరులను జయించాలనే కండూతీ, వాళ్లని

దోపిడీచేయాలనే తహతహా, వాళ్లని నాశనం చేయ్యాలన్నే పైశాచికతృష్ణా మాత్రమే. ఎదుటివారి సంపదలను, వెలలేని ఆభరణములను కొల్లగొట్టి, చంపగా మిగిలినవాళ్ళని బానిసలుగా తీసుకొని పోవడమే వాళ్ల పని.

ఆరురోజులు అహోరాత్రాలు రోమనుల తాబేటి యంత్రాలు కోట గోడల్ని భేదించడానికి యత్నిస్తూనే వున్నాయి. పొడుగాటి నిచ్చెనలు కట్టి, బురుజులపైకి ఎగ్రబాకుతూనే వున్నారు, వాళ్లు. ప్రాకారాలమీద నుంచి యూదులు నిచ్చెనలనూ, వాటిపైనవున్న సైనికులతోసహా క్రిందికి త్రోసివేస్తూన్నారు. ఎల్లాగైతేనేమి, చివరకు రోమనులు యూదుల దేవాలయంలోనికి చొరబడగలిగేరు. బలిపీఠ సమీపానికి వచ్చేసరికి వాళ్లమీద అంపవాన కురిసింది. ఈ దేవాలయమే ఒకదుర్గం. చిట్టచివరి వరకూ దేవాలయం దుర్గంగానే నిలచింది. గర్భాలయంలో పెద్ద పురోహితుడు పూజాతంతు నడిపిస్తూన్నాడు. గర్భాలయంలో చేరి నిలచియున్న యూదు పురోహితులు వారి పవిత్రగ్రంథాలను ఉచ్చైస్స్వరంతో గానం చేస్తూనే వున్నారు. రోమనులు కసాయివాళ్లలా యీ నిరాయుధులను చంపుతూన్నా ఆ పురోహితులు వెనుదీయలేదు.

దేవాలయం పరశురామప్రీతి చేయబడింది. ఆఖరికి మిగిలినవారు దేవాలయశిఖరంమీది బంగారు రేకులను పెరికి, వాటిని శత్రువులమీదికి చక్రాయుధాల్లాగ ప్రయోగిస్తూ, కడసారి తమ పవిత్రగీతాల్ని గొంతెత్తిపాడేరు...

దేవాలయావశేషాలనుంచి రోమనులు యేడు కొమ్మలు గల వెండి దీపస్థంభాన్ని త్రవ్వి తీసారు. పవిత్ర కలశములు, పళ్లెరములు, ఘంటలు మొదలైనవన్నీ వెతికి తీసుకున్నారు. తమ బంగారు గృధ్రధ్వజాన్ని యూదులు తునకలు చేసినట్లు గానే, వాళ్ల యీ పవిత్రవస్తువులను కూడా పగులగొట్టా లని రోమనులు సంకల్పించారు. దేవాలయం పడగొట్టబడింది. కాని, యూదులకు గల దైవవిశ్వాసం మాత్రం నిలచేవుంది. వారి ధైర్యమున్నూ మొక్కవోకండా నిలిచింది.

మరి కొద్ది యేండ్లలోనే యూదులు రోమనులపై తిరగ బడ్డారు. జాతి రక్షకుడొకడు బైలుదేరాడు. ఆయన పేరు బార్ కోఖ్బా. ఈ మాటకు 'నక్షత్రపుత్రుడు' అని యర్థం. ఆయన దుర్గాలు నిర్మించి, సేనలను తరిఫీదుచేయ నారంభిం చేడు. ఈ సారి రోమనులు తమ అత్యుత్తమ సైన్యాలను బ్రిటన్ నుంచి తెప్పించారు. వాటికి నాయకుడుగా జూలియస్ సీజర్ వచ్చాడు. ఆయన మహారథుడు. ఐతేనేం? యూదులు లొంగలేదు. నేలసొరంగాలతో కలుపబడిన దుర్గాలను వారు నిర్మించేరు. ఒకదుర్గం పడిపోయినపుడు అందులోనివా రందరూ యీ సొరంగాల ద్వారా మిగిలిన కోటల్లోకి తప్పించుకుని పోయేవాళ్లు.

రోమను చరిత్రకారు డొక డిట్లా వ్రాసేడు: "ఆహా! ఏమి దుష్టజనులు! జన్మభూమిలోనే పాతుకుపోవా లను కుంటారే! తమ దేశం శత్రువశం కావడానికి ప్రాణాలు పోయినా అంగీకరించరు, వీళ్లు."

రోమను లెన్నడూ యూదులతో బాహాబాహీ పోరాటా నికి సాహసించలేదు. ఒక్కొక్క కోటనే చుట్టుముట్టి, లోపలి వాళ్ళకి నీళ్ళూ, తిండీ దొరక్కుండా చేసేవాళ్ళు. ఇల్లాంటి ముట్టడి చాలాకాలం సాగేది. ఆఖరికి దుర్గం పట్టుకోబడేది. ఈ రీతిగా ఆఖరుకోట కూడా పట్టుకొన్నారు. యుద్ధంలో బార్ కోఖ్బా చంపబడ్డాడు. యూదియా దేశం శ్మశానప్రాయమై పోయింది. పురుషు లందర్నీ చంపి, స్త్రీలను, పిల్లలను బందీ లుగా తీసుకుపోయారు. రోమను బానిస అంగళ్ళలో యూదు బానిసలు పశువుల కన్న చౌకగా విక్రయించబడ్డారు.

యూదుల మాతృభూమి నాశనమైపోయినను, వారి పవిత్ర గ్రంథాలు మాత్రం వినష్టంగాలేదు. ఏమిటా గ్రంథాలు? పూర్వపు యూదు మహాపురుషుల, వీరుల గాథలను గూర్చినవే యీ గ్రంథాలు. వారి మహాత్ములు చెపుతూవచ్చిన భవి ష్యత్ స్థితి, సాంప్రదాయాచారాదులు, సూక్తులు, ధర్మ ప్రవచనాలు, భావపరంపరలు, — యివే వారి గ్రంథాల్లో నిక్షిప్తములు. ఇవే వారి సంపద. పరదేశవాసకాలంలో యీ పవిత్రగ్రంథాల్లోని భవిష్యద్గతిని తలచుకుంటూ, పూర్వ గాథలను వల్లె వేస్తూ గడిపేవారు, యూదులు. మానవు లొకరినొకరు హింసించుకోనట్టి, చంపుకోనట్టి సుదినాలకై యెదురుచూస్తూండేవాళ్ళు, బహు విశ్వాసంగా. ఆ సుదినాలు వస్తే అప్పుడింక క్రూరజంతువులు కూడా హింసను వదిలి వేస్తాయి! "తోడేలు మేకపిల్లతో నొక్కచోటనే నివసించు

నా చోట...చిన్న పిల్లవాడే వాటిని చూస్తూంటాడు." ఆ గ్రంథాల్లో అట్టి స్వర్ణయుగం రానైవుందని వ్రాసివుంది.

యూదులు ఒక దేశాన్నుంచి మరొక దేశానికి తరుమబడుతూ, అన్ని జాతులచేతా హింసించబడుతూ పరిభ్రమించేరు.

ఆ తరువాతి కాలంలో జర్మను బర్బరజాతుల దెబ్బలకు రోమను సామ్రాజ్యం పతనమైపోయింది. ఆ కాలంలో 'పుస్తకం' అనే మాటైనా యెక్కడా వినబడలేదు. జగత్ప్రసిద్ధులైనవారికి కూడా ఆ కాలంలో చదువుసంధ్యలు లేనే లేవు.

ఈ అంధకారంలో కూడా కొందరు వెలుగును నిలిపేరు. తమ పూర్వుల అమూల్యానుభవాల గాథలను, తమ మహాత్ముల, ఋషుల అమూల్యోపదేశాలను తమ సంతతులవారికై నిలిపివుంచిన వారెవరు? యూదులే. వారికి తమ ప్రాణముల కంటెనూ గ్రంథములే ప్రియతమములైనవి.

## మానవునికి నిష్ఠురశిక్షణ నొసంగిన పాఠశాల

మానవుని మార్గం రొముగుండా పోయింది. ఆ మార్గమెట్టిది? మహా సంకటావస్థలు, మహోజ్జ్వలకీర్తికర ఘట్టములు, అతి లజ్జావహ కృత్యములు,—వీటన్నిటతోనూ కూడిన దా ఘంటాపథం. నైచ్యమహాత్మ్యాల మధ్యనున్న అడ్డుతెర అత్యల్పమైనది. ఈ రెంటికీ మధ్యను ఒక్క అడుగే దూరం.

చట్టం, శాసనం అనేదేమిటి? విశేషమైన పశుబలాన్ని చూపగలిగిన బందిపోట్లు, పాలకులనే ఘనమైన పేరుతో తమ దుష్కార్యాలను నిశ్చింతగా, ప్రశాంతంగా సాగించేందుకు అల్లినవే శాసనాలు.* క్రమంగా పాలకుల అధికారం యెక్కువవుతూవచ్చింది. దీని అర్థం ఏమిటి? పాలితులంటే అధికార వర్గాలకు గల భయం, వారి క్రోధప్రతీకారాల పట్ల వాళ్ళకి గల జంకు, — వీటిని కొలిచే సాధనం పాలకులు గావించే అధికారిక శాసనాలే.

మానవుడు పొడుగునా యెన్నో కష్టనిష్ఠురాలనూ, భయంకర బాధలనూ అనుభవిస్తూండవలసి వచ్చింది. తా ననుభవించిన బాధలు కష్టాలులోనుంచి మానవుడు యెంతో కొంత నేర్చుకుంటూనే వచ్చాడు.

రోమక శాసనాలు రోమనులైన పౌరుల హక్కులనే రక్షించేవి. బర్బరులు, బానిసలు, విదేశీయులు మొదలైన వారికి యీ చట్టాలక్రింద యే హక్కులున్నూ లేవు. ఐననూ పౌరుల హక్కులనూ, విధులనూ రోమక శాసనాలు బహు నిర్దిష్టంగా నిర్దేశించడంవల్లనే, అనేక శతాబ్దాల తరువాత యిప్పుడు కూడా అవి అనుసరణీయములుగా వున్నాయి. ఒక పౌరుని హక్కులు, విధులు, — యివే అందరి హక్కులూ, విధులూ ఐన యిప్పుడు కూడా రోమకచట్టాలను పండితులు పఠించి, పాఠం నేర్చుకుంటూనేవున్నారు.

---

* దీనికి మినహాయింపులున్నాయి. కాని లౌకిక, రాజకీయ, ఆర్థిక రంగాల్లో యీ సూత్రం సర్వత్రా వర్తించుతుంది. — అనువాదకుడు.

రోమను శిక్షణ, తమ సైనికుల్ని అదుపు ఆజ్ఞల్లోనూ, కట్టుబాట్లలోనూ ఉంచేటందుకై సృష్టించబడింది. ఇదే ఆ పిమ్మట స్వదేశరక్షణ గావించుకునే సైన్యాలకూ వరవడి అయింది. రోమనుల ధైర్యసాహసాలు, శిక్షణ మొదలైన వాట్లనుగూర్చి ప్లూటార్కు యిట్లా వ్రాసియున్నాడు :

"ఒకప్పుడు కొందరు శతాధిపులు అంటే సేనాపతులు ఒక బాడవ ప్రదేశంలోనికి చొచ్చి, చిక్కువడి, శత్రువుచేత నోటువడ సిద్ధంగా వున్నారు. సీజరు దీని నంతనూ చూస్తూనే వున్నాడు. ఆ సమయంలోనే ఒక సైనికుడు సంకులసమరం లోని కురికి, బర్బరులతో ఘోరంగా పోరుతూన్నాడు. మహా సాహసకృత్యాలు గావించి, ఆ సైనికుడు శతాధిపులను వినా శాన్నుంచి తప్పించేడు. ఆ చిత్తడి నేలలోంచి బైటపడేందు కాతడు తన డాలును వదలివేయవలసివచ్చింది. ఆతడు సుర క్షితంగా వచ్చినందుకు సీజరూ, ఆయన పరివారమూ కూడా మహోత్సాహంతో పొగడ నారంభించేరు. కాని, ఆ సైనికుడు కన్నులలో లజ్జాబాష్పములు జాలువారగా సీజరు ముందు సాష్టాంగంగా మ్రొక్కి, క్షమించమని కోరేడు. సీజరుయెదుట డాలు లేకండా నిలబడవలసి వచ్చినందుకు ఆతడెంతో ఖిన్నుడై, అవమానం జరిగినట్లు బాధపడ్డాడు."

యోధుల కిది గొప్ప ఉదాహరణము కాదా ?

సీజరు, రోమను సేనాపతులలో మహారథికుడు. ఆయన కూడ తన సైనికులకు ఉదాహరణప్రాయంగానే ఉండువాడు.

అసలు సీజరు అంత ఆరోగ్యవంతుడు గాడు. ఐనను ఆయన నిరంతరం పనిచేయడంవల్లనూ, నెల్లడి ప్రదేశంలోనే యెప్పుడూ గడపడంవల్లనూ తన అస్వాస్థతను అధిగమించేందుకు యత్నించే వాడు. ఎప్పుడూ పురోగమిస్తూనే ఉండడానికి సీజరు పల్ల లోనో, బండిలోనో పండుకొనేవాడు. గతుకుల దారుల్లో బండి కుదుపులో నిద్రాసుఖం వేరే చెప్పాలా? సైన్య సమీక్ష గావిస్తూ, గుర్రపుస్వారీ చేస్తూ, ఆయన లేఖలనూ, ఆజ్ఞలనూ చెపుతూ యిద్దరు కార్యదర్శుల చేత వ్రాయిస్తూండేవాడు. ఆయన కాలపు విలువ నెరిగిన దిట్ట.

గాల్ ప్రజలు తన అధికారాన్ని ధిక్కరించి, తిరుగుబాటు ప్రారంభించేరని ఒక రోజున సీజరుకు వార్త అందింది. నదు లన్నీ గడ్డకట్టిపోయివున్న శీతకాలమది. అరణ్యమార్గాలు కొన్ని చోట్ల లోతైన మంచు క్రింద కప్పబడివున్నాయి, మరికొన్ని చోట్ల నీళ్లలో మునిగివున్నాయి. హఠాత్తుగా సీజరు ససై న్యంగా తిరుగుబాటుచోట ప్రత్యక్షమైనాడు. ఆయనకీ వార్త అందివుండదనే స్థితిలో సైన్యాలతో సీజరు ప్రత్యక్షం గావడం శత్రువులకు అత్యాశ్చర్యకరమైపోయింది.

సీజర్ యెప్పుడూ యిల్లాగే పనిచేసేవాడు. అనుమాన మైనా లేని శత్రువుమీద పిడుగుపాటులా పడేవాడు.

పదేండ్లలో ఆయన 800 గాల్ దుర్గాలను ముట్టడించి పట్టు కున్నాడు. 300 తెగల జనులను లొంగదీసేడు. గాల్ ప్రజ లత్యంత ధైర్యసాహసాలతో ఆత్మరక్షణ గావించుకున్నారు.

ఆఖరికి స్త్రీలూ బిడ్డలూ కూడా ఊపిరి ఉన్నంతవరకూ ధైర్యంగా పోరాడేరు. కాని, సీజరు దండులు వారి శక్తికి మించినవై పోయాయి.

ఎన్నో జాతులను జయించి, యెందరినో హత్యగావించి, మరెందరినో బానిసలను గావించుకొన్నవాడు, సీజరు. ఒక్క గాల్ దేశంలోనే ఆతడు పదిలక్షల జనులను చంపించేడు. మరో పదిలక్షలను బానిసలుగా తెచ్చేడు. సీజరు పటాలాలు కనబడితే చాలు, జనుల్లు భయభ్రాంతులై, వెక్కి వెక్కి యేడుస్తూ, కన్నీరు కాలువలు గట్టించేవాళ్లు. ఆయన పటాలాలు కొల్లగొట్టిన సొమ్మును మోసుకుపోతూంటే స్థానిక ప్రజలు కన్నీళ్లతో దారి తడిపేవారు. ఏదేమైనా సీజరు మహా సేనానుల్లో యెన్నదగినవా డనడం నిస్సందేహం. శతాబ్దాల తరువాతకూడా సేనలను నడపినవారూ, స్వదేశరక్షణ గావించుకొన్న వాళ్లూ కూడా సీజరు యుద్ధతంత్రాన్ని బట్టే పాఠాలు నేర్చుకుంటూ వచ్చేరు.

ఔను, మరి. రోము నగరమనే గురుకులం బహు విస్తారమైనదే. దానిని బానిసలే నిర్మించేరు. కాని, దాని నిర్మాణమేమో జరిగేపోయింది. గడచిన దానికై విచారిస్తే ప్రయోజనం శూన్యం గదా. అది నశించి యెన్నో శతాబ్దాలు గడచినా, యిప్పటికీ దాని శిథిలాలు యెందరినో పరమాశ్చర్య నిమగ్నులను గావించుతున్నాయి. రోమను అక్విడక్టుల తాలూకు బ్రహ్మాండమైన లాజులను గాంచి అద్భుతానంద

పరవశు లవుతూన్నారు, విజ్ఞులుకూడా. ఒకదానిమీద నొక టిగా మూడు యెత్తైన రాతివంతెలను వాళ్లుకట్టేరు. ముమ్మా ర్గములుగల యీ వంతెన కొకవైపున నిలబడి దాని లాజుల క్రింది నుంచి చూస్తే సుదూరంలో చిన్న కొండలు మబ్బుగా కనబడతాయి. ఈ వంతెన, పొడుగునా బ్రహ్మాండమైన, రాతిలాజులచే భరించబడుతూ, దిఙ్మండలంవరకూ ఉందా! అని పించుతుంది. కొండల్లోని చల్లని నీటిఊటలనుంచి మంచినీటి నీ అక్విడక్టులు రోమ్‌కు గొనివచ్చేవి.

ఇక్కడా – అక్కడా, ఇటలీలో – ఫ్రాన్సులో, చిన్నపిల్లలు రాతి సోపానాల మీద యిప్పటికీ ఆడుకొంటూంటారు. ఈ సోపానాలొకప్పుడు నాటకరంగాల ప్రేక్షకులకు ఆసనా లుగా పనికివచ్చినట్టివి. వలయాకార మైన యీ సోపాన పంక్తులపై పదేసివేలమంది ప్రేక్షకులు సుఖాసీనులై మధ్య నున్న రంగస్థలంలోని ప్రదర్శనాలను చూచేవాళ్ళు. ఈ బ్రహ్మాండమైన కట్టడా లన్నీ యేలాటి యంత్రసహాయమూ లేకండానే నిర్మించేరనేది యీనాటి వారికి అత్యాశ్చర్యమును కలిగిస్తూంది.

ఒకానొకప్పుడు రోమనులు ఇటలీలో ఒక పెద్ద సరస్సును త్రవ్వడానికి తలపెట్టేరు. ఆ ప్రాంతమంతా ఒక అనూప ప్రదేశం. అక్కడి జనులు భయంకర జ్వరములతో బాధ పడుతూండే వాళ్ళు. ఆ బాడవలో నుంచి మురుగు నీటిని పారించి, చెరువు నొకదాని నేర్పరచితే మిగిలిన ప్రదేశమంతా

యెండి, బాగుపడుతుందని వాళ్ళు ఆలోచించారు. ఆ చిత్తడి ప్రదేశంలో యే పంటా పండేదిగాదు. పదకొండేళ్ళలో సరస్సు పూర్తి చేసేరు. ఈ చెరువులోని నీరు టైబర్ నదిలోనికి ప్రవహించునట్లు కాలువ త్రవ్వబడింది. ఈలాంటి పనులనే నేడు మనం ప్రాజెక్టు లంటాము. ఆ నాడీ ప్రాజెక్టుపనిలో 30,000 మంది పనిచేసేరట! చిత్తడినేలగా వుండిన ఆ ప్రాంతమంతా పచ్చికబీళ్ళు, తోటలు, ఉద్యానాలతో కనులపండువుగా తయారైంది. కాని, రోము చరిత్రను చదివిన విద్యార్థులకు యీ సరోవరం సంగతిగాని, దాని నిర్మాణంలో పాటుబడిన వేలాది బానిసలను గురించి గాని తెలియదుగదా! జ్వరాలతో క్రుంగి కృశించి, లోతుకుబోయిన కండ్లు, చప్పిదౌడలు, యెముకలప్రోగులు ఐనను, యెండనక, వాననక, శ్రమకరమైన ఆ మట్టిపనిని నిర్వహించిన ఆ ముప్పది వేలమంది బానిసలు సార్థక శ్రమ చేసినవారు. ఈ పృథ్విని నిరామయంగా, సస్యశ్యామలంగా చేసేటందుకే వారు జీవించేరు, పని చేసేరు, ఆ పనిలోనే రోగాలతో మరణించేరు. ఆ ప్రదేశమంతా వాళ్ళ యెముకలు దొర్లాడుతూనే వుంటాయి. ఈ బాధామయ దుఃఖగాథ యెవరు స్మరిస్తారు? పాఠకుల మనోవీధిలో మసలునది మరొక చిత్తరువు మాత్రమే: ఇటలీదేశపు స్వచ్ఛనీలాకాశము, ఆ సరోవరనీలజలాలు; ఆ జలాలు టైబరునదిలోనికీ, అక్కడ నుంచి సముద్రంలోనికీ ప్రవహించి పోవడం, — యీ సుందర దృశ్యాన్నే వారు చూస్తారు.

ఏ చిత్తరువు, దృశ్యం యదార్థానికి సమీపమైనది? సత్యానికి సన్నిహితమైనది? అంటే రెండూ నిజమే, సత్యములే. రోము చరిత్ర మానవజాతి అభివృద్ధి చరిత్రలోని అంతర్భాగమే. గాథాపూర్ణమైనదే, అసలు మానవ చరిత్ర అంతా కూడా.

## చరిత్రయే వాదీ, ప్రతివాదీకూడాను.

మనం రోమును జ్ఞాపకం చేసుకున్నప్పుడు, మెడలో గుదియలతో, సంకెలలతో నడిచే బానిసల గుంపులు మాత్రమే గాక స్వీయరక్తంలోనే తడిసివున్న గ్లాడియేటర్లు, యితర వీరులూ కూడ స్మృతిపథంలోనికి వస్తారు. నీరో చక్రవర్తి జ్ఞాపకం వచ్చినపుడు ఆయన ప్రత్యర్థి, సమకాలీనుడూ నైన తత్త్వవేత్త సినికా కూడ మనోనేత్రం యెదుటికి వస్తాడు. కమోడస్ చక్రవర్తి గుర్తుకు వచ్చి గడగడ వణుకుతాము. గాని అంతలోనే మహావేదాంతియైన మార్కస్ ఆరిలియస్ చక్రవర్తిని స్మరించి చిత్తశాంతి నొందుతాము.

రోము యెన్నో జాతులను బానిసలుగా చేసింది. గ్రీకులు అనుభవించిన ఉజ్జ్వలస్వాతంత్ర్యానికి ఛాయమాత్రమే మిగిల్చారు. నగరాల, పట్టణాల స్వాతంత్ర్యాన్ని హరించినా రోమనులు గ్రీకుల మేధను, విజ్ఞానాన్ని, కళను మాత్రం మానవజాతికై మిగిల్చిఉంచేరు. గ్రీకుల్ని హేళనగా 'గ్రీక్లింగ్' లని వారు పిలిచేవారు. కాని, మళ్ళా తాము యీ గ్రీక్లింగ్‌ల క్రిందనే, వారి పాఠశాలల్లోనే శిక్షణనొంది, వారి తరిఫీదునే

పొంది, ఒలింపియాలో జరిగే పోటీలలో విజయమును, పొన్న పూలదండలనూ సంపాదించేవారు. అక్కడి పోటీల్లో విజయం పొందినవాని శిరస్సు చుట్టూ పొన్నపూల దండలను చుట్టి, మహావైభవంగా ఊరేగించేవారు. అంతే గాదు. హోమర్ కవిత్వానికి రోమనులు వారసులై, ముందుకు గొంపోయారు. ట్రాయ్ ప్రభువంశీకుడైన అయేనియస్ ప్రవాసము, కష్టాలు వర్ణిస్తూ వర్జిల్ మహాకవి ఒక మహా కావ్యాన్ని రచించేడు. ఓవిడ్ కవి తాను ప్రవాసంలో వుంటూనే అమాయికములూ, హార్దికములూ నైన ప్రాచీన గ్రీకు సాంప్రదాయిక గాథలను కావ్యములుగా రచించేడు. గ్రీకు హెరొడోటస్, థూసిడై డిస్‌లు ప్రారంభించిన చరిత్ర రచనను రోమను పండితులు లైవీ, టాసిటస్‌లు ముందుకు గొంపోయారు.

చరిత్ర కేవలం వాది పక్షానే గాక ప్రతివాది తరపునా వాదిస్తుంది. భాషలే యిందుకు సాక్ష్యంగా వున్నాయి. ప్రాక్యూరర్, అడ్వోకేటు మొదలైన పదాలు లాటిన్ భాష నుంచి వచ్చాయి. లాటిన్ రోమనుల భాష. ఆరేటర్, కోడ్, జూరిస్టు పదాలూ అంతే. శాస్త్రవిజ్ఞానం పాశ్చాత్య దేశాలకు గ్రీసునుంచే కాని, రోము ద్వారా వచ్చింది. పాశ్చాత్యభాషానిఘంటువు లన్నీ రోమను పాఠశాలలను, శిక్షణను గుర్తు దెచ్చే మాటలతో నిండివున్నాయి.

జిమ్నాసియమ్, అకాడమీ, లైసియమ్, యూనివర్సిటీ, మ్యూజియమ్, ఇన్‌స్టిట్యూట్, లేబొరేటరీ, ఆడిటోరియమ్,

లెక్చరర్, డాక్టర్, ప్రొఫెసర్, స్టూడెంట్, ఫిజిక్స్, మేథమా టిక్స్, ఫిలాసఫీ మొదలైన వన్నీ గ్రీకు లాటిను పదములే.

ప్రాచీన ప్రపంచ వైజ్ఞానికులను గనుక మరిచిపోయినట్లైతే మనం కృతఘ్నుల మనిపించుకుంటాం. ఆ మహాత్ములు తమ గ్రంథాల్లో మానవజాతియొక్క అనుభవాలన్నీ చేర్చి కూర్చి భద్రపరచారు. గర్వితులూ, సోమరులూ ఐన ధనికులు; ఆబో థోపహతులైన పేదలు, కష్టజీవులు, – వీరితోబాటు రోములో కూడా రాత్రింబగళ్లు నిర్విరామంగా పరిశోధనా పఠన బోధ నాది వ్యాసంగాల్లో మునిగివుండే శాస్త్రజ్ఞులూ, పండితులూ ఉండేవారు.

రోమను విజ్ఞానీ, పండితుడూ, పరిశోధకుడూ ఐన ప్లినీ వీరిలో నొకడు. ఆయన విజ్ఞానవేత్త మాత్రమే గాక నౌకా సైన్యాధిపతీ, రాజకీయవేత్తా కూడాను. ప్లినీ ఒక మహా త్కార్యాన్ని తలపెట్టేడు. అదేమిటంటే లోకంలోని మొక్కలు, జతువులు, లోహాలు మొదలైనవాటి వర్ణనాత్మక మైక జాబితా నొకదాన్ని తయారుచేయాలని.

“దీనిని పూర్తిచేయలేక పోయిననూ సరే, యీ ప్రయ త్నమే నాకు ఆనంద దాయకమైనది.” అన్నారాయన.

ప్లినీ విజ్ఞాని మితభుక్కు. చాల తక్కువకాలమే నిద్రిస్తూండే వాడు. రాత్రింబగళ్లు ప్రకృతిని గూర్చిన గ్రంథాలే పఠిస్తూండే వారాయన. భూగోళ ఖగోళ ప్రకృతిశాస్త్రాలు, ఓషధిచికిత్సా విజ్ఞానము మొదలైనవన్నీ వరుసగా చదువుతూ, గుర్తులు పెట్టి

వ్యాఖ్యానాలు వ్రాసుకుంటూ, చదివిన వాటిని మననం గావిస్తూ, అదనపు భోగట్టా సేకరిస్తూ ఉండేవాడాయన. సామ్రాజ్య దేశాలన్నీ పర్యటించీ, యుద్ధ దండయాత్రల్లో పాల్గొనీ, ప్లినీ పండితు డెంతో లోకజ్ఞానాన్ని సంపాదించేడు. ఆయన కనీసం రెండువేల గ్రంథాలను పఠించేరు. ఇదంతా తను వ్రాసిన విజ్ఞాన సర్వస్వ రచన కొరకే!

ఆయన గ్రంథానికి పునాది వేయబడింది. ఏళ్లు గడుస్తూన్నాయి. ఒక్కొక్క సంపుటమే పూర్తవుతూంది. ఆ గ్రంథం వందల సంపుటాలు ఐంది. ఇది ఒక్క గ్రంథంకాదు, గ్రంథ భాండారమే. ఒక్కయిల్లుగాదు, ఒక మహానగరమే. ఏమా త్రమూ తొందరపడకండా, బహుశ్రమతో, ఓరిమితో ఆయన నక్షత్రాలు, గ్రహాలు, చెట్లు, జంతువులు, దేశాలు, ప్రాచీన కాల విశేషాలు, ఒకటేమిటి-యెన్నో సంగతులు వర్ణించేడు. ఆయన బహు ద్రష్ట, బహుగ్రంథ పరిశీలకుడు. సూర్యుడు వేసవిలో మన దగ్గరకు రాడనీ, శీతువులో దూరంగా పోడనీ ఆయన యెరుగును; ధ్వనికంటె వెలుతురు బహు త్వరితంగా ప్రసరిస్తుందనిన్నీ యెరుగును; సూర్యచంద్రుల వల్లనే సముద్రపు పాటుపోటులు కలుగుతూంటవనీ తెలుసుకున్నవాడు. ఎంత తెలిసినా సత్యమును - అసత్యమును తెలుసుకోవడం యెన్నో సందర్భాల్లో ఆయనకు సాధ్యమయేదే గాదు! ప్రకృతి శాస్త్రానికి ప్లినీ మూలపురుషుడు; హెరొడొటస్‌తో పోల్చదగిన వాడు.

తలలు లేని మనుష్యులు, ఉదరంమీాదనే నోరూ కంఠ్ఠ్మాగల మానవులు వగైరా విచిత్రసృష్టిని గూర్చిన ప్రాచీన గాథల నీయన పునరుల్లేఖించేడు. చంద్రుడుక్షీణించేకాలం(కృష్ణపక్షం) లోనే సముద్రంలోని శంఖములు, గవ్వపురుగులు పెరుగుతా యని ఆయనా విశ్వసించేవాడు. శునకతార (సిరియస్=మృగ వ్యాధ=గుంపులోని ఆర్ద్రా నక్షత్రము) సముద్రంలో తుపాను లను కలిగిస్తుందనీ మద్యమును పులియ బెడుతుందనీ ప్లినీ కూడ నమ్మేవాడు. సృష్టిఅంతాకూడా మానవుని కొరకే నిర్మించబడి వుందనీ అనుకునేవాడు. మానవులకు పండ్లను, మద్యమును, చముదులను, కలపను యివ్వడానికే చెట్లు సృజింపబడినాయట! అవి లేకుంటే మనుష్యుడు యిండ్లు, పడవలు కట్టుకోడం యెల్లాగ?...ఇనుము యుద్ధ ప్రయోజ నాలకోసం సృజించబడింది; బంగారం జనులను ప్రలోభ పెట్టేటందుకు!

ప్లినీ యిల్లావ్రాసేరు: "బంగారును అన్వేషిస్తూ మనం ప్రపంచమంతా తిరుగుతాము. మనం నివసించు యీా భూతల మునే మనం త్రవ్వి గోతులుపెడతాము. అంతా చేసి, భూకంపాలు యెందువల్ల వస్తున్నాయా? అని ఆశ్చర్యపడ తాము! భూమాతకు కూడా ప్రతీకారవాంఛ వుందా! అను కుంటాం." భూకంపాలకు ప్లినీ పండితుని కారణ నిరూపణ యిట్టిది! దురాశాపరుడైన మానవుని అత్యాచారాలకు భూమాతకొట్టే యెదురు దెబ్బలే భూకంపాలు!

సృష్టిలో ప్రతీదీ మానవుని ఉపయోగానికే సృజించబడినాయి.

కాని, ఆయనకూ మానవుని ఘనతమీంత అంత గ్రుడ్డి విశ్వాసం లేకపోయింది. మానవుడు జంతువులన్నిటి కంటె క్రూరుడన్నారాయన. కారణాలు స్పష్టమే. సింహాలూ, పులులూ కూడ వాటిలో అవి పోట్లాడుకోవు. మనుష్యులు తమలో తామే పోట్లాడుకుంటారు, యెప్పుడూ. అంతేగాదు. మనిషి మాత్రమే అత్యంత స్వార్థపరత్వం, దురాశాగల్గిన ప్రాణి...బహుశః ప్లినీ సినేటులోనూ, చక్రవర్తి సభలోనూ, సర్కస్‌లోనూ తరచు కలుసుకొంటూండే పెద్దమనుష్యులంతగా పొగడ తగిన గుణములు గలవారై యుండరు! కాని మరో తరహా మనుష్యులుకూడా అంటే ఉత్తములు కూడా ఉన్నారనేందుకు ప్లినీ పండితుడే ప్రత్యక్ష సాక్షిగద! ఆయన జీవితంలోనే గాక మరణంలో కూడా యెట్టి దైన్యానికీ చోటీయ లేదు.

ప్లినీ సోదరపుత్రుడు చిన్న ప్లినీ చరిత్రకారుడైన టాసిటస్‌కు జాబు వ్రాస్తూ, పినతండ్రి కడపటి క్షణాలను యిల్లావర్ణించేడు:

"మా చిన్నాన్నగారు మరణించడం యెల్లా జరిగిందో వ్రాయమంటారు గదూ!...చిన్నాయనగారెన్నో అద్భుత రచనలు చేయడమేగాక విజ్ఞాన సర్వస్వమునూ పూర్తిచేసేరు గదా. పృథ్వీమీద మహా సౌందర్యవంతమైన ఒక ప్రదేశం నాశనమవుతూంటే, దానితోబాటుగా ఆయనా మృత్యు

ముఖాన పడటం విచిత్రంగానూ, విధి నిర్ణయంగానూ కనబడు తుంది. ఆ మహాత్ముని స్మృతి చిరకాలం నిలచివుంటుంది."

"చిన్నాన్నగారు తన ఆధీనంలోని నౌకాదళంతో కూడ మైజాఅగ్రం దగ్గర ఉన్నారు. విచిత్రమైన మేఘమొకటి కన బడిందని ఆగస్టు 22 వ తేదీని ఆయనకు తెలియజేసారు. అదొక బ్రహ్మాండమైన దేవదారు వృక్షంలా వుందనీ దాని కాండం ఆకాశంలోనికి లేచి, కొమ్మలు యెనిమిది దిక్కులకూ క్రమ్ము కొని వున్నాయనీ తెలిపేరు. నూతనమైన దేన్నైనా పరిశీ లించే కుతూహలం శాస్త్రజ్ఞులకు సహజమేగదా. అల్లాగే చిన్నాయనగారు వెంటనే తత్ప్రదేశానికి రమ్మని తమ నౌకా దళానికి ఆజ్ఞలిచ్చారు. కాని, అదేసమయానికి వెసూవియస్ అగ్నిపర్వత పాదంలోనున్న గుట్టల్లోంచి, తమకు సాయపడ తక్షణమే రమ్మని ప్రార్థిస్తూ ఒక జాబు ఆయన కందింది."

"ఈ కారణాన నౌకాదళం అంతా తిరిగి భూభాగ సమీ పానికే వచ్చింది. చిన్నాయనగారి ఓడ సరాసరిగా అపాయ స్థలంలోకే వెళ్ళింది. యావత్తు వినాశాన్నీ ఆయన స్వయంగా చూచేరు, దాన్ని వివరిస్తూ కార్యదర్శిచేత వ్రాయించేరు. ప్రమాద స్థలాన్ని ఆయన మరింత సమీపించేసరికి అగ్ని పర్వత బిలంలోనుంచి వెలువడే బూడిదా, మండుతూండే లావాద్రవమూ, చిట్లములూ పెల్లెగసి, ఓడమీద వర్షంలా కురిసేయి. స్టాబియా దగ్గర ఆయన తీరానికి వెళ్ళేరు. కాని, అప్పటికే గాఢాంధకారం క్రమ్మేసింది. వెసూవియస్ బిలం

లోంచి కరాళ జ్వాలలు ఆకాశానికి యెగసిపోతూన్నాయి. హఠాత్తుగా మహాధ్వనితో భూమి కంపించింది. చిన్నాయన గారూ, ఆయన పరివారమూ తల దాచుకొన్న యిల్లు వూగి, కూలి పోయింది."

"అందరూ బైటికి పరుగెత్తేరు. కురుస్తూన్న అగ్నిశిలావర్షాన్నుంచి ఆత్మరక్షణ గావించు కొనేందుకు అంతా తలగడలనూ, దిండ్లనూ తలలపై పెట్టుకుని వున్నారు. ఇతరుల వలెనే చిన్నాన్నగారు కూడా గంధకపు పొగ, మంటలు, మండేరాళ్ళ నుంచీ తప్పించుకోడానికి యత్నిస్తూ, పూర్తిగా అలసి, స్వాధీనంతప్పి, క్రిందపడిపోయారు. ఎవరో చేయి అందీయగా అతికష్టంమీద లేచి, మళ్ళా పడిపోయారు. అంతే. అదే చిన్నాయనగారి కడపటిక్షణం..."

ఇదే పాంపే, హెర్క్యులానియం నగరాలను లావాతో కప్పివైచిన వెసూవియస్ అగ్నిపర్వతమూ, భూకంపము, ఇందులోనే ప్లినీ మరణించారు.

అటుతర్వాత శతాబ్దాలుగా, నిద్రిస్తూన్న వెసూవియస్ అగ్నిపర్వతం చుట్టూ జనులు నివసిస్తూనే వున్నారు. పై ప్రమాదం జరిగిననాటి ప్రాతఃకాలంకూడా జనులంతా యథాప్రకారమే తమతమ పనులమీద పోతూన్నారు. మంగలి షాపుల్లో తమ వంతుకోసం కొందరు కనిపెట్టుకునివున్నారు; సైనికులు సారాకొట్లలో కూర్చుని త్రాగుతూన్నారు; వర్తకులు, క్రయకునికై అంగళ్లలో సామానులు ముందు

పరచుకుని, యెదురు చూస్తూన్నారు; గృహిణులు కూర లకై బజారుకు తొందరగా పోతూన్నారు; పల్లెటి రైతాంగం పట్టణంలో విక్రయించడానికై కోళ్ళనీ, గుడ్లనీ, కూరలు యితర వస్తువుల్నీ తీసికొని వచ్చియున్నారు; రొట్టెల అంగ ళ్ళలో ఆవిసులు గ్రక్కే గుండ్రని రొట్టెల మధ్య నిలబడి వున్నారు, దుకాణదారులు; చమారీలు జోళ్ళు తయారు చేయ డానికై కాలికొలతలు తీసుకొంటున్నారు; కుంభకారులు మట్టి పాత్రలు, మూకుళ్లు వగైరాలు మోసుకొని, అరుస్తూ తిరుగు తూన్నారు...

కొద్ది నిముషాల్లో యీ నగరమంతా, ఫల పుష్ప భరిత మైన ఉద్యానవనాలతో సహా పూర్తిగా, యెర్రని నిప్పులక్రింద, శిలాద్రవంక్రింద కప్పబడిపోతుందని యెవరెరుగుదురు? అటు పిమ్మట కొన్ని దినాలకు, మిగిలిన కొద్దిమందిన్నీ యీ బూడి దలో, చిట్టాలలో త్రవ్వుతూ, వెతుకుతూ తమ గృహావశేషా లకై బంధువులకై పరితపిస్తారని యెవరూహించగలరు?

మానవుడెంత నిస్సహాయుడో, అల్పజీవియో ప్రకృతిమాత హఠాత్తుగా అతనికి జ్ఞాపకం చేసింది.

ఈ రోమను నౌకాదళాధిపతి ధైర్యాన్ని మెచ్చుకోకుండా యెవ్వరుండగలరు? అతి ప్రమాదావస్థలోనున్న యీ నగర వాసుల సాహాయ్యానికై నిర్భయంగా తన నౌకాదళాన్ని గొని పోయిన ఆయన సాహసం చిరస్మరణీయం. శిలలు, అగ్నిద్రవం వర్షంలా కురుస్తూన్నా ఆయన వెనుదిరగనే లేదు. ఎంత

మాత్రం తటపటాయించకుండా ఆయన ముందుకేసాగేరు. నౌకాదళాధిపతిగా తన ధర్మాన్నీ, ప్రకృతిశాస్త్ర విజ్ఞానాన్వేషణా కుతూహలంతో తనజిజ్ఞాసనూ బొందిలో ప్రాణమున్నంత వరకు ప్లినీపండితుడు వీడనేలేదు.

'బోద్ధారో మత్సర గ్రస్తాః' అను దానికి యిట్టివా రేగదా మినహాయింపు.

జలం, అగ్ని, వాయువు మొదలైన ప్రాకృతిక శక్తులను మానవుడు శాస్త్ర సహాయంతో తన యిచ్ఛానుకూలం గావించుకొనే సుదినం సంప్రాప్తమైనపుడు యెంత ఆనంద కరంగా వుంటుంది!

అటువంటి స్థితి రాగలందులకై ప్లినీ పండితుని వంటి వారెందరు సోపానములను నిర్మించి కీర్తికాయులైరో!

# ఏడో మండలం

## పెరుగుట, విరుగుట

### శతాబ్దాలుగా మానవుని సాగరయాత్ర.

మానవుడు అల్పుడు; ఆతని జీవితం బుద్బుదప్రాయము. ఆతని యెదుట ఊహకందనంత విశాలప్రదేశమూ, భావన కందనంతటి అనంతకాలమూ పరచుకొని వ్యాపించివున్నాయి. చిట్టిచిట్టి అడుగులు వేస్తూ మానవు డెంత దూరమని పోగలడు? ఈ భూమిపై తన కీయబడిన అత్యల్పకాలంలో మానవు డేమి సాధించగలడు?

కాని, మానవు డేకాకీగాడు. అపుత్రకుడూగాడు! అతని బలం యిందులోనే వుంది.

వార్తలు ఒకచోటినుంచి మరోచోటికి త్వరగా యెల్లా అందుతాయి? మిట్టలమీద మంటలువైచి, సంకేతం గావించడం ద్వారా అతిత్వరలో వార్తల నందించవచ్చు. ఏ జవనాశ్వమూ యింత త్వరగా వార్తల నందించలేదు. కొన్ని దినాల్లో గాని అంచె గుర్రపు రౌతులద్వారా అందించలేని వార్తలను యీ జ్వాలాతోరణముల వల్ల కొద్ది గంటల్లోనే అందించగలము. ఈ మాదిరిగానే అనేక దేశాలు, జాతులు అనంతకాలవ్యవధిలో వ్యవహరిస్తూవచ్చాయి. మానవుని శ్రమ ఫలములు; కవుల, మేధావుల, శిల్పుల, కర్మకుశలుర విజయ పరంపరలు, — యివన్నీ ఒక తరాన్నుంచి మరో తరానికీ, ఒక దేశాన్నుంచి మరోదేశానికీ యీ రీతిగానే అందించబడినాయి.

ఒక్క మనిషి భూమండలమంతా తిరిగి, ప్రతీమార్గమూ కొలవాలంటే సాధ్యమా ? కాని, ప్రాచీనకాలంలో రోము లోని మేధావులు యావత్సామ్రాజ్యాన్నీ కొలిచేరు ! భూగోళశాస్త్రజ్ఞులు ప్రపంచ పటంమీద పట్టణాలను గుర్తు పెడుతూంటే, వాటి మధ్య దూరాలను సర్వేయర్లు కొలిచి నిర్ణయిస్తూండేవాళ్లు. ఈ కొలతపని ముప్పదియైదేళ్లు పట్టింది. ఎల్లాగైతేనేమి చివరకు వారందరూ కలసి ఒక పెద్ద కాగితంచుట్ట తయారుచేసేరు. ఆ పటంమీద రోముకు అన్ని దిక్కులనుంచీ వచ్చు బాటలన్నీ గుర్తించబడినాయి. రెండు చిన్న గృహసంజ్ఞలతో మహానగరాలు గుర్తించేరు. బాటల వెంబడే సత్రములు, సత్రాన్నుంచి మరోసత్రానికి వంకీగీతలతో గుర్తులు, — యిల్లాంటి పటాన్ని చూసి, యాత్రికులు, సార్థవాహులు ఒకచోటనుంచి మరోచోటికి గల దూరం యెన్నివేల అడుగులో, యెన్నిరోజుల ప్రయాణమో చెప్ప గలిగేవారు. స్పార్టానుంచి ఆర్గోస్, ఆర్గోస్ నుంచి కోరింథ్,- యిల్లాగ.

భూమిమీద దూరాలుకొలవడం కష్టమనుకుంటే సముద్రం మీద మరీకష్టంగదా ! నీటిమీద దారి గుర్తుపెట్టుకోవడం యెల్లాగ ? సముద్రంమీద తానెక్కడవున్నదీ తెలుసుకో డానికి, టైర్‌నగర నివాసియైన మారినస్ అనునాతడు భూగోళ పటంమీద ఊహాకల్పనతో మెరిడియన్ (సూర్యుడు మధ్యా హ్నవేళ ఉండుచోటు) ను, దానికి సమానాంతరంగా మరి

కొన్ని రేఖలను గీసేడు. ఈ రేఖలు కేవలం పటంపైననే ఉంటాయి గాని మన భూమి మీదా, సాగర జలాల మీదా గుర్తించబడి వుండవుగదా !

ఇంతకాలమూ ప్రపంచం పర్యాప్తమవుతూనే వుంది. అంతకు కొంచెం ముందు రోమనులకు బ్రిటన్ అనే ద్వీపం వుందనే తెలియదు. దాన్ని గూర్చిన కథలు, అసలు దాని పేరూకూడా కేవలం కట్టుకథలు మాత్రమే అనుకునేవారు. తరువాత కొద్దికాలానికే సీజర్ యీ ద్వీపులకు ససైన్యంగా రెండు సార్లు వెళ్లేడు. ఈ భూమండలం చుట్టూ సముద్రం వుందనిన్నీ, దీనినే తమ సామ్రాజ్యానికి యెల్లగా చేసుకోవాలనిన్నీ, కొద్ది కాలం క్రిందటే రోమనులు భావించేవాళ్ళు. కాని, రోమక భూగోళ శాస్త్రజ్ఞుడు స్ట్రాబో ఊహించినదేమంటే సముద్రాల కావలకూడ జనులు నివసించే భూములున్నాయనియే. జూఘా యనునాత డీ దేశాలన్నీ చూచిరావాలనే కుతూహలంతో యాత్రలుగావించేడు. జూఘా కానరీద్వీపులకు వెళ్ళేడు. అక్కడ కొబ్బరిచెట్లు అధికంగా వున్నాయి. కాని, జనులు కనబడలేదు. కానరీద్వీపుల్లోకల్లా పెద్దదైన ద్వీపంలో నున్న టెనిరైఫీ అగ్ని పర్వతంమీద జెండావలె వ్రేలాడుతూన్న మేఘ శకలాన్ని ఆతడు చూచేడు. అక్కడ మనుష్యులు కనబడతారేమోనని ఆయన అన్వేషించేడు గాని ఆరిన నెగళ్లు, శూన్యమైన మకాములు తప్ప మనుష్యులజాడ కనబడలేదు. కుక్కలు భౌ ! భౌ ! మని ఆయనకు స్వాగతం చెప్పేయి. నిర్జనంగావున్న

మానవ నివాసాల నాశునకములింకా కావలా కాస్తూనే వున్నాయి. ఈ విషయాలన్నీ చూస్తే సముద్రాని కావల కూడా యితర జనులెవరో వున్నారని ఊహించవచ్చుగదా!

దాని తరువాత యేముంది? ఇంకా యే దేశాలైనా వున్నాయా?

తత్త్వవేత్త సినికా ఒకచోట యిల్లారాసేడు: "సముద్రాల వేలావలయముల నధిగమించే దినం వస్తుంది. అప్పుడు సముద్రాంతరాల కావల యెన్నో దేశాలున్నాయని తెలుసుకుంటాము. థూలీదేశమే భూమికి కడపటి యెల్లయని అప్పుడింక ఎవరూ భావించరు."

ఈ విధంగా భూమిమీద మానవుడు ముందుకు అడుగు వేసేడు.

కాలంకూడా అతనికి సైగలుచేస్తుంది. ప్రదేశంలో పయనం చేయడంకంటె కాల ప్రవాహంలో ప్రయాణంచేయడం కష్టం గదా. బాబిలోనియనులు సూర్య యంత్రాన్నీ, జల యంత్రాన్నీ కనిపెట్టేరు. ఏథెన్సులో గాలిగోపురం మీద గడియారాన్ని స్థాపించేరు. దానివల్ల నావికులు గాలివీచు దిశనూ, ప్రొద్దునూ కూడా తెలుసుకో గలిగేవారు. కాని, యీ ఘటికాయంత్రాలు యెప్పుడూ ఒకేలాగున ఉండేవికావు, వేసవిలో పగలూ, శీతువులో రాత్రీ అధికం. పగటిభాగాన్ని ఘడియలుగా విభజించడంవల్ల వేసవికాలపు ఘడియలకంటె శీతకాలపు ఘడియలు చిన్నవిగా ఉండేవి.

ప్రాచీన యుగంలోనే పంచాంగం కూడ ఉండేది. బాబి లోనియనులు సంవత్సరమును పన్రెండు మాసాలుగను, మాసమును ముప్పది దినాలు గలదిగను విభజించేరు. మిలి ఘస్ వాస్తవ్యుడు థేల్స్ విజ్ఞాని సంవత్సరానికి 365¼ దినాలని తెలుసుకున్నాడు. కాని, వారాలు, మాసాలు క్రమబద్ధంగా యేర్పాటు చేసుకోలేక జనులు గందరగోళంలోనే ఉండేవాళ్లు. రోమను చక్రవర్తి పంచాంగమును సరిగా గుణించి, నెలలు, వారాలు క్రమబద్ధం చేయమని కొందరు పురోహితులను నియో గించగా వారు మరింత గందరగోళం చేసిపెట్టేరు. వారు రెండు రకాల సంవత్సరాలను తయారుచేసారు. ఒకదానికి పన్రెండు నెలలు, రెండో దానికి పదమూడు నెలలు. మొదటిరకం యేడాదికి 355 రోజులైతే రెండోరకం యేడాదికి 377 రోజులు! దీనివల్ల జరిగే దేమంటే సంవత్సరాది ఒక్కొక్క సారి అక్టోబరు 15 నే వచ్చేది; శీతకాలం ఆకురాలు కాలం లోనూ, వసంతం గ్రీష్మంలోనూ పడుతూంటుంది! రోమను పురోహితులు విజ్ఞాన శాస్త్రాన్నే గాక నడిమింట కనబడే సూర్యుని కూడా అర్థంచేసుకోలేక, దారి తప్పిపోయారని తెల్లమైపోయింది!

ఈ గందరగోళాన్నంతనూ చక్కజేయ వలసినదని అలగ్జాం డ్రియను జ్యోతిశ్శాస్త్రవేత్త శోశీజనిస్‌కు చక్రవర్తి ఆజ్ఞ లిచ్చేడు. ఆ సిద్ధాంతి యీ గందరగోళాన్ని సవరించి, సంవత్స రాన్ని పన్రెండు మాసములుగా, 365 దినాలుగా నిర్ణయిం

చేడు. కాని, యదార్థంగా భూమి సూర్యునిచుట్టూ తిరగడానికి 365¼ దినాలు పడుతుంది. ఇక మిగిలిన తేడా ¼ దినము. దానిని సరిపుచ్చడానికై నాలుగేండ్లకొక తూరి ఫిబ్రవరి నెలలో ఒక దినాన్ని అదనంగా చేర్చేరు.

కాని, జనులు కేవలం వర్తమాన వస్తు విషయాదులను తెలుసుకుని, వాటిని సరిచేసుకోవడంతోనే తృప్తిని చెంద లేదు. బహు ప్రాచీనకాలంలో, భూతపూర్వ యుగాల్లో యేమేమి జరిగింది? అప్పుడు ప్రాణికోటి జన్మించిందా?... భూగోళ శాస్త్రవేత్త స్ట్రాబో యిల్లా ప్రశ్నించేడు: 'భూమి యెల్లవుడూ యిప్పుడున్నట్లే వుందా?' దీనికి సమాధానంగా ఆయనే, భూమి నిరంతరం మారుతూందని సమాధానం యిచ్చాడు. ఇప్పుడు సముద్రా లున్నచోట్ల వెనుక భూ ప్రదేశం ఉండేది. ఇప్పటి పర్వతాలు సముద్రంలోనుంచే పైకి లేచినాయి. పూర్వం సముద్రతీరాలు యిప్పటి కంటె దీర్ఘతరంగా ఉంటూండేవి. సముద్ర గర్భంలోంచి అగ్నిపర్వ తాలూ, భూకంపాలూ కొత్తకొత్త ద్వీపాలను బైటకి తెస్తూం టాయి. సిసిలీ ద్వీపం ఎట్నా అగ్నిపర్వతం వల్ల నిర్మించ బడినదే.

ఖండా లెట్లు ఏర్పడుతున్నాయి? అనికూడా స్ట్రాబో పండి తుడు ఆలోచించేడు. బృహత్ వస్తు ప్రపంచానికి కీలకం యెక్కడుందో అన్వేషించిన స్ట్రాబో కది సూక్ష్మవస్తుప్రపం చంలో దొరికింది! ఐగుప్తులోని గీజాపిరమిడ్ సున్నపురాళ్లతో

నిర్మించబడింది. ఆ సున్నపురాళ్లను పరిశీలించగా వాటిలో సూక్ష్మమైన సముద్రపు పీతలు, నత్తలు మొదలైన వాటి గుల్లలు కనబడినాయి. వేలకొలది యేండ్లుగా అవి సముద్రం అడుగున ప్రోగుపడుతూన్నాయి. నీటి అడుగుననే పర్వతాలుగా ప్రోగుపడిన అవి సముద్ర గర్భాన్నుంచి వెలువడి సున్నపు కొండలుగా యేర్పడినాయి. ఆ కొండలలోనివే యీ సున్నపురాళ్లు.

## భూమిపైన విహంగయానము

రోము అత్యుచ్ఛదశకు వచ్చింది. యావత్ప్రపంచ దృష్టీ దానిమీదనే వుంది. రోమను కవి ఓవిద్ ఒక కావ్యంలో ఫయీతన్ (Phaeton) అను నాతడు ఆకాశంలోని కెగిరి, క్రింది ప్రపంచాన్ని చూచిన కథను వర్ణించేడు. ఆతడి తల్లి మానవ స్త్రీయే గాని తండ్రిమాత్రం ఫ్యోబస్ అను సూర్య దేవుడు. ఫ్యోబస్ నాలుగు గుర్రాల రథముపై ఆకాశయానం గావిస్తాడు. తండ్రి ఆకాశయానం గావించడంచూసి, ఫయీతన్‌కు తానుకూడ ఆకాశంలో రథంమీద ప్రయాణం చేయాలని కాంక్ష కలిగింది.

ఒక రోజున తండ్రి దర్బారుకు వెళ్లిన ఫయీతన్, అక్కడి మహా తేజస్సుకు కళ్లు మిరుమిట్లు గొలిపి, ద్వారంలోనే నిలచి పోయాడు. ఫ్యోబస్ తళతళలాడే సింహాసనంమీద ఆసీనుడై

వున్నాడు. ఆయన కుడి యెడమలలో గంటలు, మాసాలు, సంవత్సరాలు, శతాబ్దాలు నిలబడివున్నాయి. వసంతం తలపై పూలదండ ధరించి వుంది. ఆమె ప్రక్కనే శిశిరం శరీరంనిండా ద్రాక్షపండ్ల రసం పూసికొని యెర్రగా వుంది. శీతువు వృద్ధ స్వరూపం ప్రక్కనే యువకగ్రీష్మం నడుముచుట్టూ ధాన్యపు వెన్నుల దట్టీని ధరించివుంది.

"కుమారా! ఫయీతన్! నీకేమి కావలెను?" అనడిగేడు ఫ్యోబస్.

"నా తల్లి సత్యవాదియే యైనచో నీవే నా తండ్రివి. ఆమె చెప్పినదాని యాదార్థ్యమును నీ వల్ల వినగోరివచ్చితిని." అన్నాడు ఫయీతన్.

తలచుట్టూ వున్న ఉజ్జ్వలకిరణ జాలమును తీసి ప్రక్కన బెట్టి, కుమారుని దగ్గరగా రమ్మని ఫ్యోబస్ పిలిచేడు. కుమారుని గట్టిగా కౌగలించుకుని ఆయన యిల్లా అన్నాడు:

"ఔను! నాయనా! నీ తల్లి పలికినది సత్యమే. దానిని ఋజువు గావించుటకై నీకొక వరము నీయదలచితిని. కోరుకొనుము."

ఈ మాట చెప్పీ చెప్పడంతోనే ఫయీతన్ తండ్రి మెడను చేతులువైచి కౌగిలించుకుని అన్నాడు:

"తండ్రీ! నీ రథము నెక్కి ఒకదినము నీ గుర్రాలను తోలుట కనుజ్ఞనిమ్ము.

పుత్రుని యీ కోరికవిని, ఫోబస్ తన వరదానము తొందర పాటని చాల చింతించేడు. పిల్లవాడీ కోర్కెను వదలునట్లు చేయాలని అతడెంతో సానునయంగా ప్రయత్నించేడు.

"నాయనా! నీవు మర్త్యుడవు. మర్త్యులు విధికి దాసులుగా ఉండవలసిన వారు. మానవాతీతమైన నీ యీ కోర్కెను విడచి, మరొక్కటి కోరుకొనుము."

కాని ఆ పిల్లవాడు తనపట్టు వదలలేదు. వారు చాలసేపు దానిని గూర్చి తర్కవితర్కాలు పడ్డారు. తర్కానికి యిక వేళ లేదు. దినదేవత, పద్మారుణాంగుళుల ఉషోదేవి, అరోరా అప్పుడే తూర్పు ద్వారాలను తెరుస్తూంది. విరామ మెరుగని నిమేషములు, ఘడియలు తడబడుతూ సూర్య రథాశ్వాలను బైటికి తీసికొని వస్తూన్నాయి. ఫయాతన్ భస్మీ భూతుడు కాకుండా ఫోబస్ అతనిపైన దివ్య వసనమును కప్పేడు. స్వర్ణ కిరణ జాలము నాతని తలమీద ఉంచేడు. ప్రమాదం సన్ని హితమై వుందని తెలుసుకున్న వాడు గాన ఫోబస్ దీర్ఘంగా నిట్టూరుస్తూ కుమారుని హెచ్చరించాడు:

"నాయనా! బహు భద్రంసుమా. రథం పైకి వెళ్ళిందా స్వర్గం తగులబడుతుంది. క్రిందుగా నడిపితివా, భూమి భస్మీ పటలమవుతుంది. మధ్యమార్గంలో రథము పోనివ్వాలిసుమా. నలిగిన చక్రపుగాళ్లున్నాయి. వాటిలోంచేపోనీయి. జాగ్రత!"

ఈ లోగా నిశాదేవత పడమటి దిక్కునుంచి మెల్లగా జారి అదృశ్యమైపోయింది. తూరుపు తెల్లవారింది. ఈ పిచ్చిప్రయ

త్నం మానుకోమని మళ్ళా ఫ్యోబస్ కుమారుణ్ణి ప్రార్థించేడు. కాని ఆత్రగాడైన ఆ బాలుడు అప్పుడే లగ్గలకురికి, కళ్లెము లను చేతబట్టుకున్నాడు! సకిలిస్తూ ఆ గుర్రాలు కాడు తీసేయి. సముద్ర దేవతకూడా ద్వారాలు తెరచేసింది. ఎదుట బయలుగా సువిశాలంగా వ్యాపించియున్న ఆకాశపథమును ఫయిూతన్ చూచేడు.

సూర్యాశ్వాలు నాలుగూ ముందున కురికేయి. తూర్పు గాడ్పుకంటె వేగంగా, నీలాకాశమును త్రొక్కుతూ అవి పేరెమువాడుతూన్నాయి. దారి ఎగుడుగా ఉంది. ఐతేనేమి? రాత్రంతా విశ్రాంతి తీసికొనివున్న గుర్రాలు ఔద్ధత్యంతో కాడుతీస్తూన్నాయి. రథం రోజూకంటె తేలికగా వుండడాన్ని అవి పసికట్టాయి. ఫయిూతన్ పసివాడు, బరువు లేడు. బరువు వేయని పడవ కెరటాల్లోవలె ఆ రథం యెగిరెగిరిపడుతూ, ఊగిపోతూంది. ఇది తెలిసిన గుర్రాలు నలిగిన దారిని మీరి నడువ నారంభించాయి. ఫయిూతన్ భయభ్రాంతుడై, కింకర్త వ్యతామూఢుడైపోయాడు. సూర్యరథపు వేడిమికి సప్తర్షి మండలం కరిగిపోనారంభించింది; ధృవకేంద్రంలో మంచుకు బిరబిగిసిపోయివుండే అజగరం ఉలిక్కిపడి లేచింది.

ఫయిూతన్ క్రిందికి చూచేడు. చాలదూరంలో క్రిందుగా భూమి వ్యాపించివుంది. ఆ అర్భకుని మోకాళ్లు వణుకుతూ న్నాయి; మొగం పాలిపోయింది, కళ్ళు చీకట్లుక్రమ్మినాయి. తండ్రిమాట వింటినిగాదే! యని అప్పుడాతడు విచారించేడు.

ఆ రథాన్ని నడపడానికి తానసలు పూనుకునివుండాల్సింది గాదని పశ్చాత్తాపపడ్డాడు. వెనుకకుతిరిగి చూచేడు. గడచి వచ్చినదారి దీర్ఘంగావుంది. కాని ముందు గడవవలసిన దారి మరీ దీర్ఘంగావుంది. ఇంకిప్పు డేం చేయాలి?

అతడు గుర్రాల నదుపులో పెట్టలేకున్నాడు. వాటి పేర్లే అతడికి తెలియవు. కళ్లెముల బట్టుకొని వాటిని నిలపడం అసంభవంగా వుంది. కుడినుంచి యెడమకు భీతితో చూచేడు. అన్నివైపులా భయంకరమృగాలే. ఒకవైపున వృశ్చికం కొక్కలను తెరిచింది, ఒడిసిపట్టుకోడానికి. ఆ పిల్లవానికి మతి భ్రమసిపోయి, కళ్లెములను పూర్తిగా వదిలేశాడు. స్వేచ్ఛ లభించింపని గుర్రాలు అటునిటు పరుగెత్తుతూన్నాయి. ఒకసారి నక్షత్రమండలంలోకీ, మరోసారి భూమిమీదికీ రథాన్ని లాక్కుపోతున్నాయి. అన్నగారి రథం యిల్లా విచిత్రంగా పరిభ్రమిస్తూం దేమిటని చంద్రుడు ఆశ్చర్యపడుతూన్నాడు. భూమి అప్పుడే పొగ మేఘాలతో ఆవరించబడిపోయింది. పర్వతాగ్రాలు మండుతూన్నాయి. అరణ్యాలు, పొలాలులోంచి జ్వాలలు లేస్తూన్నాయి. చూస్తూండగానే పచ్చని మైదానాలు మసి ఐపోయినాయి. నగరాలు, దుర్గాలు పాడుపడిపోతున్నాయి. దేశాలకు దేశాలే మసియైపోతున్నాయి.

కాకసస్ పర్వతప్రాంతం భస్మంఐపోతూంది. ఎట్నా అగ్నిపర్వతం నిప్పులుకక్కుతూంది. హిమమయమై సిథియా చింత నిప్పులా వుంది. ఆల్ప్సు పర్వతసానువులు రెల్లు బీడులా

అంటుకుపోతున్నాయి. అపినైన్ పర్వతశ్రేణి నల్లని పొగ మబ్బులచే క్రమ్మబడినాయి. ప్రపంచమంతా అంటుకుంది. గాలికూడ గాడ్పొయ్యిలాగ భగ్గుమంటూంది. ఫయీతన్ కూర్చున్న రథం వేడెక్కినట్లు అనిపించింది. పొగ ఆతణ్ణి ఉక్కిరిబిక్కిరి చేసేస్తూంది. నెరుసులు అతనిని క్రమ్ముకుంటు న్నాయి. గుర్రాలు యెటు ఉరుకుతున్నాయో ఆత డెరుగనే యెరుగడు.

ఆ రోజు మొదలు యీ రోజువరకూ లిబియా యెడారి గానే ఉండిపోయిందని వాళ్ళు చెపుతారు. సముద్ర జలాలు సలసల మరిగిపోతున్నాయి. ఉడికిపోకుండా జలచరాలన్నీ సముద్ర గర్భానికి వెళ్ళిపోయినాయి. ఈ ఉత్పాతములన్నీ యేమిటని సముద్రదేవుడు మూడుమార్లు తల పైకిపెట్టి చూచేడు. కాని, వేడికి వెంటనే తల లోపలికి తీసుకోవసి వచ్చింది. సాగర పరివేష్ఠితమైవున్న భూదేవి మోకాటి బంటి నీళ్ళల్లోకిపోయి, గడగడలాడుతూ, జూస్ దేవేంద్రుని కిల్లా మొరపెట్టుకుంది :

"ఏటి పొడుగునా నీ సేవలను జేసినందుల కిదియా బహు కృతి ? ప్రభూ! ధాన్యములు, పండ్లు మొదలైన వానితో జనులను పోషించేటందుకై నా దేహమంతా నాగళ్ళవల్ల వ్రణములవుతూన్నా నేను సహించుతూనే వున్నాను. నీకు నాపైనగాని, నా సోదరుడగు సముద్రునిపైగాని కరుణ లేని యెడల పోనిమ్ము, నీ పరిపాలనక్రిందే వున్న ఆకాశంమీద

నైనా కరుణలేదా ? ఆకాశం నాశనమైపోతే దేవుళ్ళకు నివాస మనేదే ఉండదే! ఇప్పటికే అట్లాస్ దాన్ని తన భుజముల మీద వహించజాలకండా ఉన్నాడు. భూమి, సముద్రం, ఆకాశం నాశనమైనచో మనందరం తిరిగి ప్రళయంలో కూలి పోతాము. మిగిలియున్న మట్టునకైన రక్షించు, దేవా!"

జ్యూస్ దేవుడు భూదేవి మొర ఆలకించేడు. ఆయన స్వర్గా న్నుంచి దిగవచ్చి, వజ్రాయుధమును ప్రయోగించేడు. సూర్య రథం తునకలైపోయింది; గుర్రాలు లగ్గలు త్రెంచుకు పారి పోయాయి. ధీనుడైన ఫయీతన్ ఉల్కవలె క్రిందకు పడి పోయాడు. ఎరిడానస్‌నది ఆ పసివానిని తనలోనికి స్వీకరిం చింది. జలకన్య లాతని ముఖమును ప్రక్షాళనచేసి, శరీరాన్ని సమాధిలో ఉంచారు. వా రాతని సమాధి ఫలకంమీద యిల్లా వ్రాసారు :

"ఫయీతన్ శరీరం ఇక్కడ ఉంది. తండ్రి రథాన్ని తోలిన ధైర్యశాలి, ఈతడు. ఈత డతి సాహసుడై పతనమును చెందేడు."

ఓవిడ్ కవి అమాయికములైన పురాతన గాథలను నూతన ప్రపంచ దృక్పథంతో మేళవించాడు. కాని తన కథలు కేవలం కట్టుకథలే నని యాతడెరుంగును. రోములో అనేక యితర కవులున్నూ కావ్యరచన గావిస్తూన్నారు. కాని అవన్నీ ప్రాచీన దేవతలు, పురాణపీరులు, — వీరిని గురించినవిగావు. ప్రకృతిమాత రహస్యాలలోనికి చొచ్చి, వాటిని తెలుసు కుంటూన్న శాస్త్రజ్ఞులను గూర్చిన గ్రంథాలవన్నీ.

లుక్రీషియస్ కారుస్ అను కవి ఎపిక్యూరస్ అను గ్రీకు తత్త్వవేత్తను గురించి వ్రాసేడు. పురాతన విశ్వాసాలను, క్షీణదశలోనున్న సాంప్రదాయాలను యెదిరించిన విజ్ఞాని, ఎపిక్యూరస్.

> *దేవతా ప్రసంగాలు కాని, మెరుపుల పిడుగుల ఆర్భాటాలు కాని, ఆకసాన్నుంచే రానీ ఆయన భీతిలడు; ఆటంకాలూ, కష్టాలూ ఆయన ధైర్యాన్నినుమడింపజేసేది; రెట్టించిన పట్టుదలతో, యినుప పెట్టెలలో పెట్టివున్న ప్రకృతి రహస్యాలు గుట్టుమట్టుపెట్టి బైటపెట్టేడు; మహా సాహసమె ఆయన విజయానికి రాజబాట; ఇరుకూ, భయంకరము ఐన పాత ప్రపంచపు పిడికిలి నాయన తెరచుకొని చూస్త మించేడు;...........*

అన్ని పాత నిషేధాలూ, చాదస్తాలూ సాహసంగా యెది రించడంలో లుక్రీషియస్ కవి తన గురువును అనుసరించాడు. గురువే ఆయనను అసంఖ్యాకమైన విశ్వమార్గాల్లో మార్గ దర్శియై నడిపాడు.

> *ఆత్మల యాతనలు కలల్లా కరిగిపోయాయి;*
> *లోకపు గోడలు కుప్పకూలినాయి;*
> *వీక్షించాడాతడు వస్తుతత్త్వరీతులన్నీ,*
> *లోకాల అనంత విస్తృతావకాశాన్నంతనీ.*

లుక్రీషియస్ దారిలో ఒక అడ్డుగాదు, ఒక గోడకాదు, యెన్నో అడ్డులు, యెన్నో గోడలు వున్నాయి. ఈ దారి ప్రారంభించిన దెక్కడ ? కాలప్రవాహంయొక్క అంధకారమయపు టగాధాల్లో ఆరంభమైంది. ఎప్పుడు అంతా ప్రళ

యంలో పడి, ఏదీ అస్తిత్వంలోనికి రాలేదో; ఎప్పుడు భూమి, జలము, ఆకాశము అస్తిత్వంలో లేవో; మన యీ ప్రపంచము లోని వస్తుతత్త్వములను బోలిన వసలే లేవో, — అప్పు డారంభించిందీ మార్గం. పరమాణులు స్వేచ్ఛగా కలుస్తూ, విడిపోతూ, యథేచ్ఛగా పరిభ్రమిస్తూ, అంతలో ఒకదాని నొకటి ఢీకొంటూ అనంతప్రదేశంలో విహరించే కాలమది. లుక్రీషియస్ ధైర్యంగా మొదటి హద్దును దాటాడు. గిరగిర తిరిగే పరమాణువు లెట్లు సంయోగము లారంభించేవో మనోనేత్రం తోనే లుక్రీషియస్ కవి సందర్శించేడు. తాను దర్శించితె ననుకున్న విషయాల నాతడు తన కవితలో పొందుపరచాడు. భారతరమైన పృథ్వీ అణువులు కలియగా భూమి ఐంది. లఘు, లఘుతరములైన పరమాణువులు కలియగా సూర్య చంద్ర నక్షత్రాదులుగా తయారైనాయి.

> *పచ్చిక మైదానాల్లో, అడవుల్లో అక్కడక్కడ నీలాల్లా మెరుస్తూ సరోవరాలు చెదిరివున్నాయి; ప్రకృతి అంతా చిత్రార్పితమట్లు నీరవమై, పొగమబ్బుల్లో వుంది; ఈ మబ్బుల్లొనే స్వర్గీయమైన ఆకాశం జననమొంది వాయుమండలో పరి కెగసినది.*

ఇప్పుడు లుక్రీషియస్ రెండో అడ్డుగోడ దగ్గిరికి వచ్చేడు. ఇక్కడే జలం, మున్నీటినుంచి భూమిపైకుబికింది. భూమి యిప్పుడే జలాల్లోంచి పైకి వచ్చింది గనక యింకా నీళ్ళోడుతూనే ఉంది. భూమి అంతా నిమ్నోన్నతాలుగా ఉంది.

కొండలచుట్టూ, మైదానాల్లో పచ్చని శాద్వల వసనాలను ధరించినట్లుంది, భూదేవి.

లుక్రీషియస్ కవి మూతో హద్దుదగ్గరికి వచ్చాడు. నిరింద్రియ లోకాన్నుంచి సేంద్రియ సృష్టి ప్రారంభించిన దిక్కుడే. ఇక్కడి మహా అఖాతాన్ని సమ్యగ్దర్శనుడైన ఆ మహాకవి భావ తురంగం తోడ్పాటుతో అధిగమించేడు. ఈ ఘట్టము నాయన మనస్సుతో, వివేకదృష్టితో పూర్తిగా అర్థంచేసుకోకముందే దాటి ముందుకుపోయాడు. జంతుశరీరం మీద రోమము లుద్భవించినట్లే మొదట నీ భూతలంమీద పసరిక, గడ్డి, తీగెలు, పొదలు మొదలైనవి మొలచినాయి. వెచ్చని సూర్య కిరణములు, వర్షోదకముల అమృతరసపోషణాకారణంగా జీవ జంతుజాలమంతా ఉద్భూతమైనదని లుక్రీషియస్ ఊహించి, చిత్రించేడు. ఇందుచేతనే భూమిని మానవులు తల్లిగా భావిస్తూన్నారు, సహజ మాతృప్రేమ ప్రబోధంవల్ల. అక్కడినుంచి వరుస క్రమాన జంతువులు, పక్షులు, మానవులు జనన మొందేయి.

మొదటి ప్రాణులు భయంకర వికృతాకారులు. వాటికి కాలు సేతులు లేవు; ముఖాలూ కండ్లూ లేవు. ఈ వికృతా కారులకు యీ పృథ్వీమీద జీవితపోరాటం అసంభవమై పోవడంవల్ల నశించిపోయినాయి. జీవించి వుండగలుట కుత్తమ తర సాధనసంపత్తిగల కొన్ని జీవులెల్లెట్లో బ్రతుకనేర్చి, మిగు లుతూ వచ్చినాయి. పరాక్రమంవల్ల సింహం, జిత్తులవల్ల

నక్క, వేగంవలన లేడి మొదలైనవి యీ జీవిత పోరాటాల్లో మనగలిగినాయి. ఆరంభంలో మానవులు కందమూల ఫలాలను ప్రోగుజేసుకుంటూ, శీతాతపవర్షాదులకు యే చెట్ల క్రిందనో గుహల్లోనో ఒదిగియుంటూ, జంతువుల వలెనే జీవించేరు.

అక్కడనుంచి కవి యింకో హద్దుకు చేరుకున్నాడు. ప్రాణుల్లోంచి మానవులు బైలుదేరారు. వారు అరణ్యాల్లో యితర జంతువులను తరిమి వేటాడుతూ, పెద్ద గదలతో భీకర మృగాలను కూడ చావగొడుతూ, వాట్లని రాళ్ళతో బాదుతూ తిరుగుతూండేవాళ్లు. మెరుపులు అరణ్యాలను తగులబెట్టినపుడు యెవడో సాహసుడు ఆ అరణ్యాగ్నినిపట్టి మచ్చికచేసి, గార్హపత్యాగ్నిని పొందేడు. ఆ గార్హపత్యాగ్ని చుట్టూనే మానవ నివాసాలు, గృహాలు యేర్పడుతూవచ్చాయి. అందుచేతనే అగ్ని దేవుడు 'గృహపతి' అయినాడు. అప్పటికి మానవులు వేరువేరు యిండ్లలో నివసించడం లేదు. చాలమంది కలసి నివసిస్తూ, ఒకరొకరితో మనోగతభావాల నెట్టెట్లో వెల్లడించుకునేవారు. మొదట్లో భావప్రకటనకు అరపులు, సంజ్ఞలు సాధనాలుగా ఉండేవి. వస్తు నిర్దేశంగావించే శబ్దాలు, మాటలు క్రమంగా కొంతకాలానికి జన్మించినాయి.

కాలప్రవాహంలో కవి మరికొంత ముందుకు పోయాడు. మొట్టమొదటి జనపద నిర్మాణదశకు చేరేడు. అప్పటికి జనులు రెండు విభాగాలయేరు: గ్రామీణులు, నాగరకులు. జనులు

రాగిని కరిగించడం నేర్చారు. యుద్ధంకోసం, ఆత్మరక్షణకు, వేటకు ఆయుధాలు తయారు చేస్తూన్నారు. కర్మ సుకౌశల మొసగే వివిధ పరికరాలనూ నిర్మించ నారంభించేరు. బంగారు కంటె బలిష్ఠంగా వుండి, రూప కల్పనకు బాగా తగివుండడం వల్ల, రాగిని ఆ యుగంలో అమూల్యమైన దానినిగా భావించే వారు. అన్నిటి విలువలనూ తారుమారుచేయు శక్తి కాలము నకు ఉన్నది గదా. క్రమంగా ఇనుము వచ్చింది. రాగిని దాని స్థానాన్నుంచి భ్రష్టంచేసింది. ఈ కొత్త లోహంతో నిర్మించబడిన పరికరాలూ, కవచాదులూ పూర్వపు రాగివాటి కంటె దృఢముగానూ, బాగానూ కూడ వుంటున్నాయి. రాగిఖడ్గం అదృశ్యమై ఇనుముతో చేసినది దానిస్థానాన్ని ఆక్ర మించింది.

శత్రువులనుంచి రక్షణకోసం జనులు బలమైన కంచెల లోపల, గోడలలోపల, చివరకు దుర్గములలోపల నివసించే వారు. ఈ గోడల లోపలనే తమ సంపదలను సురక్షితంగా కూడబెట్టుకో నారంభించేరు. సంపదల కంత కంతకు విలువ హెచ్చుతూంది. బంగారం గట్టిలోహం కాకపోయినా అతి శ్రేష్ఠమైనదిగా పరిగణించబడింది. కొందరు సాహసులు దురా క్రమాణపరులై పురములను ముట్టడించడం, పురభేదనం గావిం చడం ఆరంభించారు. బహు పురాంతకులు ప్రభువులుగా పరిగ ణించబడ నారంభించేరు. ప్రతి ఒక్కరూ మిగిలినివా రందరి

తోనూ పోరాడేవారు. చివరకు పాలకులు శాసనాలు * గావించడం, వాటికి లోబడి అందరూ జీవించడం అమల్లోకి వచ్చింది.

లుక్రీషియస్ యింకా ముందుకు సాగేడు. మానవుడు భూమిపైనా, సముద్రంపైనా యాత్రలు అనంతంగా చేస్తున్నాడు. సముద్రతలం అంతా పడవల తెరచాపలతో నిండి పోయి, తెల్లని కొంగలతో నిండిన మైదానంలా ఉంది. అరణ్యాలు కొండలకు తరలి వెళ్లినాయి. మైదానాలూ, లోయలూకూడా ఆలివ్ తోపులతోనూ, ద్రాక్షపంళ్లతోనూ, పంటచేలతోనూ నిండివున్నాయి. శిల్పుల ఉలులు చలువ రాళ్లతో దేవతా విగ్రహాలనూ, యితర శిల్పాలంకారము లనూ మలచసాగినాయి. సంచితములైన సంపదలే గాక గీతాలూ, పద్యాలూ, ఛందస్సులూ తరాన్నుంచి తరానికి పారంపర్యంగా అందించబడుతూన్నాయి. కార్యకారణ వివేచన, ధీశక్తి మానవు నంతకంతకు ఉన్నత పథాలకు గొంపో యింది. కళలు, విజ్ఞానం పెంపొందినాయి.

---

* పాశ్చాత్యుల శాసనాలకు రోమనులు వరవడిగా వున్నాయి. శాసనాలకూ, ధర్మానికీ గల సామ్యాన్నీ, భేదాన్నీ పరిశీలించాలి. ధృధరతీతి ధర్మః అని నిర్వచనం. సంఘమును విచ్ఛిన్నమై పోకుండ ధరించేది ధర్మం అన్నచో అది నిర్బంధరూపమైనది కాగలదా? ఈ ధర్మం ఐచ్ఛికమే గాక సంఘమో, పెద్దలో విధించేదిగా కూడ వుండేది. రాజ్యాంగ సంబంధమైన శాసనానికీ ధర్మానికీ తేడా ఉందనే చెప్పాలి. — అనువాదకుడు.

కాని, మానవుడీ ఘట్టంలో తనను తక్కువ అంచనా వేసుకున్నాడు. ప్రతీదీ దేవతలకే ఆరోపించ నారంభించాడు. దేవతలే లోకాన్ని పాలిస్తూన్నారని, శాసిస్తూన్నారని భావించేడు. భూకంపం గానీ, గాలివాన రానీ, గ్రహణంపట్టనీ, మరే ఉత్పాతం జరుగనీ జనులు దేవతలకు సాగిలబడి, మ్రొక్కి, ప్రార్థనలుచేసి, బలిపీఠాలమీద బలులర్పించేవాళ్లు. తమ పడవలు సురక్షితంగా తిరిగి వచ్చినపుడు వారు దేవుళ్లకు వందన సమర్పణ గావించేవారు. చిన్నపిల్లలు చీకటికి భయపడ్డట్టే పెద్దవాళ్లు కూడా అంతకుముందు చూడనివాటిని చూస్తే భయపడేవాళ్లు.

కాని, జనుల్లో కొందరు తెలివైనవాళ్ళు, మేధావులు ఉండేవాళ్లు. వీళ్లే జనులకు వైజ్ఞానిక విషయాలను బోధిస్తూండేవాళ్లు. సూర్యకిరణాలు అంధకారాన్ని పటాపంచలు గావించినట్లే విజ్ఞాన సూర్యోదయంతో ప్రకృతిలోని చీకటి కోణాలు వెలుతురులోకి రా నారంభించేయి. భీతి కరిగి తొలగిపో నారంభించింది.

అమ్మయ్య! ఇప్పటికి మనం సమకాలీన ప్రపంచంలోకి వచ్చాము, కవితో. లుక్రీషియస్ స్వస్థానమునకే వచ్చాము. అల్లదే, రోము మహానగరం! యావత్ప్రపంచాన్నీ జయించాలని రోము ఉత్సహిస్తూండేది. సీజరు తన సైన్యాలను గాల్ పైకి నడుపుతూన్నాడు...లుక్రీషియస్ యిక్కడ నిలబడలేదు. భవిష్యత్తులోనికి దృష్టిని సారించ యత్నించేడు. ఈ విశ్వం

పోయిపోయి, చివరకు వినష్టమై ప్రళయగర్భంలో లీనమై తాను వచ్చినచోటికే తిరిగిబోవు ఆ భవిష్యత్‌ను అవలోకించేడు. పరమాణువులు నాశంలేనివీ, జగత్తు అనంతమైన దిన్నీ. గనుక ప్రళయ గర్భంలోంచి మరల లోకాలు సృజింపబడతాయి. మళ్లా యితరేతర జను లస్తిత్వంలోనికి వస్తారు. ఎక్కడో మరో ప్రపంచంలో నైనా చైతన్యం భాసించే తీరుతుంది.

ఈ రీతిగా నా మహాకవి యెంతో దూర భవిష్యత్తులోనికి భావ తురంగాన్ని పోనిచ్చి, యేర్పడబోవు యితర లోకాలను కూడ దర్శించ గలిగాడు! ఆ లోకాలు బహుశః యీ మన లోకంయొక్క స్థానాన్ని తీసుకోగలవు. ఏమో!

మానవుని జీవితకాలం అత్యల్పం. కాని, చైతన్యం యొక్క జీవితం సుదీర్ఘం! ఒక్క క్షణంలో అది సహస్రాబ్దాల కాలవ్యవధిని లంఘించగలదు. ముందుకే గాదు; వెనుకకూ బోగలదు. ఇది సామాన్యవిషయామా? కాదు. కాని, అప్పుడే విజయం లభించిందనడానికి వీలులేదు. లుక్రీషియస్ అనంతమైన కాలాన్నీ, ప్రదేశాన్నీ కూడ లంఘించేడు. కాని అతడు సర్వజ్ఞుడు కాడు. ప్రకృతిని అర్థంచేసుకోడం అంత సులభమూ కాదు. తెలిసినట్లేవుండి అంతలో తెలియకండా పోతుంది! నీకు తెలిసిందంతా తప్పేసుమా! అని పరిహసిస్తూంటుంది, యెంతవాళ్ళనైనా. లుక్రీషియస్‌కి పూర్వం ఉన్న మహామహు లెందరో, — ఎంపిడోక్లిస్, లూసిప్పస్,

డెమాక్రిటస్, ఎపిక్యూరస్ మొదలైనవాళ్ళు యెన్నో సిద్ధాంతాలను యిచ్చిపోయారు. ఐనా ల్యుక్రీషియస్ తరచు తన బుద్ధినే ఉపయోగించి వర్తమానాన్ని బోధపరచుకుంటూ, భూత భవిష్యత్తుల్లోకి చూస్తూ, వాటిని అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తూ వచ్చేడు. ఇత డెన్నోసార్లు దారి తప్పిపోయాడు కూడాను. మరెన్నో తప్పుడు నిర్ణయాలకూ వచ్చేడు.

ప్రపంచం యెల్లావచ్చిందో మానవుడు తెలుసుకోడానికి ముందు, నిరింద్రియ పదార్థాలనుంచి సేంద్రియము లుద్భవించడానికి ముందు, చైతన్యం ఉద్భవించడానికి ముందు యెన్నో లక్షల సహస్రాబ్దాలు గడిచిపోయినాయి. అడుగడుగుకూ యెన్నో కర్మ — ప్రతికర్మలూ, పోరాటాలూ జరిగినాయి. చైతన్యదశ వచ్చాక చర్చలూ అసంఖ్యాకంగా జరిగినాయి. ప్రతీ ముందడుగులోనూ కొందరు అనేవాళ్లు: "ఇది అజ్ఞేయము! మానవుని మనస్సున కందని విషయం." కాని, విజ్ఞానం ముందుకు బోతూనేవుంది. తనవైపు నిరంతరం నిత్యనూతన తరాల మహామేధావుల నాకర్షిస్తూనేవుంది. వీళ్లు మళ్ళా మానవుణ్ణి విజ్ఞానంవైపు, సత్యంవైపు మరో ముందు మజిలీకి గొంపోయేభారం వహిస్తూనే వచ్చారు.

## మానవుడు మందగామి

ప్రాచీనుల గ్రంథాలను చదివేటప్పుడు వారికెన్ని విషయాలు తెలుసునా? అని మనం ఆశ్చర్యపడతాము. ప్రాచీనులలో సామోస్‌వాసి అరిస్టార్కస్ ఉన్నాడే, ఈయన కొపర్ని

కస్ అనదగినవాడు. భూమిచుట్టూ సూర్యుడు తిరగడం లేదనీ, సూర్యునిచుట్టూనే భూమి తిరుగుతూందనీ మొట్టమొదట కని పెట్టి చెప్పినవాడీయనే. జేమ్స్‌వాట్‌తో బోల్చదగ్గ యంత్ర నిర్మాత అలగ్జాండ్రియా వాసి హెరో ఉన్నాడు. ఆతడే చక్రాన్ని త్రిప్పడానికి ఆవిరి నుపయోగించిన ప్రథముడు. వారికి ఖగోళశాస్త్రవేత్త ఇరాటోస్థనీస్ ఉన్నాడు. నౌకా యానం చేసి, ప్రపంచాన్ని చుట్టి రావచ్చునన్నాడీయన. ప్రాచీనులలో భౌగోళిక శాస్త్రవేత్త స్ట్రాబో, భూగోళాని కవ్వలి ప్రక్కన మరో ఖండం వుంటుందని యేనాడో చెప్పేడు. వారి యాత్రికుడు జూబా, కానరీదీవులకు వెళ్ళి వచ్చినవాడు.

కాని, మానవుడు యే ఆటంకాలూ, విఘ్నాలూ లేకుండ సులువుగా పురోగమించలేదు. అతని కాలుసేతులకు బరువైన శృంఖలాలున్నాయి. శృంఖలాబద్ధుడయే ఆతడు ఆనకట్టలు కట్టేడు, అక్విడక్టులు నిర్మించేడు, సొరంగాలు త్రవ్వేడు, చిత్తడి ప్రదేశాల నెండించేడు. ఈ పనులన్నీ గావించిన బానిసలు తమ భుజాలపైన అతి భారములైన బండలు మోసేరు. వంచిన నడుము ఎత్తకండా, నరాలు పొంగేలాగ పడవల్లో తెడ్లు వేసేరు. భూమిలోపలికిపోయి లోహపు ఖనిజాలను త్రవ్వి తీసేరు. బాని సలు లేకపోతే రాజభవనాలే వుండేవిగావు. దేవాలయాలు, పిరమిడ్లు, శిల్పాలు యేమీ ఉండేవిగావు. సర్కసులు అసలే నడిచేవిగావు. ఒళ్లువంచని సంపన్నుల భోగాలకై యేమీ తయారయీవిగావు.

అదిగో! అదొక రాచనగరు. దానిలో ప్రవేశించి, లోపలి విశేషాలు చూదాం, రండు. దాని వెనుకనే కొండలు యెత్తుగా కనబడుతున్నాయి. రెండు ప్రక్కలా ద్రాక్షతోటలు పర్వతపాదాలయందలి గుట్టలను కప్పివున్నాయి. రాచనగరి కిటికీల్లోంచి చూస్తే సముద్రం కానవస్తుంది. చూట్టూవున్న నీటిఊటల మర్మరధ్వనులను వినగలము. ఉద్యానాల్లోని వృక్షచ్ఛాయల్లో చలువరాతి కుట్టిమములు మనోహరంగా వున్నాయి.

ఆ భవనపతి దినమంతా చదువుతూ వ్రాస్తూనో; ఉద్యానంలో వాయుసేవన గావిస్తూ మిత్రులతో సంభాషణలోనో; సంగీతం విని ఆనందిస్తూనో; తత్త్వచర్యలు, వ్యాయామ క్రీడలు, వేట, పడవ షికారు మొదలైన వాటితో కాలక్షేపం చేస్తూనో వుంటాడు. ప్రతిరాత్రీ యీ యింట విందులు జరుగుతాయి. బానిసలు బంగారు వెండి కాగడాలు చేబూని అక్కడక్కడ నిలుచునివుంటారు. ఆ కాగడాలు సుగంధ తైలములచే తడపబడుతూంటాయి. సోఫానాల్లో ఒకదానిపై సుఖాసీనుడైవున్న అతిథుల్లో నొకడు పాపిరస్ కాగితపుచుట్ట నొకదాన్ని తీసి విప్పుతాడు. దానినుంచి, గేయభాగమును బిగ్గరగా చదువుతాడు..."శనిగ్రహదేవత యీ లోకాన్ని పరిపాలించేకాలంలో, ఆ ఆదిమయుగంలో అంతా సుఖమయంగానే వుండేది." అతిథులు సోఫానాలపైన ఒయ్యారంగా వ్రాలి, చేతుల్లో మిలమిలలాడే ద్రాక్షాసవపాత్రను పట్టుకుని ఉన్నారు. వాళ్లు శిరస్సులమీద పూలమాలలు ధరించేరు.

గృహస్థుమాత్రం ఆ గీతాన్ని ఆలకించడంలేదు. ఆతని మనసు మరుసటినాటి కర్తవ్యాంశములమీద వుంది. ఎన్నో పనులున్నాయి. తాను తెల్లవారకుండగనే లేవాలి. ఆసవ పాత్రల్లోని అంబరు మద్యాన్ని చూస్తూంటే యజమాని కా ఋతువు ద్రాక్షపంటా, దానినుంచి తీయవలసిన మద్యం విషయం జ్ఞాపకం వచ్చాయి. ఇంకా యెంతపని చేస్తేనో కాని ఆసవం పాత్రల్లోకిరాదు. ఆసవం తయారుచేయడానికి యెంతో శ్రద్ధకావాలి, యెంతో శ్రమచేయాలి. చంటిపిల్లను పెంచేందు కెంత శ్రద్ధ తీసుకోవాలో అంత శ్రద్ధా కావాలి, ఆసవాదుల తయారీకి. ఈ పనంతా బానిసలే చేయాలి. వాళ్ళు వీలైతే పని యెగగొట్టడంచే సోమరులూ, పని చెడగొట్టడలచే మోసగాండ్రూ న్నారు. భూమి అంతకంతకి సారహీన మవుతూంది. భూమాత ఇంక సస్యాలనిచ్చేందుకు యిష్టపడడం లేదని తోస్తూంది. ఇదంతా యెందువల్ల ? పనంతా బానిసల మీద వదలిపెట్టడంవల్లనే గదా !... అప్పుడే సూర్యోదయం కాకుండానే, అతిథులింకా విందుల్లో ఆనందిస్తూండగానే, బానిసలు లేచి, పనుల్లోకి బోయేరు. వాళ్లెక్కడికీ పారి పోకండా సంకెళ్ళున్నాయి. పంక్తులుగా సైనికుల మాదిరిగా నడుస్తూన్నారు, వాళ్లు. మేస్త్రి, పర్యవేక్షకుడొకడు వాళ్ళను తన అధీనంలోకి తీసుకుంటాడు.

ఈ బానిసలు యెన్నెన్నో దేశాలనుంచి వచ్చినవాళ్ళు. బంగారుజుట్టు, నీలికళ్ళుగల జర్మనులు; నల్లనిచర్మం, ఉంగరాల

జుట్టు గల నూబియనులు; ఎర్రని గడ్డాలు, రాగిరంగు గల సిథియనులు; యింకా యెన్నో జాతులవాళ్ళు బానిసలు. వాళ్ళు ఒకరికొకరు అపరిచితులు. వేర్వేరు ఆకాశాలక్రింద, వేర్వేరు నీళ్ళు త్రాగి పెరిగిన వీళ్ళందరినీ దుర్విధి యీ విదేశం లోకి విసరివైచి, సోదరులుగా ఉండమని విధించింది! వారి నుదుటిమీది వాతి జుట్టుచే కప్పబడిపోకండా వాళ్ళ తలలు ముందుభాగంలో ముండనం గావించబడినాయి. బానిసలు యెప్పుడూ పారిపోయేందుకే ప్రయత్నిస్తూండేవాళ్ళు. పట్టు బడి, వెనుకకు తీసికొని రాబడినప్పు డతికఠినంగా శిక్షించే వారు. ఆ శిక్షలు అతిదారుణంగా, అమానుషంగా ఉండేవి. చీకటికొట్లలో తిండిపెట్టకండా చంపడం, శిలువను వేయడం, తారుగుడ్డలు చుట్టి సజీవంగా దహనంచేయడం వంటి శిక్షలు మామూలువి!

యజమాని తన బానిసల నేమి చేసినా చేయవచ్చు. వా రాతని పరికరాలు, వస్తువులు, ఆస్తిమాత్రమే. ఎంతప్రమాద కరమైనా సరే బానిసలు పారిపోతూ నేవుండేవాళ్లు. పనంటే వాళ్ళకి పనికివచ్చేదిగాదు. యజమానినేగాక అతని యెద్దునీ, నాగలినీ, పొలాల్నీ, పర్యవేక్షకుల్నీ కూడ బానిసలు తీవ్రంగా ద్వేషించేవాళ్లు. స్వేచ్ఛనొందుటెట్లు? అనేదే వారి నిరంతర ధ్యాస.

బానిస అంటే మానవ వ్యక్తే. ఐనను ఆతణ్ణి పశువుగా, నాగలిలా, పనిముట్టులా చూచేవాళ్ళు. అతడు తనకి వప్ప

గించిన పశువుల్నీ, పనిముట్లనీ ద్వేషించి, వాటిమీద పగ తీర్చుకునేవాడు. నోరు లేని యీ వస్తువులే తమకు ప్రత్యక్ష శత్రువు లన్నట్లుండేవారు! అప్పటి పనిముట్లు కీ మోటుగా, వికారంగా ఉంటూండేవి. వాటి నభివృద్ధి పరచేటందుకు యెవరూ శ్రద్ధచేసేవాళ్లు గారు. ద్రాక్షపండ్లను కొయ్యతొట్లల్లో వేసి, బానిసలు వట్టికాళ్ళతోనే త్రొక్కి రసంతీసి, ఆసవం తయారుచేసేవారు. ధాన్యాన్ని గడ్డినుంచి వేరుచేయడానికి బడి తెలతో బాదేవారు. రాళ్లు, ఇటుకలు, సున్నం, దూలాలు, మట్టి మొదలైనవన్నీ భుజాలమీదే మోసేవాళ్లు.

బానిస జీవితమంటేనే అనేక సుదీర్ఘశిక్ష; నిరంతర చిత్రవధ. ఏండ్లతరబడి నిది సాగుతూనే ఉంటుంది. యజమానులూ బానిసలంటే భయభీతులతో ఉండేవాళ్లు. బానిసల ముద్రలు కాల్చి వేసేవారు, శిరస్సు ముందుభాగం ముండనం గావించేవారు. బానిసలు తరచు తిరగబడుతూండేవారు. యజమానుల భవనాలను దోచుకుని, తగులబెడుతూండేవారు. మల్లయుద్ధ విశారదుడూ; బానిసా ఐన స్పార్టాకస్ నాయకత్వాన సాగిన బానిస విప్లవాన్ని గురించి చరిత్రల్లో మనం చదువుతూంటాము. అత్యుత్తమమైన రోమను పటాలాలు కూడా ఆ తిరుగుబాటును చాల కాలంవరకూ అణచలేక పోయినాయి. బాటలన్నీకూడా రెండువైపులా శిలువ వేయబడిన బానిసల శవాలతో నానా బీభత్సంగానూ ఉండేవి. చావడానికేనా సిద్ధపడేవాళ్లే గాని బానిసలు లొంగడానికి

అంగీకరించేవారుగారు. బానిసగా జీవించియుండడం కంటె మరణమే మేలు.

బానిస విధానంవల్ల క్రమంగా మానవ సమాజం ఒక విషమ ఘట్టానికి చేరుకుంది, విషమ చక్రంలో పడిపోయింది. దీన్నుంచి బైట పడేందుకు మార్గమేమిటి ? అని బానిస లేగాక యజమానులున్నూ యోచించ నారంభించేరు. సంకెలలబరువు బానిసలనే గాక యావత్తు మానవ సంఘాన్నీ అణచివేస్తాం దని చాలమంది గ్రహించేరు.

అసంతృప్తికరమైన ఈ బానిస విధానానికి బదులుగా మరే దైనా మంచి జీవిత విధానం ఉందా ? అని చాలమంది అన్వే షించ నారంభించేరు. భూకామందులు తమ పొలాలను చెక్కలుగా జేసి, కౌలుకీయ నారంభించేరు. స్వతంత్ర పౌరు లకు, వలసవచ్చిన వారికి, భూములను పాలున కీయడంతో యీ పద్ధతి ప్రారంభమైంది. బానిసలకంటె స్వతంత్రవ్యక్తులు భూముల నధిక శ్రద్ధతో సాగుచేస్తారు, బాగా పండిస్తారు, కాపాడతారు. అదనంగా ఆదాయంవస్తే తమకే వుంటుందనే ధీమా వాళ్ళకుంటుంది. గనక స్వతంత్రులు భూముల నధిక శ్రమపడి, ఫలానికి దెస్తారు. ఇల్లా భావించడంలో పొరబా టేమీ లేదు. కాని, నమ్మకమైనవాళ్లూ, సమర్థులూ నైన పౌరులు రైతులుగా, పాలుకి పొలంచేసుకునే వాళ్ళుగా తగి నంతమంది లభించవద్దూ ? పొలాలను పరమ దరిద్రులకి, ఆఖరి మెట్టుమీద వున్నవాళ్ళకి కట్టబెట్టడమే ? పోనీ అనుకుంటే

పేరుకు స్వతంత్రపౌరులే గాని యీ జనమూ ఋణభారంతో మూలుగుతూ, మక్తాలు చెల్లించే పరిస్థితుల్లో లేరు. వాళ్లకి యెడ్లూ, నాగళ్ళూ లేవు, వాటి హామీ చూచుకుని ధైర్యంగా ఉండేటందుకు! పంటలు చేతికి వచ్చాకనైనా తమకు మక్తా చెల్లిస్తారనే నిశ్చయం, నమ్మకం లేకుండా కామందులు పొలాల నితరుల చేతుల్లో యెల్లా ఉంచుతారు?

భూకామందులకు సమస్యలూ, కష్టాలూ అంతకంతకు యెక్కువవుతూన్నాయి. కౌలుదారులున్నూ ఋణబాధల నుంచి విముక్తి జెందడం ఎల్లాగ? సంసారం గడుపుకోడం ఎల్లాగ? కాలక్షేపం చేయడం ఎల్లాగ? అని బెంగపెట్టుకునే ఉండేవాళ్లు. ఏ దేవుళ్లయినా కలుగజేసుకొని తోడ్పడుతే తప్ప యీ దుస్థితినుంచి బైట పడలేమని అందరూ అనుకునే వాళ్లు.

అంతకంతకు గ్రామస్థుల జీవితం దుర్భరమయిపోతూంది. పోనీ నగరాల్లో ఏమైనా మెరుగా? అంటే అక్కడా పరిస్థితులంతంత మాత్రంగానే వున్నాయి. పాడురోజులువచ్చి పడినాయని రోమను వర్తకులు కుయ్యోడ జొచ్చేరు. వాళ్ల వస్తువుల మాదిరివే యితర దేశస్థులున్నూ తయారు గావించేందుకు ప్రయత్నించేవారు. వాటిని రోముకే పంపి అక్కడి ధరలకంటె తక్కువకు విక్రయించుతూ పోటీచేయ నారంభించేరు. కుమ్మరివీధిలో కుండలమ్మ నారంభించినట్లుగా తయారైంది. గాల్‌నుంచి ముతకబట్టలు, అలగ్జాండ్రియానుంచి గాజు సామగ్రులు స్పెయినునుంచి రజిత పేటికలు మొదలై

సవి రోముకు వచ్చిపడుతూన్నాయి. కాచపాత్రలు, జాడీలు మొదలైనవి తయారుచేస్తూన్న కార్మికులు రోమను సామ్రాజ్యాధీన దేశాల్లో అంటే లయాన్స్, బోర్డో, ట్రైర్ మొదలైన చోట్ల హెచ్చిపోయారు. రోములో కంటె పదీ యిరవైరెట్లమంది పనివాళ్లు ఉండేవారు, యితర దేశాల్లో. ఆ బర్బర జనులున్నూ యెంత అద్భుతమైన పనితనం, విన్నాణం చూపేవారనుకున్నారు !

రోము యెన్ని జాతులనో బానిసలుగా జేసింది. వాళ్లందరి చేతా చావగొట్టి చాకిరీ చేయించుకుంటూంది. చాకిరీకే మరొక పేరు 'పని' లేక 'కర్మ'. ఈపని అనేదివుందే అది అద్భుతమైన గురువు, బోధకుడున్నూ. హస్తకౌశలంగానీ, బుద్ధికౌశలంగానీ, అది పని లేక కర్మలో నుంచే పుడుతూంది! రైన్, స్పేన్, థేమ్స్ నదుల తీరాల్లో నివసించే ఆ వివిధ బర్బరజనులు సనులు నేర్చుకోడంలో వెనుకబడ లేదు. కర్మసుకౌశలాన్ని వారు అత్యద్భుతంగా చూపి, వివిధ వస్తువుల్ని తయారు చేయ నారంభించేరు. చూడడం, చేయడం, గ్రహించడం, అభివృద్ధి జెందడం, – యీ ఘట్టాలన్నీ వాళ్లూ దాటి ముందుకు బోయారు. ఇంతకాలంగానూ రోము చేస్తూన్న దేమిటి ? జయించిన దేశాల్లోని జనులను 'కప్పం చెల్లించండి ! ఇంకా చెల్లించండి !' అంటూ పీడించడం తప్ప మ రేముంది ? రోమనుల చేతులకు పనిచేసే అలవాటు తప్పిపోయింది. ఏపనీ చేయకండానే అన్ని వస్తువులనూ పొందడం మరీ బాగుంటుంది గాదండీ !

రోమను వ్యాపారులూ పీలైనంతవరకు పనులు మానేశారు. మరి వాళ్లు మాత్రం వెనుకబడతారా ? సముద్రముల మీదా యెడారులగుండాను యెన్నో శ్రమప్రమాదాలకులోనై, దీర్ఘ ప్రయాణ ప్రయాసాలకు పాల్పడడం దేనికి ? ఈ శ్రమనంతనీ అధీన ప్రజలనే పడనీండి ! బండచాకిరీ నంతేనూ అరబ్బులు, ఐగుప్తీయనులు, పార్థియనులు, సిరియనులు వగైరా అధీన జనులనే చేయమనండి. ప్రభుజాతియైన రోమనులు చేయవలసినదల్లా శిరఃకంపం, అంగుళీ నిర్దేశం గావించడమే. బస్ ! హిందూదేశపు అపురూపవస్తువులన్నీ, అమూల్యసంపద లన్నీ తమ కాళ్ళదగ్గిరికి నచ్చి వ్రాలుతాయి. అంతే! రోమనులు తా మొక్కరికే ప్రత్యేకించి అట్టే బెట్టుకున్న 'పని' యేమిటంటే "తేండి!" అని బూకరించి అడగడమే! అధీన జనులపై తమ అధికారమును నిలబెట్టుకోడానికి రోముకు పశుబలం కావాలి. అందుకొరకే అత్యద్భుతమైన, శిక్షణ గలిగిన, ధైర్య సాహసవంతమైన పెద్ద సైన్యాం రోము తయారుచేసుకొంది. వాళ్ళు నిరంతరం యుద్ధాల్లో మునిగివుంటూండేవాళ్లు. ఎప్పటికప్పుడే కొత్తపటాలాల్ని సమకూర్చుకుంటూ ఉండాల్సి వచ్చేది. చివరకు వాళ్ళ పటాలాలకు సరిపడా రోమనులు దొరక్కుండాపోయిన కాలం రానే వచ్చింది. సామ్రాజ్యం నలుమూలలా, దూరదూర దేశా లన్నిటిలోనూ రోమను పటాలాల నుంచాల్సివచ్చేది. ఆ పరిస్థితుల్లో యింక అధీన జాతులనుంచి, గాల్, జర్మన్ జాతులనుంచి సైనికులను స్వీక

రించాల్సిన అవసరం యేర్పడింది. రోమను సైనికులకంటె బర్బరజాతుల సైనికుల సంఖ్యయే పటాలాల్లో యెన్నో రెట్లు అధికంగా ఉండే దశకూడా చివరకు రానేవచ్చింది. సైనికులను నడిపించే అధికారులు, దశాధిపులూ, శతాధిపులూగా కూడా జర్మనులే నియమితులవుతూన్నారు.

ఈ రీతిగా రోము ఒక బదనికలా, చీడపురుగులా తయారైంది. సమకాలీన మానవజాతి అనే మహావృక్షంమీద బైలుదేరినదే యీ బదనిక. ప్రతీ బదనికా, చీడా కూడ తన వినాశాన్ని తానే కొని తెచ్చుకుంటుంది; తనగొయ్యి తానే త్రవ్వుకుంటుంది. అది తన స్వీయ కృషితో జీవయాత్ర సాగించుకోలేదు. పరులుచేసిన పనిఫలితాన్ని స్వాయత్తం చేసుకొని బ్రతుకుతూంటుంది. ఒకప్రక్కన రోము బలహీనపడుతూంటే మరోవైపు అది బానిసలను చేసిన జాతులు బలపడజొచ్చినాయి. బలహీన పడుతూన్నకొద్దీ రోము మరింత దుర్మార్గంగా ప్రవర్తించేది. తన ఆధిక్యతను నిలుపుకోడానికై భయంకరంగా పోరాడేది. అంతకంతకు బలంగా తాకుతూన్న బర్బరజాతుల దెబ్బలను రోమనులు నిరంతరాయంగా తట్టుకోవాల్సివస్తూంది. ఉత్తర సరిహద్దుల్లో వారు నిర్మించిన బురుజులు, ప్రహారీగోడలు బర్బరజాతుల దండయాత్రలనునిలువరించజాలక పోయినాయి. బర్బరులు ఆల్ప్సు పర్వతాల మీదుగా జొరబడి, రోమనుల రాజబాటల మీదుగానే రోము మీదకు దాడులు చేస్తున్నారు. ఇటలీ గ్రామప్రాంతాల్లో,

మైదానాల్లో నివసించడం ప్రమాద భూయిష్టమైపోయింది. ప్రతి గ్రామమూ ఒక కోట యైపోయింది. చుట్టూ యెత్తైన గోడలు నిర్మించుకోవలసివచ్చింది. రోముకూడా నిరంతరం యే దాడి వస్తుందో నని భయంతోనే కాలం గడుపుతూంది. రోమనులు వెళ్లి, గాల్ దేశంలోనే పట్టణాలునిర్మించి, వాటిలో దేవాలయాలు కట్టి, సర్కస్‌లు, నాటకశాలలూ స్థాపించి, సంస్కృతీ నాగరకతలను పురోగమింపచేసిన ఆ దినాలు వెళ్ళి పోయినాయి. ఆ సుదినాలు యెంత త్వరగా గడిచిపోయి నాయి! ఇప్పుడు ప్రతి గాలిక్ గ్రామమూ సాయుధ శిబిరంగా తయారైంది. మధ్య ఆయుధాగారం, దానిచుట్టూ మానవ నివాసాలూ, వాటిని చుట్టి బలమైన ప్రహరీగోడలు,- యిదీ గాల్ దేశంలోని గ్రామాల, నగరాల స్థితి.

శతాబ్దాలు గడచినాయి. క్రీస్తు తరువాత 3 వ శతాబ్దం... 4 వ శతాబ్దం... సాయంకాలపు నీడలవలె మధ్యమయుగాలు ప్రాకుతూ వస్తూన్నాయి. లాటిన్ భాషలోనికి విచిత్రశబ్దాలు రా నారంభించాయి. 'బుర్గస్' (Burgus) అనేది జర్మను భాషాపదము. దీనికి అర్థం 'దుర్గం'అని. రోమనులు యిప్పుడు గడ్డాలు పెంచుతున్నారు. రోమను టోగాకు బదులుగా బర్బ రుల వైఖరి దుస్తులు ధరించ నారంభించేరు. ఉత్తరాది వాసులు షూబాను అంటే చర్మపుకోటును కూడా ధరించ నారంభించేరు.

టోగా (అంగీ) కి మారుగా షూబా (చర్మపుకోటు) ను ధరించడం! ఇది రోమనుల భవిష్యత్తుకు కీడునే సూచిస్తూంది.

## మానవుడు విజ్ఞానశాస్త్రాన్ని శపిస్తాడు.

రోమను సామ్రాజ్యంలో జీవిత మంతకంతకు కష్టభూయిష్ట మవుతూ వచ్చింది. ప్రతిచోటా దురాశాపరులైన ఉద్యోగులు ప్రజలను దోచుకతినేవాళ్లు. చక్రవర్తియే గాక ప్రభుత్వ శాఖల ప్రధానాధికారు లందరూ తాముా సీజర్లమే అనుకునేవారు! వీళ్లు రాత్రులు విందుల్లో కూర్చుని తెల్లవారేవరకూ తింటూ త్రాగుతూనే వుండేవాళ్ళు. రోజూ రేచనసాధనాలు చేసుకుంటూనే వుండేవాళ్లు! మళ్లా తినడంకోసమే వాళ్ల యీ ప్రయత్నాలన్నీను. ఎందరో తిండిలేక కడుపుమాడి చస్తూంటే యీ లంబోదరులు చేసేది యిదీ! లంబోదరులకంటె కృశోదరు లత్యధికసంఖ్యాకులుగా ఉండేవారు. బలిసినవాళ్ల కంటె బక్కచిక్కినవాళ్లే ప్రతిచోటా గానవచ్చేవాళ్లు.

పన్నులు, కప్పములు, మక్తాలు, నజరానాలు వగైరా వివిధరూపాలుగా గ్రామీణులనుంచి డబ్బు గుంజడమే అధికారుల పని. చాలమంది జనులు యీ బాధలు పడలేక కొంపా గోడీ, మడీ మాన్యమూ వదలి దూరదేశాలకు పారిపోయేవారు. రోమనుల క్రూర నిరంకుశత్వాన్నీ, అమానుష పీడననూ సహించలేమని అంతా అనేవాళ్లు. పరదేశాల్లో బర్బర జనులతో నివసించవలసి వున్నా పన్నులపీడ మాత్రం ఉండదు గదా. రోమను ప్రభుత్వం క్రింద స్వతంత్ర పౌరుడుగా ఉండడం కంటె బర్బరదేశాల్లో బానిసగా ఉండడమే మేలనిపిస్తూంది!

రైతులు భూమిని వదలి పారిపోతే తరిమి పట్టుకుని తీసుకు వచ్చేవాళ్ళు. కానరాని సంకెళ్లు యీ రైతులను వాళ్లపొలాలతో బంధించి ఉంచేవి. పలాయితులైన రైతులు శృంఖలా బద్ధులై బానిసలవలె మందలుగా వెనుకకు త్రోలుకు రాబడినపుడా అదృశ్యశృంఖలాలు దృశ్యమయేవి. వీళ్ళు భూమికి బద్ధులు; మనుష్యులకు గాదు. చట్టాలు వాళ్ళని ఆ స్థితిలోనే ఉంచి, అదే పేరుతో పిలిచేవి.

పొలం విక్రయించేటప్పుడు దానితో రైతుకూడా విక్రయించ బడేవాడు. స్వతంత్రపౌరుడైనప్పటికీ రైతు క్షేత్ర స్వామి ఆస్తిలోని వాడుగనే లెక్క. నాగళ్ళు, పశువులు వగైరాలకి వలెనే యితడున్నూ! ఏ వృత్తి చేసేవాడు ఆ వృత్తికి బంధితుడుగానే ఉండేవాడు. బొగ్గులు కాల్చి అమ్మే వాని కొడుకు బొగ్గులు కాల్చిఅమ్ముతూండ వలసిందే. సాలె వాని కుమారుడు సాలెవాడే.

'పని' చేయడ మనేది నిరసనగా, నిందాస్పదంగా చూడ బడుతూండేది. పనిచేయడం బానిసల కుచితమైనదే గాని కులీనులకు గాదు. కాని, యిప్పుడా స్థితీ పోయి, మరో అడుగు ముందుకు పడింది. రోజూ తన భుక్తిని, కష్టించి పనిచేయడం ద్వారా సంపాదించుకొనే స్వతంత్రపౌరుడు కూడా యిప్పుడు మానవుడుగా పరిగణించ బడడంలేదు. రైతులను, ఛేతి వృత్తుల వాళ్ళను గురించి ఒక చట్టంలో యిల్లా ఉటంకించ బడింది: "ఈ జనులు నీచవృత్తులచే కళంకితులైనవాళ్ళూ,

మలినులున్ను. వీళ్ళు మానవ ఔన్నత్యాన్ని పొంద నభిల షించ కూడదు. వీరు శాశ్వతంగా తమతమ స్థితులలోనే ఉందురుగాక."

నీచవృత్తులు ! కళంకితులు ! !

ఈ బానిసత్వంమీద నాధారపడిన యీ సంఘంయొక్క, ప్రభుత్వంయొక్క మరణశిక్షను యీ మాటలే వినిపిస్తూ న్నాయి. ఈ ప్రభుత్వం అవసానదశకు వచ్చిన దన్నమాట.

రాజమార్గా లన్నిటా దోపిడిముఠాలు తిరుగుతూన్నా రిప్పుడు. రైతుల దృష్టిలో యీ బందిపోట్లు మహాధీరులూ, పీడించేవాళ్ళమీద పగతీర్చుకోగల సమర్థులూను. సామ్రాజ్య ప్రభుత్వంయొక్క అధికార మంతకంతకు బలహీనమైపోతూంది. భూస్వాములు కూడా తమ భవనాలచుట్టూ ప్రాకారాలను నిర్మించుకుని, రాజసభల నేర్పాటు గావించుకొన నారంభిం చేరు. మహోన్నత ప్రభుత్వ నిర్మాణం గావించిన రోము నేడు శిథిలమై ముక్కచెక్కలై పోతూంది. ఎల్లెడలా అధ ర్మమూ, అరాచకమూ ప్రబలినాయి. తూర్పున ఒక చక్ర వర్తి, పడమట మరొక చక్రవర్తీను; ఒక్కొక్కప్పుడు నలుగురు సీజర్లుకూడా ఉండేవాళ్లు.

మార్గాలన్నీ రోముకే వెడతాయి. కాని, యిప్పుడు రోము ఒక్కటే రాజధాని కాదు. కొత్త రాజధానులు వెలసి నాయి. త్రివిస్ (Treves), మిలాన్, నైకోమీడియా (Nicomedia), కాన్‌స్టాంటినోపుల్ నగరాలలో సీజర్లు బైలు

దేరారు. ఒకప్పుడు రోమనుల ప్రభ వెలిగిపోయింది. ఇంక యిప్పుడు బర్బరజాతులే దేశాలను కొల్లగొట్టి, తమలోనే సంపదలను పంచుకొన నారంభించాయి. ఒకానొకప్పు డేరాజ పథములపైన జైత్రయాత్రోత్సుకములైన రోమను సేనావాహినులు నడచినారో, ఆ రాజబాటల మీదనే యిప్పుడు ఫ్రాంకులు, గోథులు, శాగ్జనులు దండ్లుగాబైలుదేరి, దారులు కొడుతూన్నారు. కొందరు గాల్‌లో స్థిరపడ్డారు. కొందరు సముద్రమును తరించి, బ్రిటనుదీవులకు తెరచాపలెత్తి పోయారు. మరికొందరు స్పెయినుకు వెళ్లారు.

రోమక సామ్రాజ్యము మరణశయ్యమీద నుంది. కాని సామ్రాజ్యాల మరణబాధ యెంత్లతరబడిన వుంటుంది. ఒక శతాబ్దపర్యంతం రోమకసామ్రాజ్యం మరణబాధ నొందింది.

తూర్పు దిశనుంచి హూణులు ప్రపంచాన్నంతనూ పరశురామప్రీతి గావిస్తూ, రక్తపుటేరుల్లో ముంచెత్తుతూ త్రోసుకు వస్తూన్నారు. ప్రతి గృహస్థూ, ప్రతి గృహిణీ వెయ్యి దేవుళ్లకి మొక్కుతున్నారు, తమను యీ రాక్షసమూకల బారినుంచి కాపాడమని. కాని, ఏరీ ఆ దేవతలు? ఎక్కడవున్నా రా దేవుళ్లు? వారి దీనుల మొరల నాలకించడంలేదా? ఏమో, ఏ దేవునిలో యే మహిమ ఉందోనని జనులు కనబడిన దేవుళ్ల విగ్రహాలన్నిటికీ మొక్కుతూన్నారు. ఐగుప్తీయుల ఐసిస్, బాబిలోనియనుల అస్టార్తీ మొదలైన దేవుళ్లందరకూ బలులర్పించి, సాగిలపడి, మొక్కుతూన్నారు. రోమను చక్రవర్తే

మిత్రాస్ దేవతకు బలిపీఠాన్ని స్థాపించేడు. ఏదోరీతిగా దైవాను
గ్రహం కలిగి తమ కష్టాలు తొలగుతాయని జనులు ఆశించి,
ఎదురుచూడ నారంభించేరు. అనన్యగతికులైపోయిన జనుల్లో
మంత్రతంత్రాలలో విశ్వాసం ముమ్మరంగా వ్యాపించుతూంది.
లోకం మరల మూఢవిశ్వాసాల్లోనూ, దురభిప్రాయాల్లోనూ
మునిగి, దారిగానక కొట్టుమిట్టాడ చొచ్చింది.

మానవుల్లో ఆత్మవిశ్వాసం నశించింది. తాము నిస్సహా
యులమనీ, ఏమి చేసేటందుకూ శక్తిలేనివారమనీ వారు
భావింపనారంభించేరు. అందరినోటనూ ఒకటేమాట : "శాస్త్ర
విజ్ఞానం ఏమి సాధించగలిగింది ? ఎన్ని తెలుసుకుంటే లాభ
మేముంది ? సర్వనాశనాన్నుంచి తప్పించుకోగలిగామా ?
భూమి గుండ్రంగా ఉంటేనేమి ? చదునుగా ఉంటేనేమి ? మన
కేమైనా ఒలికిందా? ఆకాశంలోనక్షత్రాలు స్థిరమైనవైతేనేమి?
కదులుతూంటే నేమి ! విజ్ఞానం మ కేమిచేసిందోగాని నాకు
స్వేచ్ఛనూ, సౌఖ్యాన్నీ యివ్వలేక పోయింది. ఇంతకూ అసలు
సత్యం ఎల్లావుంటుందో నాకు తెలిసిందా ? ఎక్కువ తెలుసు
కుంటూన్నకొద్దీ నేను సత్యమునకు ఎక్కువ దూరమవుతూ
న్నాను !"

ఈ విధంగా మానవులు విజ్ఞానమునే శపించ నారంభించేరు.
ఏ విజ్ఞానంమీద తమ ఆశలన్నిటినీ పెట్టుకుని వున్నారో ఆ
విజ్ఞానాన్నే, దాని శక్తినే శంకించ నారంభించేరు.

తమ్ము యీ దుస్థితినుంచి కాపాడగల రక్షకునికోసం
జనులు తపించిపోతూ, దేవతలకు మ్రొక్కుకుంటున్నారు.

దురదృష్టవంతుల నుద్ధరించువాడూ, పీడిత తాడితులకు పితృ తుల్యుడూ, దీనజనావన బిరుదాంకితుడూ నైన ఒక మహా పురుషుని అవతరింపజేయు మని దేవుని ప్రార్థించేవాళ్ళు. ఈ భావం యూదియాలో మొలకెత్తి, సర్వత్రా వ్యాపించింది. చిర కాలంగా యూదులు 'మెస్సయా' అనగా 'రక్షకుడు' అవత రిస్తాడని అనుకుంటూండేవారు. వారి ప్రవక్తలు కూడా యీ భావానికి బలాన్ని యిస్తూవచ్చారు. యూదియా లోని గలీలీ అను ప్రాంతంలోని రైతులు, బెస్తలు, బానిసలు, బిచ్చగాండ్రు మొదలైనవాళ్లు రక్షకు డప్పుడే అవతరించేడనీ, ఆయన యిత రుల దోషాలకై శిలువ వేయబడినాడనీ, తన రక్తమునే ధార నోసి యితరులను పాపవిముక్తులను చేసేడనీ చెప్పకొన నారం భించేరు. లోకుల పాపములకై తానే ప్రాయశ్చిత్తా న్ననుభ వించినవాడు, జనులను రక్షించడానికి తన ప్రాణాలనే అర్పిం చినవాడు తప్పకుండా రక్షకుడే నని జను లాడుకొనే మాట లానోట నానోట వ్యాపించ జొచ్చినాయి.

రోము ప్రభుత్వం ఈ భావాలు వ్యాపించడం తమకు ప్రమాదకరమని తలచి, కఠినశిక్షలు విధించ నారంభించింది. ఈ మతాన్ని రక్తపుటేరుల్లో ముంచీ, అగ్నిదగ్ధం చేసీ నాశనం చేయాలని వారు తలపెట్టేరు. నూతనవిశ్వాస మనే అగ్ని జ్వాలలు దండనీతివల్ల, అగ్ని కాజ్యం పోసినట్లు అభివృద్ధి జెంది నాయే గాని అణగిపోలేదు.

మెస్సయా లేక రక్షకునే యూదుబెస్తలు క్రీస్తు అని కూడ పేర్కొనేవాళ్లు. క్రీస్తు అంటే అభిషిక్తుడని అర్థం. ఈశ్వరునిచే

మానవ హృదయ సామ్రాజ్యాధిపత్యానికి అభిషిక్తుడన్న మాట. ఈ క్రీస్తుభావాన్ని నమ్మినవారంతా క్రీస్తియను లని పిలుచుకునేవారు. వీరిని రోమను ప్రభుత్వం క్రూరమృగాలకు మేతగా పడవేసేరు, చితులపై దహనం చేసేరు, శిలువలపై కొరతవేసేరు. ఆబోతుల కాళ్లకు గట్టి, బజారులలో యీడ్పిం చేరు. నూతన మతమునందు విశ్వాసులైన జనులను రోమను లెన్ని విధాలుగానో బాధించ నారంభించేరు. క్రీస్తుయందు విశ్వాసాన్ని వదలుకుంటా మని వాళ్లచేత అనిపించాలని ప్రభుత్వం యెంత క్రౌర్యాన్ని చూపినా వృథాయే అయింది. "మీరు సీజరు చక్రవర్తికి ప్రణమిల్లి, మీ ప్రార్థనలను అర్పిం చండి. లేకపోతే మీ ప్రాణాలు దక్కవు!" అని బెదిరించినా క్రైస్తవులు లక్ష్యపెట్టలేదు. చిన్నబిడ్డలుకూడ 'నేనూ క్రైస్త వుడనే!' అని జవాబిచ్చి అన్నిబాధలూ అనుభవించేందుకు సంతోషంగా అంగీకరించేవారు.

ఒక గవర్నరు చక్రవర్తి కిట్లు వ్రాసేడు : "ఈ విశ్వాసం పెద్ద పట్టణాలకేగాక చిన్నగ్రామాలకు కూడా వ్యాపించింది. ఐననూ దీన్ని నే నణచివేయగలనని భావిస్తూన్నాను."

కాని ఆయన అంచనా తప్పని తేలిపోయింది.

శిలాదుర్గాలనే భేదించిన రోము, యిప్పుడీ అర్భకులైన క్షుద్రమానవులను వంగదీయలేనా ? అనుకుంది. ఒక జాతిని మరొక జాతినుంచి వేరుగావించి ఉంచుతూన్న అదృశ్య కుడ్యా లనే రోము నాశనం చేసింది. ఎన్నో ప్రాచీన ఆచారాల్నీ,

సాంప్రదాయాల్నీ భగ్నం గావించింది. ఆ పాత ఆచార సాంప్రదాయాల అవశేషాలనుంచి యిప్పుడు మరో నూతన మతం ఉద్భవిస్తూంది. ఆ మతం చిన్నా పెద్దా భేదం లేకండా సర్వజనులకూ స్వాగతమిస్తూంది. గ్రీకు, రోమను, యూదు, బర్బరుడు అను భేదాల నీ నూతనమతం చూడదు. అందరి లోనూ ఉన్న మానవత్వమే వారి కీ మతంలోకి ప్రవేశార్హతను కలిగిస్తూంది.

క్రైస్తవ ఋషుల, భక్తుల ఉపదేశాలనే గాస్పెల్స్ అంటారు. ఆ ఉపదేశాలు చదువుతూంటే గ్రీకులకు వారి ప్రాచీన తత్వవేత్తలు జ్ఞాపకం వచ్చేవారు. ప్లేటో, ఉత్తమంగా ఉండే మరో క్రొత్త ప్రపంచాన్ని గురించి చెప్పేవున్నారు. ఆ నవ్యలోకంలో ప్రజలంతా కలసిమెలసి, సుఖంగా, సామరస్యంతో జీవిస్తారు. డియోజనిస్ జ్ఞాని, మానవుల్లోని విభేదాలు కృత్రిమము లనిన్నీ, తానొక ప్రపంచపౌరుడ ననీ చెప్పేవాడు.

ఈ గాస్పెల్స్ చదువుతూంటే రోమనులకు సినికా తత్త్వవేత్త జ్ఞాపకంవచ్చేవాడు. కీడు గావించినవారికి మేలుచేయడమే ఉత్తమసంస్కార మన్నా రాయన.

ఈ క్రొత్తమతం అందరికీ ప్రియమైనదిగానే వుంటూంది. అందులోనూ సామాన్య జనులకు, అమాయికులకు, అజ్ఞానులకూ మరీను! వీరెన్నడూ ప్లేటో, సినికాలను గూర్చి వినను నైనా లేదు. పెద్ద పట్టణాల వీధుల్లో, అలగ్జాండ్రియా, సీజ

రియా వీధుల్లో గుంపులు ప్రోగుపడేవి. వాళ్ళంతా వివిధ వృత్తి పనులవాళ్ళూ, బానిసలూ, బీదలూ, బిచ్చగాళ్ళూను. వీళ్ళు క్రైస్తవబోధలను బహు ఆసక్తితో చెవులు దోరబెట్టి వినేవారు.

క్రైస్తవ లిష్యు అరచేవాళ్ళు: "రోముకు యేదో కీడు మూడనైవుంది. ఓ రోము నగరమా! అపవిత్రురాలా! నీవు పడుపువృత్తిదానవు. నీకేదో యేక్షుల్తు మూడుగాక! నువ్వు అగ్నిచే దగ్ధమొనర్పబడు దినం సమీపిస్తూందిలే. మసి, బూడిదరాసులు నీ రాచనగరులను పూడ్చిపెడతాయి. తోడేళ్ళు నీ వీధుల్లో తిరుగుతాయి. !"

"కష్టజీవులైన మానవులారా! అందరూ నా దగ్గరకు రండు. మహాభారమును వహిస్తూన్న శ్రమజీవులారా! రండు. మీ శ్రమభారములను తొలగిస్తాను...వినీతులు, శాంతులే ఈశ్వరుని దీవెనల కర్హులు. వారిదే యీ లోకరాజ్యము."

ఆతురతతో వింటూన్న జనుల చెవుల కీపలుకులు తేనె చినుకుల్లా ఉండేవి. ముద్రితలలాటులైన బానిసలు, యీ మాటలను దగకొన్నవారు నీటెనివలె త్రాగుచుండిరి. వాళ్ళ బుజాలమీద వాతలు సలుపుతూన్నాయి. వాళ్ల కీ జీవితంలో యేమి ఆశలున్నాయి? ఎన్నోసార్లు నిరాశోపహతులై వాళ్ళు యజమానులపై తిరగబడేవారు. అలగ్జాండ్రియా వీధుల్లో జరిగిన పోరాటాల్లో తగులబెట్టబడి, పాడుపడిన గృహశిథిలాల మీద యింకా గడ్డి మొలవనే లేదు. ఆ నగరంలో పేటలకు

పేటలే బూడిదప్రోగులూ, రాళ్ళగుట్టలూ క్రింద మారిపోయి నాయి. అసంఖ్యాకమైన రాజభవనాల ఆనవాళ్లే లేకుండా పోయినాయి. అలగ్జాండ్రియనులు గర్వించే మ్యూజియమ్ కూడా నాశనమైపోయింది. కాని, యీ తిరుగుబాటు కూడా రోమను సైనికదళాలచే క్రూరంగా అణచివేయబడింది.

ఈ పోరాటాల్లోంచి బ్రతికి బైటపడి మిగిలినవారు దుర్భర జీవితాన్ని గడుపుతూ, నానాబాధలూ పడుతూన్నారు. వాళ్లకి భవిష్యత్తు గాఢాంధకారమయంగా కనబడింది. ఏదేనా మానవాతీతమైన దివ్యఘటన జరిగితే తప్ప యీ దైన్యం, దారిద్ర్యం, దారుణపరిస్థితులు తొలగవు. ...ఆఁ! ఔను! ఆశఉంది! పునరుత్థానం జెంది, దీనులకు విముక్తి ప్రసాదించ గల రక్షకుడు ఒక్కడున్నాడు. ఆతడే గతి...అనన్యగతికులైన దీనప్రజానీకం, తమవలెనే నిర్భాగ్యులైన క్రైస్తవ మతబోధ కుల ఉపన్యాసాలను చెవియిచ్చి విన నారంభించేరు.

దశాబ్దాలు గడచినాయి, శతాబ్దాలు గడుస్తూన్నాయి. మూడు, నాలుగు శతాబ్దాలు వెళ్లినాయి. ఈ క్రొత్తమతాన్ని అణచివేయడం అసాధ్యమని చక్రవర్తులు కూడా అంగీకరిం చాల్సివచ్చింది. అంతేగాదు. ప్రభుత్వానికి గూడ యిల్లాంటి మతం ఒకటి వుండడం అవసరమేగదా! సామ్రాజ్యాంతర్గత విభిన్న జనుల నేకసూత్రబద్ధులనుగా నిలిపి ఉంచేందుకు యీ విశ్వజనీనమతం పనికివస్తుందిగదా! భేష్!

బాగుంది. రాజ్యపాలకులకు యీ మతం ప్రయోజనకారిగా కనబడినప్పటినుంచీ పరిస్థితులు మారినాయి. శతాబ్దాల పీడనానంతరం క్రైస్తవులు యెట్టకేలకు విజయాన్ని సాధించేరు. కాన్‌స్టంటైన్ చక్రవర్తి యీ నూతనమతాన్ని స్వీకరించి, క్రైస్తవు డయేడు. విగ్రహారాధకుల దేవుళ్లకంటె క్రీస్తు బలవత్తరుడు. క్రీస్తుకు సామ్రాజ్యాన్ని అర్పణగావిస్తే, దానినింక కాపాడుకోవచ్చును.

నీటిలో మునిగిపోవువాడు గడ్డిపరకను పట్టుకున్నట్లు రోము శిలువను పట్టుకుంది! ఈ శిలువ మీదే నిన్నటివరకూ రోమనులు క్రైస్తవుల్ని మేకుబందీ గావించేవాళ్లు. ఆ శిలువయే యిప్పుడు వినాశోన్ముఖమైయున్న రోముకు ధ్వజమైంది! శిలువ మిగులవచ్చు. రోములోని క్రైస్తవబిషప్పు, పీఠాధిపతి అందరికంటెనూ బలవత్తరుడున్నూ కావచ్చు. కాని, రోము యొక్క వినాశనము మాత్రం యెవరూ తప్పించలేరు. రోమక సామ్రాజ్య మొక భయంకరవ్యాధిచే, బానిసత్వమనే అసాధ్య రోగంచే పీడించబడుతూంది. క్రైస్తవమతం యీ వ్యాధిని నివారణచేయలేదు. మతం అనే ఔషధము రోగియొక్క బాధామయజీవితాన్ని కేవలం మరికొంచెం కాలం నిలిపివుంచ గలిగింది. అంతే.

బిషప్పులు ధర్మవేదికనుంచి గావించే ఉపన్యాసాల్లో, ఉపదేశాల్లో బానిసలను గూర్చి 'క్రీస్తునందు సోదరులు' అని పేర్కొనేవారు. అంతేగాని తమక్రిందవున్న బానిసలనైనా

విముక్తులను చేయడానికి ఆతురత చూపేవారేగారు! బానిసలకి కూడా స్వర్గరాజ్యంలో స్థానం ఉంటుందని వారు ఘట్టిగా చెప్పేవారు. కాని, యీ ఐహికరాజ్యం మాత్రం ప్రస్తుత పాలకులకే వదలిపెట్టబడింది. మరేమో, ఈ క్రైస్తవ ప్రభువులు కూడా పూర్వపు విగ్రహారాధక ప్రభువులకంటెనూ కఠినులై, క్రూరులై, పారిపోయిన బానిసల నతికఠినంగా శిక్షించుతూ, బర్బరజాతుల తిరుగుబాటులను నిర్దాక్షిణ్యంగా అణిచివేస్తూ ఉండేవాళ్లు! రోము మతం మారిందే గాని మనసు మారలేదు. రోము తనగోయి తానే త్రవ్వుకొంటూంది.

అటుతరువాతనే ఆదిమక్రైస్తవుల భవిష్యద్వాణి నిజమైంది. రోమును బర్బరమూకలు ముట్టడించాయి. నగరమంతా మలమల మాడిపోతూంది. ఆకలితో జను లందరూ నకనకలాడుతూ, ఒకరినొకరు చంపుకుంటున్నారు. తల్లులు తమ పిల్లలమీాదైనా కరుణ చూపలేదు. నగరంలోని బానిసలు తిరుగబడి, నగరద్వారాల్ని తెరచి, దాడిచేస్తూన్న వాళ్ళకి సాయంచేసేరు.

శతాబ్దాలుగా రోమనులు బర్బరజాతులను మానవులుగా చూడ నిరాకరించేవారు. బర్బరులు, బానిసలు,—వీళ్లు అసలు మనుష్యులేగాదు, వాళ్ళదృష్టిలో. ఇప్పుడు బర్బరులూ, బానిసలూ యేకమై రోమను యజమానులపై పోరాడే సమయం వచ్చింది.

బానిసవిధానంవల్లనే రోము మహాసామ్రాజ్యంగా పెంపొందింది. అదే బానిసవిధానము రోముకు యిప్పుడు వినాశాన్ని తెచ్చిపెట్టింది.

ఔత్తరాహులైన బర్బరజాతుల్లో గోథ్‌లు ఒకరు. వాళ్ళు రోమును దోపిడీచేసి, కనబడినవాళ్ళందరినీ చంపి, పట్టణమంతా తగులబెట్టేరు. గోథ్‌ల వెనకనే వాండాల్‌లు వచ్చిపడ్డారు. వీరు రోములోని పెద్దపెద్ద దేవాలయాలనూ, నాటకశాలలనూ నాశనం చేసేరు. వంతెనముఖాల నున్న శిల్పాలను పగుల గొట్టేరు. గ్రంథాలయాలను పరశురామప్రీతి గావించేరు. కనబడిన పుస్తకాలన్నీ చలిమంటలు వేసుకున్నారు.

ఎద్దుకి అటుకుల రుచి యేమి తెలుస్తుంది? కవిత్వమంటే వాండాల్‌ల కేమి తెలుసు? ఈ ఆటవికులు యింకా చర్మధారులుగానే వున్నారు. రోమును కొల్లగొట్టిన వాండాల్‌ల పేరు రెండువేల యేండ్లు గడచినా యింకా మానవజాతి రోమాంచంతో, భీతాహంతోనే జ్ఞాపకం చేసుకుంటూంది. అప్రసిద్ధికంటెనూ, విస్మృతికంటెనూ కూడ దుష్కీర్తి మహాపమానకరమైనదని మరువకుడు!

రాజమార్గాలన్నీ రోమను ఫోరం దగ్గరకేపోతాయి. ఇప్పుడా ఫోరంలోనే గడ్డి మొలిచిపోయింది. ఘంటాపథాలన్నీ కలసే కూడలిచోట, ఒకానొకప్పుడు బంగారు రేకులు తాపిన విజయస్తంభం నిలబడిన తావున, యావత్ప్రపంచాన్నీ జయించా

లని యుద్ధాలు జరిగిన ఆ స్థలంలోనే యిప్పుడు పందులు పొర్లాడుతున్నాయి. మానవుని ఆశ లెంత దుర్బలములు !

మరి మన కథానాయకుడైన మానవుణ్ణి యింక యిక్కడ వదలివేద్దాము. రోమక సామ్రాజ్యము యొక్క అంతము మానవజాతి యొక్క అంతము గాదులెండి. 'మాంధాతా చ మహీపతిః కృతయుగాలంకారభూతో గతః' అన్నట్లు ఎందరు రాజులు, రాజ్యాలు పుట్టిపెరిగి నశించేరుకాదు ?

ఎన్ని పేర్లు, ఎన్ని జాతులు, ఎన్ని దశాభేదములు !

మన కథానాయకునితో నగరాన్నుంచి నగరానికి, దేశాన్నుంచి దేశానికి, ఒక శతాబ్దంనుంచి మరో శతాబ్దానికి పోయేము. మిలిథుస్, ఏథెన్సు, అలగ్జాండ్రియా, రోమ్ నగరాలు చూచేము. కథానాయకుని వివిధ అవతారాలలో మనం దర్శించేము; థేల్స్, డెమాక్రిటస్, అరిస్టాటిల్, లుక్రీషియస్, యింకా యెన్నో !

ఈ గ్రంథం ముగియనున్నదే గాని మన కథానాయకుని జీవితం మాత్రం అనంతంగా సాగిపోతూనే ఉండగలదు. మానవుని కథకు మంగళం మన మెన్నడూ పాడలేము. మానవుడు అనంతుడు. ఆతడు నిరంతరం కృషిజేస్తూ, పెరుగుతూనే వుంటాడు.

మన కథానాయకుని మరల ముందు మజిలీలో కలుసుకుంటాం. విశ్వకర్మ నిర్మాణాన్ని కొనసాగించే మానవుని కార్యకలాపాలను రాబోవు గ్రంథంలో తెలుసుకుంటాము.

మహాజనో యేన గతఃసపంథా అని విన్నారుగదా. జనులకందరకూ మహాజనులు పోయినదే దారి. ఆ దారినే మనమూ పోయి చూదాం.

సమాప్తం.

---

దీని తరువాతి చరిత్రను 'జనులు : మహాజనులు' అను గ్రంథంలో చదవ గలరు. దీనిని విశ్వసాహిత్యమాల ప్రచురించింది.

# అనుబంధము

అకాడమీ :- ఏథెన్సులోని ఉద్యానంలో అకాడమస్ విగ్రహం దగ్గర కూర్చుని ప్లేటో శిష్యులకు పాఠాలు చెప్పేవాడు.

అనక్షిమందిర్ :- ప్రథమ గ్రీకు విజ్ఞాని. అనంత ప్రదేశంలో మన భూమి వ్రేలాడుతూంటదని చెప్పేడు.

అనక్షగోరస్ :- ఇతనికి జనులు 'తర్కం' 'కారణ వివేకం' అని పేరు పెట్టారు.

అనక్షిమినిస్ :- నక్షత్రాలు వేరు, గ్రహాలు వేరు అని చెప్పిన గ్రీకు విజ్ఞాని.

అనితస్ :- సోక్రటీసును విమర్శ గావించిన నాటక రచయిత.

అరిస్టార్కస్ :- ఆకాశాన్ని యీ కొననుండి ఆ కొనవరకు కొలిచి, ప్లాను తయారుచేసిన విజ్ఞాని.

అరిస్టాటిల్ :- గ్రీకు పాండితి నంతనూ యేకీకృతం చేయదలచి, అసంభవమైనదానికై ప్రయత్నించేడు. ప్లేటో, డెమాక్రిటస్‌ల నొకే ఒరలో నిముడ్చుట సాధ్యమా !

అరిస్టొక్షనిస్ :- విశ్వంలోని శృతిబద్ధతను, సుసంగతత్త్వమును యితడు బోధించేడు.

అరిస్టొఫనిస్ :- ఈయన నాటకాల్లో పరధ్యానపు తత్త్వవేత్తలను, మందమతులను పరిహాసిస్తాడు.

అస్పాషియా :- గ్రీకు రాజ్యాంగ వ్యవహారాల్లో పాల్గొన్న ధీమంతురాలు.

అలగ్జాండరు :- ప్రపంచవిజేత అంటారే గాని యితడు నిజంగా ఆపని చేయలేదు !

అనేకత్వం, అసంఖ్యాకత్వం :- లోకముల కీ లక్షణం పట్టిందని డెమాక్రిటస్, అరిస్టార్కస్‌లు బోధించేరు.

అవినాశ్యకత :- శక్తి అవినాశ్యం అని యేనాడో మేధావు లన్నారు. శాస్త్రంలో మొదటివాక్యం కడపటి దాని వలెనే వుంది !

ఆంటిగోని :- సాఫోక్లిస్ రచన. 'మానవునికంటె బలవంతుడు లేడు.' అని బోధిస్తాడు.

ఆటం :- అతి సూక్ష్మ అణువులు. వీటిలో జగద్రహస్యం దాగి వుంది.

ఆంత్రపోమార్ఫిజం :- మానవులు దేవుని తమ రూపులోనే సృష్టించుకొన్నారు.

ఆర్కిమెడీస్ :- నీటిని పరిశోధించి, దాని స్వభావ సూత్రాలు నిర్వచించేడు. సిరాక్యూజ్ నగరవాసి.

ఆర్చిటాస్ :- ఎగిరే కొయ్యపావురాన్ని తయారుచేసేడు.

ఆల్‌స్మయోన్ :- మెదడునుంచే జంతు చలనాలు నిర్వహించ బడుతూన్నాయన్నాడు.

అల్ఫబెట్ :- ఫొనీషియనులు అక్షరమాలికనుకూడా తమ సరకులతో బాటు దేశాలన్నిటికీ గొంపోయారు.

అల్సిబియాడీస్ :- సిసిలీపైకి నౌకాదండయాత్ర నడిపినవాడు.

అస్క్లేపియస్ :- ఈ వైద్యన్ను పౌరునికి సోక్రటీసు ఒక వుంజు బాకీవున్నాడు.

ఇలియద్ :- హోమర్ మహాకవి కావ్యం. ట్రాయి నగరాన్ని గ్రీకులు ముట్టడించి నాశనంచేసిన కథ.

ఇఫిజెనియా :- యూరిపిడిస్ రచన. నాటిక. 'దేవుళ్లు ధర్మపరులు గానిచో దేవుళ్లే గాజాలరు.'

ఇరాతోస్థనీస్ :- ఈయన జ్యోతిర్విద్యావేత్త, తత్త్వవిదుడు, రాజకీయవేత్తా కూడాను.

ఎయిస్కిలస్ :- ఈయన నాటకాలు జనులను బాగా రంజింపచేసేవి.

ఎపిక్యూరస్ :- గ్రీకు తత్త్వవేత్త. నాస్తికవాది. దేవతలను గూర్చిన ప్రసంగాలు కాని, పిడుగులుకాని ఈయనను భయపెట్టలేదు.

ఎంపిదోక్లిస్ :- ప్రకృతిపై మానవుని విజయం తథ్యమని యితడు ముందే చెప్పేడు.

ఒదెస్సే :- హోమరు కావ్యం. ట్రాయ్ నుంచి వచ్చే ఒదెస్సే వీరుని ద్వీపాటనగాథ వర్ణించబడింది.

ఓవిద్ :- ప్రాచీన గ్రీకుల అమాయిక హార్దికగాథల నీతను చెప్పేవాడు.

క్లాదియస్, టాలెమస్ :- ఇతడే టాలెమీ. ఈయన విజ్ఞాన సర్వస్వరచయిత. అరిస్టార్కస్ జ్యోతిశ్శాస్త్ర బోధల నీతడు తిరగదోడేడు.

క్రీస్తు :- అగతికుడై మానవుడు రక్షకునికై పరితపించేడు. ఆత డవతరించేడు.

కమ్మోడస్ :- రోము చక్రవర్తి. సర్కస్‌చూస్తూ, హఠాత్తుగా ఉష్ట్రపక్షి తలను కత్తితో నరికిన ఘనుడు.

కాన్‌స్టాంటైన్ :- ఈ చక్రవర్తే మొదట క్రీస్తుమతాన్ని స్వీకరించినవాడు.

క్రితియాస్ :- విశ్వప్రేమను, న్యాయధర్మములను బోధించిన సోక్రటీస్ శిష్యుడే యీ స్వార్థపరుడు.

క్లినియాస :- సోక్రటీస్ వలెనే యీాయనా, ప్రతివారూ సుఖమునే కోరుతారని చెప్పేవాడు.

కోణాలు :- త్రికోణమండలి కోణములను కొలిచి, పర్వతాల యెత్తును తెలుసుకున్నాడు, మానవుడు.

క్సెనోఫనస్ :- గ్రీకు చారణుడు. ఉదాత్త భావాలతో గూడిన గీతాలను పాడుతూ చాల దేశాలు తిరిగేడు.

గ్రంథాలయం :- అలగ్జాండ్రియా లోని వివిధ గ్రంథాలయాల్లో వేలకొలది పాపిరస్ గ్రంథాలుండేవి. వాటి జాబితాయే పెద్ద గ్రంథం ఐంది.

చాన్ :- చీనా చక్రవర్తి. తమదేశపు ఎల్లల్ని విస్తృతపరచేడు.

చార్మిడిస్ :- సోక్రటీస్ శిష్యుడు. రాజు. బహు క్రూరంగా వ్యవహరించేడు.

జనులు :- ఐగుప్తీయులు తమ్మ జనులని వ్యవహరించుకునేవారు.

జర్క్సస్ :- పెరిష్యా చక్రవర్తి.

జూలాజికల్ ఉద్యానాలు :- అలగ్జాండ్రియాలోని మొట్టమొదటి

ఓషధీవనాల్లో కూడా ఏకశృంగి (Unicorn) లేనే లేదు.

టాలెమీ :- అలగ్జాండ్రియా పాలకుడు. గ్రీకు జాతీయుడు.

టాసిటస్ :- మానవజాతి చరిత్ర రచనను కొనసాగించేడు.

డయలెక్టిక్ :- అభిప్రాయాలను పరీక్షించుటకు ప్రతిపాదనలను పూర్వపక్షం గావించి, సిద్ధాంతానికి వచ్చుట అనే నిశితమైన విధానాన్ని సోక్రటీస్ నిర్మించేరు.

డైలాగ్స్ :- ప్లేటో రచన. ఎన్నో పాత్రలు తమ దృక్పథాలను వినిపిస్తారు.

డైషియార్కస్ :- భూగోళ శాస్త్ర పండితుడు.

డెమోక్రిటస్ :- ప్రాచీన గ్రీకు విజ్ఞాని, తత్త్వవేత్త. ఈయన పంథాయే విజ్ఞానానికి రాజబాట యైనది.

థియోఫ్రస్టస్ :- వృక్షశాస్త్ర పితామహుడు. అరిస్టాటిల్ శిష్యుడు. పెరిపటెటిక్ సాంప్రదాయానికి నాయకుడు.

థూసిడైడ్స్ :- స్పేగుజాడ్యపు రోజుల్లో జనుల ప్రవర్తనను గూర్చి యీయన వర్ణించేడు.

థేల్స్ :- గ్రహణాల రాకను యీ పండితుడు సూచించేవాడు.

దమాసిప్పస్ :- ఈయన పుత్రుడే డెమాక్రిటస్. జర్జస్ చక్రవర్తికి మిత్రుడు.

దియోజనిస్ :– తత్త్వవేత్త. అలగ్జాండరును తనకు చాటు లెమ్మన్నవాడు.

దియోనిసియస్ :– సిరాక్యూజ్ రాజు; నిరంకుశుడు. ఈయనకు సలహానిచ్చి ప్లేటో ప్రమాదంలో పడ్డాడు.

దియోపీథిస్ :– దేవతాభక్తి లేనందు కీతడు అనక్షగోరస్‌ను ఖండించేడు.

మిలెటస్ :– సోక్రటీస్‌మీద నేరారోపకుల్లో నొకడు.

నావికులు :– ప్రపంచమును చుట్టివున్న గోడలను నెట్టివేసి, దానిని విస్తృతపరచినది వీరే.

నీరో :– రోమను చక్రవర్తి. సినికా తత్త్వవేత్త నీతడు దండించేడు. కఠినాత్ముడు.

పని :– దీనిని 'కర్మ' అని పిలువవచ్చు. మానవుల కాలోచనలను నేర్పినది పనియే.

పిథాగొరస్ :– తత్త్వవేత్త, గణితశాస్త్రపండితుడు. సంఖ్యలు, గీతలు, బొమ్మలు మొదలైన వాటికి ప్రాధాన్యాన్ని గుర్తింపజేసినవాడు.

పెరికిలిస్ :– ఏథెన్సును మహా సౌందర్యవంతంగా, శక్తివంతంగా చేసిన ప్రజానాయకుడు, వీరుడు.

ప్లేటో :– విజ్ఞానానికి పుట్టినిల్లయిన గ్రీసులోని తత్త్వవేత్తలను ప్లేటో మళ్ళా దేవలోకాలకు నడిపేడు.

ప్లినీ :– పండితుడు, రాజకీయవేత్త, నౌకాదళాధిపతి. విజ్ఞాన సర్వస్వాన్ని రచించిన రోమను విజ్ఞాని.

ప్లినీ, చిన్న :- ప్లినీ అన్న కుమారుడు. పినతండ్రి, వెసూవియస్ అగ్నిపర్వతం ప్రేలినపుడు చనిపోయిన ఉదంతాన్ని వ్రాసేడు.

ప్లూటార్క్ :- బానిసలు గావడంకంటె మరణాన్నే యెన్నుకొన్న మానవులను చూచి ఆశ్చర్యనిమగ్నుడైన చరిత్రకారుడు.

పాలీక్రేట్స్ :- వడ్రంగి. క్రమంగా ధనికుడై, ఓట్లు సంపాదించుకుని బలవంతుడై, చివరకి నిరంకుశుడైనాడు.

పైథాగొరియన్ సంఘం :- ఒక తాంత్రిక సమితి. పిథాగొరస్ సిద్ధాంతాల ననుసరించే శిష్యులంతా గుప్త సాంకేతిక సూత్రాల ననుసరిస్తూండే సంఘంగా యేర్పడ్డారు.

ప్రామిథ్యూస్ :- దేవతాంశాసంభూతుడైన పురాణపురుషుడు. మానవులకు అగ్నిని తెచ్చియిచ్చి, వారికి కష్టనివృత్తి చేసి, దేవేంద్రుడైన జ్యూస్ కోపాగ్నికి బలియైపోయాడు. ఈ గాథనే నాటకంగా ఎయిస్కిలస్ రచించాడు. వేలాది ప్రేక్షకు లీ నాటకాన్ని చూస్తూ, నిశ్చేష్టులైపోయేవాళ్లు.

ప్రథమకారణం :- విశ్వోత్పత్తికి ప్రథమకారణంగా 'మేధ' ను అనక్సగోరస్ పేర్కొన్నప్పుడు అరిస్టాటిల్ నవ్వేడు.

ప్రయోగాత్మక విజ్ఞానం :- దేనినైనను పరీక్షించి చూచే అభిప్రాయం కలుగకపూర్వము మానవు డెన్నెన్నో కల్పనలనూ, సిద్ధాంతాలనూ గావించుకొన్నాడు.

ప్రొఫెసర్ :- పండితుడని అర్థం. ప్రొఫెసర్లు యెప్పుడూ పర ధ్యానంగా ఉంటారని అంతా అనుకునే వాళ్ళు.

ఫరావో :- ఐగుప్త రాజులకీ పేరుండేది. అఖనాతన్ అను ఫరావో కాలశాసకుడైన ఏకేశ్వరునికి ఆలయం కట్టించేడు. 'రా' అను సూర్యదేవునికి ప్రియమైనవాడని యీ మాటకు అర్థం.

ఫిదియాస్ :- ఏథెన్స్‌నగరము నాకర్షణీయంగా చేయడానికి యీ మహాశిల్పి ఆధిపత్యాన వేలగొలది శిల్పులు పని చేశారు.

ఫిలిప్ :- మాసిడోనియా రాజు. ఈతని కుమారుడే అలగ్జాండరు. మహాపండితుడైన అరిస్టాటిల్‌ను ఆహ్వానించి, కుమారుని ఆయనకు శిష్యుడుగా నప్పగించేడు. ఈయన గురుత్వం వల్లననే అలగ్జాండర్ అంత గొప్పవాడయాడు.

బాబిలన్ రాజు :- ఐగుప్తరాజు ఫరావోకు ఈయన ఒక ప్రేమ శాంతి సందేశాన్ని అంపేడు.

బానిసత్వం :- బానిసత్వం కొందరిని దుఃఖితులుగానూ, మరి కొందరిని నిరుద్యోగులుగానూ, యింకొందరిని పర శ్రమోపజీవులుగానూ చేస్తుంది.

బార్ కోఖ్బా :- యూదువీరుడు. జూలియస్ సీజరు సైన్యాల నెదిర్చి పోరిన యోధుడు.

బొటానికల్ గార్డెన్స్ :- ఓషధీఉద్యానము లని అర్థము. అల గ్జాండ్రియాలో వివిధదేశాల వృక్షాలు దెచ్చి నాటిన ఉద్యానాలుండేవి.

భావవాదం :- భావం యీ విసృష్టికి మూలమని చెప్పే సిద్ధాంతము. ప్లేటో దీనికి పూర్ణత్వమును కలిగించేడు.

భౌతికవాదం :- పదార్థమే పరిణామం జెందగా భావం పుట్టిం దనేది దీని ప్రధానసిద్ధాంతం. డెమాక్రిటస్ దీనిని బలపరచి, పుష్టి చెందించేడు.

మహాక్రమము :- విశ్వనిర్మాణంలో మహాక్రమం ఉన్నదని డెమోక్రిటస్ అన్నాడు. ఆయన రచించిన గ్రంథం ప్రాచీనకాలంలో పెన్నిధిగా భావించబడేది.

మార్పు :- విత్తు మార్పుచెంది మొలక బైలుదేరుతూంది. ఇవి రెండూ విభిన్నత గలవే.

మానవజాతి :- ఈ సమాసం యెంత గొప్పభావం కలిగివుంది! మానవులంతా ఒకేజాతి అని దీనిలో సూచించబడింది.

మారినస్ :- టైర్ నగరవాసి, విజ్ఞాని. భూగోళ పటములపై మెరిడియన్ గీతల నుంచినవాడు.

మార్కస్ ఆరిలియస్ :- రోమనుల చక్రవర్తి. జనకమహారాజు వలె సింహాసనంమీద కూర్చున్న మహావేదాంతి, ఈయన.

మార్సెల్లస్ :- రోమను సేనాపతి. సిరాక్యూజ్‌ను ముట్టడించి

నాశనం చేశాడు. ఆర్కిమెడీస్‌ను అప్పుడే రోమనులు చంపివేశారు.

మిలో :- ఒక యోధుడు. హెర్క్యులస్ ననుకరిస్తూ సింహచర్మమును ధరించేవాడు. గొప్ప శారీరక బలంగల యీతనికి బుద్ధిబలం లేదు.

మ్నిసార్కస్ :- ఒక శిల్పి. ఈయన కుమారుడే పిథాగరస్.

మీట :- మొదటి యంత్రసాధనం మీట లేక లివర్. గొప్ప బరువులను మీటతో సులభంగా యెత్తవచ్చు. సిరాక్యూజ్ నివాసి ఆర్కిమెడీస్ మీటలను గూర్చిన గ్రంథం వ్రాసేడు.

మూలభూతాలు :- గ్రీకులు మొదట సృష్టికి మూలం రెండు భూతా లన్నారు. అవి తరువాత మూడు, నాలుగు ఐనాయి. హిందువులు మూలభూతాలు ఐదు అన్నారు.

మ్యూజియమ్ :- తొమ్మండుగురు మ్యూజెస్‌యొక్క ఆలయం. నవ విద్యాధిష్ఠాన దేవతలైన వీరి ఆలయంలో ప్రయోగాత్మక విజ్ఞానం వృద్ధిచెందింది. అలగ్జాండ్రియాలోని మ్యూజియం ఆ కాలంలో సుప్రసిద్ధమైనది.

మేఘములు :- ఒక గ్రీకు గ్రంథం పేరు. దీనిని అరిస్టోఫనీస్ రచించేడు. సోక్రటీస్ పండితుడు తట్టలో కూర్చుని ఊగుతూన్నట్లు యీ కవి చిత్రించేడు.

లావోకూన్ :- ట్రాయ్ నగరంలోని మహా పురోహితుడు. గ్రీకులు వదలిన పెద్ద కత్రగుర్రాన్ని ట్రాయ్‌నగరం

లోనికి తేవద్దని సలహా యిచ్చేడు. ఆ మాట వినక ట్రాయ్‌కి చేజేతులా వినాశాన్ని తెచ్చుకున్నారు, జనులు. గ్రీకులకు విరుద్ధమైన యిట్టి సలహాను చెప్పి నందుకు లావోకూన్‌ను సముద్రంలోంచి రెండు మహా సర్పాలు వెలువడి చంపివేసెనని కథ. ఈ పురోహి తుడు సర్పపీడితుడవుతూన్నట్లు చెక్కిన విగ్రహం ర్హోడ్స్ దీవిలో ఉండేది.

లియోన్ :— ఈతనిని 'నిర్బంధించేటందుకు' సోక్రటీసు నిరాక రించేడు.

లుక్రీషియస్, కారస్ :— గొప్ప కవి. విశ్వపరిణామక్రమాన్ని వర్ణిస్తూ ఒక మహాకావ్యమును రచించేడు.

లూసిప్పస్ :— ప్రాచీన విజ్ఞాని. అణువులను, వాటి తాండవ నృత్యమును యీాయన యెరుగును.

లైవీ :— చరిత్రకారుడు. హెరోడోటస్, థూసిడైడ్స్‌లు సాగిం చిన చరిత్రరచనాకళను ముందుకు గొంపోయాడు.

లైసియమ్ :— ఏథెన్స్‌లోని మహా విద్యాలయం. దీనిలో అరి స్టాటిల్ బోధించేవాడు. ప్లేటో కూర్చుని బోధిస్తే, అరిస్టాటిల్ పచారుచేస్తూ పాఠాలు చెప్పేవాడు.

విషయం :— విషయం వేరూ, రూపం వేరూ. కంచు విగ్రహం కాదు, వెండియే గిన్నె కాజాలదు. రూపం నిర్దిష్టతా ద్యోతకం.

విరళత :— సాంస్కృతిక విరళత. వేర్వేరుజాతు లొకచో కల సినపుడు నూతనభావాలు పుట్టి, క్రొత్త సంస్కృతిగా మారుతాయి.

విజ్ఞానము :— 1953 లో దీనికి 25 వ శతాబ్ద్యుత్సవం చేయ వచ్చును.

విర్జిల్ :— రోమను మహాకవి.

వెసూవియస్ :— ఇటలీలోని అగ్నిపర్వతం.

శక్తి :— శాశ్వతం, అవినాశ్యం అని డెమాక్రిటస్ బోధించేడు.

శిశిరో :— రోమను పండితుడు, చారిత్రకుడు. సిరాక్యూజ్ పరి సరాల్లో ఆర్కిమెడీస్ సమాధిని వెతికి కనుగొన్నాడు.

శౌశిజనిస్ :— ప్రపంచం ఒక క్రమపద్ధతిలో ఉందని చెప్పిన తత్త్వజ్ఞుడు.

సినికా :— రోమను తత్త్వవేది. సర్కస్‌లో జరిగే క్రూర వినోదాలు యీాయనకు బాధ కలిగించేయి.

సీజర్ అగస్టస్ :— ప్రపంచపటం వ్రాయించేడు.

సీజర్ గయస్ జూలియస్ :— ఈ చక్రవర్తి యెన్నో దేశాలు జయించేడు.

సొఫోక్లిస్ :— గ్రీకు నాటకకర్త. ఈయన నాటకాలు అసం ఖ్యాక ప్రేక్షకులకు ఆనందం కలిగించేవి.

సొఫ్రొనికస్ :— గ్రీకుశిల్పి. ఈయన కుమారుడు సోక్రటీస్. సోక్రటీసు మొదట శిల్పవృత్తి నేర్చేడు.

సోఫిస్టులు :- ధనసంపాదనార్థమై బోధనచేసే వీరు 25 శతాబ్దాలకు పూర్వం గ్రీసులో ఉండువారు. అత్యద్భుతంగా వాదన చేసి, యితర వాదనలను ఖండించినా, వీరి సిద్ధాంతాలు తప్పాడునని తేలింది.

సోక్రటీసు :- గ్రీకు తత్త్వవేత్త. ప్రశ్నలద్వారా విషయతత్త్వమును, వైరుధ్యములను యెరిగి, మూలతత్త్వము నరయుట యీాయన విధానము.

సోలమన్ :- యూదుల రాజుల్లో గొప్పవాడు. మహామేధావి. పాలస్టయిన్‌కు నౌకాబలమును సమకూర్చుటకై పొరుగురాజు హీరమ్‌ను సహాయమడిగి తీసికొన్నాడు.

స్వర్ణయుగం :- కృతయుగంలో ధర్మం నాలుగుపాదాల నడిచేది.

స్పార్టాకస్ :- రోములో బానిసల తిరుగుబాటు నడిపించిన నాయకుడు.

స్ట్రాతోస్ :- అరిస్టాటిల్ ప్రశిష్యుడు, థియోఫ్రస్టసు శిష్యుడున్ను యీాయన.

స్ట్రాబో :- ప్రాచీన భౌగోళికుడు. సముద్రాల కావల యింకా యెన్నో దేశాలున్నాయని చెప్పినవాడు.

హిప్పస్ :- యుక్తిసహాములుగాని సంఖ్య లున్నాయని ఈతడు ఋజువు గావించేడు.

హీరమ్ :- ఫొనీషియనుల రాజు. సోలమను రాజుకు నావికులను పంపి, నౌకాబలాన్ని యేర్పాటుచేసేడు.

హీరో :- సిరాక్యూజ్ రాజు. విజ్ఞానం విలువ నెరిగినవాడు. ఆర్కి-మెడీస్ విజ్ఞాని చెప్పిన ప్రతిమాటనూ అందరూ విశ్వసించాల్సిందే నని శాసించేడు.

హెకాటియస్ :- పాతాళద్వారమని జనులాడుకొనే గుహాలో ప్రవేశించి, పరిశోధించేడు, యీాయన.

హెరాక్లిటస్ -: గ్రీకు తత్త్వవేత్త. 'అదే ప్రవాహంలో రెండు సార్లు మునగలేవు' అన్నవా డీయనే.

హెరో :- నీటి ఆవిరితో ఊలవేసే ఆటవస్తువును చేసే రీయన

హెరోడోటస్ :- గ్రీకు చారిత్రకుడు. ఎన్నో దేశాలు తిరిగేవ దేశాంతరాలు తిరిగివచ్చిన నావికులనుంచి యెంత భోగట్టా తీసికొనేవాడు.

హెరోఫిలస్ :- శవాలను ఛేదించి, శరీరావయవ నిర్మాణమును తెలుసుకున్నా రీయన.

హెసియడ్ - గ్రీకు చారణుడు. ఉత్తరవాయువు, వృద్ధాప్యము, శ్రద్ధ, మోసము మొదలైన వన్నీ దేవతలుగానే ఈతడు వర్ణించేవాడు.

హొూమర్ :- ఇలియడ్, ఒడెస్సీ అను మహాకావ్యాల్ని రచించిన గ్రీకు మహాకవి. ఈయన గీతములలో మతం, కవిత్వం, విజ్ఞానం, [illegible]లైనవన్నీ యిమిడి వుంటాయి.

# విశ్వసాహిత్యమాల - రాజమండ్రి వారివి

| | | |
|---|---|---|
| మానవులు : మహీధరములు–ఎమ్. ఇలిన్ & సెగాల్ | 5 | ( |
| జనులు : మహాజనులు– ,, | 5 | 0 |
| జ్ఞానం – విజ్ఞానం – ,, | 5 | 0 |
| యక్షప్రశ్నలు-శాస్త్రీయగ్రంథం-మూడోకూర్పు-బొమ్మలతో | 2 | 8 |
| ప్రకృతి : గతితర్కం – ఏంజిల్సు | 0 | 10 |
| వానరుడు-నరుడు : పరిణామక్రమంలో కర్మపాత్ర ,, | 0 | 6 |
| దక్షిణపవనం – ఎల్మర్ గ్రీన్ – స్టాలిన్ ప్రైజ్ నవల | 4 | 8 |
| నాడు - నేడు - అడయుంకో - నవల - రెండోకూర్పు | 4 | 0 |
| ప్రతీకారజ్వాలలు - నవల - రెండోకూర్పు | 1 | 0 |
| నా బాల్యం ( గోర్కీ ఆత్మకథ ) | 5 | 0 |
| విజ్ఞాని పాలోవ్ - మహావిజ్ఞాని జీవితం | 2 | 8 |
| గోర్కీ జీవితం - రెండోకూర్పు - బొమ్మలతో | 2 | 0 |
| లెనిన్ జీవిత కథలు - మూడోకూర్పు - బొమ్మలతో | 1 | 0 |
| చెకోవ్ కథలు - 13 కథలు - 238 పుటలు | 2 | 0 |
| టాల్‌స్టాయ్ కథలు - పది కథలు - నాల్గవకూర్పు | 2 | 0 |
| మపాసా కథలు - 19 కథలు 240 పుటలు | 2 | 0 |
| గోర్కీ కథలు - అరు కథలు - 160 పుటలు | 1 | 8 |
| నాద్యా - వివిధదేశాల కథలు - చక్కనివి | 1 | 0 |
| చీనాకథలు - ఆస్వాల్డ్ ఎడ్గ్‌బర్గ్ - రెండవకూర్పు | 1 | 0 |
| డిప్యూటీ చైర్మన్ - చీనావిప్లవ కథలు | 1 | 0 |
| టాల్‌స్టాయ్ జీవితం - 2 వ కూర్పు | 1 | 0 |
| ఛా[illegible] - పది నాటికలు - ముద్దా విశ్వనాథం | 2 | 0 |
| ఇండియా - మార్క్సు, ఏంజిల్సు లేఖలు : రెండవకూర్పు | 1 | 0 |
| వ్యవసాయ సామెతలు-నేదునూరి గంగాధరం సంకలనం | 0 | 12 |

| | | |
|---|---|---|
| శ్రీ భద్రాచలక్షేత్ర చరిత్ర - బొమ్మలతో - | | |
| రచన:- శ్రీ కొండపల్లి రామచంద్రరావు | 1 | 8 |
| ఆంధ్రుల చరిత్ర-ఖండవల్లి బాలేందుశేఖరం, ఎం. ఏ, | 1 | 8 |
| యూదుల చరిత్ర — ,, | 1 | 8 |
| విప్లవ సందేశం - నాలుగోకూర్పు | 0 | 8 |
| బలిదాన్ – లియోనిడ్ లియోనీవ్ - నాటకం | 1 | 0 |
| ఆచరణ మావో | 0 | 6 |
| ప్రజల ప్రజాతంత్ర నియంతృత్వం ,, | 0 | 8 |
| వైరుధ్యములు ,, | 0 | 12 |

## అవంతీ ప్రచురణలు, రాజమండ్రి వారి

రథచక్రాలు — రాజకీయ నవల

రచన:-రామమోహన్. 504 పుటలు క్రౌన్‌సైజు వెల 5-0 0

ఓనమాలు — నవల — రామమోహన్. 2-8-0

వినోదమూ - విజ్ఞానము - మహీధర నళినీమోహన్ 1-0-0

## విజయభారతీ పబ్లికేషన్సు, రాజమండ్రి వారి

శబ్దసింధు — హిందీ - తెలుగు నిఘంటు 1300 పుటలు

సుమారు 75,000 హిందీ, సంస్కృత, ఉర్దూ, అరబ్బి, ఫార్సీ శబ్దములకును, సుమారు 5,000 జాతీయములకు లోకోక్తుల (Idioms & proverbs) కును సులభశైలి తెలుగులో అర్థము లియబడినవి. చాల పదములకు హిందీ అర్థములు, అవసరమగు చోట్ల ఇంగ్లీషు అర్థములు కూడ యీయబడినవి.

డెమ్మి 1/8 సైజు, గ్లేజుకాగితం, క్యాలికోబైండ్ వెల 12-0-0

వలయువారు :—

## విశ్వసాహిత్యమాల - రాజమండ్రి.